# తెలుగు సాహిత్యములో రామకథ

[ 1969 – 70 సంవత్సరములో ఉత్తమ గ్రంథముగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే రెండువేల రూపాయల బహుమతి నందుకొన్నది. ]


రచయిత్రి

కుమారి పండా శమంతకమణి, ఎమ్. ఎ





-: ప్రచురణ :-

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్,

హైదరాబాదు.

# తెలుఁగు సాహిత్యములో రామకథ

[ 1969 – 70 సంవత్సరములో ఉత్తమ గ్రంథముగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే రెండువేల రూపాయల బహుమతి నందుకొన్నది. ]

రచయిత్రి

కుమారి పండా శమంతకమణి, ఎమ్. ఏ.




-: ప్రచురణ :-

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్,

హైదరాబాదు.

# అంకితము

పోచంపాడు ప్రాజెక్ట్ శ్రీ కోదండ రామస్వామి ఆలయమున వెలసిన శ్రీ సీతారాముల పాదపద్మములకు –

భక్త్యంజలులతో,
రచయిత్రి.

# వినయాంజలి

సాహిత్యరంగమున కృషిచేయవలెనను ఆకాంక్ష, భారత సంస్కృతీ సాహిత్యములకే ఆధారములయిన భారత భాగవత రామాయణములయెడ గల అభిమానము — నన్నీ రామకథా గ్రంథ రచనకు ప్రోత్సహించినవి. అందునా ముఖ్యముగ రామకథ — అది ఎట్టికథ!— ఆదర్శ దాంపత్యమునకు నిర్వచనము నొసగిన కథ!— సత్యవాక్పరిపాలనను, పుత్రుల కర్తవ్యమును, భ్రాతృప్రేమను, ధర్మమార్గమును, రాజ ధర్మమును, సతీధర్మమును, సేవకధర్మమును— "ఇట్లుండవలెనని" శాశ్వతముగ శాసించిన కథ! అందు కథ కలదు — కవిత్వము కలదు — తర్కము కలదు — వేదాంతము కలదు — సంగ్రహముగ పేర్కొనవలెనన్న రామకథయందు సర్వము కలదు. కనుకనే తరములు మారినను, యుగములు గడచినను అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ అందరికీ అన్నివేళలందునా అత్యంత ప్రియమయినకథ రామకథ! అట్టి రామకథా మధువనమున 'ఫలపుష్పముల నేరుకొనుట'— అనుభావమే నన్ను పులకితగాత్ర నొనరించుచున్నది. మరి, అంతకన్న ధన్యత్వము జీవితమున కేముండును? కాని, రామకథా సాహిత్యము అనంతమయిన మహార్ణవము వంటిది. సాహిత్య అకాడమీవారు పోటీకై నిర్ణయించిన సమయములోపల ఆ మహార్ణవము నంతనూ శోధించుట ఆకాశవాణివంటి సంస్థయందు ఉద్యోగధర్మమున నిమగ్నులమయిన నాబోంట్లకు సాధ్యముకాని పని. అందువలన లభ్యమయిన రామాయణములను నాకు తోచిన రీతిని సమీక్షించుటకు ఇందు ప్రయత్నము చేసితిని. ఉత్తమగ్రంథ బహుమతి నొసగి నాయీ కృషిని సార్థక మొనర్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి కృతజ్ఞురాలిని.

నాకీ మనశ్శక్తిని, సమయమును ఒసగుటయేకాక, కృషికి సార్థకత కలుగునట్లు కూడ అనుగ్రహించిన సీతారాముల పాదములకడ

నొక సుమముగా ఈ గ్రంథమునే అర్పించుటకంటె ఇంకేమీయగల వాడను ? అందువలననే, ఇంచుమించు ఈ గ్రంథరచనా కాలముననే నిజామాబాద్ జిల్లాలో పవిత్ర గోదావరిపై నిర్మించుచున్న పోచంపాడు ప్రాజెక్టుకడ ప్రతిష్ఠాపింపబడిన శ్రీ కోదండ రామస్వామి ఆలయమున వెలసి తమ కరుణాకటాక్షవీక్షణములతో నలుదెసలకు శుభపరంపల ప్రసాదించుచున్న శ్రీ సీతారాములకే వినమిత శిరస్కుడనై మనఃపూర్వకముగా ఈ గ్రంథమును సమర్పించుకొనుచున్నాను.

సీతారాముల పాదసన్నిధిని సమర్పింపబడిన 'తెలుగుసాహిత్యములో రామకథ' అను ఈ పుస్తకమునకు 'వందే వాల్మీకి కోకిలమ్': 'సంస్కృతవాఙ్మయములో రామకథ', 'భారతీయభాషలలో రామకథ', 'చంపూకావ్యములు – రామకథ', 'ద్విపద కావ్యములు రామకథ'— మున్నగు ప్రకరణములు రెకులనుచున్నవి. సాహితీ రంగమునందలి ప్రతిశాఖయందును రామకథ విస్తృతముగ వ్యాప్తిని పొందుటయే కాక, ఆయా శాఖలకే పరిపుష్టిని చేకూర్చినది. ఇంచుమించు అన్నిశాఖల యందును రామకథా రచనలు లెక్కకు మిక్కిలియైన సంఖ్యయందు వెలువడినవి – వెలువడుచునే యున్నవి ! ప్రతి శాఖయందలి రామాయణ రచనలు విపులముగ చర్చించవలెనన్నచో ఒక్కొక్కటియే రెండు వందల యేబది పుటలను మించిపోవును. వ్రాతప్రతి రెండువందల యేబదిపుటలకు మించరాదను నియమమును అకాడమీవారు విధించి నందువలన, ఆయా శాఖలను ప్రకరణములుగ విభజించి. వానియందలి ముఖ్యములైన అంశములను సంగ్రహముగ క్రోడీకరించుటకు ఇందు ప్రయత్నించితిని తత్ప్రయత్నమున కొన్ని రామాయణ రచనలు గురించి విపులముగ చర్చించకుండుట అనివార్యమైనది. అందువలననే బులుసు వేంకటేశ్వర్లుగారి అధ్యాత్మరామాయణమువంటి కావ్యముల నిందు సమీక్షింపలేదు. చంపూకావ్య ప్రకరణాదులందు కాలక్రమము పాటింపబడినను, ద్విపద రామాయణ ప్రకరణాదు లందంతగా పాటింపబడలేదు.

తెలుగు రామకథ ప్రధానముగ సంస్కృత రామకథా సాహిత్యముపై ఆధారపడినది. సంస్కృత రామాయణములను గూర్చి ప్రస్తా

పెంచకుండ తెలుగుకథను పరిశీలించుట అసమగ్రముగా నుండును. అందువలన, గ్రంథమును అకాడమీ పోటీకై పంపినప్పుడు ఆయా ప్రకరణములలో సందర్భవశమున ఆయా కావ్యములందు సంస్కృత రామ కథాంశములను పేర్కొనుట జరిగినది. అట్లుకాక 'సంస్కృత వాఙ్మయమున రామకథ' అను ప్రకరణమున తద్విషయములనన్నిటిని క్రోడీకరించి ఒకచో జేర్చినచో బాగుగానుండునను నాసూచనను సహృదయముతో ఆమోదించి, 'సంస్కృత వాఙ్మయములో రామకథ' అను ప్రకరణమును ఇందు జేర్చుటకు అనుమతించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

ఇందలి ఉత్తర రామాయణ ప్రకరణమునకు డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారి "తిక్కన్న కావ్యశిల్పము – తత్త్వదర్శనము", జానపద వాఙ్మయ ప్రకరణమునకు డా॥ బి. రామరాజుగారి "తెలుగు జానపద గేయ సాహిత్యము", నాటక ప్రకరణమునకు డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి "తెలుగు నాటక వికాసము", డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారి "పానుగంటివారి సాహిత్యసృష్టి – సవిమర్శ పరిశీలనము", శతక ప్రకరణమునకు డా॥ కె. గోపాలకృష్ణారావుగారి "ఆంధ్ర శతక వాఙ్మయోత్పత్తి వికాసములు – సమకాలిక జీవనము" యక్షగాన వాఙ్మయమునకు డా॥ యస్. వి. జోగారావుగారి 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర", ఇంకను డా॥ సి నారాయణరెడ్డిగారి "ఆధునికాంధ్ర కవిత్వము" (సంప్రదాయములు – ప్రయోగములు) డా॥ ఎం. కులశేఖరరావుగారి "ఆంధ్రప్రవచన వాఙ్మయము ఉత్పత్తి వికాసము" ఈ పరిశోధనా సిద్ధాంత వ్యాసములు, భాస్కర, రంగనాథ, రాఘవ పాండవీయ, నిర్వచన భారతగర్భ రామాయణ, కట్టా వరదరాజు, గోపీనాథ, వావిలికొలను సుబ్బారావుగారి రామాయణము – మున్నగు కావ్యముల, పీఠికలు అధికముగ తోడ్పడినవి. ఆ రచయితలందరికీ నా కృతజ్ఞతలు. రిఫరెన్సు నోట్సు తీసుకొను తొందరయందు ప్రమాద వశమున అటనట ఆయా గ్రంథముల యందలి పదములు, వాక్య

ములు ఇందు వచ్చియుండవచ్చును. అట్టి దోషములు ప్రమాదవశమున జరిగినవని సవినయముగ మనవి చేసుకొనుచున్నాను.

ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఎం. ఎ. లో మా గురువుగారు. అవధులు లేని నా అజ్ఞానమును ఎరిగినవారు. అయినను నా ఉత్సాహమును గుర్తించి అవసరమయిన సలహాల నొసగుటయేకాక, నేను కోరగానే నా సాహసమును మన్నించి అత్యంత వాత్సల్యముతో నా యీ గ్రంథమునకు పీఠిక వ్రాసినవారికి వినయాంజలిని సమర్పించడము మాత్రమే నేను చేయగలిగినది. మహాకవి దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి గారికి నాపై పుత్రికా వాత్సల్యము. తమ ఆశీర్వచనామృతముతో నా పుస్తకమునకు ధన్యత్వము నొసగినవారికి నా కృతజ్ఞతాంజలులు. నేను కోరగానే అంగీకరించి పుస్తక ప్రచురణ బాధ్యతలను స్వీకరించిన ఆంధ్ర సారస్వత పరిషత్తువారికి, ముఖ్యముగ అధ్యక్షులు దేవులపల్లి రామానుజరావుగారికి ప్రత్యేకముగ నా కృతజ్ఞతలు తెలుపవలెను.

గ్రంథరచనా సమయమున అవసరమయిన సలహాలనొసగిన ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులు డా॥ బి. ఆర్. శాస్త్రిగారికి, తెలుగు రీడరు డా॥ సి. నారాయణరెడ్డిగారికి, మహిళాకళాశాల తెలుగు శాఖాధ్యక్షురాలు డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారిగారికి, వరంగల్ పి. జి. సెంటర్ కాలేజి ప్రిన్సిపాల్ డా॥ బి. రామరాజు గారికి, నిడదవోలు సుందరేశ్వరరావుగారికి నా కృతజ్ఞతలు. అవసరమయిన సలహాలను సూచనలను ఒసగుటయేకాక, ప్రింటింగ్ సమయమున సహృదయముతో ప్రూఫులు దిద్దిన నిజాం కళాశాల తెలుగు రీడరు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి ప్రత్యేకముగ నా కృతజ్ఞతలు తెలుపవలెను. గ్రంథ సేకరణకు సహాయపడిన రావుబహదూర్ వేంకట రామరెడ్డి మహిళాకళాశాల తెలుగుశాఖాధ్యక్షురాలు శ్రీమతి బి.సుమిత్రా రెడ్డిగారికి, ఉపన్యాసకురాలు శ్రీమతి రావి భారతీరెడ్డిగారికి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు శ్రీ వసల సూర్యచంద్రరావుగారికి, కార్యదర్శి శ్రీ దేశిపతిరావుగారికి, కమలా ఆనార్కలీగారికి, మిత్రులకూ, వివిధ గ్రంథాలయాల అధిపతులకూ, ఉత్తమ గ్రంథముగా

దీనిని ఎన్నికచేసిన అజ్ఞాత న్యాయనిర్ణేతలకూ, గ్రంథమును సుందరముగా ముద్రించిన సాహితీప్రింటర్స్ — హైదరాబాదు వారికీ నా కృతజ్ఞతలు.

ముఖ్యముగ, స్త్రీ వ్యక్తిత్వమునకు, మానసిక వికాసమునకు గల అవసరమును గుర్తించి, సంస్కారమను పదమునకు అర్థమును చేతలయందు చూపుచు, మార్గ దర్శకత్వమును వహించుచు నన్నన్నివిధముల ప్రోత్సహించి ఈనాడు 'రామకథ' గ్రంథమును అకాడమీ పోటికి పంపగల ధైర్యస్థైర్యములను, మనఃశ్శక్తిని, ఆత్మవిశ్వాసమును నాకొసగిన ప్రత్యక్షదైవములయిన నా తల్లిదండ్రులు శ్రీమతి పండా సూర్యకాంతమ్మ, శ్రీ పండా నారాయణమూర్తిగారలకు వినమితశిరస్కనై అంజలి ఘటించుటకంటే ఏమి చేయగలను. నిర్ణీత కాలములో గ్రంథ రచన పూర్తికావించుటకై, మేలువ్రాతప్రతిని తానుగూడ వ్రాసిన సోదరి చి॥ శశికళకు, అన్నివిధముల సహకరించిన సోదరి చి॥ విజయలక్ష్మి, సోదరులు చి॥ వీరరాఘవేంద్రరావు, చి॥ మురళీకృష్ణలకు నా ఈ మొదట రచనకు అకాడమీ బహుమతి లభించునట్లుగా అనుగ్రహించిన మా ఇలవేలుపు శ్రీ కృష్ణుడు సర్వదా శుభములు కలిగింపవలెనని ప్రార్థించుచున్నాను.

హైదరాబాదు,
3—8—72.

పండా. శమంతకమణి.

# పీఠిక

శ్రీమద్రామాయణ మిహపర సాధకమైన మహాకావ్యము. అది వేద తుల్యము అందుచేతనే వేదవేద్యుఁడైన పరమ పురుషుఁడు దశరథాత్మజుఁడుగా నవతరింప వేదము వాల్మీకినుండి రామాయణ రూపమున నావిర్భవించెనని చెప్పుదురు. వాల్మీకి మహర్షియందు శ్రీరామచంద్రుని మర్యాదా పురుషోత్తమునిగా, మానవలోకమున కాదర్శప్రాయుఁడైన మహనీయునిగా చిత్రించెను. ఒక్క రామునే కాదు. అందరి పాత్రల నన్నిటిని అత్యంత శ్రద్ధతో చిత్రించి, కావ్యరూపమున స్త్రీ పురుషుల కొక ఆదర్శ ప్రపంచమును ప్రదర్శించెను. భారతీయ గృహజీవితమును రామాయణమువలె విశదముగను సమగ్రముగను చిత్రించు గ్రంథ మింకొక్కటి కానరాదు. రసపాత్ర చిత్రణము నందును, కథా కథనమందును, కవితా కౌశలము నందును, భాషా మాధుర్యమునందును దానికదే సాటి. అందుచేతనే యది భారతదేశ భాషలలోనికే కాక పాశ్చాత్య భాషలలోనికి కూడ ననువదింపఁబడినది.

రామాయణకథ యితర భాషలలో వలెనే, తెలుఁగుభాషలో గూడ వివిధ రూపములతో నవతరించినది. పద్యకావ్యము, గద్యకావ్యము, చంపూకావ్యము, గేయకావ్యము, నాటకము, యక్షగానము, హరికథ, దండకము, ద్విపద మున్నగు ప్రక్రియలలో దానిని స్పృశించని ప్రక్రియలేదు. అందుచేతనే ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు తామేఁటేఁట బహుమతిప్రదానమునకై వ్రాయించు గ్రంథములలో నొకదానికి 'తెలుఁగులో రామకథ' యను వస్తువును సూచించిరి. ఆ సూచనను గ్రహించి శ్రీమతి డా॥ కె. శాంతికుమారిగారు బహుళమైన పరిశ్రమ గావించి పరిశోధనాత్మకము, సమగ్రము, సర్వసహృదయానందకరమునైన యీ గ్రంథము రచించి బహుమానము నందుకొనిరి. ఆమె మా శిష్యురాలు. పరిశోధన పాటవము నందును, విమర్శన ప్రావీణ్యము నందును, విషయ వివేచనమునందును కడుంగడు నేర్పుకలది. ఆమె ఈ మొదటి

రచన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి బహుమానమునకు భాజన మగుటయే దీని ప్రశస్తిని చెప్పక చెప్పుచున్నది. మఱి నే నుపోద్ఘాత పూర్వకముగా నీ రెండు వాక్యములు వ్రాయుట బలవంతమైన శిష్యురాలి అనురోధమును కాదనలేక.

శ్రీమతి శ్యమంతకమణిగారు 'తెలుఁగు సాహిత్యములో రామకథ'ను గూర్చి వ్రాయుచు తొలుత వాల్మీకి కవితా కౌశలమును, అతఁడు రామాయణమును రచించిన పరిస్థితులను, రామాయణము నందలి కథను, సంస్కృతమునందును భారతీయ భాషలయందును గల రామాయణకథా ప్రధానములైన గ్రంథములను గూడ వివరించి తమ గ్రంథమున కెనలేని వన్నె చేకూర్చిరి. నిజమున కవి వారు గ్రహించిన విషయమున కత్యంతావశ్యకము లైనవికావు. కాని యవి దానికి పూర్వరంగముగా నేర్పడి గ్రంథమున కెంతో సమగ్రతను సంతరించుచు గ్రంథకర్త్రి పరిశోధన పాటవమును వెనోళ్ళఁజాటుచున్నవి వారొక గ్రంథమున రెండు గ్రంథముల విషయమును జొప్పించి దాని విలువను ద్విగుణీకరించియున్నారు.

గ్రంథ కర్త్రిగా రన్నట్లు శ్రీరాముఁడు 'తెలుఁగు దైవము'- రామాయణ కథకును తెలుఁగు దేశమునకును సన్నిహిత సంబంధమున్నది. అయ్యును తెలుఁగున భారత భాగవతములకుఁ గలిగిన ప్రశస్తి రామాయణమునకు రాలేదు. అందు కా గ్రంథములను బూర్వము రచించిన కవుల ప్రతిభా సంపద యందలి భేదమే కారణమైయుండును. ఇట్లని తెలుఁగువారికి రామాయణ కథపై నాదరము లేదనుకొనరాదు. తెలుఁగు కవులావస్తువును గ్రహించి వివిధ ప్రక్రియలలో వివిధ గ్రంథములను రచించి యుండిరి. గ్రంథ కర్త్రిగా నారాప్రక్రియల నన్నిటిని గ్రహించి విమర్శన పూర్వకముగా వానికి విలువ కట్టియుండిరి.

తిక్కన తాత భాస్కరమంత్రి పూర్వ రామాయణము రచించెనని ప్రతీతి. అందుచేతనే తిక్కన పూర్వరామాయణమును విడిచి కరుణరసమయమైన యుత్తర రామాయణమును మాత్రమే రచించెనని విమర్శకుల తలంపు. కాని యా భాస్కరమంత్రి రామాయణ

మిప్పుడు లభించుట లేదు. అట్టి ఎఱ్ఱన కృతమైన రామాయణమును లభింపకుండుట దురదృష్టము. కాఁగా భాస్కరాదులు రచించిన భాస్కర రామాయణమే తెలుఁగునందలి మొదటి చంపూరామాయణ మగుచున్నది. గ్రంథకర్త్రిగారు దానిని మూలముతో బోల్చి ఆంధ్ర కవు లెచ్చటెచ్చట సంగ్రహించిరో యేయే యవాల్మీకములైన సన్నివేశములను ప్రవేశపెట్టిరో చక్కగా నిరూపించియుండిరి. ఈ సందర్భమున వారు చెప్పిన పలువిషయములు నూతనములును ప్రామాణికములునై వారి పరిశోధన పాటవమును ప్రకటించుచున్నవి. భాస్కర రామాయణ మచ్చటచ్చట సంస్కృతమునందలి ప్రసన్న రాఘవాదు లందలి భావముల నెట్లనుసరించినదో వారు సూచించియున్నారు. మొల్ల రామాయణము, రామాభ్యుదయము, అచ్చతెనుఁగు రామాయణము మున్నగువానిని గూడ వారు కూలంకషముగాఁ బరిశీలించి యందలి ప్రబంధ పద్ధతిని, నూతన భావములను, అవాల్మీకాంశములను బ్రకటించి యున్నారు.

ఆధునిక యుగమున వాల్మీకి రామాయణమును, ఇతర రామాయణములను యథామూలముగ నాంధ్రీకరించినవారు పలువురున్నారు. వారిలో శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్రీకరణమునకు దేశమున చాల ప్రచారము కలిగినది. గోపీనాథ రామాయణము, జనమంచివారి రామాయణము, యోగానంద రామాయణము తరువాత పేర్కొనఁదగినవి. ఇటీవల శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారును, శ్రీ వేంకటపార్వతీశ్వర కవులును గూడ రామాయణము నాంధ్రీకరించి యుండిరి. శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారట్లే అధ్యాత్మరామాయణమున కాంధ్రీకరణమును బ్రచురించిరి. ఇవిగాక చంపూరామాయణము, కౌసలేయ చరితము, రామోదయము, పట్టాభిరామాయణము మున్నగు గ్రంథములున్నవి. గ్రంథకర్త్రి వానినన్నిటిని బరిశీలించి యందలి అనువాద రచనా పద్ధతులను చక్కగా వివరించి యున్నారు. ఇవిగాక మానికొండ రామాయణము, గోవిందరామాయణము మున్నగు రామాయణములు కూడ నున్నవి. వీనిలోఁ గొన్ని యాంధ్రీకరణములు, కొన్ని యనుసరణములు.

ఆంధ్రమునందలి ద్విపదరామాయణములలో రంగనాథ రామాయణము మొదటిది. కాలమును బట్టియేకాక రచనా సౌందర్యమును బట్టియు నది యగ్రగణ్యమైనది. అందు కవి జనశ్రుతి నుండి గ్రహించిన సన్నివేశములను బెక్కింటిని బ్రవేశపెట్టెను. అవి శ్రీరాముని భగవత్త్వమును నిరూపించు నట్టివి వాల్మీకి రామాయణమున లేని అహల్యా శిలారూప ధారణము మున్నగు నంశముల నన్యరామాయణములు రంగనాథ రామాయణమునుండియే గ్రహించినట్లు తోఁచును. రంగనాథ రామాయణము దాని నధ్యాత్మరామాయణము నుండి గ్రహించి యుండును. అన్నమయ్య ద్విపద రామాయణమున యుద్ధకాండము మాత్రమే లభ్యమగుచున్నది. కట్టా వరదరాజు రామాయణమును గూర్చి గ్రంథకర్త్రి చెప్పిన విషయములు వారి సూక్ష్మ పరిశీలనమును సూచించు చున్నవి. ద్విపద రూపమున రచింపఁబడిన యితర రామాయణములను గూడ వారుటంకించి యుండిరి.

రామకథను వర్ణించు ద్వ్యర్థి కావ్యములలో పింగళి సూరన్న రాఘవపాండవీయము మొదటిది. అర్థద్వయ సంఘటన సౌలభ్యామునకై యతఁడు కొన్ని కథాభాగములను సంగ్రహించెను. కొన్నింటిని గల్పించెను. గ్రంథకర్త్రి యట్టి సన్నివేశముల నన్నింటిని సూచించుచు నందలి శ్లేష చమత్కారమును బ్రదర్శించి యుండిరి. నెల్లూరి వీరరాఘవ కవి యాదవరాఘవ పాండవీయము, పిండిప్రోలు లక్ష్మణ కవి రావణదమ్మీయము అను కావ్యములను గూడ వారు పరిశీలించి తద్రచనమున కవులు ప్రదర్శించిన ప్రతిభాపాండితీ విశేషములను నిరూపించి యుండిరి.

రామకథ స్వతంత్రకావ్యరూపమునఁగాక యుపాఖ్యాన రూపమునఁ బెక్కు పురాణములందును గావ్యములందును గనవచ్చుచున్నది. అట్టి వానిలో భారతాంతర్గతమైనది మొదటిది. దాని నెఱ్ఱన అరణ్యపర్వమున నాంధ్రీకరించెను. తరివాతిది భాగవతమున పోతన రచించినట్టిది. ఇట్లే హరివంశము నందును, పద్మపురాణాదు లందును గూడ రామకథ కనిపించును. వాల్మీకి రామాయణముతోఁ బోల్చి చూడ వానిలోఁ గొన్ని విశేషములు గోచరించును. గ్రంథకర్త్రి వాని నన్నిం

టిని పరిశీలించి యేయే సందర్భముల నవి యుండెందుకు చొప్పింపఁబడినవో సవిమర్శముగ నిరూపించియుండిరి. తెలగన్న యయాతి చరిత్రమున నవసరము లేకపోయినను రామకథ యందలి ప్రీతిచే దానినెట్లో ప్రవేశపెట్టి యుండెను.

ఆధునిక కవులు పలువురు రామాయణకథ యందలి పాత్రములను, సన్నివేశములను గ్రహించి చక్కని ఖండ కావ్యములను రచించి యుండిరి. అభ్యుదయ కవులు కూడ రామాయణ పాత్ర కథా సందర్భములను దమ కావ్యములలో నవ్యతా స్ఫోరకముగాఁ బ్రవేశపెట్టి యుండిరి. రామకథా ప్రధానములైన యాధునికాంధ్ర ఖండకావ్యములలో రూపనవనీతము, సంధ్యాసౌమిత్రి, పంచవటి, అశోకవనిలో రాముడు, అహల్య, దుఃఖయోగిని, శబరి, మధువనము, ఆనందలహరి, సాక్షాత్కారము మున్నగునవి ముఖ్యములైనవి.

గ్రంథకర్త్రి ఉత్తరకాండములను ప్రత్యేకాధ్యాయమున పరిశీలించిరి. ఆంధ్రోత్తర రామాయణములలో తిక్కన నిర్వచనోత్తర రామాయణము మొదటిది. తిక్కన యిందలి రాముని నిర్యాణకథను విడిచి వైచెను. తరువాత జయంతి రామభట్టేకాశ్వాసముగా దానిని రచించెను. కంకంటి పాపరాజు నుత్తరరామాయణము దేశమున నెక్కువ ప్రచారము పొందినది. కాచవిభులుల ద్విపదోత్తర రామాయణమున కంత ప్రసిద్ధి రాలేదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు జైమిని భారతమున నుత్తర రామాయణ కథను రమణీయముగ రచించెను. ఇది ఉపాఖ్యానమని చెప్పఁదగినట్టిది. చాకలివాఁడు సీతను రాముఁడు పరిగ్రహించిన విషయమును నిందాపూర్వకముగా వాక్రుచ్చిన యంశ మిందున్నది.

రామకథను జానపదగేయ రూపమునను, సంకీర్తన రూపమునను, యక్షగాన రూపమునను, హరికథారూపమునను, పదరూపమునను, బుఱ్ఱకథ రూపమునను రచించిన వారనేకు లున్నారు. అసంఖ్యాకములైన యీ రచనలను జూడ రామకథ తెలుగువారి హృదయముల నెంత గాఢముగ హత్తుకొని పోయినదో తెలియవచ్చును. వీనిలో ప్రక్రియా వైవిధ్యమేకాక కథా సన్నివేశ వైవిధ్యమును భావవైవిధ్య

మును గూడ గోచరించును. ఇవి రామకథను పల్లెలందును గ్రామము లందు విరివిగా ప్రచారము కావించినవి. అకృత్రిమములైన జానపదుల భావములను, కథాకథన కౌశలమును జూచి యానందింపవలె నన్న వీని నవశ్యముగాఁ బఠింపవలయును. చి. శ్యమంతకమణిగారి ప్రక్రియల నన్నింటిని బరిశీలించి కావించిన విమర్శ యామె యోపికను బరిశోధన పాటవమును వేయివిధముల వక్కాణించుచున్నది.

ఆంధ్రమున రామాయణకథా నాటకములు బహుశత ప్రమితములుగా నున్నవి. అందుఁ గొన్ని భాస, భవభూతి, మురారి, జయదేవ, దిఙ్నాగాది కవుల సంస్కృత మూలముల కనువాదములు. కొన్ని స్వతంత్రములు, కొన్ని రామాయణ కథైక దేశప్రధానములు. స్వతంత్రములైన రామ నాటకములలో పానుగంటివారివి ప్రసిద్ధములైనవి. ధర్మవరమువారి పాదుకాపట్టాభిషేకము కూడ బహువారములు ప్రదర్శింపఁబడినది. ఆంధ్రము నందలి రామనాటకము లన్నింటిని సమీక్షించినచో నదియే యొక యుద్గ్రంథమగును. అందుచే గ్రంథకర్త్రిగారు ప్రసిద్ధములైన రామనాటకములను గ్రహించి వానిని మాత్రమే దిఙ్మాత్రముగఁ బరిశీలించియుండిరి.

తెలుఁగున రామకథ శతకరూపము కూడ పొందినది. గ్రంథకర్త్రి రామభక్తి ప్రధానములైన శతకములను కథాత్మకములు, సంకీర్తనాత్మకములు అని ప్రధానముగ రెండు తరగతులుగ విభజించిరి. కథాప్రధానములైన శతకములలో పట్టాభిషేక మహోత్సవీయ శతకము, శతకరామాయణము, సంక్షేపరామాయణము, ముకుందరాఘవ శతకము, ప్రసన్నరాఘవ శతకము మున్నగునవి ముఖ్యములైనవి. వీనిలోఁ గొన్ని ప్రశ్నోత్తర రూపమున నున్నవి. కొన్ని కేవలము బాలబాలికలను దృష్టిలో నుంచుకొని రచింపఁబడినవి.

ఇంక తెలుఁగున వచనమున రచింపఁబడిన రామాయణములసంఖ్యాకములు. సంస్కృతమునందున్న రామాయణములే కాక యితర భారతీయ భాషలందలి రామాయణములు కూడ తెలుఁగున వచన రూపమున ననువదింపఁ బడినవి. తులసీదాసు రామచరిత మానసము, కంబరామాయణము పద్యరూపమునఁ గూడ ననువదింపఁ

బడినవి. దక్షిణాంధ్ర యుగమున రామాయణ కథా ప్రధానము లైన వచన రచనలు పెక్కు వెలువడినవి

గ్రంథకర్త్రి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షమును గూర్చి గ్రంథాంతమున విపులతరమైన పరిశీలన కావించిరి. అందు కాంధ్రమున వెలసిన రామాయణములలో దాని యందున్న గుణోత్కర్షమే కారణము. కవిసమ్రాట్టులు కథలో కావించిన మార్పులను, వారి కథా కథన రసపాత్రపోషణ కౌశలమును. భావగాంభీర్యమును వారు చక్కగా విశదీకరించిరి.

గ్రంథాంతమున తెలుఁగు రామాయణము లందుఁ గానవచ్చు నవాల్మీకాంశముల వివరణ మొసంగఁబడినది. అనుబంధమున వాల్మీకి రామాయణానుసారముగ నిక్ష్వాకులయు, జనకులయు వంశక్రమములను, భాస్కరరామాయణ భాగవతానుసారముగ దశరథ జనకుల వంశ క్రమములను జూపఁ బడినవి. చివర గ్రంథకర్త్రి రామాయణ సంబంధములై లోకమునఁ బ్రచారమున నున్న సామెతలను, లోకోక్తులను సూచించి యున్నారు.

ఈ విధముగ శ్రీమతి చి. శ్యమంతకమణిగారు 'తెలుఁగు సాహిత్యములో రామకథ' అను విషయమును గూర్చి కూలంకషమైన పరిశ్రమచేసి ప్రామాణికమును సమగ్రమునైన యుద్గ్రంథమును రచించి యున్నారు ఇందలి పరిశోధనా ప్రావీణ్యము విశ్వవిద్యాలయములందు రచింపఁబడు పరిశోధనాత్మక సిద్ధాంత వ్యాసము లందలి పరిశీలన పాటవమును దలంపునకుఁ దెచ్చుచు నానందము కలిగించుచున్నది. రామకథ యనేక ప్రక్రియల రూపమున వ్యక్తమై యుండుటచేఁ గొన్ని రచనల పేర్లిందు చొచ్చి యుండకపోవచ్చును. అంత మాత్రమున దీని విలువ కెట్టి లాఘవమును జేకూరదు. గ్రంథకర్త్రి కావించిన విషయ విశ్లేషణమును, ప్రదర్శించిన పరిశోధన పాటవమును, అవలంబించిన రచనా విధానమును అత్యంత ప్రశంసాపాత్రములుగా నున్నవి. ఇందలి శైలి సులభసుందరమును, సర్వజన సుబోధమును, దోషదూరమునై యింపు నింపుచున్నది గ్రంథకర్త్రి

తాము వివరించిన విషయముల నన్నిటిని సోదాహరణములను గావించి గ్రంథమునకుఁ బ్రామాణికత్వమును సమకూర్చినారు. వారు కావించిన యీ కృషి ఆంధ్ర విమర్శ వాఙ్మయమునకే కాక వారి యాత్మోద్ధరణమునకును అభ్యుదయహేతువై యానందము సంధించుచున్నది. వారింకను విమర్శాత్మకములు, ప్రామాణికములు నైన రచనలు సాగించి యాంధ్ర శారద కభినవాలంకృతులు సమకూర్తురని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
1–8–72

దివాకర్ల వేంకటావధాని.

చి॥ శ్యమంతకమణి రచించిన "తెలుగు సాహిత్యములో రామకథ" చాలా ఆత్రుతతో చదివాను— ఎలాగ వ్రాస్తుందాఅని !

చదివాక ఎంతో ఆనందించాను.

ప్రతి భారత సాహిత్యంలోనూ రామకథను గూర్చిన కావ్యాలూ నాటకాలూ గేయాలూ ఎన్నో ఉన్నాయి !

మరి, రామకథ తెలుగువాని జీవితంలో నిండిపోయింది.

పెద్దపెద్ద కావ్యాలు మొదలుకొని స్త్రీల పాటలూ గేయాలూ వరకూ లోతుగా పరిశీలించి శ్యమంతకమణి ఈ గ్రంథం చాలా బాగా రచించింది.

రామకథతోపాటు ఈ రచన నిలిచిపోవాలి ! ఈమె ఇట్టి రచనలు ఇంకా చేయాలి — నూరేళ్లు జీవించి !

కృష్ణశాస్త్రి.

2-3-72.

4. జగదంబాళ్ వీధి,
టి. నగర్,
మదరాసు.

# అనుక్రమణిక

# వందే వాల్మీకి కోకిలమ్

"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥"

వాల్మీకి యనెడి కోకిల కవితాశాఖ నెక్కి మధురాక్షరములతో మధురాతి మధురముగా రామనామము కూయుచున్నది– అని వాల్మీకి మహర్షి రామాయణ కావ్యమున కొక కవివాక్కు నివాళులెత్తినది. ఆ కోకిల యెక్కిన కవితాశాఖ వేదవృక్షమున ప్రభవిల్లినది. వేద కవితాసారములైన క్రొంజిగుళ్లే ఆ కవికోకిలకు క్రొత్తగొంతుకను ప్రసాదించినవి. గీర్వాణవాఙ్మయ జగత్తున ఆకోకిలకూతతో క్రొత్తయుగము ప్రారంభ మైనది. ఆదివేదచ్ఛందముల మధురావతారమువలె నా కోకిల కంఠమున గ్రొత్తదైన లౌకికచ్ఛంద మావిర్భవించినది. ఆధ్యాత్మికమైన ఆనందచేతనమునుండి రసాత్మకమైన రామకథామృత మవతరించినది. ఋషినుండి కవి పుట్టినాడు. పరమపురుషుని నుండి పరిపూర్ణమానవు డవతరించినాడు; సత్యదర్శనము నుండి సత్కావ్య ముదయించినది. లోకమున నాదికావ్య మవతరించినది. వాల్మీకి కోకిల వాక్ప్రపంచమునకు ప్రసాదించిన నవవసంత మాది కావ్యము! అదియే రామాయణము !

భారతీయ వాఙ్మయ జగత్తునందు వాల్మీకి హిమవన్నగ సన్నిభుడు ! రామాయణము మానససరోవరసదృశము!

రామాయణమున కున్న ప్రశస్తికి కారణములు రెండుగా చెప్పవచ్చును. మొదటిది వాల్మీకి వాక్కునందలి మాధుర్యము, లేక అతని కవితా మహత్వము. రెండవది శ్రీరామ చరితమునం దున్న సహజరసానుకూల్యము. ఈ రెండును పరస్పర పోషకములు. కవి వాగ్వృత్తి కావ్యము నాస్వాదయోగ్యముగా నొనర్చెను. మహామహుని మహనీయ చరిత్రము మహాకవి వాక్కునకు బంగారమునకు తావివలె బరిఢవిల్లెను. అందువలననే నాటినుండి నేటివరకు కవిలోకము కావ్యమునకు శ్రీకారము చుట్టునప్పుడెల్ల నాదికవిని, అతని కృతిని స్మరింపక అడుగు ముందుకు వేయలేదు. "వాల్మీకి నాదశ్చ ససర్జ పద్యమ్" అను అశ్వఘోషుని ప్రశంసయు. "స్వకృతిం గాపయామాస కవి ప్రథమ పద్ధతిమ్" అను కాళిదాసుని కమనీయ వాఙ్నీరాజనమును, "అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణః తాదృశం వివర్త మితిహాసం రామాయణం ప్రణినాయ" అను భవభూతి భక్తివినమిత వ్యాఖ్యయు, "భాస్వద్వంశ వతంసకీర్తి రమణీరంగ ప్రసంగ స్వనద్వాదిత్ర ప్రథమధ్వని ర్విజయతే వల్మీక జన్మామునిః" అని జయదేవుని విజయప్రశస్తియు, "శుభమత నుత కావ్యం స్వాదు రామాయణాఖ్యం మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అను భోజుని మధురకవితా మార్గదర్శిత్వ మహిమాభివర్ణనము – వాల్మీకిమహర్షి ఛందస్సౌందర్యమును, ఆదికావ్య నిర్మాణపద్ధతిని, రామాయణేతిహాస నిబంధనా నైపుణ్యమును, మధుర కవితాఫణితీ మార్గదర్శిత్వ మహత్వమును వేనోళ్ల చాటుచున్నవి. వీనివలన వాల్మీకి కవితా మాధుర్య మనంతర కవుల రసజిహ్వల కెంత చవులూరింపఁ జేసినదో భావింపవలసు పడుచున్నది. మురారి శ్రీమద్రామాయణము నందువలననే "వాల్మీకి వాగమృత కూప" మని ప్రశంసించి యుండెను !

వాల్మీకి కవిత్వ మెంత మధురమో, అతని కావ్యకథ అంత మధురము. రామకథను రసదృష్టితో రమించి, వినూత్నభంగిమలలో వివేకించి, విభిన్న కావ్యప్రక్రియలలో వినిర్మించిన కవులు కోకొల్లలుగ నున్నారు. భారతీయుల ధర్మరతి విశ్వజనీనముగా రూపొందిన

విశిష్టగాథ రామకథ. అందువలన రామకథను రక్తితో రచించిన కవితాభిరాములగు కవీంద్రులు రామాయణ ప్రాశస్త్యమును బహు భంగుల భావించియుండిరి. అందు రామాయణ వస్తువునకు శ్రీరాముని యుదాత్త నాయకత్వము వలన నౌదాత్త్యము సిద్ధించిన దనియు, అది యే వాల్మీకిని, తరువాతి కవులను ఆకర్షించిన దనియు జేసిన కవుల ప్రశంస యొకటి మురారి అనర్ఘరాఘవ నాటకమునందలి-

"యదిక్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితమ్।
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః।
స్వ మాత్మానం తత్త ద్గుణగరిమగంభీరమధుర
స్ఫుర ద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యన్తి కవయః."

అను శ్లోకమును బట్టి గుణోజ్జ్వలు డైన రామునిచరితము నెందఱు పూర్వకవులు వర్ణించినను తరుగువోక తరతరముల కవుల నెట్లాకర్షించి కావ్యరచనకు ప్రేరేచుచున్నదో తెలియుటకు వీలున్నది. జయదేవు డిట్టి భావమునే వక్రసుందరముగ వ్యక్తీకరించినాడు.

"స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కోదోష స్సతు గుణ గణానా మవగుణః
యదే తై ర్నిశ్శేషై రపరగుణలుబ్ధై రివ జగ
త్యసావేక శ్చక్రే సతతసుఖసంవాసవసతిః."

వాల్మీకి వలె నితరులు కూడ శ్రీరామచంద్రునే తమ తమ సూక్తిపాత్రముగ నుతించుట చేత వారు నింద్యులు కారట! అది యారాఘవుని సుగుణ బృందదోషమే నట! ఎంత చక్కగా చెప్పినాడు శ్రీరాముని గుణోత్తమత్వమును !

"వేద వేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా॥"

అను రామాయణ శ్లోకమునందే పరమపురుషుని యవతారమైన రాముని మహత్వమును, వేదమే కావ్యరూపమున

నవతరించిన రామాయణ కావ్యరాజత్వమును ప్రతిష్ఠాపింప బడినవి!

"ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్!
యః పఠే ద్రామచరితమ్ సర్వపాపైః ప్రముచ్యతే."

అను రామాయణోక్తి యాకావ్యపుణ్యగుణ కీర్తనము చేయుచు, వేద సమ్మితమైన దాని స్వభావము నుగ్గడించి, కావ్యపఠన ఫలమును కమనీయముగ నిర్దేశించినది.

రామాయణ ప్రశస్తి రామకథాతాత్పర్యమును గూడ ఆశ్రయించి యున్నది. భారతీయుల కాకావ్యమునం దచంచలా దరాభిమానము లుండుట కాకావ్యము వారి సంస్కృతి కిచ్చు దివ్య సందేశ మనియే విజ్ఞులు భావించి యుండిరి. రవీంద్ర కవీంద్రులు రామాయణ కావ్యమున వాల్మీకి వ్యక్తిత్వమే కాక, భరతఖండము యొక్క విశిష్టసంస్కృతి యొక్కయు, విశేషించి గార్హస్థ్యధర్మము యొక్కయు స్వరూపము రసవంతముగా, కాంతాసమ్మితముగా ప్రవచింపఁ బడిన దని పేర్కొనియుండిరి.

"రామాయణమున కవిపరిచయము మాత్రమే యగుట లేదు. సమస్త భారతవర్షముయొక్క పరిచయము ప్రాప్త మగుచున్నది. దీని వలన గృహమనిన, గృహధర్మము లనిన, భారతవర్షమునకు ఎంతగౌరవార్హ ములగు విషయములో తెలియుచున్నది. మనదేశమున గార్హస్థ్య ఆశ్రమమునకు ఎట్టి అత్యంతఉచ్చస్థాన మొసంగబడినదో దానిని ఈ కావ్యము సప్రమాణముగ నిరూపించుచున్నది. గృహస్థాశ్రమము మన నిజసుఖములకు భోగములకు ఏర్పాటుచేయబడి యుండలేదు. అది సమస్తసమాజమునుగూర్చి ఆలోచించెడిది. మనుష్యుని యదార్థ భావముగ మనుష్యుని చేసెడిది. గృహస్థాశ్రమము భారతవర్షపు ఆర్య సమాజమునకు ప్రాకారమువంటిది. రామాయణము అట్టి గృహస్థా శ్రమముయొక్క కావ్యము. ఆ గృహస్థాశ్రమ ధర్మమునే రామాయణము ఒకవిషమ అవస్థయందు గెంటి దానినే వనవాస దుఃఖములతో విశేష గౌరవాన్వితముగ నొనరించినది. కైకేయీ మంధరలు కుచక్రకఠినా ఘాతములచే అయోధ్యారాజ గృహమును చిందరవందర చేసినట్టి

స్థితియందును, గృహధర్మపు దుర్భేద్య దృఢత్వమును రామాయణము చాటుచున్నది. బాహుబల విషయము కాదు; జయింపవలెననెడి ఆశయము కాదు; రాష్ట్రగౌరవము కాదు, శాంత రసాస్పద మగు గృహధర్మమును రామాయణము కరుణాశ్రుజలమున అభిషిక్తము చేసి ఆ మహావీరునిపై స్థాపన చేసెను." "ఈరామాయణ కథనుండి భారత వర్షపు బాలురు, వృద్ధులు, వనితలు, పామరులు, పండితులు శిక్షణను మాత్రమే పొందుట కాదు. ఆనందము పొందిరి. కేవలము దానిని శిరోధార్యముగ చేసికొనుటయేకాక హృదయాంతరాళముల యందును ఉంచుకొనిరి. అదివారికి ధర్మశాస్త్రమే కాదు. వారి మహాకావ్య మై యొప్పుచున్నది." 1

ఈ వాక్యముల ననుసరించి రామాయణము తరతరముల భారతీయుల రసానందసింధు వగుటయేకాక, యుగయుగములు సాగిపోవు నిగమాంచిత వినిర్మల ధర్మజీవితమును భరతజాతికి చూపించు పరమ కావ్య మని స్పష్టమగుచున్నది.

సంస్కృతికి జీవభూతమైన యీకావ్యమును సహృదయులు రస దృష్టితో దర్శించినను, తాత్త్వికులు, శాస్త్రజ్ఞులు వారివారి దృక్కోణము లను బ్రసరించి దానిలోని యంతరార్థములను వెలికిదీయ నారంభించిరి. తత్త్వదృష్టితో గాంచినచో రామాయణము, అందలిపాత్రలు ప్రతీకాత్మకత్వమును భజించి పరమతత్త్వోన్ముఖమైన సమన్వయమును సంతరించును. రామాయణాంతరార్థమును గుఱించి తాత్త్వికుల యన్వయ మిట్లుండును. "రామాయణమునందు చెప్పబడిన కథయంతయు ప్రతి శరీరమునందును కలదు. మోహము, అజ్ఞానము నగు సంసారము సముద్రము. రాగద్వేషాదులు రాక్షసులు, శాంతి-సీత, ఆత్మారాముడు రాముడు; పంచవటి-పరిశుద్ధాంతఃకరణము, తమోద్రిక్తత, మాయామో

---

1. "రామాయణము" (వ్యాసము) (రవీంద్రుని మాతృకనుండి అనువాదము) డా॥ బెజవాడ గోపాలరెడ్డి. —చూ. సారస్వత వ్యాసములు, 3వ సంపుటము. సంకలనకర్త :— డా. జి. వి. సుబ్రహ్మణ్యం. ఆం. ప్ర. సా అ. ప్రచురణ

హము-రావణుడు, ఈతడే జీవి, లంక-దేహము, విషయవ్యాపారము అశోకవృక్ష వాటిక."

"తమోద్రిక్తుడు,మాయామోహినియగు రావణుడను జీవి అపరోక్ష జ్ఞానస్వరూపుడగు శ్రీరాము నాశ్రయించి, పంచవటియను పరిశుద్ధాంతః కరణమందున్న త్రిగుణాత్మకయగు శాంతియను సీతను మోహించి, మోహమను సముద్రము నందున్న లంక యను దేహమున విషయ వ్యాపారములను అశోకవృక్షవాటికయందు సీతను రహస్యముగ దాచి యుంచెను. శాంతి యను సీత మాయామోహనమను రావణునివలన పీడింపబడి శోకరూపము నొంది బుద్ధజీవుని దశనొందెను. సంసార సముద్రము మిక్కిలి భయంకరము, దుఃఖభాజనము. ఇందున్న జీవుడు అనేక కష్టముల ననుభవించుచున్నాడు. అపుడు భగవంతునకు అను గ్రహము గలుగ సీత కోపశమనమునకై గురువగు నాంజనేయుని ఆదేశింప, అతడు మోహసాగరమును లంఘించి, మహామోహ రావణపీడిత యగు సీతకు శోక ముపశమింప శ్రీరామ గుణానుభవ మను తత్వ ముపదేశించి, బుద్ధజీవమోహము నశించుటకు, రావణు నాశ్రయించిన విషయవ్యాపారములను అశోకవనమును భంగమొనర్చి, విషయములను రాక్షసుల జంపి, విషయి యగు రావణునకు ఆత్మతత్వ ముబోధించెను. ప్రారబ్ధ విశేషమున ఆతనిమోహము నశింపనందున త్రిగుణాత్మక మగు లంక యను బాహ్యదేహమును భస్మము గావించి, సర్వాంశముల అపరోక్షజ్ఞానమగు రామునకు విన్నవించెను, మాయా మోహ జీవుడగు రావణుడు ఆత్మస్వరూపమును విచారించి, శ్రీరాము డను తత్వమును బొందగోరి, ఆవరణరూపు లగు రాక్షసులను శ్రీరా మునిచే జపించి, దేహాదిభావమును విసర్జించి శ్రీరాము డను ఆత్మసా యుజ్యమును బొందెను. అంత శాంతి శోక రహితమై యాత్మారాముని బొంది సుఖించె నని జ్ఞానులు తెలుసుకొనుచున్నారు.[1]

1. హనుమ— శ్రీదివాకరుని వెంకట సుబ్బారావు, పుట 5—6

రామాయణ రహస్యార్థము మూడుమార్గముల నాశ్రయించి వ్యాఖ్యానింపబడియున్నది. ఉపనిషత్తులు, భారతపురాణాదులు, కావ్యములు అనునవి ఆ మూడుమార్గములు. రామాయణముతరువాత వచ్చిన ఉపనిషత్తులలో సీతోపనిషత్తు, రామ రహస్యోపనిషత్తు. రామతాపన్యుపషత్తులు ముఖ్యములైనవి. భారతము, బ్రహ్మాండ పురాణము. దేవీభాగవతము మొదలగు నితిహాస పురాణములు రామాయణ రహస్యమును శాస్త్రదృష్టితో పరిశీలించి తమదృక్కోణములను ప్రపంచించి యున్నవి. భాస కాళిదాసాది మహాకవులు రామాయణ కథా కవిత్వ మాధుర్యములకు ముగ్ధులై తత్కావ్య శిల్ప మర్మములను గ్రహించి తమ కృతులందు సంతరించుకొనిరి. వీరిది సాహిత్యపరమైన శుద్ధరసమార్గము. ఉపనిషత్. పురాణములది తత్వమార్గము, వీరికి రామాయణమొక మహామంత్రము. యోగ మంత్ర ధర్మశాస్త్ర రహస్యములనెడి రత్నములనిధి.

"రామాయణస్య మాహాత్మ్యం వక్తుంవర్షశతైరపి అశక్యం విస్తరాద్వక్తుం"[1] అనునది వీరి విశ్వాసము.[2]

రామాయణము షట్కాండమండితమైన కావ్యము. వస్త్వైక్య దృష్టితో నీ కావ్యకథ రసానుకూలమై రాణించుచున్నది. బాలకాండము శ్రీరాముని శివధనుర్భంగ, పరశురామ గర్వభంగములతో ముగియుచు నాయకుని వీరత్వమును స్థాపించుచున్నది. అయోధ్యాకాండమున కైకేయీ రౌద్రకర్మకు ఫలముగా దశరథ మరణమువలన శోకము భాసించుటతో పాటు, శ్రీరాముని యరణ్యావాసవ్రత దీక్షయందు ధర్మదీక్ష వీరస్ఫూర్తి నందుచున్నది. అరణ్యకాండము రాముని రాక్షస సంహార రూపమైన మహానాటకమునకు ప్రథమాంకమువలె భాసించును. సీతావియోగదుఃఖము కరుణరస ఘట్టము–కిష్కింధకాండ సీతాన్వేషణ యత్నపూర్ణమై భాసించుచున్నది. అది సుందరకాండమున హనుమం

---

1. తత్త్వ సంగ్రహ రామాయణము
2. వివరములకు చూడు : షోడశీ–రామాయణ రహస్యములు– శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ.

తునిచే నిర్వహింపబడి నిండుదనమును సంతరించుకొనునది. యుద్ధ కాండము రామరావణయుద్ధరంగము. శ్రీరాముడు ధర్మయుద్ధ వీరము ప్రదర్శించి తన గార్హస్థాశ్రమ ధర్మమును పునరుద్ధరించుకొనిన వీర గాథ యిందుకలదు. ఇట్లొక్కొక్క కాండ మొక్కొక్క రసతరంగమై రామాయణము రసికుల హృదయక్షేత్రముల కొక రస తరంగిణివలె రాజిల్లుచున్నది.

ఉత్తరరామాయణ రచనము వాల్మీకిదా కాదా యను నంశము విమర్శకులలో వివాదగ్రస్తమైనను అది వాల్మీకిరచనమని విశ్వసించు పరిపాటి పరంపరగా వచ్చుచున్నది. ఉత్తరరామాయణకర్త లది వాల్మీకి కృత మనియే పేర్కొనుట జరిగినది.

రామాయణమును తత్వదృష్టితో చూచు నధ్యాత్మపరులు సుందరకాండ మా కావ్యమునకు గుండెవంటి దని భావింతురు. బ్రహ్మాండ పురాణ మీకాండను "సమస్తమంత్రరాజోఽయ"మ్మని ప్రశంసించెను. సుందరకాండ నామ సార్థక్యము నీ క్రింది శ్లోకము వర్ణించుచున్నది.

"సున్దరే సున్దరో రామః సున్దరే సున్దరీ కథా ।
సున్దరే సున్దరీ సీతా సున్దరే సున్దరం వనం ।
సున్దరే సున్దరం కావ్యం సున్దరే సున్దరం కపిః ।
సున్దరే సున్దరం మన్త్రం సున్దరే కిం నసుందరమ్ ॥"

సుందరకాండము నందలి శ్రీరాముని స్థితియు తత్కాండము యొక్క ఉత్తమత్వమును స్థాపించు బ్రహ్మాండ పురాణ శ్లోకము గమనింపదగినది,

"చంద్రబింబ సమాకారం వాంఛితార్థ ప్రదాయకం
హనూమత్సేవితం ధ్యాయేత్ సుందరేకాండ ఉత్తమమ్."

ఇందు రాముడు పాస్యదైవముగా గీర్తింపబడినాడు. రామాయణ పారాయణమున నందువలననే సుందరకాండమున కొక వైశిష్ట్యము, మహత్వము కలదు. కావున రామాయణ కావ్యపఠన మననముల

వలన రసానందమును, జ్ఞానానందనమును లభించి యైహికాముష్మిక సుఖస్థితి మానవునకు సిద్ధించునని సులభముగా జెప్పవచ్చును.

ఆదికావ్యారంభమున వాల్మీకి శోకచిత్తము నుండి శ్లోక ముద యించిన యుదంతము సర్వజన హృదయాహ్లాద జనకముగా నున్నది. ఒకనాడు త్రికాలజ్ఞుడైన నారదమహర్షి వాల్మీక్యాశ్రమమున కరుదెం చెను. వాల్మీకి యాముని కర్ఘ్యపాద్యాది సేవలొనర్చి ప్రసన్నుని జేసెను. ఆ పైన నా మహర్షి నిట్లు ప్రశ్నించెను.

"కోన్వస్మిన్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః॥
చారిత్రేణ చ కోయుక్తస్సర్వభూతేషు కోహితః
విద్వాన్కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః॥
ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్కోఽనసూయకః
కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే॥
ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే
మహర్షే! త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవం విధం నరమ్."

ఇట్టి యుత్తమగుణములు గల నరుడు దాశరథియైన శ్రీరామ చంద్రుడని పేర్కొని, యాతని గుణకీర్తనము చేసి, యతని విష్ణ్వంశను ప్రశంసించి, రామకథను సంగ్రహముగా దెలిపి నారదుడు వెడలి పోయెను. తరువాత వాల్మీకి స్నానార్థమై తమసాతీరమునకు బయలు దేరెను. తమసానిర్మలతీర్థ దర్శన మా మునిపుంగవుని చిత్తము నల రించినది. వెంటనే యాతడు దాని నిట్లు వర్ణించినాడు

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ! నిశామయ!
రమణీయం ప్రసన్నామ్బు సన్మనుష్యమనో యథా॥"

సన్మనుష్యహృదయమువలె నా తీర్థ మతిప్రసన్నముగా నున్నదను నీవర్ణనము వాల్మీకి చిత్తవృత్తి నైర్మల్యమును, కవితాశక్తిని వ్యంజింప జేయుచు సహృదయహృదయానందకర మగుచున్నది.

వాల్మీకి తన వల్కలములను శిష్యునకందించినాడు. ఆ తటమున నున్న విపులవనమున దృష్టిసారించినాడు. ఆయనకు సమీపముననే

జతకూడి చారునిస్వనము చేయుచున్న క్రౌంచమిథునము కానబడెను. ఆ జంట రామాయణకథావ్యగ్రమైన యాతని చిత్తమున మెదులుచున్న సీతారాముల జంటవోలె భాసించి యుండవచ్చును. దానిని గాంచి ముని ముగ్ధుడైయుండెను. అంతలో నొక వ్యాధుడా జంటలో మగపక్షిని బాణముతో గొట్టెను. రక్తసిక్తమైనశరీరముతో నది నేలపై బడెను. దానిని గాంచి క్రౌంచి రోదింపసాగెను. వాల్మీకి యా దృశ్యమును గాంచెను. ఆయన శోకవివశుడయ్యెను. ఆ శోకావేగమున నాతని ముఖమునుండి యొక శ్లోక మప్రయత్నముగా బయలు వెడలినది.

"మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్॥"

"ఓరి నిషాదుడా! నీవు చిరకాలము జీవింపవు. మా జంటలో కామమోహితమైన యొకదానిని సంహరించితివి కదా!" - అను నీమాటలు క్రౌంచి మనోగతభావములను తాదాత్మ్యముతో భావించి వాల్మీకి హృదయము పలికినది. ఆయన మాటల కాయనకే యబ్బురము కలిగినది.

"శోకార్తే నాస్యశకునేః కిమిదం వ్యాహృతం మయా"
అని చింతించి యిట్లు నిశ్చయించెను.

"పాదబద్ధో௨క్షరసమః తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకోభవతు నాన్యథా॥"

మహర్షి తత్కాలము నందలి తనయవస్థను వివేకించికొని శోకార్తుడైన యతని చిత్తవృత్తియే పాదబద్ధము, అక్షరసమము, తంత్రీలయ సమన్వితము నై శ్లోక మయ్యెనని తలంచెను. శ్లోకరామణీయకత్వమునకు హేతువులైన లక్షణములను ఆ విచక్షణుని చిత్తము వివేకింప గలిగినది.

వాల్మీకి ననుసరించుచున్న భరద్వాజుడను శిష్యుడా మహర్షి ముఖవినిర్గత శ్లోకరమణీయత్వమునకు ముగ్ధుడై యిట్లు కీర్తించెను.

"సమాక్షరై శ్చతుర్భి ర్యః పాదై ర్గీతో మహర్షిణా
సోఽను వ్యాహరణా ద్భూయః శోకః శ్లోకత్వ మాగతః॥"

సమాక్షరములైన నాలుగు పాదములతో వాల్మీకిచే గతమైన శ్లోకమా శిష్యుని చిత్తమును హత్తుకొనినది. వాల్మీకి పాత్రగతమనో భావములను తాదాత్మ్యముతో భావించి రమణీయ వాగ్వృత్తి నాశ్ర యించి కవిత నావిష్కరింపగల కవికోకిల, భరద్వాజుడు మధుర మైన ఛందము నాస్వాదించి రసానుభూతిని బొందగలుగు సహృద యుడు; సామాజికుల కెల్లఱకు ప్రతినిధిస్థానీయుడు! ప్రప్రథమమున నావిష్కృతమైన లౌకిక ఛందము కవి సహృదయుల హృదయాను భూతుల నిఱువైపుల ముద్రించుకొని యవతరించినది.

వాల్మీకి మహర్షి తమసాతీర్థమున గ్రుంకులిడి తచ్ఛ్లోక భావనా మయ చిత్తవృత్తుడై యాశ్రమమునకు జేరెను. కొంతవడికి బ్రహ్మ యా మహర్షి యాశ్రమమునకు వచ్చెను. క్రౌంచీవియోగశోకబద్ధ మైన శ్లోకమును భావించుచున్న వాల్మీకితో బ్రహ్మ యిట్లనెను:

"శ్లోక ఏవా స్త్వయంబద్ధః నాత్రకార్యా విచారణా
మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ॥"

నీచే బద్ధమైనది శ్లోకమే. ఇందు విచారింపవలసిన దేమియును లేదు. నా ఛందము వలననే నీ సరస్వతి (వాక్కు) యిట్లు ప్రవర్తిల్లి నది- అని బ్రహ్మ నిర్దేశించెను. విశ్వకర్తయైన విరించి కావ్యకర్త కానున్న వాల్మీకికవి నోట ఛందమును బలికించెను. రామాయణ మహాకావ్య నిర్మాణమున కనువైన కవివాక్కు సిద్ధమైనది. అప్పుడు బ్రహ్మదేవుడు-

"వృత్తం కథయ వీరస్య యథా తే నారదా చ్ఛ్రుతమ్"

అని వాల్మీకిని రామకథ నిర్మింపు మని యానతిచ్చెను. రామా దులగు కథావ్యక్తుల యొక్క రహస్య ప్రకాశవర్తనములన్నియు వాల్మీ కికి గోచరములగునట్లు ప్రసాదించెను. మరియు నిట్లాశీర్వదించెను.

"న తే వాగనృతా కాచిదత్ర కావ్యే భవిష్యతి
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్॥"

రామాయణకావ్యమున వాల్మీకి వాక్కొక్కటియైన నసత్యము కాబోదట! రామకథ పుణ్యప్రదమేకాక మనస్సును రమింపజేయు రసకావ్యమగునట! అంతకంటె కవికోకిల వాక్కునకు కావలసిన ఫలమేమున్నది. అట్లే రామాయణ మాదికావ్యమై అవతరించినది.

విరించి యాకావ్యము చిరంజీవి యగునని యాశీర్వదించెను.

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥"

చతుర్ముఖుని వాక్కు త్రికాల సత్యము!

రామకథను రమణీయముగా పలికిన వాల్మీకి కోకిల భారతీయులకు ప్రాతస్మరణీయము! కవికుమారుల కవితాకల్పవృక్షములకు నిత్య నూతన వసంతము! కావున నేటికిని రసికలోకము "వందే వాల్మీకి కోకిలమ్" అని భక్తి పారవశ్యమున పాడుకొనుచున్నది!

## అనుబంధము :

శ్రీమద్వాల్మీకి రామాయణ కథ సంగ్రహమున ఇట్లున్నది :-

రామాయణ కావ్యరచనకుగల పూర్వరంగము పైన వివరింపబడినది.

బ్రహ్మచే ఆదేశింపబడి ఇరువదినాలుగువేల శ్లోకములలో రామాయణమును రచించిన వాల్మీకి దానిని అంతేవాసులైన సీతాతనయులు కుశలవులకు గానరూపమున అభ్యసింపజేసెను. వారు పలు తావులందు రామాయణ గానమొనర్చుచు పలువురి ప్రశంసల నందిరి. చివరకు వారు తమసాతీరమున జరుగుతున్న శ్రీరామాశ్వమేధయాగ సందర్శనమునకు వాల్మీకితో కలిసి వెడలి, అచ్చట శ్రీరామ ప్రేరితులై రామాయణ కథాగాన మొనర్చిరి. అట్లు ప్రజా సముఖమున,

శ్రీరాముని మ్రోల వారుచేసిన గానమే వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణ దివ్యకథ. ఆకథ ఇట్లుండును :

సకల సౌభాగ్యములతో అమరావతిని మరపించు అయోధ్యానగరిని దశరథక్ష్మాపాలుడు పాలించుచుండెను. అనపత్య దోషమునకు కుములుచుండిన అతడు అశ్వమేధయాగ మొనరించిన పుత్రులు కలుగుదురని భావించి, మంత్రి సుమంత్రునిచే వసిష్ఠ వామదేవాదుల రావించి, యాగ నిర్వహణకు సుముఖులగావించి, అంతఃపురమున నీ విషయమును వెల్లడించెను. తదుపరి వసిష్ఠుడు అశ్వమేధము ఋశ్యశృంగాధ్వర్యమున జరిగిన జయప్రదమగునను దేవరహస్యమును- మున్ను తాను సనత్కుమారమహర్షివలన వినిన దానిని దశరథునకు చెప్పి, తిరిగి దశరథునిచే కోరబడి ఋశ్యశృంగుని వృత్తాంతమంతయు వివరముగ వినిపించెను. పిమ్మట సుమంత్రుని హెచ్చరిక మేరకు దశరథుడు సపరివారముగ వెడలి, అంగదేశాధిపతియైన రోమపాదుని అంగీకరింపచేసి ఋశ్యశృంగుని సపత్నీకముగ అయోధ్యకు తోడ్కొని వచ్చెను. వసంతఋతువు ప్రవేశించినపిమ్మట ఋశ్యశృంగానుమతిని యాగమునకు వలసిన సన్నాహములు ప్రారంభమయ్యెను. అశ్వమేధయాగానంతరము ఋశ్యశృంగాధ్వర్యమున పుత్రకామేష్టి కూడ జరిగినది. యజ్ఞహవిస్సునకై సమావేశమయిన ఇంద్రాదిదేవతలు లంకేశ్వరుడైన రావణాసురుని వలన సంభవించుచున్న కష్టనష్టముల పేర్కొని బ్రహ్మను శరణువేడిరి. ఆ సమయమున కచ్చటి కరుదెంచిన శ్రీమహావిష్ణువు దాశరథియై దానవసంహార మొనరింతునని అభయ మొసగెను.

యజ్ఞాంతమున ప్రాజాపత్యపురుషు డావిర్భవించి దశరథునకు దివ్యపాయసము నొసంగెను. దశరథ పత్నులైన కౌసల్య, సుమిత్ర, కైకేయిలా పాయసమును భుజించి, అంతర్వత్నులైరి. రాక్షస సంహారము కావించునపుడు శ్రీహరికి సహాయ మొనర్చుటకై వాయు ఇంద్రాది దేవతలు బ్రహ్మదేశమున వాలి, సుగ్రీవ, హనుమంతాది వానరవీరులను, అసంఖ్యాకమైన వానరసేనను కూడ సృష్టించిరి.

పుత్రకామేష్టిని జయప్రదముగ సంపూర్ణము గావించిన దశరథుడు ఋశ్యశృంగాదులను నిజనివాసముల కనిపెను. రోజులు శరవేగమున గడచినవి. దశరథాదుల కలలు ఫలింపజేయుచు శ్రీరామ భరతులు కౌసల్యా కైకేయిలకు, లక్ష్మణ శత్రుఘ్నులను కవలలు సుమిత్రకు జన్మించిరి, రామాదుల బాల్యక్రీడలతో కాలచక్రము గిర్రున తిరిగినది. సుశిక్షితులైన శ్రీరామాదుల వివాహమును గురించి నిండు పేరోలగమున సుమంత్రాదులతో సంప్రదించుచున్న దశరథుని కడకు విశ్వామిత్రమహర్షి అరుదెంచెను. ఆతడొనర్చుచున్న యాగమును రాక్షసులబారినుండి రక్షించుటకై రాముని తనతో పంపమని కోరగా, ప్రథమమున భీతిల్లినను, వసిష్ఠాదుల ప్రోత్సాహమున చివరకు అంగీకరించి దశరథుడు రామలక్ష్మణులను మునివెంట పంపెను. విశ్వామిత్రుడు మార్గమందు వారికి బల అతిబల విద్యల నుపదేశించెను. మధ్యమార్గమున మునియానతిని రాముడు తాటకియను దానవిని సంహరించి, జంబుకాది దివ్యాస్త్రములను మునినుండి పొందెను, పిమ్మట రామలక్ష్మణులు మారీచ సుబాహులను రాక్షసులను జయించి, విశ్వామిత్రుని యాగమును సంరక్షించిరి. విశ్వామిత్రుడు గాధి, సత్యవతి, గంగ, కుమారసంభవ, సాగరచరిత్ర, సముద్రమథనము మున్నగు వృత్తాంతములను చెప్పుచు వారిని మిథిలానగరమున జనకమహారాజొనర్చుచున్న యాగము సందర్శించుటకు తోడ్కొని పోయెను. మార్గమధ్యమున శ్రీరామపాద స్పర్శచే గౌతమపత్నియైన అహల్యకు శాపవిమోచనము కలిగెను. మిథిల యందు జనకుని పురోహితుడైన శతానందుడు రామలక్ష్మణులకు విశ్వామిత్రుని బ్రహ్మర్షిత్వమును గురించి వివరముగ చెప్పెను. ప్రసంగవశమున సీతాజననము గూర్చి తెలియజేసిన జనకుడు సీతాకల్యాణమునకై పణముగ నుంచబడిన శివధనుస్సును విశ్వామిత్రుని కోర్కెపై రామలక్ష్మణులకు చూపగా, మునియానతి తలదాల్చి శ్రీరాముడు శివధనుర్భంగ మొనరించెను. సంతసించిన జనకుడు దశరథాదుల రావించి శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు సీతోర్మిళా మాండవీ శ్రుతకీర్తుల నొసగి వైభవోపేతముగ వివాహమొనర్చెను. కల్యాణానంతరము

అయోధ్యకు చనుచున్న శ్రీరాముని కడకు పరశురాము డరుదెంచి శ్రీరాముని బలపరాక్రమములను గురించి అవహేళన మొనర్పగా, రాముడు పరశురాముని కడనున్న విష్ణుచాపము నెక్కిడి భార్గవ రాముని గర్వభంగము కావించెను. అయోధ్య చేరిన పిమ్మట భరత శత్రుఘ్నులు కేకయరాజుకడ కరిగిరి.

## అయోధ్యా కాండము :

తనకు కలుగుతున్న దుర్నిమిత్తములకు కలతనొంది దశరథుడు శ్రీరామయౌవరాజ్యాభిషేకమునకై నిశ్చయించి, సమయాభావమున కేకయ, జనకరాజులకు ఆహ్వానములు పంపకుండగనే ముహూర్తము నిశ్చయింపజేసెను. విషయము తెలిసి కైకేయిఅరణపుదాసి మంధర యనునది రాముని అభ్యున్నతి కోర్వజాలక కైకేయిని ప్రేరేచెను. అసూయాగ్రస్తయైన కైక దశరథుని ఆతడు మున్ను వాగ్దానముచేసిన రెండు వరములుగ భరతునకు రాజ్యాభిషేకము, శ్రీరామునకు పదునాలుగు సంవత్సరములు వనవాసము కోరెను. నిర్వికారముగ పితృవాక్పరిపాలనకు సంసిద్ధుడైన రఘురాముని ధర్మపత్ని సీత, సోదరుడు లక్ష్మణుడుకూడ అనుసరింప కృతనిశ్చయులైరి. దశరథుని సమ్ముఖమున కైక యొసగిన నారచీరలుధరించి వనవాసయోగ్యములైన పరికరముల గ్రహించి, శోక సముద్రమున మునిగిన అయోధ్యనువదలి వారు మువ్వురు కానలకై సుమంత్రుని రథమున బయలుదేరిరి. నిషాధ రాజైన గుహుని పట్టణమగు శృంగిబేరపురమున మర్రిపాలతో జడలను ధరించి, గంగనుదాటి వనప్రవేశ మొనర్చి, వారు పాదచారులై పోవుచు భరద్వాజుని దర్శించి, అటనుండి చిత్రకూటమునకు జని అక్కడ పర్ణశాలను నిర్మించుకొనిరి.

ఇట సుమంత్రుడు శూన్యరథముతో అయోధ్యచేరి దశరథాదులకు రామాదులసందేశము వినిపించెను. దుఃఖపరవశుడైన దశరథుడు స్వర్గస్థుడు కాగా, వశిష్ఠాదులు రాజుదేహమును తైలమున భద్రపరచి భరతశత్రుఘ్నులను పిలిపించిరి. అయోధ్య కరుదెంచిన భరతుడు

తన పరోక్షమునజరిగిన శ్రీరామ వనగమనమునకు వగచి కైకేయిని నిందించి శ్రీరామునే రాజ్యాభిషిక్తుని కావింతునని నిండుపేరోలగమున శపథము కావించి, శ్రీరాముని తోడ్కొనివచ్చుటకు సపరివారముగ బయలుదేరి, మార్గమధ్యమున గుహుని, భరద్వాజుని కలుసుకొని, చివరకు చిత్రకూటమును జేరెను. సపరివారముగ వచ్చి రాజ్యమును స్వీకరింపుమని ప్రార్థించిన భరతుని సమాశ్వాసపరచి, శ్రీరాముడు చివరకు తనకు మారుగా పాదుకల నొసగెను. భరతుడు సభక్తికముగ వాటిని స్వీకరించి, మరలివచ్చి కౌసల్యాదులను అయోధ్యకు పంపి, తాను నందిగ్రామమున జటావల్కలధారియై రాజ్యమును పాదుకా పరముగ నిర్వహించుచుండెను.

మహర్షుల ప్రోద్బలమున రాక్షస సంహారమునకై కృతనిశ్చయు డయిన శ్రీరాముడు అయోధ్యావాసుల సాన్నిధ్యమును పరిహరించుటకై చిత్రకూటమును విడిచి, దండకారణ్యాభిముఖుడై చనుచు అత్రి మహర్షిని దర్శించెను. అనసూయాదేవి సీతాపాతివ్రత్యమునకు సంతసించి ఆమెను దివ్యవస్త్రాదులతో సత్కరించెను. పిమ్మట సీతారామలక్ష్మణులు దండకారణ్యమున ప్రవేశించిరి.

## అరణ్య కాండము :

దండకారణ్యమున ప్రవేశించిన శ్రీరామలక్ష్మణులు విరాధుడను రాక్షసుని వధించి, శాపవిముక్తుని కావించి, శరభంగమహర్షి వైకుంఠ గమనమునుకనులారగాంచి,సుతీక్ష్ణమహర్షి దర్శనమొనరించి మాండకర్ణి ఋషివృత్తాంత మాలించి, అగస్త్యాశ్రమము చేరుకొనిరి. దివ్యాస్త్రముల నొసంగి అగస్త్యుడు వారికి పంచవటిమార్గము చెప్పెను. పంచవటి ప్రవేశించిన రామాదులకు జటాయువను విహంగముతో పరిచయము ఏర్పడెను. పంచవటిలో పర్ణశాల నిర్మించుకొని సీతారామలక్ష్మణులు సుఖముననుండగా హేమంతము గడచినది. ఒకనాడు లంకాధిపతి యగు రావణాసురుని సోదరియైన శూర్పణఖ పంచవటికి వచ్చి వారిని చూచెను. శ్రీరామసౌందర్యమున కాకృష్టయై అది శ్రీరాముని సమీపించి, తన మోహావేశమును ప్రకటింపగా సోదరుని ప్రోద్బలమున లక్ష్మణుడు

దాని నాసికను, కర్ణములను ఖండించి విరూపను గావించెను. ఆభంగ పాటునకు శూర్పణఖ ఆగ్రహముచెంది పదునాలుగువేలమంది రాక్షస వీరులతో రాగా, శూర్పణఖ సోదరులైన ఖరదూషణులను ససైన్యముగ శ్రీరాము డొంటరియై సంహరించెను. అకంపనుడను రాక్షసునిచే విషయము నెరిగిన లంకేశుడు సీతాపహరణార్థము మారీచుని సమీపించి, అతని హితోక్తులచే శాంతించి మఱల లంకకు బోయెను, కాని, శూర్పణఖ ప్రేరణమున తిరిగి మారీచుని కడకువచ్చి, అతని బెదిరించి సహాయ మొనరించుటకు అంగీకరింప చేసెను. మారీచుడు మాయా మృగమై పర్ణశాల ముంగిట సంచరింపగా కాంచి, సమ్మోహిత యైన జానకి, దానిని బంధింప పతిని వేడెను. లక్ష్మణుడు వారించినను లెక్కింపక శ్రీరాముడు ధనుర్బాణుడై హరిణమును వెన్నంటిపోయి, మాయామృగమనిగ్రహించి, శరప్రయోగమొనరించగా, శ్రీరామకంఠము ననుసరించి లక్ష్మణుని పిలుచుచు మారీచుడు నేలకూలెను. అయ్యార్తి నాలించి జానకి శ్రీరామునకు ప్రమాదము సంభవించెనని భ్రమించి, లక్ష్మణుని రామసంరక్షణార్థమై వెడలుమని కోరగా అతడు అది రాక్షస మాయగా గుర్తెఱిగి నిరాకరించెను. దుఃఖపరవశయైన జానకి క్రోధముతో మరది శీలమును శంకింపగా లక్ష్మణుడు చింతించి, చేయునదిలేక ఆమె నొంటిగావిడచి సోదరునికై వెడలెను. అదనుకై నిరీక్షించుచుండిన రావణుడు మాయాసన్యాసియై సీత సమ్ముఖము నకు వచ్చెను. ఆతిథ్య మొసగ వచ్చిన జానకికి అతడు నిజస్వరూ పమును చూపించి, మనోవాంఛ తెల్ప రాఘవపత్ని క్రోధముతో అతని నిందించెను. తుదకు రావణుడామెను బలాత్కారముగ బంధించి ఏగుచుండగా జానకి విలాపమాలించి జటాయువరుదెంచి రాక్షసుని ఎదుర్కొనెను. భయంకరయుద్ధమున రావణుడు జటాయు వును సంహరించి, జానకినిగైకొని ఆకాశమార్గమున లంకకేగుచుండగా మార్గ మధ్యమున ఋష్యమూకాద్రిని వానరులనుకాంచి జానకి వారి నడుమ పడునట్లుగా తన ఆభరణములను విసరివైచెను. రావణుడు సీతను లంకయందు అశోకవనమున బంధించి, త్రిజటాది రాక్షసవని తల కాపుంచి, రామప్రవర్తనము నెరుగుటకై రాక్షసులను పంచవటికి

పంపెను. ఇట లక్ష్మణద్వితీయుడై ఆపదను శంకించుచు ఆశ్రమమున కరుదెంచిన రాముడు సీతను గానమికి దురపిల్లి, మృగములు సూచించిన మార్గమున చనుచు కొన ఊపిరితో నున్న జటాయువు వలన సీతాపహరణ వృత్తాంతము వినెను. జటాయువునకు అంతిమక్రియలు కావించి సోదరులు బయలుదేరిరి. అట్లు సీతను అన్వేషించుచు లక్ష్మణుడు అయోముఖి అను రాక్షసి ముక్కు చెవులు ఖండించెను. పిమ్మట వారు కబంధరాక్షసుని సంహరింపగా శాప విముక్తి కలిగి గంధర్వుడై, అతడు సుగ్రీవునితో సఖ్యమును కావింపుమని వారిని హెచ్చరించెను. కబంధుని సూచన మేరకు రామలక్ష్మణులు శబరిని కలుసుకొనిరి. పిమ్మట పంపాసరస్సుకు పయనమయిరి.

## కిష్కింధా కాండము :

పంపాతీరమున విహరించు శ్రీరామలక్ష్మణులను సుగ్రీవుని చే ప్రేరితుడైన హనుమంతుడు వచ్చి కలుసుకొని, రామసుగ్రీవుల మైత్రీఆవశ్యకతను గుర్తించి, వారిని తన ప్రభువుకడకు కొనిపోయి అగ్నిసాక్షిగ వారికి సఖ్యమొనర్చెను. సుగ్రీవుడు వారికి సీత ఆభరణములను చూపెను. సుగ్రీవుని సోదరుడైన వాలి వలన సుగ్రీవునికి కలిగిన పరాభవమును విని రాముడు వాలిని వధించి, కిష్కింధా రాజ్యమును ఆతని కొసగెదనని శపథ మొనర్చెను. శ్రీరాముని ప్రేరణతో సుగ్రీవుడు వాలిని ద్వంద్వయుద్ధమునకు ఆహ్వానించెను. వారు కలహించుచుండగా శ్రీరాముడు శరప్రయోగమున వాలిని సంహరించెను. సుగ్రీవుడు కిష్కింధాపతిఅయ్యెను. వర్షఋతువు గడచిన పిమ్మట సుగ్రీవుడు నానాదేశములనున్న సకలవానరవీరులను సమ్మేళనపరచి నలుదిశల సీతాన్వేషణకై పంపెను. దక్షిణ దిశకు అట్లు అంగదజాంబవంతాదులతో ఏగుచున్న హనుమంతునకు శ్రీరాముడు సీతకు అభిజ్ఞానముగ తన అంగుళీయకము నొసగెను. హనుమంతాదులు దక్షిణ దిక్కుగ అన్వేషించుచు చివరకు సముద్రముచేరి, అధైర్యము నొంది కుములుచుండగా, ఱెక్కలులేని సంపాతి యను విహంగ మొకటి వారి కలకలము విని వారిని సమీపించెను. జటాయువునకు సోదరుడైన సంపాతి జటాయువు మరణమునువిని శోకించి,

సీతాదేవిని రావణుడు లంకకు గొనిపోవుట తన కుమారుడైన సుపార్శ్వుడు తిలకించెనని చెప్పగా సంపాతికి యథాప్రకారముగా ఱెక్కలు మొలిచెను. సముద్రలంఘనము హనుమంతునకే సాధ్యమని నిశ్చయించిన జాంబవంతాదులు అతని అందుకు ప్రోత్సహించిరి. అతడందుకుద్యుక్తుడయ్యెను.

## సుందరకాండము :

దృఢ నిశ్చయముతో హనుమంతుడు వారధిని లంఘించుచుండ, అతని సేద దీర్చుటకై సముద్రుడు మైనాకపర్వతమును పంపెను. లంక చేరునంతవఱకు విశ్రాంతిగైకొనననిచెప్పి, దానినిపంపి ముందుకు సాగు పావని బలశౌర్యముల పరీక్షించుటకై దేవతలు సర్పమాతయగు సురసనుపంపిరి. రాక్షసాకృతిదాల్చిన సురసను ఓడించి, సింహికయనుమఱియొక దానవిని సంహరించి, నిర్విఘ్నముగ లంకను జేరి. ఆంజనేయుడు అచ్చట లంకాధిదేవతయైన లంకిణిని గెలిచి, ఆమె ఆశీస్సులను పొందెను. నిశాసమయమున రామసతికై లంక నంతయు అన్వేషించెను. రావణాంతః పురమునుకూడ శోధించి చివరకు అశోకవనికేగిన హనుమంతునకు అశోకవృక్షము క్రింద శోకితయై యున్న సీతాదర్శనము లభించెను. శింశుపావృక్షమున అతడు సూక్ష్మరూపమున దాగియున్న తరి. లంకేశుడు మండోదర్యాది అంతఃపురకాంతలతో అట కరుదెంచి. సీతాప్రసన్నతకై ప్రయత్నించి, విఫలుడై ఆమెకు రెండుమాసముల గడువు మాత్రమొసగి వెడలిపోయెను. పిమ్మట హనుమంతుడు సీతను కలుసుకొని, విషయములను సవిస్తరముగ ఎఱింగించి. రామముద్రిక నొసగగా సంతసించి, సీత ప్రతిగా పతి కొసగుటకై చూడామణి నొసగెను. పిమ్మట ఆమె అనుమతిని గైకొని అశోకవనిని ధ్వంసము గావించి, తన్నెదిరించిన రాక్షసవీరులను సంహరించి తుదకు రావణ పుత్రుడైన ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు జిక్కి. రావణుని కొలువునకు వెడలెను. అచ్చట లంకేశునకు రామ సందేశమును వినిపింపగా, అతడు కుపితుడై పావనిని సంహరింప అజ్ఞయొసగి. సోదరుడైన విభీషణునిచే వారింపబడి వాలమునకు అగ్నిరగుల్ప నాదేశించెను. రాక్షసులట్లు కావిం

పగా, హనుమంతుడు ఆకాశమున కెగిరి ఆ అగ్నితో లంకకాల్చి, సీత అనుమతిగైకొని తిరిగి సముద్రము లంఘించి జాంబవంతాదుల కడ కేగగా, అందరును ఆనందాతిశయమున పరవశించుచు తిరోన్ముఖు లైరి. శ్రీరామ సన్నిధానమున హనుమంతుడు సీతా సందర్శనాది విశేషములన్నియు నెఱింగించెను.

## యుద్ధకాండము :

శ్రీరాముడు అఖండమగు వానరసేనతో లంకేశునిపై యుద్ధమునకు బయలుదేరి, సముద్రముకడ విడిసెను. లంకయందు మంత్రాలోచనలు జరుపుతున్న సోదరునికి హితముగరుప ప్రయత్నించి అవమానింపబడిన విభీషణుడు రావణుని పరిత్యజించి, తన మంత్రులతో కలసి వచ్చి శ్రీరాముని శరణు జొచ్చెను. శ్రీరాముడా సముద్రతీరముననే విభీషణుని లంకాధిపతిగా అభిషేకింప జేసెను. సముద్రుని ప్రసన్నతకై శ్రీరాముడు త్రిరాత్రములు ప్రాయోపవేశ మొనర్చియు ఫలితము గానక, కుపితుడై వార్నిధిపై బ్రహ్మాస్త్రప్రయోగమున కుద్యుక్తుడు కాగా, భీతిల్లిన సముద్రుడు ప్రత్యక్షమై, శరణువేడి, వానరసైన్యమునగల విశ్వకర్మకుమారు డైన నీలుని సహాయమున వార్నిధిపై సేతునిర్మాణము కావింపుమని చెప్పెను. సేతువునిర్మించి, సాగరముదాటి, శ్రీరాముడు లంకయందు విడిసెను. రావణుడు శ్రీరామలక్ష్మణుల మాయాశిరముల జూపి సీతను దుఃఖితను కావింపగా, విభీషణపత్నియైన సరమ యది రావణమాయగా నామె కెఱింగించెను. శ్రీరాముడు తుది ప్రయత్నముగ వాలి పుత్రుడైన అంగదుని రావణుని కడకు రాయబారమంపెను కాని అది విఫల మయ్యెను. యుద్ధ మారంభమయ్యెను. రణరంగమున అంగదునిచే పరాభవింపబడిన ఇంద్రజిత్తు మాయాయుద్ధమున రామలక్ష్మణులను నాగపాశబద్ధులను కావింప వారుమూర్ఛిల్లిరి. ఇంద్రజిత్తు వారు మరణించిరని రావణునకు చెప్పెను, అంత రావణుడు పుష్పకవిమానమున త్రిజటతో సీతను యుద్ధరంగమున కనుపగా దుఃఖించు సీతకు త్రిజట పుష్పకము భర్తృహీనలను భరింపదు కావున రాముడు సజీవుడేనని చెప్పి సమాశ్వాస పరచెను. గరుక్మంతుడరుదెంచి, రామలక్ష్మణులను విగతబద్ధులను కావించి చనెను. తరువాత జరిగిన భయంకర యుద్ధమున ధూమ్రాక్షవజ్ర

ద్రంష్ట్రప్రహస్తనరాంతకవిరూపాక్షఅతికాయమహాకాయాది రాక్షస వీరు లందరు మరణించిరి. రావణ సోదరుడైన కుంభకర్ణుడు కూడ చివరకు శ్రీరామునిచే హతుడయ్యెను. ఇంద్రజిత్తు హోమము చేసి శస్త్రాదుల బడసి రామలక్ష్మణులను బంధింపగా, హనుమంతుడు సంజీవిని గొనివచ్చి వారల సేద దీర్చెను. రణరంగమున ఇంద్రజిత్తు మాయా సీతనువధించి, అంతర్ధానమై నికుంభిలా హోమము నారంభింపగా, విభీషణుని ప్రేరణమున లక్ష్మణుడు యాగవిఘ్నము గావించి, భయంకర యుద్ధమున ఇంద్రజిత్తును హతమార్చెను. పుత్రశోకావేగమున రావణుడు సీతను వధించుట కుద్యుక్తుడుకాగా సుపార్శ్వుడు వారించెను.రామరావణుల యుద్ధము ప్రారంభమయ్యెను. రావణశక్తికి లక్ష్మణుడు మూర్ఛిల్లగా, హనుమంతుడు సంజీవినిచే సేదదీర్చెను. ఇంద్రుడు మాతలిని సారథిగ తన రథమును రామ సహాయార్థము పంపెను. దాని నధిరోహించిన రామునకు అగస్త్యమహర్షి అరుదెంచి ఆదిత్యహృదయము నుపదేశించెను. రావణుని శిరములు భేదించినను మరల ఆవిర్భవించు చుండుటకు శ్రీరాము డచ్చెరువొంది. మాతలిచే హెచ్చరింపబడి బ్రహ్మాస్త్ర ప్రయోగమున రావణుని హతమార్చి లోక శాంతి నొనగూర్చెను. విభీషణుడు లంకాధిపతియై, రామాదేశమున సీతను సాలంకృతగా శ్రీరామసన్నిధికి గొనివచ్చెను. పరు నింట నుండిన సీతను స్వీకరింపజాలనను శ్రీరాముని కఠినోక్తులకు దుఃఖించి సీత, తన పాతివ్రత్య నిరూపణనకై అగ్నిప్రవేశ మొనర్చెను. బ్రహ్మమహేశ్వరాది దేవతలువచ్చి శ్రీరాముని స్తుతించిరి. అగ్నిస్వయముగ సీతను గొనివచ్చి శ్రీరామున కొసగెను. ఇంద్రుడు రాముని కోరిక మేరకు విగతజీవులైన కపివీరుల నందరిని బ్రతికించెను. పుష్పకమున భరద్వాజాశ్రమమునకు ససైన్యముగ వచ్చి శ్రీరాముడు హనుమంతుని నందిగ్రామమున నున్న భరతుని కడ కంపెను. తదుపరి అయోధ్య కరుదెంచెను. సీతారామ పట్టాభిషేకము మహావైభవముగ అయోధ్యయందు జరిగెను.

## ఉత్తరకాండము :

ఉత్తర రామాయణము వాల్మీకి ప్రోక్తమా కాదా యను వివాదము పండిత ప్రకాండులలో కలదు. అయ్యది వాల్మీకి విరచితమే

యను వాదమునను ప్రస్తుతమంగీకరించి, ఆ కథాసంగ్రహము కూడ యిప్పట్టున పేర్కొనుట జరిగినది

పట్టాభిషేకానంతరము రాజ్యపాలన మొనర్చుచున్న శ్రీరాముని దర్శనార్థము అగస్త్యాది మహర్షులరుదెంచిరి. శ్రీ రామునిచే అడుగబడి అందగస్త్యుడు రావణ కుంభకర్ణాది రాక్షసవీరుల జన్మరహస్యములను, సీతాదేవి పూర్వజన్మగా చెప్పబడు వేదవతి వృత్తాంతము, రావణుని దిగ్విజయములు, దురహంకారము, రంభావిషయికముగా పొందిన శాపము, హనుమంతుని జననము-మొదలైన వృత్తాంతము లన్నియు వివరముగ వినిపించెను. జనకవిభీషణసుగ్రీవాదులను సత్కరించి, నిజనివాసముల కనుపుటయే కాకుండ రాముడు పుష్పకమును గూడ కుబేరునికి పంపివేసెను.

రాముడు రాజ్యమేలుచుండగా పదివేలవత్సరములు గడచినవి. సీతాదేవి అంతర్వత్ని యయ్యెను. శ్రీరాముడామె కోర్కెల తీర్పగోరి కోరుకొనుమనగా ఆమె తపోవనముల దర్శింపవలెననెను. మరునాడు పంపుటకు రాముడంగీకరించెను. ఆరోజుననే రాముడు పండితుల మధ్యస్థమున నుండి నగర విశేషములడుగ భద్రుడను నతడు పరునింట చెఱనుండిన సీతాదేవిని పురజనులు కొందరు శంకించుచున్నారని చెప్పెను. ఖిన్నుడై రాముడు మిగిలిన వారిని కూడ అడుగగా వారును ఆ విధముగనే చెప్పిరి. వారల పంపి, కృతనిశ్చయుడై రాముడు సోదరుల రావించి, అపనింద నెరింగించి, సీతాపాతివ్రత్యము తానెరింగియున్నను ప్రజావాక్యము పాలించుట రాజధర్మము కావున తపోవనముల సందర్శింపవలెనను ఆమె కౌతూహలము తీర్చు నెపమున వాల్మీక్యాశ్రమము చెంత వదలి రమ్మని లక్ష్మణు నాదేశించెను. రామాజ్ఞను జవదాటని లక్ష్మణు డట్లే ఒనరించెను.

ఆ రీతి వనముల త్రోయబడి దుఃఖించుచున్న సీతను గాంచి వాల్మీకి శిష్యులు వాల్మీకి కెరిగింపగా ఆయన జరిగినదంతయు దివ్యదృష్టిని గ్రహించి ఆమెను తన యాశ్రమమునకు తోడ్కొని పోయెను. సీతను వదలివచ్చినందుకు దుఃఖించు లక్ష్మణునకు

సుమంత్రుడు పూర్వము దుర్వాసముని దశరథునకు చెప్పిన రామ శోకమును గురించిన విషయము చెప్పెను. దేవాసురుల సంగ్రామ మందు ఓటమి పొందిన అసురులకు భృగుపత్ని శరణమొసగుటకు కినిసి విష్ణువామెను సంహరించెను. ఆగ్రహించిన భృగవు విష్ణువు మనుష్యరూపమున జన్మించి చిరకాలము భార్యావియోగదుఃఖ మనుభవించునట్లు శాపమొసంగెను. విష్ణువద్దానిని లోకోపకారార్థము స్వీకరించెను-ఈ దేవరహస్యము విని అయోధ్య కరుదెంచిన లక్ష్మణు నకు రాముడు ధర్మవర్తనులైన నృగుమహారాజాదుల కథలు చెప్పి శాంతింప జేసెను.

తరువాత కొంత కాలమునకు లవణాసురుని సంహరించుటకు బయలుదేరిన శత్రుఘ్నుడు మార్గమధ్యమున వాల్మీక్యాశ్రమమున విడిసెను. ఆ రాత్రియే సీతాదేవికి కుశలవులు జన్మించిరి. ఆ శుభ వార్త నెఱిగి శత్రుఘ్నుడు సంతసించి, వెడలి లవణుని సంహరించి మధురానగరమును పాలింపసాగెను. పండ్రెండుసంవత్సర ములు గడచినవి. చివరకు శత్రుఘ్నుడు శ్రీరామసందర్శనార్థమై బయలుదేరి మార్గమధ్యమున వాల్మీక్యాశ్రమమును చేరి, కుశలవు లను చూడకుండగనే వారి రామాయణ గాన మాలించి, సంతసించి అయోధ్యకరిగెను.

కొంత కాలమునకు శ్రీరాముడు గోమతీ తీరమున అశ్వమేధ యాగము ప్రారంభించెను. కుశలవాది శిష్యసమేతుడై వాల్మీకి యాగ సందర్శనార్థ మరుదెంచెను. రాముని కోరికపై కుశలవులు యజ్ఞవాటిని రామాయణ గాన మొనర్చిరి. రాముడు వారిని తన పుత్రులుగ గురుతించి, సభాముఖమున సీత ప్రతిన గావించిన ఆమెను స్వీకరింతునని వాల్మీకికి సందేశమంపెను. మరునాడు యజ్ఞవాటిని మహర్షులతో పాటు అయోధ్యావాసులు, రాక్షసవానరవీరులు కూడ సమావేశమయిరి. అచ్చటకు సీతను తోడ్కొని వచ్చిన వాల్మీకితో రాముడు సీతాపవిత్రచరిత్ర తానెరిగియున్నను ప్రజల ఆమోదార్థమై ఆమె ప్రతిన చేయుట అవసరమనెను. అంత వాల్మీకాదేశమున

సీత ప్రాంజలియై భూమిని తిలకించుచు, త్రికరణశుద్ధిగా తాను శ్రీరామునే ధ్యానించిన, భూదేవి తనను లోనికి గ్రహించుననని పలికెను. అందరు నివ్వెరపడి చూచుచుండ పాతాళము నుండి సింహాసనమున ఆసీనయై యున్న భూదేవి ఆవిర్భవించి, సీతను సింహాసనమున కూర్చుండబెట్టు కొని తిరిగి లోనికి జనినది. రాముడు శోకార్తుడై భూదేవిపై కోపమును ప్రదర్శింపగా బ్రహ్మ శాంతపరచి, ఈ విధముగా జరుగునని వాల్మీకి మున్నే తన కావ్యమున పేర్కొని యున్నాడు కావున దానిని సంపూర్ణ ముగ ఆలకించుమని కోరెను.

మరునాడు రామాదేశమున కుశలవులు ఉత్తర రామాయణమున సీత పాతాళమున ప్రవేశించిన తదుపరి కథను గానము చేసిరి. అందు శ్రీరాముడు సీతావియోగ దుఃఖమును భరించుచునే రాజ్య పాలన మొనరించెను. కౌసల్యాదులు స్వర్గమున కరిగిరి. భరతుని కుమారులు గాంధార దేశమునకు, లక్ష్మణుని పుత్రులు కారుపథ దేశమునకు అధిపతులయిరి. తరువాత కొంత కాలమునకు యమ ధర్మరాజు తాపసవేషమున రాముని కడ కరుదెంచి తమ ఏకాంతము నకు భంగము కలిగించువారికి శిరశ్ఛేదన శిక్ష నొసగెదనని రామునిచే శపథము చేయించి. ద్వారమున లక్ష్మణుని కాపుంచి స్వర్గమునకు రావలయునను విరించికోరికను విన్నవించెను. ఆ సమయముననే దూర్వాసముని రామదర్శనార్థమరుదెంచి, లక్ష్మణుడందు కంగీకరింప నందున ఆగ్రహించి రఘువంశ నిర్మూలనము కావింతుననగా, భయ పడి లక్ష్మణుడు లోనికి జని వారి ఏకాంతమునకు భంగము కలిగిం చెను. రాముడంత పరిత్యాగమును మరణముతో సమానముగ భావించి, సమయభంగము కావించిన లక్ష్మణుని పరిత్యజించగా, అతడు సరయూతీరమునకు జని యోగము నవలంబించి శరీరము తోడనే స్వర్గమున కరిగెను. పిమ్మట రాముడు కుశలవులను పట్టాభిషిక్తుల గావించి వెన్నంటిన రాక్షసవానరవీరుల తోడను అయోధ్యావాసుల తోడను కలసి సరయూనదిని ప్రవేశించి స్వర్గమును చేరెను. అచ్చట రాముడు శ్రీమన్నారాయణు డయ్యెను.

శ్రీమద్రామాయణ సర్వము, సంగ్రహముగ నిది.

# సంస్కృత వాఙ్మయములో రామకథ

కావ్యమునకు ఇతివృత్తము శరీరము. రామాయణమునకు రామకథ శరీరము. రాముడు 'పుంసాం మోహన రూపాయ' అని ప్రసిద్ధి కెక్కిన జగదేకమోహనుడు. అతని చరిత్రముకూడ అంత మోహనమైనది. అందువలన రసలుబ్ధులైన కవిరాట్టుల దృష్టుల నది ఆకర్షించుటలో నబ్బురము లేదు.

రామకథయందు భారతసంస్కృతి రమణీయముగ ప్రతిబింబించి యుండుటచే భారతీయకవుల కావస్తువు కల్పవృక్షమై పరిఢవిల్లినది. సంస్కృతభాష మన కనాదిభాష. ఆ భాషలో వెలసిన సమస్త సాహిత్య ప్రక్రియలలో రామకథ యవతరించినది. పౌరాణికు లా వస్తువును పురుషార్థసాధనోపదేశమున కనువైన పుణ్యగాథగా తలచిరి. తాత్త్వికులు జ్ఞానబోధకు సరిపడు సమన్వయము నందించు ప్రతీకాత్మక కావ్యముగా భావించిరి. కావ్యకర్తలు, రూపకకర్తలు రససృష్టికి పుష్టికలిగించు నవ్యకల్పనలకు నందనోద్యానముగా నూహించిరి. ఇట్లు వాల్మీకిచే స్రష్టమై పుష్టమైన రామాయణము అనంతర సంస్కృత కవికులముచే నానావిధ కల్పనా మహనీయమై గీర్వాణ భారతికి కిరీటప్రాయమై కీర్తికెక్కినది.

ప్రాచీన సంస్కృత సాహిత్య ప్రక్రియలలో పురాణేతిహాసములు ప్రధానముగా పేర్కొనదగినవి. పురాణములలో అష్టాదశ మహాపురాణములు ముఖ్యమైనవి. శివపురాణ దేవీభాగవతాదులు, ఉపపురాణములు తరువాత నెన్నదగినవి. అష్టాదశపురాణములలో సగమునకు పైగా రామకథను తమయందు నిమిడ్చికొనియున్నవి. సామాన్యముగా పురాణములలో సూర్యవంశ క్రమమును వర్ణించుపట్ల రామచరితమును, అన్యసందర్భములందు రామాయణ కథాంశములను సంగ్ర

సీత ప్రాంజలియై భూమిని తిలకించుచు, త్రికరణశుద్ధిగా తాను శ్రీరామునే ధ్యానించిన, భూదేవి తనను లోనికి గ్రహించునని పలికెను. అందరు నివ్వెరపడి చూచుచుండ పాతాళము నుండి సింహాసనమున ఆసీనయై యున్న భూదేవి ఆవిర్భవించి, సీతను సింహాసనమున కూర్చుండబెట్టు కొని తిరిగి లోనికి జనినది. రాముడు శోకార్తుడై భూదేవిపై కోపమును ప్రదర్శింపగా బ్రహ్మ శాంతపరచి, ఈ విధముగా జరుగునని వాల్మీకి మున్నే తన కావ్యమున పేర్కొని యున్నాడు కావున దానిని సంపూర్ణ ముగ ఆలకించుమని కోరెను.

మరునాడు రామాదేశమున కుశలవులు ఉత్తర రామాయణమున సీత పాతాళమున ప్రవేశించిన తదుపరి కథను గానము చేసిరి. అందు శ్రీరాముడు సీతావియోగ దుఃఖమును భరించుచునే రాజ్య పాలన మొనరించెను. కౌసల్యాదులు స్వర్గమున కఱిగిరి. భరతుని కుమారులు గాంధార దేశమునకు, లక్ష్మణుని పుత్రులు కారుపథ దేశమునకు అధిపతులయిరి. తరువాత కొంత కాలమునకు యమ ధర్మరాజు తాపసవేషమున రాముని కడ కరుదెంచి తమ ఏకాంతము నకు భంగము కలిగించువారికి శిరశ్ఛేదన శిక్ష నొసగెదనని రామునిచే శపథము చేయించి. ద్వారమున లక్ష్మణుని కాపుంచి స్వర్గమునకు రావలయునను విరించికోరికను విన్నవించెను. ఆ సమయముననే దూర్వాసముని రామదర్శనార్థమరుదెంచి, లక్ష్మణుడందు కంగీకరింప నందున ఆగ్రహించి రఘువంశ నిర్మూలనము కావింతుననగా, భయ పడి లక్ష్మణుడు లోనికి జని వారి ఏకాంతమునకు భంగము కలిగిం చెను. రాముడంత పరిత్యాగమును మరణముతో సమానముగ భావించి, సమయభంగము కావించిన లక్ష్మణుని పరిత్యజించగా, అతడు సరయూతీరమునకు జని యోగము నవలంబించి శరీరము తోడనే స్వర్గమున కరిగెను. పిమ్మట రాముడు కుశలవులను పట్టాభిషిక్తుల గావించి వెన్నంటిన రాక్షసవానరవీరుల తోడను అయోధ్యావాసుల తోడను కలసి సరయూనదిని ప్రవేశించి స్వర్గమును చేరెను. అచ్చట రాముడు శ్రీమన్నారాయణు డయ్యెను.

శ్రీమద్రామాయణ సర్వము, సంగ్రహముగ నిది.

మణి నిర్దోష యని నుడివెను. అంత అహల్యకు శాపవిమోచనము కలిగెను. పరదారాసంగమమువలని హానిని నిరూపించుటకును, దేవతారాధనమువలనను మహాత్మసాంగత్యమువలనను గలుగు శుభముల నెఱింగించుటకును పద్మపురాణ మీ కథ నిట్లు వర్ణించినట్లు కానబడుచున్నది.

పద్మపురాణ – ఉత్తరఖండమున శ్రీరామకృత శంబూక వధా వృత్తాంతము యథావాల్మీకముగా సంగ్రహింపబడియున్నది. మఱియు ఈ ఉత్తరఖండమునందే ఈశ్వరునిచే దశావతారగాథలు చెప్పబడినవి. అందు రామావతారగాథయు గలదు. మహాభారతాధ్యాత్మరామాయణములందుగూడ రామకథ ఈశ్వరునిచే చెప్పబడినట్లు కలదు. పద్మపురాణమునందలి రామావతారకథ రావణజననపరాక్రమాదివర్ణనముతో ప్రారంభ మైనది. అందలి రామకథలో అవాల్మీకములైన కొన్ని కల్పనలు చోటు చేసికొనినవి. అట్టివానిలో ముఖ్యములైన వాని నీ క్రింద పొందుపఱచుట యగుచున్నది.

1. యజ్ఞకుండమున శౌరి యుద్భవించి దశరథుని వరము కోరుకొమ్మనెను. దశరథుడు శౌరినే పుత్రునిగా వరము కోరుకొనెను. శౌరి ప్రసన్నుడై యతనికి పాయస మొసగెను. రా జాపాయసమును అప్పు డచ్చటనున్న కౌసల్యాకైకల కొసంగెను. వారిరువురును దరువాత నచటకు వచ్చిన సుమిత్రకు భాగము పెట్టిరి. కౌసల్యకు శ్రీరాముడు విశ్వరూపముతో జనింప నామె యా రూపును చూడజాలక విష్ణువును భజించి పుత్రరూపము ధరింప వేడుకొనెను. ఈ ఘట్టము అధ్యాత్మ రామాయణము నందును కలదు.

2. కౌసల్యాతనయునకు జాతకర్మాదుల దీర్చి శ్రీరాము డని పేరిడిన తరువాత భరత లక్ష్మణ శత్రుఘ్ను లుదయించిరి.

3. కౌశికుడు కోరగానే దశరథుడు సంతసముతో రామలక్ష్మణుల నాతనివెంట అడవికి పంపెను.

4. తాటకాసంహారమునకు పూర్వమే తార్క్ష్యు డదృశ్యరూపమున దివ్యాస్త్రశస్త్రములను, అక్షయతూణీరములను, దివ్యకార్ముకమును రామున కొసగెను

5. హతయైన తాటక అందఱు చూచుచుండగా దివ్యరూపమున దివి కేగెను.

6. విష్ణుచాపము నెక్కిడిన రాముని గాంచి పరశురాముడు అతడే విష్ణు వని స్తుతించెను.

7. ఇందు మంథరా ప్రసక్తియే లేదు. రామపట్టాభిషేకమును గూర్చి వినిన కైక రాజుకడ కేగి రామవనవాసమును, భరత రాజ్యాభిషేకమును వరములుగా కోరెను. దశరథు డావరముల నొసగి రాముని నడవి కేగ నాజ్ఞాపించెను. పితృవచోవ్యాజమున రాముడు రావణవధకై అడవి కేగెను.

8. కాకాసురవృత్తాంతము కలదు.

9. రాముడే శూర్పణఖయొక్క ముక్కుచెవులను తెగకోసెను.

10. రావణునిచే కొట్టబడి పడియున్న జటాయువును మొదటిసారిగా రాముడు చూచెను. వాల్మీకి రామాయణమున దండకారణ్య ప్రవేశముననే జటాయువుతోడి పరిచయ మైనట్లు కలదు.

11. సీతాదేవిజాడ చెప్పని గంగపై కినిసి రాము డామెను రక్తసలిల యౌనట్లు శపింప నామె భీతయై ప్రత్యక్ష మయ్యెను. అంత రాముడు శార్ఙ్గకోటిని గంగాగయా సమంబును, భాగవత తీర్థోదరంబుననగు శబరీతీర్థము నేర్పఱిచి యేతత్పుణ్యతీర్థతోయ సంగమంబున శాపవిముక్తి యగునట్లు అనుగ్రహించి ఋష్యమూకకు వెడలెను.

12. అస్త్రముచే రాము డుదధిని శోషిలగ జేసి, సముద్రుడు శరణు వేడ వారుణాస్త్రమున జలమును పూరించెను. పిమ్మట నలునిచే సేతువును నిర్మింపజేసెను.

13. రావణుని నికుంభిలా హోమము కలదు.

14. రావణవధానంతరము రాముడు వేయేండ్లు రాజ్య మేలెను.

15. స్వర్ణసీతతో కలిసి యాగ మొనర్చు రామునికడకు వాల్మీకి మహర్షి సీతాకుశలవులను గొనివచ్చి స్వీకరింపు మనెను.

ఈ కథార్థము లన్నింటిలోను మంథరపాత్రను రామకథలో లోపింపజేసిన యంశము విశేషముగ పఠితల నాకర్షించుచున్నది.

పద్మపురాణోత్తరఖండమున రామకథయొక్క పూర్వాపరములు సవిస్తరముగా కలవు. ఇది రామాశ్వమేధముతో ప్రారంభమైనది. రామాశ్వమేధకథను శేషుడు వాత్స్యాయనున కెఱిగించెను. సీతా పరిత్యాగానంతరము అగస్త్యునివలన రావణునిగుఱించి తెలిసికొనిన రాముడు బ్రహ్మహత్యాపాతకనివారణార్థము అశ్వమేధయాగము కావించెను. శత్రుఘ్నుడు హనుమత్సహితముగా యాగార్థమై దిగ్విజయమునకు వెడలినప్పుడు ఆయాదేశముల రాజుల చరిత్రములు ఇందు చెప్పబడినవి, ఋతంభర సత్యవంతులు శత్రుఘ్నునకు లొంగిపోయిరి. హయమును హరించిన విద్యున్మాలి యను రాక్షసుని జయించి శత్రుఘ్నుడు హయముతో ఉత్తరదిశ కరిగి ఆరణ్యకమహర్షిని దర్శించి రామనామమాహాత్మ్యమును గుఱించి యతనివలన వినెను. అప్పట్టున ఆరణ్యకముని రామాయణమును సంగ్రహముగా వినిపించెను. ఈ విధముగా పద్మపురాణమున పట్టాభిషేకానంతర కథతో రామకథ ప్రారంభమై మధ్యలో ప్రసంగవశమున పూర్వకథ చెప్పబడినది. ఆ కథలో అహల్య శిలాకృతిదాల్చినట్లు చెప్పబడినది. వాల్మీకి రామాయణమున ఉత్తరకాండమున అగస్త్యుడు రావణాదుల చరిత్రలు వివరించిన తరువాత సీతాపరిత్యాగము జరిగినది. పద్మపురాణమున సీతాపరిత్యాగము తరువాత అగస్త్యుడు వచ్చినాడు. శత్రుఘ్నుడు వెడలినపిమ్మట ఆరణ్యకముని అయోధ్య కేగి సవన దీక్షితు డైన రామునిసముఖమున, ప్రాణములు విడి అతనిలో లీనమయ్యెను.

యజ్ఞాశ్వము రేవాహ్రదమున మునిగెను. సుమతి హెచ్చరిక మేరకు శత్రుఘ్నుడు హనుమదాదులతో పాతాళమున కేగెను. అచ్చట హయము బంధింపబడి యుండెను. రామభక్తురా లైన యొకస్త్రీ వీరమణి

యను ప్రభువుతో జరుగుయుద్ధమున శత్రుఘ్నునకు విజయము లభించుటకై యొక మహాస్త్రము నొసగుటకై హయము నట్లు బంధించెను. ఆమె తన విషయమును తెలిపి శత్రుఘ్నున కస్త్రము నుపదేశించెను. ఆపైన రుక్మాంగద వీరమణులకును శత్రుఘ్నునకును యుద్ధ మయ్యెను. పరమేశ్వరుడు ప్రమథగణములతో వీరమణికి అండగా నిలిచెను. శివునకును, హనుమంతునికిని ద్వంద్వయుద్ధము వాటిల్లెను. శివుడు హనుమంతుని భక్తిశక్తులకు మెచ్చి వరము కోరుకొమ్మనెను. హనుమంతుఁడు తాను సంజీవనౌషధము తెచ్చునంతవఱకు హతులైన తన వర్గమువారి కళేబరములను రక్షింప గోరెను. హనుమంతుఁడు సంజీవనిచే తమవారిని బ్రతికించుకొనెను. అట శత్రుఘ్నుఁడు వీరమణిని మూర్ఛిల్లఁజేసినను ఈశ్వరునిముందు నిలువఁజాలక రాముని స్మరించెను. శ్రీరాముఁడు ప్రత్యక్షమయ్యెను. వీరమణి తన సర్వస్వసహితముగా హయమును రాజున కొసఁగెను. పిమ్మట క్రతుహయము హేమకూటము చేరగా నచట రామకథాశ్రవణము వలన సాత్త్వికరాక్షసునకు శాపవిమోచనము కలిగెను. ఆ తరువాత రామభక్తుడగు సురథుఁడను రాజు హయమును బంధించుటయేకాక యుద్ధమున హనుమదాదులను గూడ బంధించెను. అప్పుడతఁడు రామదర్శనము చేయింపు మని హనుమంతుని వేడుకొనెను. హనుమంతుఁడు శ్రీరాముని స్మరించెను. రాముఁడు ప్రత్యక్ష మయ్యెను. సురథుఁడు భక్తిపారవశ్యమున సర్వస్వమును రామున కర్పించెను.

అంత హయము వాల్మీక్యాశ్రమమును సమీపించెను. అచ్చట లవుడు యాగాశ్వమును బంధించెను. అంత పృచ్ఛకుఁడైన వాత్స్యాయనుఁడు కథకుఁడైన శేషుని లవకుశజన్మవృత్తాంతాదులను గూర్చి ప్రశ్నించెను. శేషుఁడంత సీతాపరిత్యాగవృత్తాంతమును విపులముగఁ జెప్పెను. ఇట్లు పద్మపురాణమున రామకథ యొక క్రమబద్ధముగాఁ గాక పరిచ్ఛిన్నముగా సందర్భముల ననుసరించి ఘట్టములు ఘట్టములుగా చెప్పఁబడి యున్నది.

సీతాపరిత్యాగమునకు కీరాంగనాశాపము ముఖ్యకారణ మని పద్మపురాణము వింతకల్పనము చేసినది. వివాహత్పూర్వము సీత

ఉద్యానవనమున కీరదంపతులు భావిసీతారామకల్యాణమునుగూర్చి చెప్పకొనుట యాలించి, వానిని బట్టి పంజరమున బెట్టి సమాచార మడిగెను. అవి తాము వాల్మీక్యాశ్రమమున నుండు చిలుకల మనియు, వాల్మీకి భావిరామాయణము వ్రాసి శిష్యులకు వినిపించు సందర్భమున తామును వింటి మనియు చెప్పి, విష్ణువే రాము డని కీర్తించి వివాహ పర్యంతకథను చెప్పగా సీత తానే ఆ కథానాయిక సీత యని యెఱిఁగి "కీరాంగన గర్భిణిగాన ప్రసవానంతరము వచ్చి సీతను చూతు" మని చెప్పినను వినక, కీరాంగనను బంధించెను. అంత దుఃఖిత యైన కీరాంగన "గర్భధారిణి వైన తరువాత పతి నెడఁబాయుదు"వని సీతను శపించి, అసువులఁ బాసెను. అది చూచిన కీరము "అయోధ్యయం దుద్భవించి నిన్ను పతినుండి యెడఁబాపుదు" నని ప్రతిన బూని తాను గంగలో మునిఁగి, అసువులఁ బాసి మఱుజన్మమున చాకియై సీతా రాముల నెడబాపె నని పద్మపురాణమున కలదు. సీతావియోగగాథకు కార్యకారణ సంబంధము నిరూపించు పూర్వగాథను అపూర్వప్రతిభతో పద్మపురాణము కల్పించినది.

లవకుశులతోడి యుద్ధమున శత్రుఘ్నాదులు మూర్ఛనొందిరి. వారలు రామతనయు లని యెఱింగియు హనుమంతుఁడు స్వామికార్య నిర్వహణార్థము వారితో పోరెను. కుమారులు కపులందఱిని బంధించి తల్లికి వినోదము గల్పింప సంకల్పించి హనుమత్సుగ్రీవుల వాలము లనుబట్టి వారిని సీతయొద్దకుఁ గొంపోయిరి. ఆమె వారిని గాంచి విచారించి రాముఁడుతన పతి యనియు, వారలకు తండ్రి యనియుఁ దెలిపి క్షమాపణ పూర్వకముగా హయమును శత్రుఘ్నున కొసంగు డని కొమరుల నాదేశించెను. వా రట్లు కావించిరి.

సవనాశ్వము తిరిగివచ్చిన తరువాత శత్రుఘ్నాదులను యాత్రా విశేషములఁగూర్చి రాముఁడు ప్రశ్నించెను. వారు జరిగినదంతయు చెప్పిరి. రాముఁడాశ్చర్యపడి అచ్చటనే యున్న వాల్మీకిని కుశలవు లెవ రని యడిగెను. అంత వాల్మీకి సీతాచరిత్రము చెప్పి, ఆమె పాతివ్రత్య మునురాముఁడు స్వయముగా నెఱిఁగియే యుండెను గావున స్వీకరించుట ధర్మ మనెను. అశరీరవాణియు నటులే పలికెను. అంత రాముఁడు

సీతను తోడితెచ్చుటకు లక్ష్మణునిపంపెను. సీత లక్ష్మణునకు బాలురను మాత్ర మొప్పఁజెప్పి తా నాయాశ్రమముననే ముక్తిపొందుదునని తెలియ పరచెను రాముఁడు సీత రాకునికి వగచి తనయాజ్ఞగా భావించి రమ్మని మరల లక్ష్మణునితో వార్త నంపెను. ఆమె వచ్చునంతలో లవకుశులచే వాల్మీకికృతరామాయణము వినెను. ఇచ్చట పృచ్ఛకుని ప్రస్తావన ననుసరించి వాల్మీకి శోకము శ్లోక మగుట, ఆదికావ్యావిర్భావ వృత్తాంతము సంగ్రహముగాఁ జెప్పఁబడినది. అపైన పతియాజ్ఞ పాటించివచ్చిన సీతను రాముఁడు పరిగ్రహించినట్లును, కుంభసంభవుఁడు కనకసీతాప్రతిమను తొలగించి, సీతారాములనే యజ్ఞదీక్షితులఁ జేయించె ననియు చెప్పఁబడినది. రాముఁడు శాస్త్రోక్తముగా హయమును స్పృశింపగా నది దివ్యపురుషుడై నిలిచి, దుర్వాసుని శాపమువలన నారూపమును దాల్చి రామకరస్పర్శకై వేచియున్నట్లు చెప్పి అంతర్ధాన మయ్యెను. అంత వసిష్ఠుడు హయస్థానమున కర్పూరము నుపయోగించి యాగము పూర్తిచేయించెను. ఈ కథనము శేషుడు వాత్స్యాయనునకు జెప్పె నని సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పెను.

యుక్తవయస్కుఁడైన రామునికి హోమలబ్ధ యగు సీతాకుమారి నొసఁగ నభిలషించి జనకుఁడు దశరథునకు రాయబార మంపగా అతఁ డానందముతో సకుటుంబముగా మిథిల కేతెంచెను. అంత నారదుఁ డరుదెంచి సీతకు స్వయంవరము చాటు మని జనకునకుఁ జెప్పగా, దశరథుని అంగీకారమున అతఁ డట్లు చేసెను. స్వయంవరసభకు సూర్యవరుణాదిదేవతలును బలిబాణాసురాది రాక్షసులును సకల రాజకుమారులును అరుదెంచిరి. వీరందరిని గాంచి జనకుడు భీతిల్లి మహేశుని ప్రార్థింపఁగా నతఁడు ప్రత్యక్షమై శివచాపము నొసఁగి దాని నెక్కిడినవానికి సీత నొసఁగు మని యాన తిచ్చెను. శివచాపభంగమున కితరు లెవ్వరును చాలరైరి. రాముఁడు ధనుర్భంగము చేసి సీతను చేపట్టెను. మిగిలినరాజు లహంకరించి రాముని నెదిరించిరి. అతఁడు వారిని రణరంగమున నోడించెను.

పరశురామ గర్వభంగ మందు కానరాదు. కేకయరాజపుత్రి యైన సువేష (మొదట సురూపనా పేరొ్కనఁబడినది) వరములు కోరఁగా,

వసిష్ఠుఁడు రామావతార తత్త్వమును వివరింపగా, ఎట్టకేలకు దశరథుఁడు రాము నడవులకు బంప నంగీకరించెను.

సీతాపహరణానంతరము శోకమూర్తి యైన రాముఁడు ఋష్యమూకమునకు జేరి యొక చెట్టునీడ సౌమిత్రితొడపై తల యుంచి పరుండెను. ఆ చెట్టుకొమ్మపై వానరుఁ డొకడు కానవచ్చెను. అతనితో రాముఁడు పరిచయము గావించుకొనెను. అతఁడే హనుమంతుఁడు. అంత హనుమంతుఁడు సుగ్రీవునికడ కేఁగి మహిమాన్వితు లిద్దఱు నీ సాంగత్యము గోరుచున్నా రని నివేదింప, సుగ్రీవుఁడు రామునమ్ముఖమునకు వచ్చెను. అగ్రజానుమతిని లక్ష్మణుఁడు వారి గాథ నా కపిపుంగవున కెఱింగించెను. సుగ్రీవుఁడు సీతనగలమూట చూపి, రావణునిచే గొనిపోఁబడుచున్న తరుణి యొర్తు రామరామ యని రోదించుచు నా భూషణముల నచ్చట వదలిన దనియు చెప్పి, వానర సైన్య సహాయమున సేతువు నిర్మించి, రావణుని హతమార్పగల మని ప్రతిజ్ఞచేసి రామునితో చెలిమి చేసెను. ఆపైన వాలి వధయు, తారాదుఃఖమును, సుగ్రీవుని పట్టాభిషేకమును, సీతాన్వేషణమును, లంకాదహనమును జెప్పఁబడినవి. రాముఁడు కపిసైన్యముతో వార్నిధిని దాటుటకై ఈశ్వరుని బ్రార్థించెను. శివుఁడు ప్రత్యక్షమయ్యెను. దుర్నిరీక్ష మగు పరమేశ్వరునిరూపును రాముఁడు గాంచలేక పోయెను. ఈశుఁడు రామునకు దివ్యచక్షు విచ్చెను. అంత రాముఁడు శివుని స్తుతించి వార్నిధి దాటుటకు సేతువుగా నుపయోగింప శివకార్ముకమును బడసెను.

హనుమదాదులచే పట్టుపడిన అతికాయ మహాకాయుల వలన లంకాద్వారమున గల పంచవక్త్రముల దారువు నేకప్రయత్నమున పంచఖండములు కావించు వానిచే రావణుఁడు నిహతుఁ డగునని విని రాముడు దాని నేకశరమున ఖండించెను. రావణుఁడు మొదటిసారి రణరంగమునకు వెడలినపుడు రామబాణముల కోర్వ జాలక వెను దిరిగి అంతఃపురమున కేగెను. విభీషణుఁ డచ్చటకు వచ్చి యతనికి శరణు జొచ్చుటయే యుక్త మని నీతిబోధ కావింపగా రావణుఁ డాతనిని కాలితో నెగిసి తన్నెను. అంత విభీషణుఁడు రాముని కడ కేగెను.

యుద్ధరంగమున నాతఁడు రావణుఁ డంతమొందు చిహ్నపదమును సూచింపగా రాముఁడు రావణుని వధించెను. పిమ్మట మహేశ్వరుఁడు ప్రత్యక్ష మయ్యెను. అగ్నిశుద్ధ యైన సీతను శ్రీరాముఁడు పరిగ్రహించెను.

ఈ పూర్వకల్పరామాయణమున దశరథునకు నలుగురు భార్యలుండినట్లును, ద్వాదశీవ్రతపుణ్యఫలముగా రామాదు లారాజునకు గలిగినట్లును, సీత జనకునకు హోమలబ్ధ యైనట్లును, రామలక్ష్మణులను హనుమంతుఁడు మొదట దర్శించినవిధమును కల్పించుటయందును, సేతువుగా శివధను వుపయోగించినట్లును రావణప్రథమయుద్ధానంతరము విభీషణ శరణాగతి యైనట్లును చేయబడిన వినూత్నకల్పనలు విశేషముగా నాకర్షించునవి. వీని వలన రామాయణ ప్రధాన కథా తాత్పర్యము దెబ్బతినుటలేదు.

వరాహాగ్ని పురాణములందు హనుమజ్జనన వృత్తాంతము కలదు. మహేశ్వర వీర్యమును వహించిన వాయువు ఋతుస్నాతయైన అంజనాదేవిగర్భమునందు దానిని నిక్షిప్తము చేసెను. ఆమె కినిసి శపింపఁబోవఁగా వాయువు లోకహితార్థమై ఈశ్వరాంశము నట్లు నిక్షిప్తము చేయవలసివచ్చిన దనియు, దానివలన నామెపాతివ్రత్యము భంగము కాదనియు చెప్పెను. ఆమె ప్రసవపర్యంతము తపము చేయవలెననియు, పుట్టబోవు బాలుఁడు మహావీరుఁడును, విష్ణుభక్తుఁడును అగుననియు తెలిపెను. అందుల కంజనాకేసరులు సంతసించిరి. మార్గశిర శుద్ధ త్రయోదశి నాడు అశ్వనీ నక్షత్రయుక్త వృశ్చిక లగ్నమున ఆంజనేయుఁడు జన్మించెను. అతఁడు బాల్యమున నాకలిగొని సూర్యుని ఫలముగా భావించి సూర్యమండలమునకై యెగురఁగా నింద్రుఁ డాతనిని గొట్టి నేలఁ బడవైచెను. అతని దీనావస్థను గాంచి వాయుదేవుఁడు ఖిన్నుఁ డై దిశలను బంధించి యతని కడ కూరుచుండెను. వాయుబంధనమునకు వెఱగుపడి దేవేంద్రాదు లచ్చటకు వచ్చి బాలునకు వరము లిచ్చి బ్రతికించిరి.

బ్రహ్మవైవర్త పురాణమున సీతాదేవి జన్మకథ విపులముగాఁ జెప్పబడినది. మనువంశసంభవుఁడైన రాజసావర్ణి శివభక్తుఁడు. అతఁడు దక్ష

సావర్ణి మనువుడు. అతనికి నారదశాపమువలన రాజ్యము పోయెను. అతనికి వృషధ్వజుఁడను కొడుకు పుట్టి తండ్రి కోల్పోయిన రాజ్యమును తిరిగి సంపాదించెను. వృషధ్వజునకు రథధ్వజుఁడును, అతనికి ధర్మధ్వజకుశధ్వజులును జన్మించిరి. అందు కుశధ్వజునిభార్య మాలావతి. వారిరువురును సంతానార్థులై విష్ణువును గొలచిరి. విష్ణువు వారికిఁ బ్రత్యక్షమై వారి కోరిక ననుసరించి మహాలక్ష్మి అంశతో వారికి వేదవతి యను కుమార్తె జన్మించు ననియు, నామెయే కాలక్రమమున తపము చేసి సీతగా పుట్టు ననియు, అప్పటికి కుశధ్వజుఁడు మిథిలాపుర చక్రవర్తి జనకుఁడుగా నుండి యా సీతను రామావతారమున తన కిచ్చి వివాహము చేయు ననియు వర మొసంగెను.

కుశధ్వజ దంపతులకు వేదవతి జన్మించి, యుక్తవయస్క అయి శ్రీవిష్ణువును భర్తగాఁ బడయఁగోరి తప మొనరించుచుండెను. రావణుఁ డామెను చూచి మోహించి, పట్టఁబూనఁగా వేదవతి రోషముతో నటుపై పరస్త్రీలను బలవంతముగా గ్రహింపఁబూనినచో శిరస్సు లెంపుట్రయ్యెడు లగునట్లు వానిని శపించి, తాను లంకయందు జన్మించి పుత్రపౌత్ర సహోదరాది బంధుమిత్రామాత్య సహితముగా నశింపచేయుదు నని పలికి అగ్నియందుఁ జొచ్చెను.

తదుపరి వేదవతి లంకయందు మహాపద్మములు గల తటాకమునందు ఒక మహాపద్మమునందు చిన్నబాలిక రూపమును దాల్చెను. పూజార్థము పుష్పములకై అరుదెంచిన రావణు పరిచారికలు చూచి బాలికాసహితముగా పద్మమును గొనిపోయి రావణున కొసఁగిరి. శుక్రాచార్యులు ఆమె వేదవతి కావున నామె నొక మందసమం దుంచి సముద్రమున విడచుట యుక్తమనెను. రావణు డట్లే చేసెను. ఆమందసము మిథిలానగరతీరము చేరి భూమిలో కప్పబడి యుండెను. కుశధ్వజ దంపతులు కాలక్రమమున మరణించి, మిథిలయందు జనకరాజదంపతులుగా జన్మించిరి. జనకుఁ డొకసారి యజ్ఞమునకై భూమిని దున్నగా అందు బాలిక దొరికెను. శతానందమహర్షి అనుమతిపై నామెకు సీతా నామధేయ మిడెను. ఆమెయే రామపత్ని సీత.

బ్రహ్మవైవర్త పురాణమునందలి యీ కథలో వేదవతియే రావణుని శిరస్సు బ్రద్దలగునట్లు శపించిన దని కల్పింపఁబడినది. కాని పెక్కు రామాయణములందు రంభాకారణమున రావణున కాశాపము కలిగినట్లు కలదు.

నారదీయ మహాపురాణమున శివధనుస్సు వృత్తాంతము రాముఁడు సీతకుఁ జెప్పినట్లు చిత్రముగ నిట్లు కల్పింపబడినది: స్వేతకేతు మహారాజు అగస్త్యమునికి మహారత్నమాల, విల్లు, అమ్ములపొది, అస్త్రశస్త్రాదులను ఇచ్చి రావణసంహారార్థము శ్రీరాముఁడుగా నవతరించిన శ్రీవిష్ణువునకు అతని దర్శనార్థము, సీతాలక్ష్మణసహితుఁడై వచ్చినప్పు డొసగు మని ప్రార్థించి యిచ్చెను. అగస్త్యుఁడు త్రేతాయుగాంతమువఱకు వానిని రక్షించి రామున కొసగెను.

సీతారామలక్ష్మణులు అరణ్యవాసము చేయునెడ చిత్రకూటపర్వతమున నొకనాఁడు వినోదార్థము రాముఁడు సీతతో జనకుఁడు శివుని విల్లును బడసిన విధమును వివరించె నని సూతుఁడు శౌనకాది మునులకు చెప్పెను. శ్రీరాముఁడు సీతతో చెప్పిన కథ యిది :—

సుమాలి కైకసులకు జన్మించిన రావణుఁడు భూలోకమునందలి రాజులనందరిని జయింపఁగోరి జనకునిపైకి దాడి వెడలగా అతఁడు హరిహరాదులను ప్రార్థించెను. అప్పుడు హరిహరులు ప్రత్యక్షమైరి. ఈశ్వరుఁ డతనికి శివధనుస్సు నొసఁగి తాను మిథిలను అదృశ్యముగ రక్షించుచుందు నని చెప్పెను. విష్ణువు తాను శ్రీరామునిగ జన్మించి సీతారూపమున నున్న లక్ష్మిని వివాహ మాడి రావణవధ కావింపనుండెను. కావున సీతావివాహము శివధనుర్భంగముతో నెరవేర్పఁదలచె ననియు, అంతదనుక హరిహరాదులమైన మేము మిథిలను రక్షించుచుండెదమనియు చెప్పెను. రావణుఁ డీ రహస్యము శుకసారణులవలన విని భయపడి వెనుదిరిగి పోయి, భూమండలముపైఁ గల రాజులపై నెన్నఁడును యుద్ధమునకుఁ దలపడలేదు. శివధనుస్సును విరిచి పట్టభంగమిషతో రావణవధార్థము వనమున కేతెంచితి నని రాముఁడు సీతకుఁ జెప్పెను. అంత సీత ద్వాపరయుగమునందు శ్రీకృష్ణరూపమును చూపు మని రామునిం గోరెను. ఆ సాయంకాలము

సీతారాములు జగన్నాథక్షేత్ర సమీపమున విశ్రమించిరి. రాముని కోరికపై సీత రాధా రూపమునను, రాముఁడు శ్రీకృష్ణ రూపముననను అచ్చట శిలావిగ్రహముల వెలయించిరి. శ్రీరామకృష్ణావతార తత్త్వము లను వ్యాఖ్యానించుట కీ పురాణకథ చిత్రముగాఁ గల్పింపఁబడిన దని భావింప వీలగుచున్నది.

మార్కండేయ మహాపురాణమున సూర్యవంశ రాజుల చరిత్ర వర్ణింపఁబడు సందర్భమున గంగావతరణము, శ్రీరామ చరిత్రము వర్ణింపఁబడియున్నట్లు నారదీయ మహాపురాణమున పురాణ విషయ క్రమమును జెప్పు సందర్భమున నిర్దేశింపబడియున్నది. ప్రస్తుతము లభ్యమగుచున్న మార్కండేయమున నీ భాగము కానరాదు.

కూర్మపురాణమున జాంబవంతుని జన్మవృత్తాంతము కలదు. ఒకపరి హిమవంతమున విహరించుచు పార్వతీపరమేశ్వరులు పశు పక్ష్యాదుల స్వేచ్ఛావిహారమును దిలకించుచుండిరి. అప్పుడు వారికి శుక్లశోణితపతన మయ్యెను. ఈశ్వరుని శుక్లమునుండి పాదరసమును, పార్వతి శోణితమునుండి ఇంగిలీక గంధకములును, గైరికాది ధాతు వులును పుట్టెను. పిమ్మట వాని సమ్మేళనమువలన జాంబవంతుఁడు పుట్టెను. పరమేశ్వరుఁ డాతనికి వజ్రమయశరీరమును, ఆయుర్వేద మును ప్రసాదించి, శ్రీరామభక్తుడ వగుమని వర మొసంగెను.

దేవీభాగవతమున రామాయణకథాప్రసక్తి తృతీయస్కంధ మున గలదు. అది దేవీనవరాత్రి పూజా మహత్త్వమును ప్రతిపాదించు టకు గల్పింపబడినది. సుగ్రీవ పట్టాభిషేకానంతరము సీతకై చింతిల్లు రాముని సన్నిధికి నారదుఁ డరుదెంచి వేదవతియే సీత యనియు, రాముడు విష్ణువు యొక్క అవతార మనియు చెప్పి, రావణ సంహా ర్థము రాముఁ డాశ్వయుజ మాసములో దేవీనవరాత్రివ్రత మాచరింప వలె నని హితవు చెప్పెను. రాముఁ డట్లే కావించి తన్మహిమ వలన రావణ సంహారము గావించెను. దేవీ భాగవతము నందలి రామకథలో మంథర ప్రసక్తి లేదు. రాముఁడు వనగమనమున తనను సీతాలక్ష్మణు లనుసరించుట కంగీకరించిన తరువాత కౌసల్యను దర్శింపఁబోయి నట్లిందు కలదు.

భాగవత మహాపురాణ ద్వితీయ స్కంధమున బ్రహ్మ నారదునకు విష్ణ్వవతారములను వర్ణించు నవసరమున రామావతార వృత్తాంతమును సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నది. నవమస్కంధములోఁగూడ రామకథ మఱల చెప్పఁబడి యున్నది. ఇందు పూర్వోత్తర రామాయణము లందలి కథ కథనాత్మకముగా నతిసంగ్రహముగాఁ గలదు. ఈకథ ననుసరించి రావణవధానంతరము విభీషణునిచే నాతని కంత్యక్రియలు గావింపఁజేసి, రాముఁడు సీతను దర్శించుటకు స్వయముగా అశోకవనమున కేగెనని కలదు. వాల్మీకిరామాయణమున సాలంకృతయైన సీతను తన దరికి దోడ్తెమ్మని రాముఁడు విభీషణున నాజ్ఞాపించినట్లును, విభీషణుఁడట్లే చేసినట్లును గలదు. అహల్యావృత్తాంతము వంటి యుపకథ లిందు లేవు. ఉత్తరరామాయణ కథలో రాముఁడయోధ్యానగరమున నడిరేయి గూఢవృత్తిఁ దిరుగుచు సీతాపవాదమును స్వయముగా వినినట్లును, అపైన చారులవలన గూడ దాని నెఱింగినట్లును గలదు. సీత నిదుర పోవుచుండగా నామె నారాత్రియే వాల్మీక్యాశ్రమము నందుఁ బెట్టఁ బనిచె ననియు గలదు. రాముని యశ్వమేధయాగమును జూడవచ్చిన కుశలవులను గాంచి రాముడుఁ వారి తల్లిదండ్రులను గుఱించి ప్రశ్నించెను. వారు తాము వాల్మీకి శిష్యుల మని మాత్రము చెప్పిరి. రాముఁడు "లేవు మీా తల్లిదండ్రుల నెఱింగెదఁగాక" యని వారి నొక విడిదియం దుంచెను. మరునాడు వాల్మీకి సీతా కుశలవులను గొని వచ్చి స్వీకరింపు మని రాముని వేడెను. కుశలవులను వాల్మీకి కొప్పగించి సీత భూవివరమునఁ బ్రవేశించెను. పిమ్మట 1300 సం॥లు రాముఁడు బ్రహ్మచర్యము వహించి రాజ్యమేలి అవతారమును చాలించెను. ఈ కథలో యాగాశ్వమును కుశలవులు బంధించుట మున్నగు ఘట్టములు లేవు.

శ్రీ శివపురాణము నందలి లీలాఖండమున హనుమదవతార లీలఁ జెప్పఁబడినది. అందు మహాబలుఁ డగు హనుమంతుఁడు అంజనీ గర్భమున శివవీర్యప్రభావమున జన్మించిన కథసంగ్రహముగఁ గలదు. లింగవైభవ ఖండమున రామాయణ మతిసంగ్రహముగా యథా వాల్మీకముగాఁ జెప్పఁబడినది. శ్రీ రామలింగేశ్వర ప్రతిష్ఠాపనమందలి

విశేషము. సముద్రము దాటునెడ శివారాధనము చేసెద నని లక్ష్మణునితో పలికి రాముఁడు ఇసుకతో శివలింగమును జేసి పూజింపఁగా పరమేశ్వరుఁడు ప్రత్యక్ష మయ్యెను. రావణవధానంతరము పతితో గలిసి యచ్చటకు వచ్చిన సీత హనుమంతునిచే కాశినుండి లింగమును దెప్పించి యచ్చట ప్రతిష్ఠించెను. శివపురాణ - ఉమాఖండమునందు సూర్య వంశ చక్రవర్తులను గీర్తించు సందర్భమున గూడ గంగావతరణము, శ్రీ రామకథ సంగ్రహముగను. యథా వాల్మీకముగను జెప్పఁబడినవి. రామలింగేశ్వర ప్రతిష్ఠ కూడ ఇచ్చట పేర్కొనబడినది.

బ్రహ్మాండ పురాణమున సగర భగీరథ వృత్తాంతము చెప్పబడిన సందర్భమునందు ఉపోద్ఘాత పాదమున రామకథ, మిథిలాధిపతుల వంశక్రమము సంగ్రహముగా సూచింపఁ బడియున్నవి. గరుడ పురాణమున భగీరథ వృత్తాంతమును, విష్ణు పురాణమున గంగావతరణము, రామాయణము, గాధిచరితము, విశ్వామిత్ర పరశురాముల జన్మ వృత్తాంతములు చెప్పబడి యున్నవి.

ఇట్లు పురాణవాఙ్మయము నందు రామకథ వంశానుచరిత ఘట్టములందును, అవతారవర్ణనఘట్టము లందును సంగ్రహముగా కానవచ్చుచున్నది. ఆయా పురాణస్వభావమును బట్టి రామకథలో చిత్రములైన కల్పనలు చోటు చేసికొనినవి. ఏమైనను పురాణ వాఙ్మయము నందలి రామకథ వాల్మీకి హృదయమునకు భిన్నమైనదిగా కానవచ్చుట లేదు. పరమార్థ మొకటియే యైనను రామకథా ప్రతిపాదనములో పురాణములు కొంతమార్గాంతరము ద్రొక్కియుండవచ్చును. అంతియే.

వేదమును ప్రమాణముగా నమ్మిన పురాణములందేగాక, జైన మత వాఙ్మయమునందును రామకథ కలదు. కాని అది తన్మత సూత్రానుగుణముగా మలచబడి ప్రతిపాదింపబడినది. జైన రామాయణకథను, దానిలో నవాల్మీకములైన కల్పనలను గురించి కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు సమీక్షించియుండిరి. వారు దర్శించిన ఫలితాంశముల నిచ్చట ప్రస్తావనము చేయుట అప్రస్తుతము కాదు.

"ఈ కథ వాల్మీకి రామాయణమునకు చాల భిన్నమై యున్నది. రాక్షసులకు వానరులకు సంబంధముండె నని తెలియుచున్నది. సీత అయోనిజ కాదు. రాము డేకపత్నీవ్రతుడు కాడు. హనుమంతుడు నిత్య బ్రహ్మచారి కాడు. రావణు డొక్క స్త్రీలోలత్వమందు తప్ప తక్కిన విషయములందు దావర్శప్రాయుడే. రాజులకు స్త్రీసంగతి నాటికి నేటికిని మిక్కుటము. కాని రావణు డెన్ని చేసినను సీతాపచారకుడు కాకుండిన నిప్పటికి ననేక పటరాజులవలె, రాజపితులవలె నిందాస్పదుడు కాకుండెడి వాడు. అత డహింసాప్రాయుడు. యజ్ఞములందు హింస యుండుటచే యజ్ఞధ్వంసి యయ్యెను. కాని వాల్మీకులవారు వేదమతద్వేషి యనియు, మునిహింసకు డనియు తన కలముయొక్క మసిచే రావణుని ముఖమును నల్లగ చిత్రించెను. లక్ష్మణునికి ఎనమండుగురు పట్టపుభార్యలట, 16 వేల పెండ్లాలట! ఈ గుంపు నంతయు భాగవతమందు శ్రీకృష్ణులవారి కంటగట్టినారు. ఈ పేరమే పౌరాణికులవలన జరిగెనో దురూహ్యము. ఇచ్చట లక్ష్మణుడే గరుడవాహనుడు. చక్రి, రావణాంతకుడు. మఱియు నారాయణావతారుడు. ఇంక మరేమి లేదు. ఇంనాడు డింక అసలే లేదు. ఇందలి వంశావళులు వాల్మీకులవారి వంశావళులతో భేదించుచున్నవి. శంబుకుడు శూర్పణఖపుత్రు డనియు నతనిని లక్ష్మణుడు వధించె ననియు నిందున్నవి. శంబుకు డను శూద్రతపసిని రాముడు ఖండించె నని యుత్తర రామాయణమున నున్నది. శూద్రుల తపస్సు అంత మెచ్చరానిదై యుండెనే? "దశముఖ" అను పదమున కుత్పత్తి హేతువిందు చాల సమంజసముగా గనబడుచున్నవి. జైనరామాయణమునందు కుంభకర్ణుడును, ఇంద్రజిత్తు మరణింపలేదు. మఱియు సంజీవపర్వతమును హనుమంతుడు తెచ్చెనన్న దిచ్చట కల్ల. భామండలుడు (ఇతడెవడో?) అమృతము దెచ్చెనని యున్నది. రావణుడు తపస్సు మహేశ్వరునిగూర్చి చేసెననియు, చేతుల దురద వదలునట్లు కైలాసముపై బొటనవ్రేలితో శివుడే యదిమె ననియు మనము వినిన సంగతి. అందు వాలిచే నడచబడె నని యున్నది. మఱియు నీ జైన రామాయణములో నహింసావిషయమును, రావణుని యజ్ఞధ్వంసకత్వమును

తెలుపుట జైన సిద్ధాంత ప్రచారమునకై చేసియుందురు. మహేశ్వరునికి మారుగా నిచ్చట ప్రతిఘట్టమందు జిననాథుని పేర్కొనియున్నారు. ఇదియు మత ప్రచారార్థమే యుండవలెను."[1]

జైన పురాణ రామకథ వేదధర్మప్రతిపాదనాత్మకమైన వాల్మీకి రామాయణకథకు స్వభావముచే భిన్నమైనది. అది జైనమత ప్రచారార్థము పుట్టినది కావున నది తన్మతానుయాయులను దప్ప నితరుల నంతగా నాకర్షించినట్లు కానరాదు.

సంస్కృత సాహిత్యమున పురాణములన్నియు నొకయెత్తు. ఇతిహాసమును, పంచమవేదము అయిన మహాభారత మొకయెత్తు. వ్యాస భట్టారకుడు రామకథను వనపర్వమున మార్కండేయ మహర్షి ధర్మరాజునకు జెప్పినట్టు వ్రాసెను.

సంస్కృత మహాభారతమున అరణ్యపర్వములో రామాయణ ప్రశంస కథారూపమున నాలుగు తావులందు కలదు. అరణ్యవాస సమయమున పాండవులు తీర్థయాత్ర లొనరించు ఘట్టమున లోమశ మహర్షి వారి కాయా క్షేత్ర మాహాత్మ్యముల నెఱింగించు సందర్భమున రామకథా ప్రసక్తి కలదు.

1. అగస్త్యాశ్రమము చేరి, మణిమతీ నగరము ప్రవేశించిన పాండవులకు లోమశుడు అగస్త్యముని, వాతాపి ఇల్వలుల కథ వివరించెను— తీర్థయాత్రా పర్వము-96, 97 అధ్యాయములు. 99 వ అధ్యాయమున భృగుతీర్థ మాహాత్మ్యము చెప్పు సందర్భమున పరశురామ గర్వభంగ వృత్తాంతము కలదు. ఇక్కడ రామాయణగాథ కూడ సంగ్రహముగ కొంత కలదు. శివధను ర్భంగము లేకుండగనే పరశురాముడు అయోధ్యయందున్న రాముని సమీపించి విష్ణుచాపము నొసగి, అవహేళన మొనర్పగా, ఉగ్రుడైన శ్రీరాముడు విష్ణుచాపభంగ మొనర్చి, విష్ణు రూపమును ప్రదర్శించెను.

---

1. జైన పురాణము (వ్యా) చూడు: సారస్వత వ్యాసములు - రెండవ సంపు. (ఆం. సా. అకాడమీ ప్రచురణ)

2. 105 వ అధ్యాయమున కాలకేయదైత్యులు సముద్రమున దాగి నప్పుడు వారి సంహరణార్థము అగస్త్యుడు సముద్ర జలమును పాన మొనర్పగా చతుర్ముఖుడు సాగరము భగీరథునిచే పూరింప బడగల దని చెప్పెను. ఇప్పట్టున గంగావతరణ కథ 105, 106, 107, 108 అధ్యాయములందు గలదు. 111 వ అధ్యాయమునుండి ఋశ్యశృంగ వృత్తాంతము వివరముగ ఉన్నది. ఇందు రోమపాదుడు ఒక ద్విజుని బాధించిన కారణమున రాజ్యమున అనావృష్టి యేర్పడినట్లు కలదు. ఋశ్యశృంగ మహర్షిని తోడ్కొని వచ్చుటకు కిందు వేశ్యలు కాక, చతుర దైన ఒక వేశ్యామాత జాణ అయిన తనకుమార్తెతో వెడలినట్లు కలదు— అధ్యాయములు-110, 111, 112, 113.

3. సౌగంధికాపహరణ ఘట్టమున హనుమంతుడు భీమునికి చెప్పిన సంగ్రహరామకథ కలదు. అధ్యాయములు-147, 148.

4. జయద్రథ పరాభవానంతరము ధర్మరాజుచే కోరబడి మార్కండేయ మహర్షి పాండవులకు రామకథ వివరముగ చెప్పెను. ఇదియే మహాభారతమందలి రామోపాఖ్యానముగా పేరుగాంచి నది. — 273 నుండి 293 అధ్యాయములు.

ఇది రామజననముతో ప్రారంభ మయినను, రావణునిగురించి, ఆతని బలపరాక్రమములను గురించి ఆదిలో వివరించినది. మహావీరు డయిన రావణుని వధార్థము బ్రహ్మాదు లొనరించిన ప్రయత్నములు పేర్కొనబడినవి. దుందుభి అను గంధర్వాంగన మంథరగా జన్మించినది. అనగా, ఉత్తరరామాయణమందలి రావణ వృత్తాంతము భారత రామోపాఖ్యానమున కథారంభమునందే గ్రహింపబడినది.

ఇందు శివధనుర్భంగాదులు లేవు. రాముడు సీతను పరిణయ మాడెను. అంత దశరథుడు రామాభిషేకమునకై నిశ్చయించి, పురోహితునితో భాషించు తరి మంథర ఆలకించి, కైకను ప్రేరేచెను. కైక సర్వాభరణ భూషితాంగియై యుండునప్పుడు భర్తను గదిసి వర

ప్రదానమునకై వేడెను. దశరథుడు అంగీకరించిన తదుపరి వరముల వివరములు చెప్పెను. శ్రీరాముడు దశరథుని దర్శించకయే వనముల కరిగెను.

సీతాపహరణఘట్టమున ప్రథమముగ జటాయువు ప్రవేశించును. తెలుగుకావ్యములు పెక్కింటియందు ఈ పద్ధతియే కలదు. రావణునిచే గొనిపోవబడుచు సీత ఎదురయిన ప్రతి ఆశ్రమము కడను ఆభరణ మొక్కొక్కటిగా విడిచి, చివరకు, వానరులమధ్య తన దివ్యవస్త్రమును వైచెను. సీతకొరకై ఆశ్రమమున కరుదెంచుచున్న రామలక్ష్మణులకు జటాయువు మార్గముననే కానుపించి అపహరణ వృత్తాంత మెరింగించెను. తదుపరి వారు ఆశ్రమమునకు వెడలిరి. సుగ్రీవునితో రణమునకై బయలుదేరిన వాలి తారతో "నీవు సర్వప్రాణిభాషలను నేర్చిన దానవు కనుక ధీశక్తిని అరుదెంచిన వా రెవరో గ్రహింపు" మని కోరెను. వాల్మీకి రామాయణ మందలి తార యింతటి బుద్ధిశాలినిగా కన్పట్టదు. వాలి సుగ్రీవులు పోరు సలుపుచుండ హనుమంతుడు పుష్పహారమును సుగ్రీవుని కంఠమున పడునట్లు విసరెను. వర్షఋతువున మాల్యవంతమున విడిసియున్న రాముని సుగ్రీవు డెడనెడ దర్శించుచుండెను. రావణుడు అశోకవనమున ఆశ్రమము నిర్మించి అందు సీత నుంచెను. ధర్మజ్ఞాత అయిన త్రిజట దుఃఖించుచు సీతకు రామక్షేమము, సుగ్రీవసఖ్యము, రంభావిషయకమయిన రావణుని శాపము, తన స్వప్నము చెప్పెను. పిమ్మట రావణుడు అరుదెంచి సీతను హెచ్చరించెను. ఆగ్రహావేశములతో లక్ష్మణుడు కిష్కింధకు అరుదెంచుటకు పూర్వమే సుగ్రీవుడు కపిసైన్యమును సీతాన్వేషణమునకై పంపి, వారికై నిరీక్షించుచుండెను. వాల్మీకి రామాయణమున నాల్గుదిక్కు లందలి కపిసేనలు సమాయత్త మగుటకు ఆజ్ఞ నొసగి, వారికై నిరీక్షించుచుండెను. సీతను గాంచి వచ్చి రామునితో ఆ వార్త చెప్పిన హనుమంతుని చేతనే ప్రయాణ విశేషములు, లంకావార్తలు మొదలగునవి చెప్పించబడెను. అతడు లంకాదహనము గావించితి నని మాత్రము పేర్కొనెను. రావణునితో సంభాషణము మున్నగునవి లేవు. రణరంగమున లక్ష్మణుడు నరుకగా కుంభకర్ణుడు చతుర్భుజుడు అయ్యెను.

అంతలో తిరిగి బహుశీర్షుడు, బహుభుజుడుగా రూపొందెను. లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమున కుంభకర్ణుని వధించెను. రాముడు కాదు. రావణుడు తన శరీరమునుండి ఆయుధధారులైన రాక్షసుల బ్రభవింపజేయగా రాముడు వారిని సంహరించెను. మాతలి తోడ్కొని వచ్చిన రథమును గాంచి రాముడు అదియు రాక్షసమాయగా తలుత సంశయించెను. బ్రహ్మాస్త్రమున మరణించిన రావణుని బూడిద మాత్రము రణరంగమున మిగిలెను. వృద్ధమంత్రి అవింధ్యుడు మలిన వస్త్రధారిణి సీతను తోడ్కొని వచ్చి స్వీకరింపుమని రాముని వేడెను. ఆకసమున నిలిచి తిలకించు దేవతల నుద్దేశించి సీత తన పవిత్రతను నిరూపింప బ్రార్థించెను. రామాయణమున అతి ప్రధానముగ పేర్కొనబడు అగ్నిప్రవేశ మిందు లేకుండగనే రాముడు సీతను స్వీకరించెను.

రామకథ నాధ్యాత్మిక దృష్టితో దర్శించి వర్ణించిన కావ్య మధ్యాత్మ రామాయణము. వాల్మీకి రామాయణము తరువాత కవులను అధికముగా బ్రభావితులను జేసిన దీరామాయణము. అందలి కథ సంగ్రహముగా నిది :–

**బాల కాండము:-** నారదునిచే అడుగబడి బ్రహ్మ ఒకప్పుడు ఈశ్వరుడు పార్వతికిచెప్పినకథగా అధ్యాత్మ రామాయణము చెప్పబడినది. అధ్యాత్మ రామాయణమున ఈశ్వరుడు ప్రథమమున, రామపట్టాభిషేకానంతరము సీతారాములు హనుమంతునకు రామతత్త్వ ముపదేశించుట చెప్పెను. పిమ్మట అధ్యాత్మ రామాయణ కథ ఆరంభమగును. రావణాది రాక్షసుల భారము భరింపజాలక భూదేవి గోరూపమున మహర్షులతో కూడి బ్రహ్మకడ మొరపెట్టుకొనగా బ్రహ్మ క్షీర సముద్రమునకు వెడలి ప్రార్థింప ప్రత్యక్షమయిన విష్ణువు తాను మున్ను కశ్యపున కొసగిన వరము ప్రకారము ఇప్పుడు దశరథునిగ జన్మించిన కశ్యపునికి నలుగురు కుమారులుగ జన్మింతు ననియు, యోగమాయ సీత కాగలదనియు చెప్పి మాయమయ్యెను. బ్రహ్మ దేవతలను వానరులను పుట్టించవలసినదిగా ఆనతిచ్చెను. అయోధ్యను పాలించు దశరథుడు వసిష్ఠు నాజ్ఞమేరకు ఋష్యశృంగుని రావించి పుత్రకామేష్టి ఒనర్చి,

అగ్నిహోత్రుని వలన పాయసము బడసెను. ఈ విధాన మంతయు అతి సంగ్రహముగ చెప్పబడినది. అగ్నిదేవుడు రాజుకు విష్ణువు కుమారుడుగా జన్మించు నని చెప్పెను. దశరథుడు కౌసల్యాకైకలకు పాయసము చెరిసగము ఒసగగా- అప్పుడే అక్కడకు వచ్చిన సుమిత్రకు వారిరువురు చెరిసగము నిచ్చిరి. రాముడు చతుర్భుజములు౦ శంఖ చక్రములతో ఆవిర్భవింపగా కౌసల్య స్తుతించి, బాలభావము వహింప ప్రారించినది. అప్పుడు విష్ణువు బ్రహకోరికపై రావణాదుల వధింప తా నాఅవతారమును ధరించినట్లును, పూర్వము దశరథకౌసల్యలు విష్ణువును పుత్రునిగా బడయగోరి తప మాచరించినందున వారి అభీష్ట మీడేర్ప వారికి జనించినట్లును చెప్పి, శిశు వయ్యెను. రామునకు జాతకకర్మాదు లయిన పిమ్మట భరతుడును లక్ష్మణ శత్రుఘ్నులును జన్మించిరి. రామాదుల బాల్యచేష్టలు ఇందు వర్ణింపబడినవి. కృష్ణలీలలలో వలె నిందు రాముడు పాలుపెరుగులు త్రావుచు తల్లిని విసిగించెను. విశ్వామిత్రాగమన ఘట్టమున, వసిష్ఠుడు కలత నొందిన దశరథునితో దశరథుడే కశ్యప ప్రజాపతియనియు, కౌసల్య యదితి యనియు, వారు తపము చేసి, శ్రీహరి పుత్రుడుగా జన్మించు వరము బడసినందున, విష్ణువు నలుగురుపుత్రుల రూపమునను, మిథిలయందు యోగమాయ సీతాకన్యగాను జన్మించి రనియు, యాగ రక్షణ వ్యాజమున కౌశికుడు రాముని సీతారామకళ్యాణార్థము గొని పోవ వచ్చినా డనియు చెప్పగా, సంతసించి దశరథుడు రాముని కౌశికున కొసగెను. తాటక వధ ఇందు కలదు. కామవనము నధిగమించి వారు వెడలి రని మాత్రమే పేర్కొనబడినది కాని, మన్మథ దహన వృత్తాంతము లేదు. యాగ రక్షణ మొనర్చి, అహల్యా శాపవిమోచనము గావించుట కలదు. ఇందు వాల్మీకి రామాయణము నుండి భేదించు ఒక ముఖ్య విషయము అహల్యశిలాకృతి ధరించు నట్లు శపింపబడుట. అహల్య రాముని విష్ణువుగా గుర్తించి సుదీర్ఘముగ స్తోత్రము కావించెను. గంగ దాటబోయిన రామాదులతో నావికుడు (పేరు లేదు) రామపాద స్పర్శమున పడవ స్త్రీ యగునను భయమును వెలిబుచ్చి శ్రీరామపాదప్రక్షాళనము కావించి, గంగ

పాటించిన శ్లోక మనోహర కల్పన మిందు కలదు. విశాల సగర, గంగావతరణ, దండకవన వృత్తాంతాదు లిందు లేవు. శివధనుర్భంగము తరువాత లక్ష్మణాదులకు ఊర్మిళాదుల నొసంగు మని కోరుట మున్నగునవి కూడ యిందు లేవు. జనక, దశరథాదులందరును నది నలుగురి వివాహములుగనే భావించి సన్నాహములు జరిపిరి. జనకుడు సీతా జన్మ వృత్తాంతమును, తనకు నారదుడు చెప్పిన దానిని నీ విధముగా చెప్పెను. నాగేటి చాలున దొరికిన సీతను జనకుడు పెంచుకొనుచుండగా నారదు డరుదెంచి రావణవధార్థము శ్రీహరి అయోధ్యలో జన్మింప నున్నాడనియు, అనాదినుండియు శ్రీహరిపత్ని యైన మాయాశక్తి రామపత్ని యగుటకు సీతగా జన్మించినది గావున ఎట్లయిన ఆమెను రామునకే ఒసగ వలెననియు చెప్పెను. శివధనుర్భంగ మొకటియే కార్యసాధన కాగల దని భావించిన జనకుడు అట్టి నియమము నేర్పాటు చేసెను. జనకు డిది యంతయును జెప్పి రాముని విష్ణ్వవతారముగా స్తుతించెను. పరశురామ గర్వభంగ ఘట్టమున పరశురాముడు విష్ణుచాపము నెక్కుపెట్టిన రాముని నారాయణావతారముగ గుర్తించి, కార్తవీర్యుని సంహారమునకై తప మొనరించిన తనకు విష్ణువు ప్రత్యక్షమై ధను వొసగి ఇరువది యొక్క పర్యాయములు క్షత్రియసంహారము గావించి భూమిని కశ్యప ప్రజాపతికి దాన మొనర్చు మనియు, రామావతారమున తిరిగి తాను వైష్ణవ తేజమును గ్రహింతు ననియు చెప్పిన దానిని, చెప్పి, శ్రీరాముని స్తుతించెను. పిమ్మట అందరును అయోధ్య చేరిరి.

**అయోధ్యా కాండము :-** సీతారాముల కథకు నారదు డరుదెంచి, రావణ సంహారమునకై హెచ్చరించెను. రాముడు మరునాడే దండకారణ్యమున కరిగి, సీతావ్యాజమున రావణుని పరిమార్తు నని అభయ మొసగెను. దశరథుడు రామాభిషేకమునకై నిశ్చయించెను. వసిష్ఠుడు రాముని కలుసుకొని ఆతడు రావణవధార్థము భూమిపై జనించిన విష్ణువను దేవరహస్యము తా నెరుగుదు నని చెప్పి, పట్టాభిషేక విషయమును తెలియజేసెను. దేవతలు మంథరాకైకేయుల నావహింప వలసినదిగా సరస్వతీదేవిని కోరిరి. ఆమె అట్లే ఒనర్చినది. కైకేయీ

వరలాభాదులు వాల్మీకి రామాయణమునందు వలనే ఉన్నను, స్వల్పమయిన మార్పులు అటనట కలవు. కౌసల్యా సముఖమున లక్ష్మణుడు క్రోధము ప్రదర్శింపగా శ్రీరాము డొనర్చిన ధర్మోపన్యాసము తప్ప, తక్కుంగల కథాంశము లన్నియు సంగ్రహముగ చెప్పబడెను. సీత రామునితో జ్యోతిష్కుడు తనకు వనవాసయోగము కల దని చెప్పె ననియు. బ్రాహ్మణులవలన తాను వినియుండిన రామాయణము లన్నింటియందును సీత వనమునకు రాము ననుసరించి నట్లే గలదనియు చెప్పి రాముని అంగీకరింపజేసెను లక్ష్మణుడు వనవాస గమనమునకై రాముని కౌసల్యా మందిరముననే వేడినాడు. దుఃఖించు అయోధ్యావాసులకు వామదేవుడు విష్ణ్వవతారములనుగురించియు, రామావతారము రావణవధార్థ మనియు, నారదు డీవిషయమై రామునితో చర్చించె ననియు, దేవరహస్య మంతయు జెప్పి వారిని శాంతింపజేసెను. వాల్మీకి రామాయణము వలెనే ఇందు కూడ వసిష్ఠుడు సీతాదేవి నారచీరలు ధరింప నవసరము లేదనెను. వనగమనము, దశరథ మూర్ఛ కలవు. శోకించు గుహుని కిందు లక్ష్మణుడు తత్త్వోపదేశ మొనర్చెను. గంగను దాటి భరద్వాజుని దర్శించి, చిత్రకూటమున తనసన్నిధి కరుదెంచిన సీతారామలక్ష్మణులకు వాల్మీకి మహర్షి తన పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను. పూర్వజన్మమున వాల్మీకి బ్రాహ్మణుడు- భార్యావ్యామోహమున కిరాతుడై చౌర్యవృత్తిని కూడ అవలంబించెను. ఒకనాడు మహర్షులు ఎదురై నీ పాపములందు నీవారు పాలుపంచుకొనెదరా యని ప్రశ్నింప, అతడు గృహమున కరిగి పత్నీ పుత్రులను అడిగెను. వారు సుఖములందు మాత్రము పాలు పంచుకొనెద మనిరి. పశ్చాత్తప్తుడైన బ్రాహ్మణుడు మహర్షుల ఆదేశమున వారు తిరిగి వచ్చు పర్యంతము "రామ" శబ్దము జపించుచు తపము గావించెను. అంత వా రరుదెంచి "మహర్షి"గా దీవించిరి. వాల్మీకి తన యీ వృత్తాంత మంతయు చెప్పి, ఇది యంతయు నీ నామమాహాత్మ్య మని శ్రీరాముని స్తుతించెను. చిత్రకూటమున సీతారామలక్ష్మణులు పర్ణశాలను నిర్మించుకొనిరి. ఈ పర్ణశాల నిర్మాణము వాల్మీకి రామాయణమున లక్ష్మణుడు కావించి

నట్లును, అధ్యాత్మ రామాయణమున వాల్మీకి శిష్యగణముకావించి నట్లును కలదు.

రామవనగమనముగూర్చి సుమంత్రునివలన వివరముగ విన్న దశరథుడు కౌసల్యకు తనశాపము గురించి చెప్పి, శోకావేశమున మరణింపగా కౌసల్యాదులు దుఃఖ సాగరమున మునిగిరి. వాల్మీకి రామాయణమున రాత్రివేళ దశరథుడు మరణింపగా తెల్లవారిన తరువాత కౌసల్యాదు లావిషయము గ్రహించినట్లు కలదు. భర తాగమనము, భరతుని వనగమనము. భరద్వాజాతిథ్యము ఆదిగా గల కథాభాగ మంతయు క్లుప్తముగ చెప్పబడినది. లక్ష్మణుడు ససైన్య ముగ అరుదెంచు చున్న భరతుని ఋజువర్తనమును శంకించుట యిందు లేదు. వాల్మీకిరామాయణమున కలదు. రామప్రేరితుడై వసిష్ఠుడు భరతునకు దేవరహస్యమును, కైకేయిని సరస్వతి ఆవేశిం చిన విషయమును చెప్పెను. వర్ణశంయన మిందు లేదు. రాముని అవతారమూర్తిగా స్తుతించి క్షమ నర్థించిన కైకకు శ్రీరాము డంతయు తన ఆదేశానుసారమే జరిగిన దని చెప్పి సమాశ్వాస పరచెను. రామా దులు దండకవని కేగుచు అత్రిమహామునిని దర్శించిరి.

**ఆరణ్య కాండము:** రామసీతలక్ష్మణులు అత్రిమహామునచే వనమున సంచరించిరి; విరాధవధ మున్నగువృత్తాంతములిందు కలవు. ఇందు అగస్త్యునిభ్రాత అగ్నిజిహ్వుడుగా పేర్కొనబడినాడు. వాల్మీకి రామా యణమున కేవలము అగస్త్యునిభ్రాతగానే చెప్పబడెను - పేరు లేదు. జటాయుదర్శనాదులు గలవు. పంచవటియందు రాముడు లక్ష్మణునకు ఆత్మ, పరమాత్మ, మాయలను గురించి సవిస్తరముగ చెప్పెను.

రాముని అడుగుజాడల సౌందర్యమునకు సమ్మోహితయైన శూర్ప ణఖ రామాదుల కడకు వచ్చెను. శూర్పణఖా పరాభవము తరువాత ఖరదూషణులు పదునాలుగువేలమంది రాక్షసులతో రాముని ఎదిర్చి, మడిసిరి. వాల్మీకి రామాయణమున ఖరుడు మొదట పదునలుగురు రాక్షసులను పంపి, వారు హతులు కాగా పిమ్మట తాను పదునాలుగు

వేలమందితో బయలుదేరినట్లు కలదు. శూర్పణఖ వలన రామపరాక్రమము గురించి వినిన రావణుడు ఆ రాత్రంతయు యోచించి, శ్రీరాముని నారాయణావతారముగా నిశ్చయించి, రామునిచేతి మరణమే మోక్షదాయకమని భావించి, రామునితో విరోధమే అందుకు మార్గముగా నిర్ణయించుకొని, మారీచునికడ కరిగెను. అధ్యాత్మ రామాయణము అతి ముఖ్యమయిన ఈ ఘట్టమున వాల్మీకి రామాయణముతో భేదించుచున్నది. వాల్మీకి రామాయణమున ఖరదూషణాదులవధ గాంచిన అకంపను డను రాక్షసుడు లంక కేగి రావణునికి చెప్పగా, ఆగ్రహావేశమున రావణుడు సీతాపహరణార్థము మారీచునికడ కరుదెంచి, అతని హితోక్తులకు శాంతించి, తన ప్రయత్నము విరమించుకొని లంక కేగెను. తదుపరి శూర్పణఖ వచ్చి, ప్రేరేచగా, మరల మారీచుని కడ కరుగుదెంచి, అత డెంత చెప్పినను వినక, మారీచుడు మాయామృగ మగుటకు అంగీకరింపజేసెను. అధ్యాత్మ రామాయణమున మారీచుడు తా నంతకు పూర్వమే హరిణరూపమున రాముని కెదురింప యత్నించి, రామశరమునకు గురి యైతి ననియు, రాముడు విష్ణువవతార మనియు చెప్పి వారింప యత్నించెను. కాని రావణుడు — రాముడు భగవంతు డైన అతనిచే మరణము ముక్తిదాయక మనియు, కాకుండిన గతి లభించు ననియు చెప్పి, మారీచుని సుముఖుని గావించుకొనెను.

రావణ ప్రయత్నము గ్రహించిన రాముడు ఒకసంవత్సరకాల పర్యంతము అనగా రావణవధ జరుగువరకు అగ్నియందు అదృశ్యమై యుండి, ఛాయాసీతను మాత్రము పర్ణశాలయందు, తనకడ నుంచుమని సీతను కోరెను సీత అట్లే కావింపగా, ఆశ్రమమున మాయా సీత వెలసెను— మాయామృగమై చనుదెంచిన మారీచుడు మరణించి, రామునియం దైక్య మయ్యెను. సీతను రావణుడు భూమితోసహా పెళ్లగించి అపహరించి, అశోకవనమున నుంచి, ఆమెను మాతృదేవతగ మనమున భావించుచుండెను. మాయాసీతవిషయము లక్ష్మ

ణునకు తెలియకుండుటకై శ్రీరాముడు విరహదుఃఖమును అభినయింప నిశ్చయించుకొని, రావణవధాదులకై కార్యక్రమమును రూపొందించుకొని. మారీచుని హతమార్చి తిరిగివచ్చుచుండగా రాముని లక్ష్మణుడు కలుసుకొనెను. సీతాన్వేషణమున జటాయువును దర్శించి, జటాయువుకోరికపై శ్రీరాముడు తనదైన విష్ణురూపమును ప్రదర్శించెను. పిమ్మట కబంధవధ జరిగెను. ఈసందర్భమున అధ్యాత్మరామాయణము కబంధునకు అష్టావక్రునివలన శాపముకలిగెనని చెప్పగా, వాల్మీకిరామాయణమున స్థూలశిరునిచే శాపము కలిగినట్లు కలదు. పద్మపురాణమున కబంధవధ శబరీమోక్షణానంతరము జరిగినది. వాల్మీకిరామాయణమునందువలెనే యిందుకూడ కబంధప్రేరితులై రామలక్ష్మణులు శబరిని కలుసుకొనగా, శబరి రామునకు తా నంతకుమునుపే సిద్ధముగా నుంచిన పండ్లను ఒసగెను. పద్మపురాణమున శబరి పండ్లను స్వయముగా ఆరగించి పిమ్మట రాముని కొసగినట్లు కలదు. వ్యాఖ్యాతలుకొందరు శబరి ఎంగిలిపండ్లను రాముని కొసగినట్లుగా వ్యాఖ్యానించుటకు ఇదియే ఆధారమని చెప్పవచ్చును.

**కిష్కింధా కాండము:-** తమకడకు వచ్చినహనుమంతునితో రాముడే తమవృత్తాంత మంతయు వివరించెను. వాల్మీకిరామాయణమున రామానుమతితో లక్ష్మణుడు వివరించెను. రామసుగ్రీవులమైత్రి కుదిరిన పిమ్మట సుగ్రీవుడు స్వీయచరిత్ర నెరిగించుపట్టున మాయావి వధకై గుహయందు ప్రవేశించినవాలి ఒకమాసమువరకు అందే యుండెనని చెప్పెను. వాల్మీకిరామాయణమున సంవత్సరపర్యంతమని కలదు. ఇట్లే వాల్మీకిరామాయణమున దుందుభిశరీరము నంతయు రాముడు యోజనదూరము విసరగా అధ్యాత్మరామాయణమున దుందుభిశిరస్సునుమాత్రమే విసిరెను. వాల్మీకిరామాయణమున మతంగమహర్షి వాలిఅనుచరులను కూడ శపింపగా, అధ్యాత్మ రామాయణమున వాలినిమాత్రమే శపించెను. సప్తతాళభంజనాదులతో సుగ్రీవుడు రాముని దైవముగా గుర్తించి ఐహికభోగముల ద్వేషించి రామభక్తియే కావలయు నని వేడ, రావణవధార్థము రాముడే అతనిని మాయామోహితుని గావించెను. వాలితో తార తాను అంగదునివలన

వినిన రామవృత్తాంతము చెప్పగా, వాలి రాముడు విష్ణ్వవతార మను విషయము తాను మున్నే ఎఱుగుదు నని చెప్పెను. వాలిని వధించి సుగ్రీవపట్టాభిషేక మయిన తరువాత ప్రస్రవణాద్రిని నివసించుచున్న రాముడు లక్ష్మణునకు తత్త్వోపదేశ మొనర్చెను. తరువాతికథ వాల్మీక రామాయణమునందువలెనే కలదు. ఇందు స్వయంప్రభ వానరవీరులను గుహబయటకు చేర్చి తాను ప్రస్రవణగిరి కరిగి శ్రీరాముని స్తుతించి తదనుమతిని బదరికాశ్రమమునకు వెడలెను, సముద్ర తీరమున దుఃఖించు అంగదునికి హనుమంతుడు రాముడు విష్ణు వను రహస్యము నెరింగించెను. సంపాతి పరిచయమైన హనుమంతుని సముద్రలంఘనసన్నాహముతో కాండము ముగిసెను.

సుందరా కాండము :- సురస, మైనాక, సింహికలు ఇందుకూడ వచ్చిరి. తనను జయించిన హనుమంతునికి లంకిణి సీత యున్నజాడ తెలిపెను. అందువలన హనుమంతుడు రాత్రివేళ సూక్ష్మశరీరధారియై లంకను, రావణుని అంతఃపురమును సీతకై అన్వేషించి, అంతలో లంకిణిమాటలు గుర్తుకు రాగా అశోకవనమున కరిగెను. కపివీరు డొకడు సూక్ష్మరూపమున లంకలో సీతాన్వేషణ మొనరించుచున్నట్లు స్వప్నమున గాంచిన రావణుడు, ఆకపివీరుడు అశోకవనమున వృక్షమున దాగియుండు ననియు, ఆతనిసమక్షమున సీతాదేవితో సంభాషించిన నతడు ఆగ్రహము చెంది రాముని త్వరితముగ తోడ్కొనివచ్చు ననియు భావించి రావణు డారాత్రి పరివారసహితముగ సీతకడ కరుదెంచెను. మిగిలినకథయంతయు వాల్మీకిరామాయణమువలెనే కలదు. కాని అధ్యాత్మ రామాయణము తత్త్వప్రధాన మగుటచే రావణునికి హనుమంతుడు తత్త్వోపదేశ మొనరించెను.

యుద్ధ కాండము :- రాముడు సైన్యసమేతముగ సముద్రతీరమున విడిసెను. మంత్రాలోచనము జరుపు రావణునికి కుంభకర్ణుడు సీత లక్ష్మి యని చెప్పి, యుద్ధము వలదనెను. హితము పల్కు విభీషణుని రావణుడు నిందింప, విభీషణుడు తన నలుగురు మంత్రులతోడను మింటి కెగసి సీతారాములు కాళికాలరుద్రు లనియు బ్రహ్మాదేశమున

రాక్షసవధార్థ మరుదెంచి రనియు చెప్పి రామశరణార్థియై అరిగెను. తన కథయు మొనగినరాముని దైవముగా విభీషణుడు స్తుతించెను. శుకసారణుల వృత్తాంతము, సేతుబంధనము కలవు. సేతునిర్మాణమునకు ముందు శ్రీరాముడు రామలింగప్రతిష్ఠాపన మొనర్చెను. సముద్రము దాటి సువేలాద్రిని చేరుకొనినరాముని శౌర్యాదులను రావణునికి వివరించి చెప్పుటచే శుకరాక్షసునకు, అగస్త్యునివలన కలిగినశాపము తొలగి, వైఖానసమునులను చేరుకొనెను. మాల్యవంతుడు రావణునకు హితము గరుప ప్రయత్నించెను. సువేలాద్రిని విడిసియున్న రాముడు దూరముగ మేడపై కొలువున్నరావణుని శ్వేతచ్ఛత్రములను ఒక్కబాణముతో భేదించి రావణుని అవమానించెను.

యుద్ధము ప్రారంభ మయినది. ఇంద్రజిత్తుచే పరిమార్పబడిన వానరులందరును హనుమంతుడు సంజీవనిచే పునర్జీవితుల గావించెను. కాలనేమివృత్తాంతము కలదు. కుంభకర్ణుని మరణానంతరము ఇంద్రజిత్తు హోమము ప్రారంభింపగా విభీషణుడు పండ్రెండుసంవత్సరములు నిద్రాహారములు విసర్జించినవ్యక్తిమాత్రము ఇంద్రజిత్తును వధింపగల డను బ్రహ్మవాక్కును రామునకు తెలియజేయగా, రాము డదియంతయు తా నెరుగుదు నని చెప్పి, లక్ష్మణుని హనుమదాదులను ఇంద్రజిత్తుపై యుద్ధమునకు పంపెను. ఇంద్రజిత్తు మరణించెను. దిగ్విజయార్థము పాతాళహోమ మొనర్చుచున్నరావణునికడకు, విభీషణునిహెచ్చరికమేరకు అంగదుడు మండోదరిని బలాత్కారమున గొనివచ్చి, రావణధ్యానభంగ మొనర్చెను. మండోదరి రావణునకు రాముడు విష్ణ్వవతార మని చెప్పగా, రావణు డారహస్యము తా నెరుగుదు ననియు, మోక్ష మందగోరి తా నట్లు ప్రవర్తించుచుండె ననియు తన మరణానంతరము సీతను మండోదరి వధింపవలయు నని చెప్పెను. రామరావణయుద్ధమున మాతలిహెచ్చరికపై బ్రహ్మాస్త్రప్రయోగమున రాముడు రావణుని సంహరించెను. రావణుతేజము రామునియం దైక్యము కాగా, నారదుడు ద్వేషమార్గమున రావణుడు రాముని చేరుకొనె నని దేవతలకు చెప్పెను. దుఃఖించు విభీషణునకు రామాదేశమున లక్ష్మణుడు జ్ఞానబోధ కావించెను. మాయాసీత అగ్నిప్రవేశ మొనరించగా బ్రహ్మరుద్రాదులు అరుదెంచిరి. బ్రహ్మ

రాముని స్తుతించెను. అగ్ని నిజసీత నొసంగెను. పట్టాభిషేక సమయమున సీత హనుమంతునకు హార మొసగి సమ్మానించెను. పిమ్మట సీతారాములు హనుమంతునకు వరములుకూడ నిచ్చిరి.

అధ్యాత్మరామాయణమునకూడ ఉత్తరకాండము కలదు. అది యిట్లున్నది :

శ్రీరామ దర్శనార్థము వచ్చిన అగస్త్యాదిమునులు రావణాది రాక్షసవీరుల జన్మక్రమములను వివరించిరి. రావణదిగ్విజయాది వృత్తాంతము లిందు సంగ్రహముగా కలవు. ఇందు రావణుని తల్లి పేరు కైకసి. అంశములు మాత్రము ఇంచుమించు వాల్మీకిరామాయణోత్తరకాండమందువలెనే కలవు.

సీతాదేవి రామునితో దేవతలు తనకడ కరుదెంచి వైకుంఠమున కాహ్వానించి రని చెప్పగా, రాముడు అపవాదవ్యాజమున ఆమెను వాల్మీక్యాశ్రమమున విడుతు ననియు, కుశలవులు జన్మించినతరువాత మరియొకపరి శపథ మొనర్చి భూప్రవేశ మొనర్చుమనియు నుడివెను. మిగిలినకథయంతయు వాల్మీకిరామాయణోత్తరకాండమువలెనే కలదు. తనకడ నున్న కుశలవులకు మున్ను పరమేశ్వరుడు ఉమాదేవికి వివరించిన రామాయణకథనంతయు గానరూపమున నేర్పెను. రాముడు స్వర్ణ సీతతో యజ్ఞములు కావించెను. యజ్ఞసందర్శనార్థ మరిగిన వాల్మీకి కుశలవులు రామునిసమ్ముఖమున గాన మొనర్చుటకు అనుమతి నొసగి, పారితోషకములుమాత్రము స్వీకరింపవల దని హెచ్చరించెను. వారిగాన మాలించి, వారిని తనకుమారులుగా గుర్తించినరాముడు శత్రుఘ్నాదులను పంపి సీతను రావించెను. సీత భూప్రవేశ మొనరించినపిమ్మట రాముడు కౌసల్యకు తత్త్వ ముపదేశించెను. సుమిత్రా కౌసల్యలు స్వర్గము పొందిరి. అంతకు పూర్వమే కైకేయి పరమపదించెను. మిగిలినకథ వాల్మీకిరామాయణోత్తరకాండమునందువలెనే కలదు.

అధ్యాత్మరామాయణమున రాముడు జ్ఞానమూర్తియైన అవతార పురుషుడు. అతడు మాయారూపిణియైన సీతతో గలిసి రావణసంహా

రార్థ మొనర్చిన లీలయే వనవాసవృత్తాంతము. రావణునిచే హరింపబడినది సత్యసీత కాదు. మాయాసీత. లక్ష్మణున కాసత్యము తెలియదు. రామునిర్వేదము లక్ష్మణాదులకు సత్యముగా భాసించినది. అది యొక ఆభాస. రావణుడు మోక్షము నర్థించి రామునితో బోరినవాడు, రావణునివర్తన మీరామాయణమున శత్రురూప మగు భక్తి విశేషము. ఇట్లధ్యాత్మరామాయణము తత్త్వప్రధానముగా సాగిన రామకథ. ఈరామాయణమునకు రామకథను చెప్పుటకంటె దానియందలి ఆధ్యాత్మికతత్త్వమును కల్పనలద్వారమునను, ఉపదేశముల ముఖమునను వ్యాఖ్యానించుటయే పరమలక్ష్యము.

అధ్యాత్మరామాయణానంతరము పేర్కొనదగిన మఱియొక సంపూర్ణరామాయణము ఆనందరామాయణము. అందు కూడ రామకథను పరమేశ్వరుడు పార్వతికి చెప్పెను. ఆకావ్యము సూర్యవంశ రాజులవంశవర్ణనముతో నారంభమగును. తరువాత కౌసల్యాపరిణయ వృత్తాంతము వచ్చును.

దశరథుడు వివాహనిశ్చయానంతరము జలకేళి సలుపుచున్న సమయమున లంకేశుడైన రావణుడు దశరథకౌసల్యలకు జన్మింపనున్న హరివలన మరణము సంభవించు నని బ్రహ్మ చెప్పగా విని దశరథసుమంత్రుల నీట ముంచగా వారు సరయువునుండి గంగకు, అటనుండి సముద్రమునకు కూడ బోయి ఒకదీవియందు తేలిరి. రావణుడు కౌసల్య నపహరించి యొకపేటికయందిడి సముద్రమందలి ఒక మత్స్యముగర్భమున నుంచెను. ఒకనా డామత్స్య మాపేటికను దశరథు డున్నదీవిపై నిడి మరియొకమత్స్యముతో పోరాడుచుండ దశరథసుమంత్రు లామందసమును తెరచి కన్యను గాంచిరి. దశరథుడు కౌసల్యను గాంధర్వవిధిని వివాహమాడెను. అంతలో మత్స్య మరుదెంచి పేటికను ముప్వురితో దాచినది. రావణుడు బ్రహ్మలిఖితమును తప్పించితి నని విరించినే పరిహసించి పేటికను తెరచి చూడ అందుండి ముప్వురును వెల్వడిరి. బ్రహ్మ రావణుని సమ్మతపరచి వారికి సాకేతపురికి పంపునట్లు చేసెను. తరువాత దశరథుడు వందల సంఖ్యలలో వివాహములు చేసుకొనెను.

ఒకనాడు దేవదానవయుద్ధమున సహాయమునకై వెడలిన దశరథునిరథము ఇరుసు విరుగగా కైకేయి తనవామహస్తమునే ఇరుసుగా పట్టి కాపాడి వరములను పొందెను. కైక బాల్యమున తన్ను చూడ వచ్చిన ఒకముని నిద్రించుచుండగా అతనిముఖమునకు మసిబూసి, అతడు లేవగానే వామహస్తముతో వందన మాచరింపగా నతడు వజ్రమువలె హస్తము భాసించు నని వర మొసగె. పిమ్మట కైకేయి చేసిన పనికి కినిసి, ఘోరాపవాదము పొంది, ఆమెముఖ సందర్శన మునకు మహాపాపముగా జనులు భావించి తొలగిపోవుదు రని శపించెను. యుద్ధమునుండి వచ్చిన దశరథునకు శ్రవణవధచే శాపము వచ్చినది.

ఇందు దశరథునిపుత్రిక యైన శాంతను రోమపాదుడు దత్తపుత్రికగ గైకొని, ఋశ్యశృంగుని కొసగి వివాహము చేసెను. పుత్రకామేష్టి చేసిన దశరథునికి అగ్నిదేవుడు ప్రత్యక్షమై పాయస మొసగెను. దానిని రాజు ముగ్గురు రాణులకు సమముగా బంచుగా గృధ్రి శాపవశమున తనభాగమును కైక పాలవైచెను- సువర్చలయను అప్సర బ్రహ్మశాపమున, గృధ్రమై, కైక పాయసమును విసరివేయ సంకల్పము చేసియుండినది. అంజనాద్రిని పడిన పాయసము అంజనకు లభించి ఆంజనేయుడు జన్మించెను. కౌసల్యాసుమిత్రలు కైకకు తమ పాయసమందు వంతు లిచ్చిరి. ఇంతలో భూదేవి వేడుకొనగా బ్రహ్మ విష్ణువును రావణనిర్మూలనకై ప్రార్థించెను. విష్ణ్వాదేశమున దుందుభి యను గంధర్వాంగన మంథరగను, దేవతలు కపివీరులు గాను జన్మించిరి. ఈ మంథరయే కృష్ణావతారమున కుబ్జయైనది. అధ్యాత్మరామాయణమునందువలెనే యిందుకూడ శంఖచక్రధారియై ప్రత్యక్ష మయిన విష్ణువును బాలభావము వహింప కౌసల్య కోరినది. సుమిత్రకు లక్ష్మణుడు, కైకకు భరతశత్రుఘ్నులు జన్మించిరి. తాటక సంహారాదులు కలవు. ఇందు అహల్య కఠినశిలగా మారియుండినది. ఇంద్రునియెడ అంతటను సహస్రయోనులు ఉద్భవించునట్లు శాప మొసగిన గౌతముడే దేవతలప్రార్థనపై అక్షులుగా కనబడునట్లు అనుగ్రహించెను. గుహుని వృత్తాంతము ఇక్కడే కలదు. విశ్వామిత్రుని

వెంట మిథిలకు పయనమగుచున్న శ్రీరామునితో గుహుడు "నీ పాద రజమునకు అచేతనమగు వస్తువుకూడ స్త్రీగా మారిపోవును- ఈ పాదరజము సోకి నా పడవ కూడ నాతియైనచో ఏమిచేయగలవాడ" ననుచు పాదములను నీట కడిగి పడవలోనికి ఆహ్వానించెను.

సీతాస్వయంవరమునకు ఆహ్వానము లేకుండగనే రావణుడు అరుదెంచెను. మిథిలయందు విడిసిన తరువాత, శ్రీరాముడే సీతాపతి యగునుగాన, ఉచితమర్యాదలు జరుపవలసినదిగా విశ్వామిత్రుడు జనకునకు రహస్యముగా వార్త పంపెను. అంత జనకుడు వారిని భద్రగజముపై ఊరేగింపుతో స్వయంవరస్థలికి గొనిరాగా మిగిలిన రాజులందఱు అసూయాగ్రస్తులైరి. బాల్యమున సీత శివచాపముతో ఆడుకొనుచుండుట గాంచిన పరశురాముడు ఆమెను శక్తిగ గుర్తించి, జానకిని వీర్యశుల్కను గావింపు మని జనకు నాదేశించెను. ధనుస్సు నెక్కిడి అది మీదపడగా అశక్తుడైన రావణుని రక్షించుటకు గురుని ఆదేశమున రాముడు ఉద్యుక్తుడు కాగా, ప్రాసాదములపై నుండి గాంచిన స్త్రీలు రాముడే సీతాపతి కావలయు నని దేవతలను ప్రార్థించిరి. సీతయు దేవతల ప్రార్థించి యట్లగునేని పదునాలుగు వర్షములు వనవాస మొనరింతు నని మ్రొక్కుకొనెను. ఇందు కుశధ్వజుడు జనకుని బంధువు- సోదరుడు కాడు. సీతాజన్మముగురించి జనకపురోహితుడు దశరథునకు చెప్పిన కథ యిది:

పద్మాక్షు డను రాజు లక్ష్మిని పుత్రికగా బడయగోరి మొదట ఆమెనుగూర్చి, ఆమె ఆదేశముపై తరువాత విష్ణువు గురించి తప మొనర్చి శ్రీహరినుండి మాతులుంగఫలమును పొందెను. అందు సౌందర్యఖనియైన బాలిక కన్పట్టెను. ఆమెకు పద్మ యని పేరిడి, పెంచి, స్వయంవరమున అంచితాకాశనీలవర్ణాంగుడైనవారికే ఒసగెద ననగా, రావణాదులెల్లరు కోపించిరి. పద్మను అపహరింప నెంచి వారు పద్మాక్షుని పదివేలమంది రాణులు సహగమన మొనర్చిరి. ఒకనాడు పద్మ అగ్నినుండి వెల్వడి విహరించుచుండగా రావణుడు గాంచి చెరపట్ట నుంకింపగా ఆమె రత్నపంచకమై అగ్నియందలి పేటికలో దాగెను. రావణు డాపేటికను గొనిపోయి దేవిసన్నిధి నుంచి, ఆ

రాత్రి మండోదరిని అందలిరత్నములను శిరోభూషణములుగ అలంకరించుకొనుమనెను. మండోదరి పేటికను తెరచుటకు ప్రయత్నించెను. రావణుడుకూడ యత్నించి విఫలుడయ్యెను. చివరకు మందసమును పగులగొట్టగా అందు శక్తిస్వరూపిణివంటి బాల కన్పట్టె, మండోదరి హెచ్చరికమేరకు రావణుడు ఆబాలను లంక దాటింప నడుకట్టెను. ఆబాల తాను మరల లంక కరుదెంచి రావణుని, మూడవసారి యరుదెంచి పౌండ్రకశతకంఠరావణుని- సంహరింతునని పలుక రావణు డామెను సంహరింపబోయెను. మండోదరి వారించి మిథిలానగరసమీపమున భూమియందు వదలిపెట్టించెను. ఆ భూమిని జనకుడు ఒకవిప్రునకు దానమొసగెను. ఆవిప్రు డాభూమిని దున్నుచు పేటికను గాంచి, గొనిపోయి జనకున కొసగెను. అందుండి వెల్వడిన బాలికయే సీత. ఆమె మాతులుంగాజాతకనుక మాతులుంగి, సీరాగ్రమున వెల్వడుటచే సీత, పద్మాక్షునిపుత్రి యగుటచే పద్మ, అగ్నివాసిని కనుక అగ్నిగర్భ, రత్నరాజియం దుండినది కనుక రత్నావతి. భూమినుండి లభించుటచే భూపుత్రి, జనకునికుమార్తె కనుక జానకి అని పిలువబడెను. పరశురాముడు శ్రీరాముని అవతారపురుషునిగా స్తుతించెను. ఇందు అయోధ్యలో శ్రీరామాదులు దీపావళి జరుపుకొనుట వర్ణింపబడెను. ఆనందరామాయణకర్త మహారాష్ట్రుడు కనుక మహారాష్ట్రులకు ముఖ్యమయిన పండుగను ఇందు చొప్పించి యుండవచ్చును. సీతాస్వయంవరకాలమున క్రోధము వహించిన రాజులందరు యుద్ధమునకు రాగా రామాదులు వారితో పోరిరి. అందు భరతశత్రుఘ్నులు మరణించగా రామునిపనుపున లక్ష్మణుడు ముద్గలముని ఆశ్రమమున కేగి, అచ్చటివారల నెదిర్చి సంజీవిని కొనివచ్చి వారల బ్రతికించెను. దశరథుడు ముద్గలునిదర్శన మొనర్చి లక్ష్మణునితరపున క్షమ నర్థించెను. ముని సంతసించి శ్రీరామునిపూర్వవృత్తాంతము వివరించెను. అది యిది : జలంధరు డను రాక్షసుని సంహరించుటకై శ్రీహరి పార్వతీదేవిప్రేరణమున, జలంధరునిపత్నియైన వృందాదేవిశీల మపహరించుటకై తాపసవేషమున ఉద్యానవన

మునకు వచ్చెను. అప్పటికే వచ్చిన బృందను జయవిజయులు రాక్షసాకృతివాల్చి భయపెట్టగా ఆమె అక్కడనే ఉన్న మునిని శరణు వేడెను. ఆమె పతిక్షేమ మరయునంతలో ఇద్దరు కపివీరులు ఆకాశమున కన్పట్టిరి. బృంద పతి మరణించె నని శంకించి దుఃఖింపగా, ముని తాను బ్రతికింతు నని అభయ మొసగి, అంతర్ధానము చెంది జలంధరవేషధారియై ఆరమించెను. రోజులు గడచెను. చివర కొకనాడు మోసము నెరిగిన బృంద జయవిజయులు రాక్షసులై, అందు జ్యేష్ఠుడు శ్రీహరిభార్య నపహరించు ననియు, మంటిని కనుపించినకపులే వానరులై జన్మించు నారాయణునకు తో డగుదు రనియు శాప మొసగి మరణించెను.

ముద్గలుడు ఈ కథతోపాటు సీతాపహరణాది భవిష్యద్వృత్తాంతమును, దశరథునిపూర్వజన్మముకూడ నెఱింగించెను. కలహ యను నొకబ్రాహ్మణస్త్రీ పతితో ఎల్లప్పుడు కలహించుచు అతడు ద్వితీయవివాహ మొనర్చుకొన, ఆత్మహత్య గావించుకొని, యమునిశాపమున బ్రహ్మరాక్షసి యయ్యెను. కొంతకాలమునకు ధర్మదత్తు డను మహాత్ము డామెకు తనకార్తికవ్రతసుకృతార్ధ మొసగగా, శాపవిమోచనయై దివ్యాంగన యయ్యెను, విష్ణుదూతలు వచ్చి మరుజన్మమున ధర్మదత్తుడు దశరథునిగాను, కలహ కైకగాను జన్మింతు రనియు, అప్పుడు వారికి శ్రీహరియే పుత్రు డగుననియు, ఇది యంతయు కార్తికవ్రతమాహాత్మ్య మనియు చెప్పిరి. ఈవృత్తాంతములన్నియు ఆలించిన పిదప దశరథుడు రామాదులతో అయోధ్య చేరెను. మరికొన్నినాళ్ళకు శ్రీరామాదులశోభనములు జరిగెను. దశరథుని కోరికపై శ్రీరాముడు కౌసల్యాదశరథులకు తాను పూర్వ మొసగినవరముప్రకారము పుత్రుడైన శ్రీహరి నని చెప్పి తత్త్వోపదేశ మొనర్చెను.

**అయోధ్యా కాండము :-** నారదముని సీతాలక్ష్మణసమన్వితు డయిన శ్రీరామునికడ కరుదెంచి, రావణసంహార మొనర్చిన పిమ్మట రాజ్యపాలనము గావించవలయు నను దేవతల సందేశము వినిపించెను. సీత రామునితో, పూర్వ మొకమునిపుంగవు డామె పదునాలుగు వర్షములు వనవాస మొనర్చు నని చెప్పెననియు, శివధనుర్భంగసమయ

మున పదునాలుగేండ్లు వనవాస మొనర్చు ననునియమము హానితి ననియు, ఆర్యులు రామకథాప్రసంగము లొనర్చునప్పుడు సీతాసమేతుడై రాముడు కానల కేగినట్లు పఠించుట తా నాలించియుంటి ననియు చెప్పి శ్రీరామున ననుమతి బడసెను. వసిష్ఠుడు కౌసల్యాసుమిత్రుల సమక్షమున దశరథునితో రావణసంహారము, రాఘవవనవాసము, దశరథ స్వర్గవాసము- ఇత్యాదులన్నియు చెప్పి, ఆరంభమున పట్టాభిషేక ప్రయత్నములు కావింప మని హెచ్చరించుటయే కాక రామునితోకూడ అతడు వనవాసమునకై సర్వసన్నాహములు గావించుకొనవలయు నని చెప్పెను. తదుపరి మంథరాబోధనమున కైకేయీవరప్రదానము జరిగి రాముడు వనములకు తరలెను. దుఃఖించుప్రజలకు వామదేవుడు నారదుడు రామునకు వినిపించినదేవతలయాదేశము తెల్పి, దానవసంహార మొనర్చి రాముడు రాజ్య మేలు నని చెప్పి శాంతుల జేసెను. వసిష్ఠుడు సీతాదేవి నారచీరలు ధరింప నవసరములే దని చెప్పి ఆమెకు అమూల్యవస్త్రముల నొసగెను. గుహ భరద్వాజ వాల్మీకాదుల కలుసుకొని సీతారామలక్ష్మణులు చిత్రకూటమును చేరిరి. ఇందు కాకాసురవృత్తాంతము కలదు. కాకము సీతాదేవిచరణాంగుష్ఠమును గాయపరచగా ఉగ్రుడైన రాముడు ఇషికాస్త్రప్రయోగమున దాని నేత్ర మొకటి హరించెను. పాదుకాప్రదాన సందర్భమున భరతుని దర్భశయనము కలదు. శ్రీరాముని కోరికపై వసిష్ఠుడు శ్రీరాముని అవతార హేతువును చెప్పెను. సీతారామలక్ష్మణుల దండకారణ్య ప్రవేశముతో అయోధ్యాకాండము ముగిసెను.

**అరణ్య కాండము :-** రామసీతాలక్ష్మణులు-తత్క్రమముననే అరణ్యమున ప్రవేశించిరి. విరాధవధాదులు కలవు. పంచవటి ప్రవేశముననే జటాయువుతో పరిచయ మేర్పడెను. శూర్పణఖాసుతుడైన సాంబుని ఒకనాడు ప్రమాదవశంబున లక్ష్మణుడు సంహరించగా, క్రోధావేశమున చనుదెంచిన శూర్పణఖ రామదర్శనమున మోహపరవశయయ్యెను. ఖరదూషణాదులవధానంతరము రామాదేశమున సీత సత్త్వరూపమున శ్రీరాముని వామపార్శ్వమునను, రజోరూపయై అగ్నియందును, ఛాయామాత్ర తమోరూపయై రావణుని మోహింపజేయ

పర్ణశాలయందును నిలచెను. సీతాపహరణఘట్టమున పంచవటి చుట్టును లక్ష్మణుడు గిరులు గీసెను. అశోకవనియందున్న సీతకు బ్రహ్మాజ్ఞచే ఇంద్రుడు పాయస మొసగెను- సీతకై పరితపించు శ్రీరాముని పరీక్షించుటకై పార్వతీదేవి మాయసీతయై కన్పట్ట, రాముడు నవ్వి నిజవిశ్వరూపమును ప్రదర్శించెను. తదుపరి కబంధవధ జరిగెను.

**కిష్కింధా కాండము :-** ఇందు సుగ్రీవసఖ్యమువరకు వాల్మీకిరామాయణమువలెనే కథ నడిచినది. తాళవృక్షభంజనవృత్తాంతము భేదించుచున్నది. సర్పదేహమందు చక్రాకారమున నున్న తాళవృక్షముల గాంచి శ్రీరాముడు లక్ష్మణుని పాదమును అంగుష్ఠముచే స్పర్శింపగా, శేషుడైన లక్ష్మణుడు తనఅంశజుం డగుపన్నగమునకు సంకేత మొనర్చ, ఆ సర్పము తనదేహమును మెలికలు పోవునట్లు చక్కగ నిగిడ్చెను. అంత ఒకబాణమున రాముడు తాళవృక్షములను ఖండించెను. మహేశ్వరునినుండి గ్రహించి కశ్యపముని ఇంద్రున కొసగిన మాలను మహేంద్రుడు వాలికి బహూకరించెను. రిపుబలవిధ్వంసి యైన ఆమాలను సర్పరాజుచే తెప్పించి రాముడు సుగ్రీవున కొసగెను. అప్పుడు సుగ్రీవుడు సర్పవృత్తాంతము రామునకు చెప్పెను. ఒకప్పుడు వాలి తాళఫలములను గుహయందుంచగా ఒకసర్పము భుజించుటచే ఉగ్రుడై సప్తఫలములు ఆ సర్పము నందే వృక్షము లగునట్లు శపించెను. అట్లే జరుగగా, సర్పము తనయందలి ఆవృక్షముల నరకిన వారిచే వాలి సంహరింపబడు నట్లు ప్రతిశాప మొసగెను. కనుక శ్రీరాముడే వాలిమారకు డని సుగ్రీవుడు విశ్వసించెను. తనను వారించు తారతో వాలి నారాయణుడైన రామునిచే మరణమునే తాను కాంక్షించుచుంటి ననియు, తార సుగ్రీవుని సేవించిన, సుగ్రీవునిపత్నిని తాను గ్రహించిన పాపము నశించు ననియు, ఆనేరమువలన తాను మాలను గోల్పోయితి ననియు చెప్పి యుద్ధమున కేగెను. శరాఘాతమున కూలినవాలితో రాముడు సుగ్రీవుడు తారను గ్రహింపగల డనియు,

ఇకపై కపుల కీయాచారము వర్తించు ననియు, రాబోవు తన కృష్ణావతారమున వాలి బోయయై తన మరణమునకు కారణభూతు డగు ననియు పేర్కొనెను.

**సుందర కాండము :-** లంకయందు హనుమంతుడు సీతాన్వేషణము గావించుచు అచ్చటి మందిరములదీపముల నార్పి, రావణునిగడ్డము మీసములు కాల్చి, దూతలనడుములకు జలభాండముల గట్టి త్రోలి, అవియన్నియు సీతామాహాత్మ్యములుగా భావించి దైత్యులు భీతిల్లునట్లు ప్రవర్తించెను. పిమ్మట మండోదరిని గాంచెను. మండోదరీ వృత్తాంతమిట పార్వతి కీశ్వరుడు చెప్పెను. ఒకప్పుడు కైకసి కోర్కెపై శివలింగము బడయగోరి రావణుడు కైలాసమున కేగి ఈశ్వరుని ప్రార్థించి ఆత్మలింగముతోపాటు, పార్వతిని కాంచి మోహించి ఆమెనుకూడ గైకొని మరలి వచ్చుచుండ పార్వతి విష్ణువును ప్రార్థించెను. వృద్ధబ్రాహ్మణరూపమున అరుదెంచినవిష్ణువు రావణుని అనుసరించువనిత పార్వతి కా దనియుఃపార్వతిని ఈశ్వరుడు పాతాళమున మయునికడ భద్రముగా నుంచినాడని చెప్పగా రావణుడు పాతాళమున కేగి అచ్చట గల మండోదరినే పార్వతిగా భావించి తోడ్కొని వచ్చెను. తనప్రభావమున కాలకృత్యములు తీర్చుకొనుటకు రావణుడు ఆత్మలింగము బ్రాహ్మణునకొసగి వెడలగా బ్రాహ్మణు డాలింగమును భూమిపయి పెట్టెను. అది అక్కడ స్థాపితమైపోయెను. అదియే గోకర్ణక్షేత్ర మయ్యెను.

హనుమంతుడు అశోకవనియందున్నతరి సీతాదర్శనార్థ మరుదెంచిన రావణునిపలుకులకు కుపితయై సీత తాను బాలయై పేటియందుండి లంక కేగుదెంచిన వృత్తాంతము స్ఫురణకు తీసుకొనివచ్చి రామశరణార్థియై ప్రాణముల కాపాడుకొను మనగా రావణుడు సిగ్గిల్లెను. సీతాన్వేషణ మొనరించుతరి మారుతి గయునిపత్రమును రావణునిపర్యంకముపైనను, రావణుని ఉత్తరీయమును విభీషణునితల్పము పైనను ఇచ్ఛాపూర్వకముగ వదలుటచే రావణుడు మండోదరిశీలమును శంకించి గయుని సంహరించి, మండోదరినికూడ నరుకబోవ పరిజను లడ్డుకొనిరి. అట్లే విభీషణుడు సరమను చంప నుంకించగా మిగిలిన

వారు రక్షించిరి. సభామంటపమున తనవాలమును రాక్షసు లుత్త రింప యత్నించి విఫలులగుట గాంచి, హనుమంతుడు తాను చిరంజీవి కావున వలసినచో వాలమున కగ్గి పెట్టుడు మని పల్కెను. అందుల కుద్యుక్తులై రాక్షసులు వాలమునకు చుట్టుటకై లంకలోని వస్త్రములన్నియు గొనివచ్చినను ఇంకను కొంత వాలము మిగిలియే యుండుటచే తుదకు సీతాదేవి వస్త్రములను గూడ గ్రహింపవలె నని భావింపగా వాలము పెరుగుట ఆగెను. అంత లంకాదహన మయ్యెను. ఇచ్చటనే గజేంద్రమోక్షము, లంకాస్వర్ణమహిమ వృత్తాంతములు కలవు. పూర్వము పాండ్యదేశాధిపతి యైన ఇంద్రద్యుమ్నుడు తప మొనరించు చున్నతరి అగస్త్యమునీంద్రుడు చనుదెంచి తన కర్ఘ్యపాద్యాదు లొసగి పూజింపని రాజును గజరాజు గమ్మని శపించెను. హూహూ అనెడి గంధర్వుడు సరోవరమున జలక్రీడ లాడుచు నీట మునిగి దేవలు డను ముని పాదములను పట్టి, ముని ఉగ్రుడై మకరి యగునట్లు శపించెను. ఈ కరిమకరుల శాపవిమోచనమే గజేంద్రమోక్షకథ. శ్రీహరి అనుమతి పొంది గరుడుడు కరిమకరుల కళేబరములను భక్షించవలయునను కోర్కెతో అచటికి వచ్చిన భ్రూమగు డను గృధ్రరాజునుకూడ సంహరించి, పాదములతో మూటింటిని బట్టి విశాలవృక్షశాఖపై వ్రాలగా ఆ కొమ్మ విరిగెను. అందు గల వాలఖిల్యాదిమునుల తపమునకు భంగము కలుగకుండుటకై గరుడు డావృక్షశాఖను పట్టి కశ్యపునానతిని లంకలో పెట్టి, కరిమకరాదులను భక్షించెను. వాని ఎముకలు మూడు శృంగములుగ త్రికూటాద్రు లయ్యెను. వాలఖిల్యాదిమును లున్న వృక్షశాఖను గరుడు డా శిఖరములపై నిలిపెను. ఆకొమ్మ కాలక్రమమున పాచి పట్టి శిలగా మారెను. లంకాదహనసమయమున ఆశిఖరములెల్ల కరిగి లోహములై ప్రవహించగా లంక స్వర్ణలంకగా భాసించెను. హనుమంతుడు సముద్రమును తిరిగి లంఘించుటకు కుద్యుక్తు డయిన సమయమున చతుర్ముఖుడు అరుదెంచి, మారుతి లంకయందు గావించిన కార్యము లన్నింటిని నొక లేఖయందు లిఖించి శ్రీరామున కొసగు మనెను. తనవిజయములకు గర్వించినమారుతి సముద్రము దాటి వచ్చి, వృద్ధుడైన ఒకమునిని గాంచి, ముద్రికను, మణిని, లేఖను

నతనికొసగి. తాను దప్పిక తీర్చుకొన నేగెను. ఇంతలో ఒకక్షుద్ర మర్కట మరుదెంచి ముద్రికను కమండలమున వేసెను. పావని కమండలమున వెదుకగా అందు అసంఖ్యాకములుగా ముద్రికలు కనుపించెను. ముని అవియన్నియు పావనికన్న మున్నె కపులు సీతను గాంచి తెచ్చియిచ్చిన వని తెల్పగా, తన అహంభావమునకు చింతించినహనుమంతుడు రామునిచెంత కరిగెను. కమండలముననే యుండి పోయిన ముద్రికను శ్రీరామునికడ గాంచి మారుతి రాముని విష్ణువుగ గ్రహించి రామభక్తు డయ్యెను.

**యుద్ధ కాండము :-** సముద్రతీరమున రాముడు హనుమంతునిచే ఇసుక లంకను తయారు చేయించి, విభీషణుని కొసగెను. అది హనుమలంకగా ప్రసిద్ధి పొందెను. పూర్వము నీలు డొక బ్రాహ్మణునిసాలగ్రామములను నీట బారవైచి, నీట విసరినశిల మునుగకుండునట్లు శాపము పొందెను. గావున నీలునిసహకారముతో సేతువు నిర్మింపు మని సముద్రుడు రామునకు చెప్పెను. పిమ్మట శివలింగ ప్రతిష్ఠాపనకై ఈశ్వరుడు రెండు లింగముల నొసగెను. ఇప్పట్టున అగస్త్యకృత దక్షిణాచలగర్వభంగవృత్తాంత మిందు కలదు. హనుమంతు డరుదెంచులోపల ముహూర్తము దాటిపోవుచుండుటచే రాముడు సైకతలింగస్థాపన మొనర్చెను. అది ఎరిగి క్రుద్ధుడై మారుతి రామానుమతిని సైకతలింగమును కదల్ప ప్రయత్నించి విఫలుడై, చివరకు దాని ప్రక్కగా కాశీలింగమును ప్రతిష్ఠించెను. పిమ్మట ఈశ్వరుడు సైకతలింగమునుండి ఉద్భవించి, లింగోత్పత్తినిగురించి చెప్పెను.

అంగదుని రాయబారముతరువాత సౌధాగ్రముపైకి వచ్చిన రావణునిపై కెగిరి సుగ్రీవు డాతని కిరీటము గొనివచ్చెను. లక్ష్మణ మూర్ఛ తేర్చుటకై సంజీవని గొనివచ్చుహనుమంతుడు కాలనేమిని సంహరించి దారిలో భరతునితో సంభాషించెను- లక్ష్మణమూర్ఛానంతరము పాతాళముననున్న ఐరావణమైరావణులను రావణు డాహ్వానించెను. వారరుదెంచి అంజనేయనిర్మితవాలప్రాకారమున నిద్రించు

రామలక్ష్మణులను కొనిపోయి పాతాళమున బంధించిరి. వారికై బయలుదేరిన పావని, పావురములజంటసంభాషణమువలన పాతాళమున కరిగి, వారిని దర్శించెను. అక్కడ మారుతిని మకరధ్వజుడు ఎదుర్కొనగా పావని తా నపుడెంచిన అవసరమును తెల్పెను. పిదప, లంకాదహన సమయమున కంఠమును శుద్ధిపరచుకొనుటకై తాను సముద్రమున ఉమియగా, దానిని భక్షించిన ఒక మకరమునకు జనించినవాడే మకరధ్వజు డని తెలిసి సంతసించెను. అంత మారుతి పుత్రుని సహాయమున కామాక్షి ఆలయమున విగ్రహము వెనుకకు దాగి, నరబలి కావలయు నని పలుకగా రాక్షసులు రామలక్ష్మణుల నర్పించిరి. అంతరామలక్ష్మణులు మారుతి రాక్షసులతో జరిపినయుద్ధమున ఐరావణమహిరావణు లెంతకును మరణించకుండిరి. అంతలో చంద్రసేన యను నొకనాగకన్య రామనామగానము చేయుచుండ హనుమంతు డామెకడ కరిగి రాముభారము నామెశయ్య భరించినచో రాము డామెవశ మగు నని అభయ మొసగి రాక్షసులమరణరహస్య మెరిగెను. ఒకప్పుడు తుమ్మెదలసంఘము బాలురు బంధించుచుండగా సోదరులు వాటిని రక్షించిరి. అవి అవసరసమయమున రాక్షసులప్రాణములు కాపాడునట్లు వాగ్దాన మొనర్చెను. అవి కోట్లకొలదిగ వృద్ధిపొంది, రాక్షసులశయ్యాతల్పమున వసించి, అమృతముతో వారిని బ్రతికించుచుండె నని విని హనుమంతుడు వాటిని సంహరించెను. అం దొక్కటి చంద్రసేన తల్పమును తొల్ల యొనర్చు ఒప్పందమున హనుమంతుని అభయమును పొంది అట్లే కావించెను. రాక్షసుల జయించి రాముడు హనుమంతుని కోరికమేరకు చంద్రసేన కడ కరుదెంచి శయ్యపై ఆసీనుడు కాగానే తల్పము విరిగెను. రాము డంత రాబోవుకృష్ణావతారమున ఆమె తన సతి యగునట్లు వర మొసగెను. ఈవిషయ మాలించిన రావణుడు రాముడు నారాయణుడే అని నిర్ధారణ గావించుకొనెను. కుంభకర్ణుడు కూడ రాము డవతారపురుషు డనురహస్యమును రావణున కెరింగించెను. ఇందు ఇంద్రజిత్తు కుంభిలాహోమమును, సులోచనాసహగమనమును కలవు. అంగదుడు రావణునిహోమము విఘ్న మొనర్పగా రావణుడు తాను రాముని

వలన మరణము కోరియే శత్రుత్వము నెఱపితి ననియు, తన మరణానంతరము మండోదరి తిలోదకములు వదలి, అగ్నిలో ప్రవేశించవలయుననియు మండోదరితో చెప్పెను. రామరావణయుద్ధమున విభీషణుడు రావణుని నాభియందు గల అమృతకుంభమును గూర్చి ఎఱింగించెను. రావణుని మరణానంతరము అమృతవృష్టికి కపులందఱు పునర్జీవితులయిరి. ఒక కపిమాత్రము కుంభకర్ణునిగర్భమం దుండిపోగా రాముడు యమధర్మరాజును రావించి ఆ కపిని కూడ బ్రతికించెను. త్రిజటకు కూడా వరములు ప్రసాదించబడెను. విభీషణుని కోర్కెపై రాముడు వార్నిధిని వింటిమొనతో గ్రుచ్చగా ఆ స్థలము ధనుష్కోటిగాను, రాముని ఆనతిపై సంపాతి ఏర్పరచినతీర్థము జటాయుతీర్థముగాను ప్రఖ్యాతిని పొందినవి. ఇందు భరతుని అగ్నిప్రవేశ ప్రయత్నము కలదు.

పట్టాభిషేకసమయమున సీత రాము డొసగిన రత్నహారమును హనుమంతునకు బహూకరించగా పావని దానిని నోటకొరికి విసరివైచి, శ్రీరాముడు లేని వస్తువును తాను ధరించ నని చెప్పి, సీతకోర్కెపై తన హృదయమును చీల్చి అం దున్న సీతారామలక్ష్మణులను చూపెను. అంత సీతారాము లతనికి వరము లొసగిరి. అనంతరము పంక్తిభోజనమున పావని రామునిపాయసపాత్రను గొనిపోవ, వానరులందఱు రామోచ్ఛిష్టమును ప్రసాదముగ భుజించిరి.

**ఆనంద రామాయణము - ఉత్తర కాండము :-** ఇందలి ఉత్తరకాండ కథయందు పెక్కు అవాల్మీకియాంశములు కలవు. ఇది రాముని రాజ్యపాలనమునే ప్రధానముగ వర్ణించెను. సీతాపరిత్యాగ, కుశలవ జననాది వృత్తాంతము లందు లేవు. ప్రథమసర్గయందు మాత్రము రాక్షస, వానరవీరుల జన్మాదికములగురించి అగస్త్యుడు వివరించెను. తరువాత యాత్రాకాండమున బ్రహ్మదేశమున వాల్మీకి రామాయణమును రచించుట, సీతారాములు యాగము లొనర్చుట, యాగకాండమున వసిష్ఠోపదేశమున రామాశ్వమేధమునకై సన్నాహములు జరిపి, నిర్వహింప

బడుట- సీతను రాముడు వసిష్ఠునకు యజ్ఞదక్షిణగ సమర్పింపగా, వసిష్ఠుడు ఆమె వెత్తు బంగారమును గ్రహించి, రాజ్యమును, సీతను మరల రామున కొసగి, భవిష్యత్తునందు రాజ్యమును, సీతను దాన మొసంగకుండునట్లు రామునిచే వాగ్దానము చేయించుట, విలాసకాండమున సీతారాముల కౌతుకక్రీడాభివర్ణనాదులు- సీతారాముల దాంపత్య జీవనము- వ్యాసుడు రాముని దర్శించుట- మున్నగు విషయములు కలవు.

రామకథను రసదృష్టితో వర్ణించి బహువిధకావ్య ప్రక్రియలలో వెలయించిన సంస్కృత కవులు పెక్కుమంది కలరు. వారందరి కావ్యములను సమీక్షించినచో గ్రంథము పెరుగును. కావున నతి ప్రధానములైనవానిని మాత్రము పేర్కొందును.

శ్రవ్యకావ్యములలో మొదట పేర్కొనదగినది కవికులగురువగు కాళిదాసు రచించిన రఘువంశ మహాకావ్యము. ఇనవంశ చక్రవర్తుల యుదాత్తవర్తనమున కెత్తిన కవితానీరాజన మామహాకవి కావ్యము. అందు రామోదంతము కలదు.

**రఘువంశమునందలి రామకథ :-** వివాహితు లైనపిమ్మట ఒకనాడు మృగయావిహారార్థము వనమున కేగిన దశరథుడు ప్రమాదవశమున మునికుమారుని శరములకు గురిచేసెను. కొనయూపిరితో నున్న అతని కోరికమేరకు అతనిని వృద్ధజననీజనకుల కడకు కొనిపోయెను. వారి అభ్యర్థనముపై శరమును పెకలింపగా మునికుమారుడు మరణించెను. అంత శాపము పొందిన దశరథుడు, తనకు పుత్రప్రాప్తి కలుగు అదృష్టము శాపమువలన కలుగుచున్నది కావున అది వరమే యగునని పలికెను. క్షీరసాగరమునకు దేవత లరుగగా లక్ష్మీదేవి అంకస్థలమున నిద్రించుచున్న విష్ణువు మేల్కాంచెను. చతుర్ముఖుడు ఒసగిన వరముల విషయము చెప్పి తాను దాశరథిగ జన్మింతు నని అభయ మొసగెను. పాయసమును రాజు కౌసల్యాకైకలకు సమానముగ ఒసగి సుమిత్రకుకూడ అందు భాగ మిడు మని కోరెను. వారు తమ భాగములందు సగపాలొసగిరి. సుమిత్రకు వారిరువురియెడ సమానముగ

అనురాగ ముంచెను. దివ్యస్వప్నములు గాంచుచున్న దేవేరులవలన రా జావిషయము నెరిగి తాను నారాయణునకు జనకుడు కానున్నట్లు గుర్తించి సంతసించెను. విశ్వామిత్రునివెంట కుమారులను రాజు నిస్సంశయముగ పంపెను. యాగసంరక్షణార్థ మరుదెంచవలసిన దిగా జనకుడు విశ్వామిత్రుని ఆహ్వానించెను. శివధనుస్సు జూచ కుతూహలపడిన రాఘవులను ముని తనవెంట గొనిపోయెను. విష్ణుచాపము నెక్కిడి పరశురాముని పుణ్యలోకముల హరించినపిమ్మట రాముడు పరశురాముని క్షమింపు మని వేడెను. ఇందు మంథర లేదు. కైకయే స్వయముగ అన్నియు జేసినది. భరతుడు పాదుకల గ్రహించుటతో రఘువంశమున దశరథునికథ ముగియును.

తరువాతి సర్గలో రామకథ కలదు. ఇందు కాకాసురవృత్తాంత మున్నది. రామలక్ష్మణు లిరువురిచేతను తిరస్కృతి యైన శూర్పణఖను గాంచి సీత హసింపగా అది దానికి కోపకారణ మయినది. ఖరదూషణులు మొదటనే వేలాదిసైనికులతో వచ్చిరి. మారీచునిపేరు లేదు. లంకాదహనానంతరము హనుమంతుడు సీతకడనుండి రత్నమును గ్రహించెను. కాలనేమి కథాదులు లేవు. రాముడు పుష్పకమునుండి సీతకు జూపిన దృశ్యములు వివరముగ వర్ణింపబడినవి. అంతర్వత్నిగ నున్న సీతకోరిక వినినపిమ్మట రాముడు సౌధాగ్రమునుండి నగరశోభను తిలకించుచు తన నడతనుగూర్చి ప్రజాభిప్రాయమును అడుగగా భద్రుడు సీతాపవాదము నెరింగించెను. లక్ష్మణుడు వనమున వాల్మీక్యాశ్రమ మార్గము జానకికి చూపెను. స్వర్ణసీతాప్రతిమతో రాముడు క్రతువు లొనర్చుట విని సీత బాధపడెను. శత్రుఘ్నుడు ఆశ్రమమునకు అరుదెంచినరాత్రి కుశలవులు జన్మించిరి. శత్రుఘ్నుడు కాళిందీతటమున మధురానగరమును నిర్మించి పాలించెను. వాల్మీకి ఆశ్రమమునకు తిరిగి రాకయే శత్రుఘ్నుడు అయోధ్యకు వెడలెను. సమయము వచ్చినప్పుడు సీతాకుమారులను తాను స్వయముగ రామున కప్పగించగలవాడ ననియు, రామున కంతవరకు సీతావిషయికమయిన వార్త లెరిగించవల దని వాల్మీకి పలుకుటచే శత్రుఘ్నుడు అన్నకడ

రహస్యము వెల్లడింపలేదు. వాల్మీకికి రాముడు రాజ్యమంతయు అర్పించెద నన వాల్మీకి సీతాతనయుల స్వీకరింపు మని కోరెను.

క్రీ. శ. అయిదు లేక ఆరవశతాబ్దమునకు చెందినవాడుగా భావింపబడుచున్న కుమారదాసుడు జానకీహరణ మను ఇరువది సర్గల మహాకావ్యమును రచించెను. ఇందు క్రమముగా దశరథుని చరిత్ర, రావణునిచే పరాభూతులైన దేవేంద్రాదులు నాగలోకములో నున్న విష్ణువును శరణు జొచ్చుట, విష్ణువు వారికి రామునిగా జన్మించుటకు వర మొసగుట, ఋతువర్ణనము రాముని జననము, బాల్యము, విద్యాభ్యాసాదులు, వసిష్ఠునితో కలసి రాముడు లక్ష్మణసమేతుడై రాక్షససంహారమునకై వెడలుట, వసిష్ఠుడు అరణ్యములో నుండిన తిరుతెన్నులు, రాముని మిథిలాప్రయాణము, దశరథుని మిథిలాప్రయాణము, సీతారాముల వివాహవిహారములు, రాముడు అయోధ్యకు తరలుట, రామపట్టభంగము, భరతుడు రాజ్యస్వీకారార్థము రాముని వేడుట, సీతాపహరణము, గరుడరావణయుద్ధము, గరుడునిమరణము, రాముడు వాలిని గూల్చుట, వసంతర్తువర్ణనము, రామునికడకు సుగ్రీవునిరాక, వర్షర్తువర్ణనము, రామునివిరహవేదనము, సుగ్రీవు డతని నోదార్చుట, సేతునిర్మాణము, రామరావణయుద్ధము, రామపట్టాభిషేకము నను నంశము లభివర్ణితము లైనవి. ఈకావ్యముపై కాళిదాసుప్రభావము అధికముగా గానవచ్చుచున్నది. ఐనను విశ్వామిత్రునకు బదులు వసిష్ఠుని, జటాయువునకుబదులు గరుడుని పేర్కొనుట వింతగా దోచుచున్నది. పదిహేడు పదునెనిమిదిసర్గలలో నితడు యమకానుప్రాసాదులలో దనకు గల నేర్పును ప్రకటించెను.

ఇట్లే రామకథను గైకొని రచింపబడిన కావ్యము ల సంఖ్యాకములు. భట్టి మహాకవిచే రచింపబడి, భట్టికావ్య మని ప్రసిద్ధిగాంచిన రావణవధ మనుకావ్యము ప్రకీర్ణప్రసన్నఅలంకారతిఙంతములను నాలుగుభాగములతో వ్యాకరణసూత్రములకును, అలంకారములకును లక్ష్యముగా చెప్పబడినది. కాశ్మీరదేశకవి యగు అభినందనుడు (క్రీ. శ. 9 వ శతాబ్ది) రామచరితకావ్యమును అసంపూర్ణముగా 36 సర్గలు రచించెను. ఆతరువాత నివపురుకవులు నాలుగుసర్గలు

వ్రాసి దానిని పూరించిరి. బిల్హణమహాకవి (1050 క్రీ. శ.) విక్రమాంకదేవచరిత్రమునే గాక, రామకథావస్తుకమైన మఱొకకావ్యమును వ్రాసె నని తెలియుచున్నది. 13, 14 శతాబ్దములలో నున్న వేంకటనాథకవి రామపాదుకలను వర్ణించు పాదుకాసహస్రమను స్తుతికావ్యమును, పదునెనిమిదిసర్గల కావ్యమును, మాధవవిద్యారణ్యులు రామోల్లాసమును, ఆతనిశిష్యు డైన వామభట్టబాణుడు (15 వ శతా) రఘునాథచరిత మగు ముప్పదిసర్గలకావ్యమును, అభిరామకామాక్షి యను కవయిత్రి (16 వ శతా) అభినవ రామాభ్యుదయ మను 24 ఆశ్వాసములకావ్యమును, మధురవాణి 14 సర్గల రామాయణసంస్కృతానువాదమును, రాజచూడామణిదీక్షితుడు (17 శతా) రామకథ యను కావ్యమును, చక్రకవి జానకీపరిణయమను 8 సర్గలకావ్యమును, వేంకటేశు డనుకవి రామయమకార్ణవము, రామచంద్రోదయ మను కావ్యములను, శరభోజి రాఘవచరిత్ర మను 12 సర్గల కావ్యమును, విష్వక్సేను డనుకవి 19 సర్గల రామచరితమును, గోపాలరాజనుకవి రామచంద్రోదయ మను 5 ఆశ్వాసముల కావ్యమును రచించి యుండిరి.

రామకథను శ్లేషకావ్యములలో నిబంధించిన గీర్వాణకవులు కలరు. వారిలో రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యకర్త ధనుంజయుడు మొదట పేర్కొనదగినవాడు. అతనివలెనే కవిరాజను మఱియొకకవి రాఘవపాండవీయమను ద్వ్యర్థికావ్యమును వ్రాసెను. క్రీ. శ. 16 వ శతాబ్దివా డగు చిదంబరకవి రాఘవపాండవయాదవీయ మను త్ర్యర్థికావ్యమును, 17 వ శతాబ్దివాడగు వేంకటాధ్వరి యాదవ రాఘవీయ మను ద్వ్యర్థికావ్యమును, 18 శతాబ్దివా డగు హరిదత్తసూరి రాఘవనైషధీయ మను ద్వ్యర్థికావ్యమును రచించిరి.

చిత్రకావ్యములలో రామకథను వెలయించినవారిలో మొదట చెప్పదగినవాడు విట్ఠల ఉమాక వెంకటేశ్వరకవి. అతడు తన అపూర్వచిత్రకవితానైపుణ్యమును వెలార్చి గద్యపద్యములలో ముప్పది సర్గలరామాయణసంగ్రహమును రచించెను. అందు అయోధ్యాది యుద్ధకాండమువఱకు గల శ్లోకముల ప్రథమాక్షరముల నన్నింటిని

కలిపి చదివినచో గౌరీవివాహ మనుకావ్యమును, ద్వితీయపాదము లందలి ప్రథమాక్షరము లన్నియు కలిపినచో శ్రీరంగాదిక్షేత్ర మాహాత్మ్యమును, తృతీయపాదాద్యక్షరములు కలిపి చదివినచో భగవదవతార చరిత్రకావ్యమును, చతుర్థపాదము లందలి అక్షరము లన్నియు కలిపి చదివినచో ద్రౌపదీకల్యాణకావ్యమును ఏర్పడును. బాలకాండమునందలి ప్రథమాక్షరములన్నియు కలిపి చదివినచో రామకవచ మేర్పడును. ఇది చతుస్సర్గకావ్య మని ప్రశస్తి గాంచినది. దీనితర్వాత పేర్కొనదగినవి:_ కృష్ణకవి 14 సర్గల క్రియాగోపనరామాయణము, సాలాయణుని నిరనునాసికచంపువు అనుకావ్యములు. ఇందు రెండవది అనునాసికాక్షర విరహితముగ వ్రాయబడినకృతి. శూర్పణఖ తనభంగపాటును రావణునితో చెప్పుట యిందలివస్తువు. నాసికలేని శూర్పణఖ అనునాసికాక్షరములు రాకుండ పలుకుట యందలి చమత్కారము. ఆధునికులలో సి. యస్. రామశాస్త్రిగారి 'రావణసీతాసంవాదఝరి' యను చిత్రకావ్యము పేర్కొనదగినది. అందు రావణోక్తశ్లోకమున ఒక అక్షరము లోపింప జేసి చదివినచో సీతాప్రత్యుత్తర మగును.

ఇంకనూ చంపూకావ్యప్రక్రియ ననుసరించి రచింపబడిన కావ్యములలో భోజమహారాజు, లక్ష్మణ సుకవి, రాజశ్యాముడు, ఘనశ్యాముడు, ఏకామ్రనాథుడు మొదలగువారు వ్రాసిన పూర్వరామాయణ కథాచంపువులును, యతిరాజు, శంకరాచార్యుడు, హరిహరనాథుడు, వేంకటాధ్వరి, గరళపురిశాస్త్రి మొదలగువారు రచించిన ఉత్తరరామాయణకథాసంబంధు లగు చంపూకృతులును ప్రసిద్ధములు. గద్యకావ్యములలో వాసుదేవుడు, దేవవిజయగణి, సార్వభౌము డను కవులు రచించిన రామకథాకృతులు ముఖ్యములు.

ఈ సంస్కృతకావ్యకర్తలవలెనే నాటకకర్తలు కొందఱు రామకథ నభినివేశముతో గ్రహించి తమకృతులయందు నిబంధించిరి. అట్టి వారిలో భాసుడు, దిఙ్నాగుడు, శక్తిభద్రుడు, యశోవర్మ, భవభూతి, మురారి, రాజశేఖరుడు, జయదేవుడు, భాస్కరుడు, రాజచూడామణి, మహాదేవుడు మొదలగువారు ప్రసిద్ధులు. వారిచే రచింపబడిన

మొత్తము పదునేను నాటకములు రామకథాత్మకములై రసికులహృదయముల నలరించుచున్నవి.

భాసునిరామాయణనాటకములలో ప్రతిమానాటకమున కత్యంత ప్రాశస్త్యము కలదు. తరువాత పేర్కొనదగినవి అభిషేకనాటకము, యజ్ఞఫలము. ప్రతిమానాటకమున రామాయణమునందలి అయోధ్యారణ్యపర్వములకథ యితివృత్తము. దానిని భాసుడు రూపకప్రక్రియ కనుగుణముగా మలచి రచించుటలో రమణీయము లగుకొన్నికల్పనలు గావించెను. ఈనాటకమున నేడంకములు గలవు. ప్రథమాంకమున సీత పట్టాభిషేకభంగవార్త వినకపూర్వమే అవదాతిక యను చెలికత్తె తెచ్చినవల్కలమును పరిహాసపూర్వకముగ ధరించినట్లును, శ్రీరాముడు పట్టభంగవార్త తెలిసిన తరువాత సీత యంతఃపురమునకు వచ్చి యవదాతిక తెచ్చిన క్రొత్తవల్కలమును ధరించుటయు, సీతాలక్ష్మణులను వెంట నిడుకొని శ్రీరాముడు తండ్రిని చూడకయే యతని యాజ్ఞను పాటించుటకొరకు వనమున కేగినట్లును కల్పింపబడినది. తృతీయాంకమున ప్రతిమాగృహకల్పన మీనాటకనామమునకు సార్థక్యమును కలిగించుచున్నది. దశరథునిమరణవార్త భరతునకు దెలుపుటలో భాసుడు భావించిన చక్కని సన్నివేశమే ప్రతిమాగృహ కల్పనము. మాతులగృహమునుండి వచ్చిన భరతుడును, దశరథ పత్నులును మృతచక్రవర్తులప్రతిమల కాలయమైన ఆప్రతిమాగృహమున దశరథప్రతిమను గాంచుట, తండ్రిమరణమునకును, రామవనవాసమునకును తనతల్లియే కారణ మని తెలిసిన భరతుడు కినిసి అచ్చటనుండియే శ్రీరామదర్శనార్థ మడవి కేగుట యిందలి వస్తువు. పంచమాంకమున శ్రాద్ధకల్పనమును, శ్రీరాముడు మాయామృగము వెంటనంటి వెడలినపుడు లక్ష్మణుడు కులపతుల నెవరినో యెదుర్కొనుట కేగి, ఆశ్రమమున లేకుండినట్లును భాసుడు కలించి కమనీయసన్నివేశమును పోషించెను. షష్ఠాంకమున సుమంతుడు శ్రీరామదర్శనార్థము జనస్థానమునకు వెడలివచ్చి భరతునకు సీతాపహరణాది వృత్తాంతముల నెఱింగించుట, భరతుడు శ్రీరామసహాయార్థము సేనల సమీకరింప ప్రయత్నించుట, కైకేయీసౌశీల్యప్రతిష్ఠాపనము జరుగుట

ష్ఠామెచే భరతునితో మాటలాడింపచేయుట అవాల్మీకములైన నూత్న కల్పనలు. సప్తమాంకమున శ్రీరాముడు సీతాలక్ష్మణులతో గూడి జనస్థానమున సేనలతో గూడి తనకై వచ్చుచున్న భరతుని గలయుట. వసిష్ఠవామదేవాదులు రాముని కచ్చటనే పట్టాభిషేకము చేయుట వర్ణింపబడినది. ఈకల్పనలమూలమున వాల్మీకిరామాయణకథయందలి కొన్ని దోషములు తొలగింపబడినవి. రాముని ధార్మికశీలము, కైకేయీసౌశీల్యము, భరతునిభ్రాతృభక్తి రసవంతముగా బోధింపబడినవి.

కిష్కింధాకాండమునుండి శ్రీరామపట్టాభిషేకమువఱకు గల రామకథ వస్తువుగా గల ఆఱంకముల నాటకము అభిషేకనాటకము. ఇందు భాసుడు చేసిన మార్పులను డా॥ జీరెడ్డి చెన్నారెడ్డిగారీవిధముగా గుదిగ్రుచ్చి చెప్పిరి.[1]

“1. వాల్మీకీయమున వాలిసుగ్రీవులయుద్ధము రెండుమార్లు ప్రసక్తము కాగా నిచ్చట యొకసారియే జరుగుట, 2. తార-వాలి సంభాషణముమూలమున వాలిశీలచిత్రణము వాల్మీకీయములోకంటె భిన్నముగ చేయబడుట, 3. వాలి-శ్రీరాముల సంభాషణము భిన్నముగా నుండుట, 4. వాలి మరణసమయమున తారను జూచి నిరాకరించుట, 5. హనుమంతుడు శ్రీరామముద్రిక లేకయే సీతాదర్శనము చేయుట, 6. రావణుడు విభీషణుని హనుమంతుడు లంకను వీడక పూర్వమే త్యజించుట, 7. విభీషణుడు సముద్రునిపై బాణము వైవ శ్రీరాముని ప్రోత్సహించుట, 8. సేతునిర్మాణావసరము లేకయే శ్రీరాముడు సముద్రతరణ మొనర్చుట, 9. శ్రీరామలక్ష్మణుల కృత్రిమశీర్షములను ఇంద్రజిద్వధానంతరము రావణుడు సీతకు జూపుట, 10. లక్ష్మణునిచే కాక శ్రీరామునిచేతనే మేఘనాధుడు చంపబడుట, 11. శ్రీరాముడు సీతాపరిగ్రహణార్థము తన్ను ప్రార్థించు విభీషణుని కఠినముగా మందలించుట, 12. రామాయణమున

1. భాసనాటకములు - పుట 250-251.

బ్రహ్మాదులు పలికినపలుకు లన్నియు నిచ్చట అగ్నిదేవునిచేతనే చెప్పించుట, 13. శ్రీరామపట్టాభిషేకము లంకయందే భరతాదులసన్నిధిని దశరథునిచే చేయించుట.

భాసుని యజ్ఞఫలనాటకమున రామాయణ బాలకాండమునందలి వస్తువు. ఏడంకములు గల ఈనాటకము భాసకృతము కాదనువాదమును కలదు. ఏమైనను ఈనాటకవస్తువునం దవాల్మీకము లైన కథాంశముల నేర్పరించుట ప్రస్తుతము. ఈనాటక ద్వితీయాంకమున దశరథుడు తన రాణులతో గలిసి గ్రీష్మోద్యానవనమున నున్నప్పుడు దాయభాగప్రసక్తి చెప్పించుట. కైక కిదివరకే వర మిచ్చియుండుట వలన నామెయే రామునికి రాజ్య మిచ్చుట న్యాయ మని రాజు యోచించుట యనునది చిత్రమైన కథాకల్పనము. తృతీయాంకమున రావణుడు రాముని పరాక్రమ విశేషము పరీక్షించుటకు నయోధ్యయందు రాజప్రాసాదసమీపమున తిరుగాడుచుండుట. రామాదులు అస్త్రాభ్యాసము చేయునెడ రామబాణమునకు విఘ్న మాపాదించుటకుకైన రావణుడు యత్నించుట. చివరకు విఫలుడై రామబాణ ప్రభావాభిభూతుడై లంక కేగుట యను కల్పనము విశేషమైనది. పంచమాంకమున జనకయజ్ఞకల్పనము, షష్ఠాంకమున సీతారాములు మిథిలానగరోద్యానమున పరస్పరవీక్షణమున విరహతప్తు లగుట. జనకుడు ప్రవేశించి సీతను శ్రీరాముని కిచ్చుటకు నిశ్చయించుట నూతన కల్పనలు. సప్తమాంకమున సీతాకల్యాణము, పరశురామ గర్వభంగములు కలవు,

దిఙ్నాగుడు ఉత్తరరామాయణకథను "కుందమాల" యను నాఱంకములనాటకముగా రచించెను. భాసుడు ప్రతిమాగృహమువలె దిఙ్నాగుడు కుందమాలను గల్పించి నాటకేతివృత్తమును రమణీయకల్పనామహనీయముగా దీర్చిదిద్దెను. అందలి అవాల్మీకములైన కల్పనలు స్థూలముగా నివి: ప్రథమాంకమున రామాజ్ఞను బాటించి లక్ష్మణుడు సీతాదేవిని గంగానదీతీరమున నడవులలో దింపివచ్చుట; వాల్మీకి ఆమె కాశ్రయ మిచ్చుట యను కథార్థములు కలవు. సీత

వాల్మీకివెంట నేగుచు భాగీరథికి మ్రొక్కి "తల్లీ! నేను సుఖప్రసవ నగు దునేని ఇపుడు నీకు ప్రతిదినము అందముగా కట్టినకుందమాలను సమ ర్పించుచుండెదను"–అని మ్రొక్కెను. నాటకనామసార్థక్యము కల్పించు నాజైమైన కల్పన యిది. ద్వితీయాంకమున రాముడు నైమిశమున యజ్ఞముచేయ నలకట్టి సంభారములు సిద్ధము చేసి వాల్మీకిని శిష్య సమేతముగ రమ్మని ఆహ్వానించుట– సీత లవకుశులతో సహా వాల్మీకి గోమతీనదీతీరమున నాతని కేర్పఱచిన యాశ్రమమున విడిదిసేయుట– సీత భాగీరథికి దూరమగుటచే గోమతినే గంగగా భావించి తనవ్రత మును విడక కుందమాలను గట్టి యానదీమతల్లికి సమర్పించుచుం డుట–అనునవి నూత్నకల్పనలు. తృతీయాంకమున శ్రీరాముడు గోమతీ తీరమున సీతయడుగుజాడలను గుర్తించి నది యొద్ద కేగి వానిపై దేలు చున్న కుందమాలను చూచి సీత నేర్పును గుర్తుకు తెచ్చుకొనుట– అ దండ తేలియాడుచు వచ్చినదిక్కునకు వెడలి– వాల్మీకి విడిదిసమీప మున కేగి– సీతయడుగుజాడలనుబట్టి పోయి– ఒక లతామండపమున విశ్రమించుట– ఆవనదృశ్యములను గాంచి పూర్వము తాను సీతతో కలసి దండకారణ్యభూములలో నుండిన స్మృతులు కలుగగా రాముడు పరితపించుట– అనునవి కరుణార్ద్రకల్పనలు. చతుర్థాంకమున వాల్మీకి ఆశ్రమస్త్రీలకు తిరస్కరణి ననుగ్రహించుట– తిలోత్తమ– మాయాసీతవేషమున రాముని సతీరక్తిని బరీక్షింపనెంచుట– ఆనంద రామాయణమున పార్వతీదేవి మాయాసీతగా రాముని పరీక్షించుట ఇచట స్మరణీయము. రామమిత్రుడు కౌశికు డాసంగతి తెలిసికొనుట– వాల్మీకి తన శిష్యుడగు కణ్వుని శ్రీరామునకు నైమిశారణ్యరామణీయ కత్వమును చూప పంపుట– తిరస్కరణిమహిమతో నున్న సీతయొక్క ఛాయను రాము డొకదిగుడుబావిలోచూచి, పలవించి మూర్ఛపోవుట– సీత ఆతని చేర్చుటకు గౌగిలించుట–అతడుమేల్కాంచునంతలో నామె దూరమగుట– మఱల రాముడు మూర్ఛాగతు డగుట– సీత కొంగుతో రామునకు చల్లగాలి వీచుట– రాముడు కన్నులు మూసికొనియే సీత కొంగును పట్టుకొని కన్నులు తుడుచుకొనుట– సీత పైటను విడిపించు కొనుట– రాముడు తనయుత్తరీయమును త్యజింప సీత దానిని గొని,

సుగంధవిరహితమైన దానివలన రాముడు విరహమును గ్రహించి ఊరడిల్లుట- సూర్యాస్తమయ మగుట- కౌశికుడు వచ్చి తిలోత్తమ సంగతి చెప్పుట- రాముడు తాను పొందినది మాయాసీతస్పర్శ యని తలం చుట- మొదలగు రమణీయ కల్పనలు కలవు. పంచమాంకమున రాముడు సీతాస్మృతులతో వేదనపడుట- లవకుశసమాగమము కలిగి నను తనపుత్రులను విషయము స్పష్టము కాకపోవుట- అనునవి పేర్కొనదగినవి. షష్ఠాంకమున లవకుశులు రామకథ నాలపించుట- వారు రామపుత్రు లనియు, రాముడు వారితండ్రి యనియు కణ్వుని వలన నెఱింగి వారందరు మూర్ఛాగతు లగుట- వాల్మీకి యనుమతిని సీత వారినిం దేర్చుట- వాల్మీకి సీతాలవకుశులను రామున కర్పించుట- భూదేవి సీతాపాతివ్రత్యమునకు సాక్ష్యము చెప్పుట- కుశుని కభిషే కము జరుగుట- అను కథార్థములు కలవు.

క్రీ. శ. 8 వ శతాబ్దియారంభమున నున్న శక్తిభద్రుడు జైన రామాయణ మాధారముగా నద్భుతరసప్రధాన మగు ఆశ్చర్యచూడా మణి యను నేడంకములనాటకము రచించెను. ప్రథమాంకమున శూర్ప ణఖను గాంచి లక్ష్మణుడు ముహూర్తమాత్రము మనసు చలింపగా, రఘువంశీయుల కిది తగ దని వితర్కించుకొనును. రామానుమతిని పొందిన దని విని, ఆమెను తదుపరి కలుసుకొందు ననును. ద్వితీ యాంకమున రామలక్ష్మణులచే తిరస్కరింపబడిన శూర్పణఖ నిజ రూపమున అరుదెంచి, లక్ష్మణుని బంధించి మింటి కెగయగా, స్త్రీ హత్యకు వెనుకాడిన లక్ష్మణు డామెముక్కుచెవులు ఖండించెను. సీతా పహరణము జరుపగల నని బెదరించి ఆమె చనెను. తృతీయాంక మున ఖరదూషణాదులవధకు సంతసించిన మహర్షులు రాక్షసమాయ తెల్పు చూడామణి అంగుళీయకము, శరములనుండి మర్మస్థానముల కాపాడు కవచము రామునకు లక్ష్మణునిచే పంపిరి. రాముడు చూడా మణిని సీత కబరియం దిడి అంగుళీయకమును తాను ధరించెను. శూర్పణఖాద్వితీయుడై రావణుడు రథమున సీతాపహరణమునకై వచ్చెను. మారీచుని సంహరించి వచ్చురామునికడకు మాయాసీతగా

శూర్పణఖయు, రామునిగ రావణుడు సీతకడకు చనిరి. సూతుడు మాయాలక్ష్మణుడై రథమును గైకొని మాయరామ,సీతలకడ కరుదెంచి, భరతునకాపద సంభవించుటచే మహర్షు లందరు భరతరక్షణార్థ మరుగుచు రామునికొరకు రథమును సృష్టించి పంపిరనియు పలుకగా సీత విశ్వసించి రథ మధిరోహించెను. మారీచుడు మాయారాముడై లక్ష్మణుని కికురింప బోవగా రాముడు మాయాసీతతో చనుదెంచి మారీచుని గురుతించి సంహరించెను. లక్ష్మణుడు శూర్పణఖను గుర్తించి వధింపబోగా, శరణు వేడిన దానవిని రాముడు కాపాడి సీతాపహరణవృత్తాంతము విని శూర్పణఖచేతనే రావణునకు సందేశము పంపెను. చతుర్థాంకమున సీతాకేశపాశమును స్పృశింపబోయి రావణుడు నిజరూపమును పొందెను. పంచమాంకమున దుస్స్వప్నము గాంచిన మండోదరి రావణుడు అశోకవని కరిగె నని తెలిసి, చేటితో అచటికి వెడలినది. రావణుడు సీతను ప్రార్థించి చివరకు పాదములపై వ్రాలెను. తిరస్కరించిన సీతను రావణుడు వధింపబోగా మండోదరి వలదని ప్రార్థించెను. షష్ఠాంకమున సంపాతిసూచనమేరకు అశోకవనికరుదెంచిన హనుమంతుడు సీతను దర్శించి, రామునికడ కరిగెను. సప్తమాంకమున రావణసంహారముగురించి విద్యాధరదంపతులు పేర్కొందురు. లక్ష్మణుడు సీతభావశుద్ధిని పరీక్షింపవలయు ననెను. సుగ్రీవుడు తోడ్కొనివచ్చిన సీత "ఎల్లవేళల పతికి సుందరముగ కన్పింతు" వను అనసూయవరముచే అందముగ కానుపింప ఆ వరము తెలియని రాము డామెను తూలనాడెను. విషయము గ్రహించిన జానకి నవ్వె భర్త పరుషముగా మాటలాడుచున్నా డన లక్ష్మణసుగ్రీవహనుమంతు లామెను దండనార్హురా లనిరి. సీత అగ్నిప్రవేశము కావించెను. నారదు డరుదెంచి సీతారాములను లక్ష్మీనారాయణులుగ స్తుతించి అనసూయావరమును తెలిపెను. సీత పతివ్రత యను జనవాదమును విభీషణు డెరింగించెను. ఈనాటకమందలి మరియొకవిశేషము విభీషణుడు సీత లంకనుండి వచ్చువరకు తాను లంకాప్రవేశ మొనర్ప నని పలుకుట. యుద్ధమును విద్యాధరమిథున మవలోకించుట భాసభవభూతులనాటకములందు కలదు.

ఈ శతాబ్దిలోనే కనోజిపాలకు డగు యశోవర్మ రామాభ్యుదయ మను నాటకము రచించెనని తెలియుచున్నది. కాని అది నేడలభ్యము.

"ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అని కీర్తిగాంచిన భవభూతి, పూర్వరామాయణమును మహావీరచరిత మనియు, ఉత్తర రామాయణమును ఉత్తరరామచరిత మనియు పేర్లతో నాటకములుగా తీర్చిదిద్దెను. భవభూతికావ్యములు అపూర్వకల్పనలకు ప్రసిద్ధ ములు. మహావీరచరితమున ధర్మవీరమును, ఉత్తరరామచరితమున కరుణరసమును అత డొప్పించిన విధ మనన్యసామాన్యము. భవ భూతి నాటకములలోని కల్పనలు సంగ్రహముగా నివి :

**మహావీర చరితము :-** ప్రథమాంకమున రామలక్ష్మణులతో సిద్ధా శ్రమమునకు విశ్వామిత్రుడు చనుదెంచినసమయముననే జనకుని ప్రోద్బలమున సీతోర్మిళలతో కుశధ్వజుడును అచటి కరుదెంచి, రామ తేజస్స్పర్శ రాతిని నాతిం జేయుట గాంచి, సీతను రామున కొసగ వలయు నని భావించెను. రావణప్రేరితుడై సీతనిమిత్త మట కరు దెంచిన సర్వమాయు డనురక్కసుడు రామకృతతాటకాపరాభవము, శివధనుర్భంగములతోపాటు మారీచసుబాహుల ఘోరపరాజయము తిలకించి, విశేషములను రావణున కెరిగించుట కరిగెను. ద్వితీ యాంకమున, మహేంద్రగిరిపై నున్న పరశురాముడు శూర్పణఖ, మాల్యవంతుల ప్రేరణమున రామునితో రణ మొనర్ప మిథిల కరుదెం చెను. అంతఃపురమున నున్న రాముడు పరశురాముని ఆర్భాటము నకు భీతి నొందిన సీత నూరడించి, భార్గవునికడ కేగెను. జనకశతా నందులు పరశురాముని శాంతింప వేడిరి. కంకణవిసర్జనమునకై రాము డంతఃపురమున కరిగెను. తృతీయాంకమున పరశురామపరా భవము వర్ణిత మయ్యెను. చతుర్థాంకమున మాల్యవంతుని హెచ్చరి కపై శూర్పణఖ మంథర నావేశింప వెడలెను. పిమ్మట మంథరా వేషధారిణియై శూర్పణఖ శ్రీరామునికడకు జని కైకసందేశము గల లేఖ నొకదానిని ఒసగెను. దశరథుడు పట్టాభిషేకసన్నాహమున నుండ రాముడు సీతాలక్ష్మణులతో తండ్రి నోదార్చి, జాప్యము తగ

దని పలికి కానల కేగెను. భరతునికి పాదుకల నొసగిన తరువాత, గుహునివలన విరాధునిగూర్చి విని, వాని వధింప రామాదులు చిత్రకూటమున కరిగిరి. పంచమాంకము విష్కంభమున సంపాతి జటాయువులు సంభాషణమువలన విరాధవధ, శూర్పణఖ నాసాచ్ఛేదము, ఖరదూషణాదుల సంహారము, సీతాపహరణము– మున్నగు అంశములు తెలియును. రావణపరిత్యక్తుఁడైన విభీషణుడు సుగ్రీవుని చేరి, రామశరణము కోరుచు శ్రమణ యను తాపసిని రామాన్వేషణార్థము పంపగా, ఆమె కబంధునిచే బంధింపబడెను. అప్పటికి జనస్థానమున నున్న లక్ష్మణుడు కబంధుని వధించెను. ఆమె విభీషణ శరణాగతి, సీతాపహరణము, ఋష్యమూకమున హనుమదాదులు జానకిఉత్తరీయమును భద్రపరచుట తెలిపెను. శాపవిముక్తుఁడై దివ్యపురుషునిగా స్వరూపమును పొందిన కబంధుడు మాల్యవత్ప్రయుక్తుఁడై వాలి రామలక్ష్మణుల వధింపకోరుచున్నాఁడని ఎరింగించెను. శ్రమణ చూపిన దుందుభికాయమును రాముడు పాదాంగుష్ఠమున తొలగద్రోసెను. వాలి వచ్చి స్వయముగ నిష్టము లేకున్నను మాల్యవంతుని ప్రోద్బలమున రాముని వధింపగోరి, కూలి రామహస్తమున మరణించుట కూరడిల్లెను. అప్పుడే సుగ్రీవవిభీషణు లచ్చటికి వచ్చిరి. వాలిప్రేరణమున రామసుగ్రీవులు అగ్నిసాక్ష్యముగ మిత్రులైరి. విభీషణుని కూడ వాలియే రామునికి మిత్రుని గావించెను. వానరులనందరిని యుద్ధమున రామునికి తోడ్పడు మని చెప్పి వాలి మరణించెను. షష్ఠాంకమున సీతాన్వేషణార్థము వానరులు బయలుదేరుట, హనుమంతుడు సీతాశిరోరత్నమును గ్రహించి, లంకను దహింపగా మండోదరి రావణునికి హితము గరుప ప్రయత్నించి విఫలయగుట మాల్యవంతత్రిజటాసంభాషణమువలన తెలియును. అశోకవనమున సీతను జూచుచున్న రావణునికడకు మొదట మండోదరి, తరువాత ప్రహస్తుడు అరుదెంచి లంకాముట్టడిగురించి చెప్పిరి. అంగదునిరాయబారము విఫల మయ్యెను. రావణుడు సపరివారముగ రణరంగమున కరిగెను. దేవేంద్రచిత్రరథు లాకాశమున నిలిచి రావణమేఘనాథకుంభకర్ణులు రామలక్ష్మణసుగ్రీవులతో పోరాడుట తిలకిం

చిరి. మూర్ఛిల్లినరామలక్ష్మణులను హనుమంతుడు సంజీవనిచే తెర్చెను. రామలక్ష్మణులు బ్రహ్మాస్త్రప్రయోగమున, రావణమేఘనాదుల వధించిరి. సప్తమాంకమున రాక్షసనిర్మూలనము, సీతాగ్నిప్రవేశము, విభీషణపట్టాభిషేకము జరిగె నని తెలియును. పుష్పకమున అయోధ్యకు బయలుదేరిన సీతారాములు హనుమంతునితో కలిసి సైన్య సమేతుడై వచ్చిన భరతుని గాంచిరి. విశ్వామిత్రుడే వచ్చి రామాభిషేకమునకు సన్నాహము లొనర్చెను. అభిషిక్తుడైనరాము డందరికీ నమస్కరించెను. సుగ్రీవాదులు స్వస్థలముల కరుగగా పుష్పకము కుబేరునికడ కరిగెను.

**ఉత్తర రామచరితము** - "(రామాయణ) ఉత్తరకాండకథ యెఱింగిన వారికి భవభూతి ఇందు కావించిన మార్పులు చెప్పకయె తెలియగలవు. అందు జననిందవలన సీతానివాసమునకు అనంతరము శత్రుఘ్నుడు లవణుని మీఁదికి పోవును. దారిలో వాల్మీకి యాశ్రమమున మజిలీ చేసిన దినమున అట సీతకాన్పు ఐనది. తరువాత పండ్రెండేండ్లకు అతడు మధురలో రాజుగా నుండి అంతట రాముం జూడవచ్చును. తరువాత కొన్నినెలలకు మరణించినబ్రాహ్మణబాలుని బ్రతికింప రాముడు శంబూకుని చంపుట, తరువాత అగస్త్యులవారిని దర్శించి నగరమునకు మరలి అశ్వమేధమున కుపక్రమించుట, గుఱ్ఱముతో లక్ష్మణుడు పోయి ఎల్లరవలన కప్పములు గొనివచ్చుట— యజ్ఞము, అపుడు కుశలవులు వచ్చి యజ్ఞవాటమున రామాయణముం బాడుదురు. వారు తనకొడుకు లని రాముడు శంకించును. వాల్మీకి వచ్చి అవు నని చెప్పి, సీతను పతివ్రతను అంగీకరింప మనును. ఆమె లోకమునకు తనశుద్ధిని రుజువుచే తెలిపిన అట్లే అంగీకరింతు నను. సీత పరమతపస్విని ఒట్టులు పెట్టి అట్లు రుజువు చూపి తాను మఱి రాముం గూడక భూమిలో అడంగిపోవును.

1. భాగీరథీతీరవనభూముల చూడగోరిన కోరిక తీర్చునెపమునపే రెంటను అడికకైన నివాసము, ఐనను సీతకు ఆకోరిక కలుగుటకు భవభూతి చిత్రదర్శనమును అతిమనోహరముగా కూర్చినాడు. శుభసంయో

గాంతముగా ముగింప నెంచిన తననాటకాన అందు ప్రస్తావనవశమున వచ్చిన జృంభకదానమును భాగీరథీప్రార్థనయు తరువాత కుమారుల ప్రత్యభిజ్ఞానమునకును దిక్కులేని సీత యవేక్షణమునకును ఉపయోగించినాడు. మఱియు చిత్రదర్శనమున పూర్వవియోగప్రతిమలఁ జూచి ఆస్మరణమున చిత్తమున ఇరువురును వియోగదుఃఖదూనతను దుర్నిమిత్తముం బోలె అనుభవించుటం జెప్పినాడు.

2. భవభూతి నాటకమున ముఖ్యమైనమార్పు సీతాపునఃసంయోగము. కవి దానికి తగినట్లు కథను మార్చి పండ్రెండేండ్లకు తర్వాత ఒక్కదినముననే బ్రాహ్మణబాలమృతిని శంబూకవధను అగస్త్యదర్శనమును రాముని పంచవటిమజిలీని అందు "అహో సంవిధానమ్" అను తాను అబ్బురపడిన ఆతమసాసీతావాసంతీరాముల కరుణోత్తర సమాగమమును ప్రాంతక్రొత్తల మేలుకలయికగా పెనచి యల్లినాడు. వాల్మీకాశ్రమమున ఆసమయముననే అవసిష్ఠారుంధతి కౌసల్యా జనకుల సమాగమమును వారి యేడ్పులును ఆశలును భవభూతి యద్భుతనవీనసృష్టియే. యజ్ఞాశ్వము, బాలురపోరు, ఆదారిలోనే రాముడు ఆదినమే కొమాళ్ళం గలిసికొని వారిని ఆనవాలు పట్టబోయి పట్టజాలక తికమకపడుట, వాల్మీకియాట, జనులు సీతశుద్ధిని మహిమను ప్రత్యక్షముగా చూచి తృప్తిపడుట కుశలవులతోడి సీత పెద్దలయెదుట మరల రాముంగూడుట".[1] ఈ కల్పనలచే ఉత్తరరామచరిత భవభూతి కథా నిర్మాణ యశఃపతాకమై పరిఢవిల్లినది.

"బాలవాల్మీకిబిరుదాంచితుడైన మురారి క్రీ. శ. 8 వ శతాబ్దిలో అనర్ఘరాఘవ మను నేడంకములనాటకము రచించెను. మహావీరచరితము నీతడు కొంత యనుసరించినను మొత్తమునకు పూర్వరామాయణకథయే యిందలి యితివృత్తము. ప్రథమాంకమున రామలక్ష్మణులను దశరథుడు కౌశికునితో బంపుట చెప్పబడినది. ద్వితీయాంకమున తాటకసంహారము, మిథిలాప్రయాణము, శివధనుర్భంగము, రావణుడు రాముని పరాక్రమమున కసూయపడుట, సీతారామాదుల వివాహములు గలవు. తృతీయాంకమున రావణప్రేరితయై శూర్పణఖ

1. ఉత్తరరామచరితము - శ్రీ నేలటూరు రామదాసయ్యంగారు పు. 37-38.

మంథరాకృతి దాల్చి కైకను ప్రోత్సహించి సీతారాముల నడవుల కంపునట్లు చేసి, ఆపైన వారిరువురను వేరుచేయుటకు ప్రయత్నింపవచ్చునని యోచించి శూర్పణఖను పంపుటయు, పరశురామగర్వభంగము, పట్టభంగము మొ॥ అంశములు గలవు. రామవనవాసావసరమున అయోధ్యలో దశరథజనకులు కలరనియు, మూర్ఛిల్లినతండ్రిని జనకునిచేతిలో పెట్టి రాము డడవుల కేగె ననియు నిందు కల్పింపబడినది. పంచమాంకములో జటాయువు రావణమారీచులవృత్తాంతము జాంబవంతున కెఱిగించుట, సీతాపహరణము చేసి లంక కేగుచున్న రావణునితో జటాయువు పోరుట, రామలక్ష్మణులు సీతాన్వేషణపరులై పోవుచు కబంధునిచేతిలో చిక్కినగుహుని రక్షించుట, దుందుభికారణముగా వాలి రామునితో తలపడుట, వాలిసంహారము, సుగ్రీవపట్టాభిషేకము- వర్ణితములు. షష్ఠాంకమున రామరావణయుద్ధము, సప్తమాంకమున రాము డయోధ్య చేరుట కలవు. ఇట్లు కల్పింపబడిన నూత్నకల్పనలలో శూర్పణఖ రావణప్రేరితయై మంథరాకృతి దాల్చి కైకను పురికొల్పుట, కబంధునిబారినుండి గుహుని రక్షించుట యనునవి మకుటాయమానములు.

క్రీ. శ. 900 ప్రాంతమున రాజశేఖరు డనుకవి బాలరామాయణ మను పది యంకముల మహానాటకము రచించెను. 741 శ్లోకములతో నిండారియున్న ఈనాటకమున రాజశేఖరుడు రావణునిసీతావ్యామోహమున కధికప్రాధాన్య మొసగెను. ప్రథమాంకమున రావణుడు శివధనుర్భంగమునకై సీతాస్వయంవరమున కేతెంచి, తత్ప్రయత్నమున విఫలుడై, సీతను చేపట్టినవీరునిపై ప్రతీకారము తీర్చుకొనుటకు ప్రతిజ్ఞచేసి నిష్క్రమించును. ద్వితీయాంకమున నతడు పరశురామునిసహాయము నర్థించి, భంగపడి, యుద్ధము చేయబోయి మిత్రులచే నివారింపబడును. తృతీయాంకమున రావణునిమనోవ్యథ నుపశమింప చేయుటకొఱకు అతనిముందు సీతాకల్యాణరూపకము ప్రదర్శింపబడును. కాని ఆరూపకప్రదర్శన మాతని మనోవ్యథ నధికము

చేసి విఫలమగును. చతుర్థాంకమున రామపరశురాముల ద్వంద్వ యుద్ధము, పంచమాంకమున రావణమనోవ్యథ శాంతించుటకు సీతాది రూపములు గల బొమ్మలాట ప్రదర్శింపబడును. రావణుడు విరహార్తుడై వనమునందలి ప్రకృతివస్తువులను గాంచి సీతావిరహము ననుభవించును. రామునివలన పరాభవింపబడిన శూర్పణఖ దుఃఖ మాతని యందు పౌరుషము నుద్దీపింపజేయును. షష్ఠాంకమున దశరథమరణ వృత్తాంతము కలదు. సప్తమాంకమున సేతుబంధనవృత్తాంతమును, మాల్యవంతుడు మాయాసీతశిరస్సును ప్రదర్శించుటయు కలవు. అష్టమాంకమున కుంభకర్ణమేఘనాధాదులవధ, రావణప్రథమపరాజయము వర్ణితము. నవమాంకమున రామరావణయుద్ధము నింద్రుడు వర్ణించి చెప్పుట కలదు. దశమాంకమున రామాదులు పుష్పకారూఢులై అయోధ్య కేగుట వర్ణింపబడినది. ప్రతినాయకునిచుట్టును కథ నల్లి నాయకధీరోదాత్తస్వభావమును వ్యంజింపజేసిన మహత్తరనాటక మీ బాలరామాయణము.

రాజశేఖరునికి సమకాలికుడగు మాయురాజు ఉదాత్తరాఘవ మను నాటకమును రచించెను.

మహానాటకము అనునామాంతరముగల హనుమన్నాటక మొకటి పదునొకండవశతాబ్దమున వెలసియున్నది. దీనికర్త హనుమంతు డనుప్రసిద్ధి కలదు. కవినామ మెఱుకపడుట లేదు. ఇందు ప్రథమాంకమున సీతావివాహవృత్తాంతము, ద్వితీయాంకమున సీతారాముల యనురాగము, తృతీయాంకమున మాయాహరిణవృత్తాంతము వఱకుగల రామకథయు, చతుర్థాంకమున సీతాపహరణానంతరము రాము డాశ్రమమున కేతెంచి అన్వేషించుటయు, పంచమాంకమున రాముడు హనుమంతుని సీతాన్వేషణార్థము పంపుటయు, షష్ఠాంకమున పావని సీతను గాంచి, ఆమె నూరడించి తిరిగివచ్చుటయు, సప్తమాంకమున వానరసేన వారధి దాటుటయు, అష్టమాంకమున నంగదరాయబారమును, నవమదశాంకములలో రామరావణయుద్ధము, రాము డయోధ్య

చేరుటయు వర్ణితములై యున్నవి. హనుమన్నాటకములు రెండు కల వని విమర్శకులు భావించుచున్నారు.

జయదేవుడు ప్రసన్నరాఘవ మను నేడంకములనాటకమును రచించెను. ఇతడు గీతగోవిందకర్తకంటె భిన్నుడు. ఇతనికాలము క్రీ. శ. 1088-1172 ప్రాంతము. ఇతనికి పక్షధరమిశ్రు డనియు, పీయూషవర్షు డనియు బిరుదములు కలవు. ప్రసన్నరాఘవనాటక ప్రథమాంకమున రావణబాణాసురులమధ్య పోరు జరిగి బాణాసురునిచే రావణుడు పరిభవింపబడుట వర్ణింపబడినది. ద్వితీయాంకమున సీతా రాము లుద్యానవనమున రాగహృదయులైన దృశ్యము రమణీయముగా కల్పింపబడినది. తృతీయాంకమున కౌశికప్రేరితుడై రాముడు శివ ధనుర్భంగము చేయుట, పరశురాము డావార్త కుగ్రుడై రామునకు సందేశ మంపుటయు, సీతారామకల్యాణమును వర్ణితములు. చతుర్థాంక మున జనకాదులు వేడుకొనుచున్నను పరశురాముడు స్వయముగా రామునితో యుద్ధమునకు తలపడుట, మొదట సంకోచించినను చివ రకు రాముడు భార్గవునితో పోరి విజేతయై పరశురామునిపాదము లంటి క్షమాభిక్షవేడుట యను చిత్రమైన కల్పనము కలదు. పంచ మాంకము నదీమతల్లులు సాకారులై రంగమున ప్రవేశించి తమ సంభాషణార్థములచే సూచింపజేసిన సూచ్యకథాంగములతో శోభిల్లు చున్నది. యమునానది సుగ్రీవుడు వాలివలన బొందిన బాధాతిశయ మును, సరయూనది రామవనవాసగమనము మొదలుకొని మాయా హరిణవృత్తాంతము వఱకును చెప్పును. నదులన్నియు సాగరుని సమీపించును. గోదావరి సాగరునితో సీతాపహరణము, జటాయు మరణము, ఋష్యమూకపై సీతాభరణవిసర్జనము మొదలగునంశము లను, తుంగభద్ర వాలివధయు, రామసుగ్రీవపవనాత్మజులమైత్రియు చెప్పును. ఇంతలో నొకమహాకారము సముద్రముపైగా నెగిరిపోవును. అది హిమాలయమా వింధ్యమా యని భ్రమించుచు సాగరుడు నదు లతో గలసి నిష్క్రమించును. షష్ఠాంకమున రాముడు సీతావియోగ దుఃఖమున నామెనుగూర్చి చెట్టుగుట్టల నడుగుచు విలపించుచుండును. విద్యాధరదంపతు లాతనికి తమ దివ్యశక్తితో లంకలోని సంగతులను

కన్నులకు కట్టునట్లు చూపించెదరు. అందు సీత కనిపించును. రావణు డామెను తనను స్వీకరింప బ్రతిమిలాడి, భంగపడి, లాభములేక చివర కామెను సంహరింప నొరలోనుండి ఖడ్గము తీయును. కత్తికి బదు లాతనిచేతిని- సముద్రము దాటి లంకకు వచ్చిన హనుమంతుని చేతిలో మరణించిన రావణునికుమారుడు అక్షయునితల వచ్చును. విరక్తి చెందిన సీత అగ్నిప్రవేశము చేయబోగా ఆ అగ్ని మణిరూపముగా మారిపోవును. పావని సీత నూరడించి రామవృత్తాంతము నెఱిగించును. సప్తమాంకమున రాముని దండయాత్రవ్యూహమును, సేతునిర్మాణమును చిత్రించి మాల్యవంతు డంపిన యొకపటమును ప్రహస్తుడు రావణునకు జూపును. రావణు డది చిత్రకారుని రమణీయ కల్పన మని భావించి, దాని నవజ్ఞ చేయును. మండోదరి ప్రవేశించి యామెకు అశుభశకునములవలన గలిగిన భీతిని రావణునితో వ్యక్తము చేయును. చివరకు రావణుడు లంక రామునిచే ముట్టడింపబడిన దని గమనించి కుంభకర్ణమేఘనాదాదులను యుద్ధమునకు పంపును. వారు రణనిహతు లయ్యెదరు. రావణుడే యుద్ధమునకు తలపడును. అతని మరణమును విద్యాధరులిద్దరు వర్ణించెదరు. అంకాంతమున సీతారామలక్ష్మణవిభీషణాదులు ప్రవేశించి సూర్యాస్తమయ చంద్రోదయవర్ణనములను చేసి పుష్పకము నధిరోహించెదరు. ఇట్లు రమణీయకల్పనాఘటితమై ప్రసన్నరాఘవము ప్రశస్తిగాంచి యున్నది.

దశరూపక కారుడు చలితరామనాటకము నొకదానిని పేర్కొనెను గాని, అది లభించుటలేదు.

వాల్మీకికోకిల తొలిసారి రామకథ నాలపించిన కలస్వనమును విని శతాబ్దాలతరబడి కవికంఠము లాకూతనే నూతనరాగవిన్యాసములలో మేళవించి ముగ్ధమోహనముగా కూయుచునే ఉన్నవి. గీర్వాణభారతిలో ఆ రామకథాలహరీవిన్యాసభంగిమలు పురాణేతిహాసకావ్యరూపకప్రక్రియలయందు ప్రసరించినవిధము నీయధ్యాయమున రేఖామాత్రముగా దర్శించుట యైనది.

తెలుగులో రామకథ ప్రస్తుతాంశము. తెలుగుసాహిత్యము ప్రారంభమగునాటికే గీర్వాణసాహిత్యము పండబారినది. దాని భాండారము తెలుగుపలుకులకు వారసత్వమైనది. వాల్మీకిరామకథ సంస్కృతముననే విశ్వరూపము తాల్చినది. అనంతకోటి నూతన కల్పన లందులో నందగించుకొనినవి. తెలుగుకవి కలము పట్టు నాటికి అవిశ్వరూపసాక్షాత్కారము నాకళించుకొనక తప్పనిసరియైనది. వాల్మీకిరామాయణము ననువదింపబూనిన కవికి అవాల్మీకములై అనంతరగీర్వాణకవికల్పితము లైన కథాఘట్టములు కన్నులకు గట్టకుండ నుండజాలవు. అందువలన తెలుగులోని రామకథ అచ్చమైన వాల్మీకమే కాదు. సంస్కృతరామకథా సాహిత్యసారభూతముగా సాక్షాత్కరించిన సారకథ. తెలుగుకవులు నిర్మించినరామకథను నిగ్గు తేల్చుటకు పూర్వము సంస్కృతసాహిత్యమునందలి రామకథను తత్కల్పనాప్రపంచమును దర్శింపకతప్పదు. తత్ప్రయత్నమే ఈ చిన్ని అధ్యాయము.

---

# భారతీయ భాషలలో రామకథ

తెలుగులో రామకథను పరిశీలించుటకు మున్ను ముఖ్యము లగు భారతీయ భాషలందు రామకథాస్థానమును గ్రహించుట ఎంతేని అవశ్యకమై యున్నది. అట్టి రామాయణములను ఈ ప్రకరణమున సంగ్రహముగ చెప్పుటకు ప్రయత్నము జరిగినది. *

## వంగ సాహిత్యము:—

వంగ సాహిత్యమున ప్రప్రథమమున పేర్కొన వలసినది కృత్తివాస ఓఝూ విరచిత రామాయణము- (క్రీ.శ. 1420 ప్రాంతము). కృత్తివాసఓఝూరామాయణము వాల్మీకిరామాయణమును మూలముగా గొనినను స్వతంత్ర రీతిని సాగెను. కొన్నిఘట్టములు అమూలకములు. ఇతర పురాణములు, మహానాటకము, భట్టి కావ్యము మున్నగు వాని ప్రభావము కూడ ఈ రామాయణముపై కలదు. కృత్తివాస కవి కృతములుగ "సీతార బారమాస్య", "లక్ష్మణేర్ శక్తి శేల", "రామరాస, "అద్భుత రామాయణ" మున్నగు గ్రంథములు ప్రచారమున కలవు.

**అద్భుత రామాయణము !** కృత్తివాస ఓఝూ అనంతరము వెలువడిన రామాయణములలో వాల్మీకి రామాయణముకంటె అద్భుత' అధ్యాత్మ, రామాయణములకు అనువాదములు అధికముగా కలవు. మహాభారతమునందలి రామాయణమును అనుసరించి "భారత రామాయణము" లేదా "సంక్షిప్త రామాయణము"గా పెక్కు రామాయణములు వెలువడెను. అద్భుతాచార్య (నిత్యానంద) అను నాతడు వ్రాసిన రామాయణమే అద్భుత రామాయణము. ఇందు అద్భుత విషయములు పెక్కు కలవు. సీతాదేవి కాళీమాత అవతారముగా ఇందు పేర్కొనబడెను. ఈ కవి శతకంఠరామాయణమును కూడ రచించెను.

---

* ఈ ప్రకరణమందలి అంశములు సాహిత్య ఎకాడమీ ప్రచురించిన భాషా సాహిత్య గ్రంథముల నాధారముగా పేర్కొనినవి.

చంద్రావతి : (క్రీ.శ. 1550) సుమారు క్రీ.శ. 16 వ శతాబ్దాం తమున ఈమె "రామాయణ గీత" అను రామాయణము రచించినట్లు ప్రతీతి. "దస్యుకెనా రాము" గ్రంథము కూడ ఈమె రచించెను.

రామశంకరదత్తు : (క్రీ. శ. 1770) "వాల్మీకి, వశిష్ఠ ఆర్ అద్భుత గ్రంథకార, మహాభారత ఆదిపురాణ ప్రచార, ఏసబి గ్రంథి శుని శ్లోక అనుసారె, పదవందకరిక హెభిషక శంకరె"- అని యితర రామాయణములను అనుసరించినట్లు పేర్కొనినను రామశంకరదత్తు ప్రధానముగ బ్రహ్మాండపురాణాంతర్గతమగు అధ్యాత్మ రామాయణమునే అనుసరించుచు రామాయణమును రచించెను. కృత్తివాస రామాయణమున 17670 పద్యములు, రామశంకర రామాయణమున 15346 పద్యములు కలవు.

శంకర కవిచంద్ర : (1702) అటనట అవాల్మీకీయములగు ఘట్టములను స్వీకరించి ఇతడు "విష్ణుపురీ రామాయణము"ను రచించెను.

జయప్రసాద రామప్రసాదులు ; (1770, 1796) తండ్రికొడుకులగు వీరిరువురు కలిసి రామాయణమును రచించిరి.

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు ; (1820-1891) ఆధునిక గద్యసాహిత్య జనకుడుగా ప్రశంసలందిన ఈ కవి "సీతావనవాస" "ఉత్తరరామ చరిత్ర" వ్రాసెను.

ప్రఫుల్లచంద్ర వంద్యోపాధ్యాయ : (1864-1900) "వాల్మీకి ఓతత్సామయిక వృత్తాంతే" మున్నగు గంథములు రచించెను.

ఉమేశచంద్ర మిత్ర సీతావనవాస నాటకము రచించెను. హరిశ్చంద్ర మిత్ర 'జానకీ నాటకము' ఉమాచంద్రమిత్ర "సీతావనవాస" మనోమోహనవసు (1831-1912) 'రామాభిషేక నాటకము జ్యోతిరింద్రనాథఠాకూరు:- (1848-1927) మహావీరచరితము ఉత్త రామ చరితనాటకములు (అనువాదము); కామినీ సుందరిదాసి (1900) రామేర అధివాస నాటకము, తరంగిణీదాసి (1879) సుగ్రీవ

మిలన నాటకము, గిరీశచంద్రఘోషు (1844-1911) రావణవధ, సీతారవనవాస, లక్ష్మణవర్జన, సీతారవివాహ, రామేరవనవాస, సీతాపహరణ నాటకములను, రవీంద్రనాథఠాకూరు 'వాల్మీకి ప్రతిభ' (గేయ నాటకము-1881 లో) ద్విజేంద్రలాలురాయి (1867-1913) సీత నాటకమును వ్రాసిరి.

మైకేలు మధుసూదనదత్తు (1824-1873) విరచిత మేఘనాథ వధ కావ్యము భారతీయ సాహిత్యమునందే విశిష్టస్థాన మాక్రమించెను. కథ రామాయణాంతర్గతమే అయినను, ఇది నవీనము అపూర్వము అయిన సృష్టి. ఈ కావ్యమునందు వాల్మీకి, హోమరుల ప్రభావము అధికముగ కాంచనగును. పాత్రలు ఇలియడ్‌ను స్ఫురింపజేయును- ఇందు ఇంద్రజిత్తుపత్నినామము ప్రమీలగా పేర్కొనబడెను.

ఇంకను ద్వారకానాధరాయి సీతాపహరణ గ్రంథమును, హరిశ్చంద్ర మిత్ర (1838-1872) రామాయణ బాలకాండ, నిర్వాసిత సీతలను రచించిరి.

## ఓఢ్ర సాహిత్యము :

మహాభారతమును ఓఢ్రభాషలో వెలయించిన సరళాదాసు విలంక రామాయణము, విచిత్ర రామాయణములను కూడ రచించెను. ఈ విచిత్ర రామాయణము డొంకాడ సీతారామకవిచే ఆంధ్రీకరింపబడెను. ఈ గ్రంథమునందలి జానపద గేయ వాఙ్మయ ప్రకరణమున పేర్కొనబడిన ఓఢ్రభాషయందలి విచిత్ర రామాయణము ఇయ్యదియే. విలంక రామాయణములో సహస్రశీర్షుడైన మహిరావణుని శక్తిస్వరూపిణియైన సీత సంహరించుట ఇతివృత్తము. ఒరియాభాషలో సరళాదాసు భారతము, బలరామదాసు రామాయణము, జగన్నాధదాసు భాగవతము విశిష్టమైనవి.

బలరామదాసు : సరళాదాసు రామాయణము తరువాత ఒరియాభాషలో వెలువడిన మహాకావ్యము బలరామదాసు రామాయణము. ఒరిస్సా ప్రజలఆచార వ్యవహారములను తన కావ్యమున

ఇతడు ప్రతిబింబింప జేయుటేకాక, తన ఉత్కళాభిమానమునకు చిహ్నముగ. ఉత్కళులు రామునితో వెడలి దండకారణ్యమున శ్రీరామునకు సహాయ మొనరించినట్లు పేర్కొనెను.

ఇంకను అభిమన్యు, దినకుషు అను జంటకవులు సీతారామ గాథను భజన నాటకములుగను, పకీరు మోహనసేనాపతి సులభతర శైలియందు రామాయణమును రచించిరి.

## పంజాబీ సాహిత్యము :

క్రి. శ. 14 వ శతాబ్దియందు భక్తి ఉద్యమము ప్రబలినప్పుడు నాట్యకళ పునరుద్ధరణకై 'రామలీల' మున్నగు నాటకములు రచింపబడెను.

## కాశ్మీరీ సాహిత్యము :

దివాకర ప్రకాశభట్టు అను నామాంతరము గల ప్రకాశరాముడు (క్రి. శ. 1760 ప్రాంతమున) రామావతార చరిత, లవకుశ యుద్ధ చరితములను రచించెను. రామాయణ చరితమును కవి కేవలము అనువాదముగనే కాకుండ, నాటి సామాజిక జీవనమునకు, చిత్తవృత్తులకు సముచితస్థానము ఒసగుచు వెలయించెను. ఇందలి కౌసల్య కాశ్మీర మాతృహృదయమునకు ప్రతీక యనతగును.

వంగ, ఒరియా, పంజాబీ సాహిత్యములందు 14 వ శతాబ్ది యందే రామాయణ రచనలు వెలువడుట గమనార్హము.

## హిందీ సాహిత్యము :

హిందీసాహిత్యమునందే గాక, భారతీయ సాహిత్యములందే మహోత్కృష్టములగు గ్రంథములుగ పూజ్యత నందిన కొలది గ్రంథములలో హిందీభాషయందు రచింపబడిన "శ్రీరామ చరితమానస్" ఒకటి. మహాభక్తుడైన తులసీదాసు రచించిన రామాయణ మిదియే. క్రి. శ. 1589 లో జన్మించిన తులసీదాసు ప్రథమమున భార్యయందు అవధులు దాటిన మోహావేశము కల్గియుండి, ఆమె హితోపదేశమున శ్రీరామపదభక్తుడుగ పరివర్తన మొంది, 1631వ సంవత్సరమున అయోధ్యాక్షేత్రమందు శ్రీరామచరితమానస్ వ్రాయ మొదలిడెను.

"వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

అనుదానిని పురస్కరించుకొని సంస్కృతముననే అధ్యాత్మరామాయణాదులు రచియింపబడెను. వాల్మీకి శ్రీరాముని ఆదర్శ మానవునిగ నిరూపించుటకు చేసినంత యత్నము అవతార పురుషునిగ చూపుటకు చేయలేదు, భక్త శిరోమణి యగు తులసీదాసు వాల్మీకి రామాయణమునే అధికముగ అనుసరించెను.

"నానాపురాణనిగమాగమసమ్మతం యత్
రామాయణే నిగదితం క్వచి దన్యతోపి
స్వాంతస్సుఖాయ తులసీ రఘునాథగాథా
భాషానిబంధ మతిమంజుల మాతనోతి"

ఈ శ్లోకము నతడు తాను చేయదలచిన వాల్మీకిరామాయణ భిన్నములగు విపర్యయములను సూచించుటకు వ్రాసియుండును. దోహ, సోరఠా, చౌపాయి మున్నగు గేయచ్ఛందములలో అధ్యాత్మ రామాయణము, వాల్మీకి రామాయణము, హనుమన్నాటకము, శ్రీమద్భాగవతములు ఆధారములుగ అటనట తన ప్రవృత్తి కనుకూలములగు మార్పులను స్వోపజ్ఞకముగ చేయుటకు రామామృత రసాయనమును ఆర్యావర్తమునకు అందించెను.

తులసీ రామాయణమునందు కథాపృచ్ఛకులు మువ్వురు. 1. పార్వతి, 2. భరద్వాజుడు, 3. గరుత్మంతుడు. కథకులు మువ్వురు 1. శంకరుడు, 2. యాజ్ఞవల్క్యుడు, 3. కాకభుశుండి. శ్రుతిసమ్మతమైన హరిభక్తిపథము నుపదేశించుటే రామాయణ రచనమున తులసీదాసు వాంఛించి యుండుటచే

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణమ్ పాదసేవనమ్
అర్చనం వందనం, దాస్యం సఖ్య మాత్మనివేదనమ్
ఇతిపుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా"

అను భగవద్గీతయందలి నవ విధ భక్తిమార్గములను అధ్యాత్మ రామాయణపరముగ అనువదించినను 1. యథా లాభ సంతుష్టి, 2. సర్వమును భగవదర్పణ సేయుట అనునవి స్వంతముగ చేర్చి, భక్తిమార్గ నిర్దేశమున కొంత స్వాతంత్ర్యమును కూడ చూపెను. ఇతడు అధ్యాత్మ రామాయణమందలి "భగవత్తత్త్వ విచారము" లేక "భగవదర్పణము"ను ప్రముఖముగా వర్ణించెను. రామచరిత మానసమున బాలాదికాండలు సోపానములుగా వింగడింపబడెను.

ఇందు మిథిలాపురమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని అనుమతిని బడసి పూజాపుష్పములకై ఉద్యానవనమున కేగి. గౌరీపూజార్థమటకు అరుదెంచిన సీతను కాంచెదరు. ఈ సందర్భమున తులసీదాసు సీతారాముల మనఃప్రవృత్తులను చక్కగా చిత్రించెను. ఇట్లు సీతారాముల పూర్వరాగమునకు తులసీదాసు సందర్భము కలిగించుట హనుమన్నాటకానుసరణ మని విమర్శకుల భావన.

అధ్యాత్మ రామాయణమునందువలె ఇందు దేవతల ప్రార్థనముపై సరస్వతి మంథరా, కైకేయిలను ఆవేశించెను.

గంగావతరణ ఘట్టమున గుహుడు శ్రీరాముని పాదములను ప్రక్షాళణము కావించెను.

"మాంగే నావనన కే వట ఆనా
కహయితుం హెూరమరమైజా నా
చరణకమలరజ హసబుకహాయి
తరవి ఊంమునిఘుర నీ హాయీ
బాటపరయి మోరి నాన ఊదాయీ."

"శ్రీరామునితో గుహుడు నీపాదములు గడిగెదను. నీపాదములందు రాళ్ళను, కఱ్ఱలను మనుష్యులుగ జేయుశక్తిగల పరాగ ముండియుండును. కాన నీపాదరజమువలన నానావయు మానుషి యగునేని నావృత్తికి భంగము వాటిల్లు"నని పలికెను.[1] తులసీరామాయ

1. తులసి రామాయణము- శ్రీమతి యేలూరుపాటి లక్ష్మి సరస్వతి వచనానువాదము, 172

ణము నందు మధుర హృదయంగమమగు భావనలలో ఒకటిగా పేర్కొనబడు ఈ కల్పనమువంటిది సంస్కృత అధ్యాత్మ రామాయణమున కలదు.

ఈ భావమునే కవయిత్రి మొల్ల తన రామాయణ కావ్యమున (అయోధ్యాకాండము-ప. 32)

"సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యె నఁట ! పన్నగ నీతని పాదరేణువి
య్యెడ వడి నోడ సోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాముపదకంజయుగంబు భయమ్ము పెంపునన్"

అని మనోహరముగ విపులీకరించెను.

కాకాసుర వృత్తాంత మిందు అరణ్య కాండారంభముననే చెప్ప బడుటయేకాక అధ్యాత్మరామాయణమందువలె సీతచరణాంగుష్ఠ మును అమిషబుద్ధిచే కాకము చుంచువుతో విదారించినట్లు చెప్ప బడెను. మరియు వాల్మీకి రామాయణమందు కాకాసుర వృత్తాంతమును సీత హనుమంతునకు వివరించి చెప్పి నట్లుండగా తులసీదాసు

"తాతసక్రసుత కథాసునా ఎహు !
బాన ప్రతాప ప్రభాహిసముఝూ ఎహు"

(జయంతునికథ రాముని జ్ఞప్తి కెలయింపుము) అని మాత్రము కోరెను.

రంగనాథ రామాయణ మందలి సులోచనా వృత్తాంతము ఇందు కూడ కలదు. యుద్ధకాండము అని పేర్కొనక తులసీదాసు 'లంకా కాండ'మనుటచే విభీషణ శరణాగతి సుందరకాండముననే పేర్కొనెను.

ఇందు సీతాన్వేషణమునకై లంకయందు ప్రవేశించిన హను మంతుడు అచ్చట గల తులసీవనమును కాంచి అచ్చెరువొంది, అట కేతెంచిన విభీషణుని కలుసుకొనెను. అంత వారిరువురు శ్రీరామ మహిమ, సీతా వృత్తాంతములను గూర్చి సంభాషించుకొనిరి. ఈ సన్నివేశము తులసీదాసు స్వకపోలకల్పితము.

స్త్రీలయెడ తనకుగల గౌరవమునకు నిదర్శనమో యనునట్లు తులసీదాసు ఇందు రావణాంతఃపురస్త్రీ వర్ణనమును పరిహరించెను.

"గయ ఉదసాధన మందిర్ మాహీ"
అతివిచిత్ర కహి జాతే సోనాహీం
సయనకియేం దేఖా కపితేహీ మందిర్ మహుం నదీఖి వైదేహీ॥

—అని మాత్రము పేర్కొనెను.

ఇందు శ్రీరామ పట్టాభిషేకము యుద్ధకాండమున కాక ఉత్తర కాండమున కలదు. ఉత్తర కాండమున సీతాపరిత్యాగ వృత్తాంతము లేదు. కుశలవులు అయోధ్యయందే జన్మించిరి.

ఇందలి మరియొక ముఖ్యాంశము సీతారామ వనవాస సందర్భమున తానే ఒక తాపసి రూపమున సీతారామలక్ష్మణులకు, వారు భరద్వాజాశ్రమము వీడి చనునప్పుడు ఆతిథ్యమొసగినట్లు తులసీదాసు వ్రాయుటలో వాల్మీకి రామాయణమున శ్రీ రామాదులకు వాల్మీకి ఆతిధ్యమొసగుట కవి మనసున మెరసి యుండవచ్చును.

"ఆనందకాననే కశ్చిజ్జంగమస్తులసీతరుః
కవితా మంజరీ యస్య రామభ్రమరభూషితా"

అని మధుసూదన సరస్వతిచే ప్రస్తుతింపబడిన తులసీదాసు రామాయణము ఆంగ్లములోనికి కూడ అనువదింపబడెను. ఎటకిన్స్ అనునతడు పద్యానువాదము కావించెను. వారాన్నికోవ్ అను రష్యన్ పండితుడు దీనిని రష్యన్‌లోనికి భాషాంతరీకరించుటయే కాక, రష్యన్ దృక్పథముతో ఒక బృహత్పీఠిక కూడ రచించెను.

తులసీ రామాయణమునకు పెక్కుమంది ఆంధ్రానువాదములు వెలయించిరి. క్రీ. శ. 1857 ప్రాంతమున విశాఖమండలమున విజయనగర సంస్థానాధీశులగు పూసపాటి విజయరామగజపతి మహారాజు ఆస్థాన కవియైన మండ కామేశ్వర కవి ప్రప్రథమముగా తులసీరామాయణమును ఆంధ్రీకరించిరి. ఇందు గద్యపద్యములు లేకుండ, మూలమున ప్రయోగింపబడిన హిందీ వృత్తములే వాడ

బడెను- నిర్వచనము- అముద్రితము. కృత్యారంభమున మాత్రము "మంగళముల నర్థవాదముకు సరసములకు...." అని తెలుగు గీతము కలదు. తరువాత తెలుగుపద్య కావ్యములుగా భాగవతుల నరసింహ శర్మ, మైలవరపు సూర్యనారాయణమూర్తి, వచనకావ్యముగ నేల నూతల పార్వతీ కృష్ణమూర్తి యేలూరుపాటి లక్ష్మీసరస్వతి ప్రభృతులు అనువదించిరి.

## వాల్మీకి అడుగుజాడలలో దక్షిణాది కవులు : తమిళ సాహిత్యము

తమిళ సాహిత్యమున స్వర్ణయుగముగా ప్రశంసింపబడు చోళ మహీపతుల పరిపాలనాకాలమున (క్రీ. శ. 850-1200) కవిచక్రవర్తి బిరుదాంకితు డైన కంబకవి విరచితమగు కంబరామాయణము వెల సెను. "కల్వియిఱ్ పెరియవన్ కంబన్" (కవిత చెప్పుటలో అధి కుడు కంబకవి) "కంబన్ వీట్టు కట్టుత్తఱియం కవిసొల్లుం" (కంబకవి గృహమునందలి కట్టుకొయ్యకూడ కవిత్వము చెప్పును)- అనుచు కంబ కవి పండిత ప్రశంసలను పొందెను.

రామావతార మను నామాంతరము కల కంబరామాయణము తమిళులకు ప్రామాణికగ్రంథము. రామాయణమున షట్కాండలను కంబకవి, ఉత్తరకాండమును సాలెకులజుడగు వాణిదాసుకవి రచించిరి. కంబరామాయణము వాల్మీకి రామాయణానుసరణమయ్యును భాషాంతరీకరణము కాదు. కథయందును అవాల్మీకయము లగు అంశములు కొన్ని కాంచనగును.

1. వివాహాత్పూర్వమే సీతారాముల పరస్పరవీక్షణము, అనురాగము- పదంపడి అనంగదశావర్ణనము. ఈ విషయమును శ్రీరాముడు హనుమంతునకు అంగుళీయక మొసంగుచు, పేర్కొనుట.

2. దశరథుడు తనకు ఔర్ధ్వదైహికములను భరతుడు కావించరాదని నిషేధించుట- వశిష్ఠుడు శత్రుఘ్నునిచే నిర్వర్తింపజేయుట.

3. రావణుడు సీతాదేవిని స్పృశింపక, పర్ణశాలా ద్వితీయముగ అపహరణము కావించుట. ఇందు రావణుడు వేదాధ్యయన

పరుడు, శివభక్తుడు, వైణికుడు- అతనిధ్వజమున వీణ చిహ్నము కలదు.

4. గుహుడు రామభక్తుడు- రాజు గాకుండుట.

5. సుగ్రీవుడు తారను మాతృదేవిగా సన్మానించుట.

6. విభీషణుడు రావణునకు హిరణ్యకశిపుని వరమును ఎరింగించుట.

7. యుద్ధరంగమున కుంభకర్ణ విభీషణుల సంభాషణము- ఈ సన్నివేశము రంగనాథ రామాయణమున కాంచనగును.

8. రావణుడు మాయాజనకుని సృష్టించి సీతాదేవికి దుర్నీతి గరపుటకు యత్నించుట.

9. అంగదుడు శ్రీరాముని శరణువేడుట.

ఇతివృత్తమునందు వాల్మీకిరామాయణ భిన్నములైన ఇటువంటి సన్నివేశములు కల్పింపబడుటయేకాక, ఇందు విశేష వర్ణనాదులుకూడ కలవు. దశరథుని మిథిలాప్రయాణము సుదీర్ఘముగ విస్తరించబడి, కౌసల్యాదుల విహారలీలలు, పుష్పాపచయము, జలక్రీడ, మధుపానము మున్నగు ప్రబంధ వర్ణనలు కావింపబడెను. వాల్మీకిరామాయణము నందలి ఆసక్తిదాయకములగు అహల్యావృత్తాంతాదులను కంబకవి విస్తరించి వ్రాసెను. వివాదగ్రస్తమగు వాలివధను కంబకవి సమర్థించెను. ఇరువదినాలుగువేల శ్లోకముల రామాయణమును కంబకవి పండ్రెండువేల వృత్తాంతములుగా రూపొందించెను.

**కన్నడ సాహిత్యము :-** కన్నడ రత్నత్రయమున ద్వితీయుడగు పొన్నకవి "భువనైకరామాభ్యుదయ" కావ్యమును రచించెను.

జైన రామాయణము : క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమున నాగచంద్రుడనుకవి "రామచంద్రచరిత్ర పురాణము" వ్రాసెను. ఇది కన్నడమున వెలసిన ప్రథమ జైన రామాయణము. ఈ మహాకావ్యము వాల్మీకి రామాయణానుసారి కాదు. ప్రాకృతములో విమల

సూరి రచించిన 'సౌమచర్య' (పద్మచరిత), రవిషేణుని సంస్కృత రామాయణమునుండి ఇతివృత్తమును స్వీకరించి నాగచంద్రుడు జైన రామాయణమును రూపొందించెను.

ఇందు రాముడు విష్ణ్వవతారముకాడు- మనుష్యమాత్రుడు. రామలక్ష్మణులు బలవాసుదేవులు. ధర్మనాయకుడైన రాముడు అహింసా వ్రతి, చరమదేహధారి. రామునితల్లి అపరాజిత, లక్ష్మణుడు సుమిత్రా తనయుడు, భరతుడు కైకేయీపుత్రుడు, శత్రుఘ్నుడు సుప్రభాకుమారుడు. వీరనాయకుడై లక్ష్మణుడు రావణుని సంహరించెను. ప్రతినాయకుడైన రావణుడు అసురుడు, దశముఖుడు కాడు, భీముడను రాక్షసవంశీయుడు- ఒక విచిత్రమైన అద్దమున పదితలలు కనిపించుటచే దశముఖు డన బడినాడు. ఇతడు ధర్మాత్ముడు, పరస్త్రీ పరాఙ్ముఖుడు- కాని సీతాదర్శనమున వ్యామోహితుడై ఆమెను చెరగొనెను. ఆయాసమయములందాతడు సీతాదేవిపై సానుభూతినికూడా ప్రదర్శించెను. ఇందు యజ్ఞములు లేవు, విశ్వామిత్రుడు లేడు, శివధనుర్భంగము లేదు, పరశురామ మంధరలుకూడ లేరు. సీత ధరణిజకాదు- జనకపత్ని గర్భశుక్తిముక్తాఫలము- సీతకు ప్రభామండలుడను సోదరుడు కలడు. ఒకానొకసందర్భమున సీతను నారదుడు మోహించినట్లు కూడా కలదు. రామలక్ష్మణుల విభవమునకు దుఃఖితుడైన పుత్రునికై కైక వరములను అభ్యర్థించెను. లక్ష్మణుడు ఖరుని, చంద్రనఖిపుత్రుడైన శంభునకుని సంహరించుటయే యుద్ధమునకు కారణమయ్యెను. విభీషణుడు సీతకారణమున రావణుడుమరణించునని తెలిసి జనక దశరథులను సంహరించ ప్రయత్నించి విఫలుడై, రావణునికి సద్బుద్ధిగరుప ప్రయత్నించి విఫలుడై రాముని శరణము పొందెను. వాలి సుగ్రీవులు కపులుకారు- కపిధ్వజులు మాత్రమే. సేతుబంధనము కావింపబడలేదు. వానర సైన్యము ఆకాశగమనవిద్యాప్రాప్తిం జేసి సముద్రతరణము కావించెను. రావణుని మేనల్లుడగు హనుమంతుడు, సోదరుడగు విభీషణుడు, రావణుని అకృత్యమును రోసి రామశరణాగతులైరి. విమానము నధిష్ఠించి హనుమంతుడు సముద్రతరణము కావించి, తన విద్యాబలముచే లంకను దహించెను.

రామలక్ష్మణులు వేలసంఖ్యలో వివాహములు చేసుకొనిరి. చివరకు సీత జినమతమును స్వీకరించి, స్వర్గమున ఒక ఇంద్రపదవిని పొందెను-రాముడు జినస్థానమును, లక్ష్మణుడు అధోగతిని, రావణుడు నరకమును పొందిరి. ఇట్టి మార్పులన్నియు జైనాచార్యులు స్వీయ ధర్మప్రచారమునకై కావించినట్లు విస్పష్టమగును. ఇందు జైన భక్త్యావేశము అధికముగ కాంచనగును.

క్రీ. శ. 16వ శతాబ్దియందు కుమారవాల్మీకికవి "తొరవె రామాయణమును" రచించెను. అయిదువందలకు పైగా భామినీ షట్పదులున్న యీ మహా గ్రంథమున వైదికసంప్రదాయానుసారముగ అన్నికాండలు అనువదింప బడెను. అలతిమార్పు లున్నను వాల్మీకి రామాయణమునే ప్రధానముగ అనుసరించిన యీ కవి శ్రీరాముని విష్ణ్వవతారముగ వర్ణించెను. దీనిని కన్నడమున వెలసిన మొదటి వాల్మీకి రామాయణానుసార కావ్యముగా పేర్కొనవచ్చును.

కనకదాసు అను నతడు రామధ్యానచరిత అను షట్పదికావ్యమును రచించెను. సుమారు 1750 ప్రాంతంలో హెళవనకట్టె గిరియమ్మ అను కవయిత్రి 'సీతాకళ్యాణ' గ్రంథమును వెలయించెను. (1770-1841) దేవచంద్రకవి అభినవ పంపని రామచంద్ర చరితమాధారముగా "రామకథావతారమును" రచించెను. 19వ శతాబ్దాంతమున బసవప్పశాస్త్రి ఉత్తర రామచరిత నాటకమును వ్రాసెను.

19వ శతాబ్దాంతమునకు చెందిన నంజళికె లక్ష్మీనారాయణప్ప గద్యమున 'అద్భుత రామాయణము'ను, వార్ధక షట్పదియందు 'రామ పట్టాభిషేక కావ్యము. సుప్రసిద్ధ గద్యకావ్య మగు 'రామాశ్వమేధ మును రచించెను. పాశ్చాత్యరచనాప్రభావము ఈకవిరచనలో స్పష్టముగ గోచరించును. ఇతని రచనలలో రామాశ్వమేధము సుప్రసిద్ధమైనది. పద్మపురాణమునందలి శేషరామాయణము దీనికి ఆధారము. ఈ గ్రంథము ఇష్టదేవతాస్తుతితో ప్రారంభము కాకుండ వర్షాకాల వర్ణనతో ఆరంభింపబడెను. ఇందు సీతారాములతోపాటు ఆధునికదంపతు లైన ముద్దణామనోరమల సంవాదము హాస్యరస భరితముగ చిత్రింపబడెను.

ఆధునికయుగమున ముళబాగిలు ఉత్తరరామచరితమును నవగన్నడములోనికి అనువదించెను.

**మలయాళ సాహిత్యము :-** మలయాళ సాహిత్యమున వెలసిన ప్రప్రథమకావ్యము యుద్ధకాండము ఆధారముగా రచింపబడిన రామచరిత కావ్యము. ఇది క్రి. శ. 12 శతాబ్దియందు రచింపబడినట్లు ప్రచారమున నున్నను, గ్రంథకర్తృత్వము, రచనాకాలము కూడ వివాదగ్రస్తములు.

రామచరితమునకు పిమ్మట 'కట్టశన్ పాట్టుగళ్' పేర్కొనదగిన కావ్యసంపుటము. ఇందుకణ్ణశ రామాయణము ముఖ్యముగా పేర్కొన తగినది. దీనిని రామపణిక్కర్ (1375-1475) రచించెను.

మలయాళ మహాకవి ఎళుత్తచ్చన్వంటికవి మలయాళమున 'నభూతో నభవిష్యతి'. వాల్మీకికృతి ననుసరించి ఇతడు అధ్యాత్మ రామాయణము వ్రాసెను. వాల్మీకి రామాయణమున పురుషోత్తముడుగ వర్ణింపబడిన శ్రీరాముడు ఎళుత్తచ్చన్ కావ్యమున దైవముగా అభివర్ణింపబడెను. మహాభక్తుడైన ఎళుత్తచ్చన్ కావ్యమున రామప్రశంస గల ప్రతిస్థలమునందును భక్త్యుద్రేకముతో రామనామ సంకీర్తనము కావించెను. ఇందలి పాత్ర పోషణము సజీవముగ నుండును. ఇతడు ఉత్తర రామాయణమునుకూడ రచించెను.

సంస్కృతమునందలి రామాయణ చంపువు ననుసరించి పునం నంబూద్రి, సంస్కృత భారత చంపువుకు రెండురెట్లు అధికమగు రామాయణ చంపువును రచించెను. ఇందు రావణజన్మ వృత్తాంతమునుండి రామపట్టాభిషేకమువరకు గల కథ కలదు.

మలయాళీనృత్యమగు కథకళికి నిర్దేశింపబడిన ఆటకథారచనలలో రామనాట్టం ఆట్టకథ ఒకటి. కొట్టారకార తంబురాన్ అనుకవి ఈ రామనాట్టమును.

1. పుత్రకామేష్టి.
2. సీతాస్వయంవరము.
3. విచ్ఛిన్నాభిషేకము.
4. ఖరవధము.

5. బలివధము. 7. సేతుబంధనము.
6. తోరణయుద్ధము. 8. యుద్ధము

అను అష్టభాగములుగ, ఎనిమిది రాత్రుల ప్రదర్శనమునకు అనుకూలముగ రచించెను. ఇదియే ప్రథమ ఆట్టకథగా కొందరి మతము-అయినను ఈ విషయము వివాదగ్రస్తము, ఇందు వాల్మీకి, కంబ, పునం నంబూద్రుల రామాయణానుకరణములు కాంచనగును.

ఇందుకు జానపదనృత్య విశేష మనతగిన తుళ్లత అనునాట్యము నకై రావణవధము మున్నగు తుళ్ళతరచనలు, శూర్పణఖాంగము (13-15 శ॥ ప్రాంతము) వచన మున్నగు రచనలుకూడ మలయాళ సాహిత్యము కలవు.

**మహారాష్ట్ర సాహిత్యము :-** 13-14 శతాబ్దములలో నరహరిసోనార్ కవి రసాళరామాయణము రచించెను, కాని 8-10 అభంగములు మాత్రమే లభ్యములు- రామసాక్షాత్కారము బడసిన రామభక్తుడగు సమర్థరామదాసస్వామి (క్రీ. శ. 1608-1681) సుందరకాండము, యుద్ధకాండము రచించెను.

జయరామస్వామి పడగాంకర్ సీతాస్వయంవర్ గ్రంథమును రచించెను.

ఆనంద తనయుడు 'కడలే' అను గేయరూపమున సీతాస్వయంవరకావ్యమును, రామాయణ భారతములలోని అఖ్యానములను సుందరములగు పదములను వెలయించెను.

మహారాష్ట్రకవి సార్వభౌము డైన మోరోపంత్ (1729-1794) ప్రథమగ్రంథము లవకుశాఖ్యానము- ఇత డింకను సీతాగీతము, మంత్రరామాయణము, పద్మరామాయణము, దామరామాయణములను కూడ రచించెను. 'శ్రీరామ జయరామ జయజయరామ'- అను మంత్రమును యమక గర్భితముగ మంత్రరామాయణమున వెలువరించెను.

హంసరాజు (శా. శ. 1720-1770) వేదాంతపరముగా రామాయణమును అభంగములలో వ్రాసెను.

సాంగ్లీవాస్తవ్యు డగు విష్ణుదాసభావే క్రీ. శ. 1843 లో వ్రాసిన సీతాస్వయంవర్ నాటిక మరాఠీభాష దృష్ట్యా అందలి ప్రథమ నాటకము.

తాత్యాగోడబోలె ఉత్తరరామచరితమును అనువదించెను.

అణ్ణాసాహెబ్ కిర్లోస్కర్ (1843-1885) రామరాజ్య వియోగము మున్నగు నాటకములు వ్రాసెను.

భార్గవరాంవరేర్కర్ నాటకరంగమున మార్పులు కావించి, భూమికన్యా సీతా నాటకమును నవీనపద్ధతియందు వ్రాసెను.

మాడ్గూళ్కర్ సీతారామాయణమును క్రాంతికారకమగు రచనగా పేర్కొనవలెను.

భారతీయ భాషలందు రామాయణము ఎన్నిరూపముల వెలసినదో సంగ్రహముగా వివరింపబడెను. క్రీ. పూ. 200 ఏండ్లప్రాంతమందు శాలివాహన చక్రవర్తి కాలమున జీవించినట్లు భావింపబడుచున్న గుణాఢ్యమహాకవి పైశాచీభాషలో రచించిన కథాసరిత్సాగరమందు రామాయణకథాసారము కలదు. కథాసరిత్సాగరము అలభ్యమయ్యెను, సోమదేవ కృతమగు సంస్కృతకథాసరిత్సాగరమువలన మూలకథయందలి రామాయణమును గ్రహింపనగును. "మూలమైన పైశాచీ బృహత్కథకు సరిగా నుండును-ఇంచుకైనను అతిక్రమింపదు" అని సోమదేవుడు గ్రంథాదిని ప్రతిన కావించెను. ఈ గ్రంథము క్రీ. పూ. 200 ఏండ్ల ప్రాంతమందు జనబాహుళ్యమునగల రామాయణ స్వరూపమును గ్రహించుటకు తోడ్పడును.

కథాసరిత్సాగరమందలి కథ యిట్లున్నది :-

అయోధ్యాధిపతియగు దశరథుని పుత్రులు రామభరతలక్ష్మణ శత్రుఘ్నులు. రావణవధార్థమై మహావిష్ణువు రాముడుగ వెలసెను-

విధివియోగమున సీతారామలక్ష్మణులు తండ్రిపనుపున కానల కేగిరి. అచ్చట రావణుడు సీతాపహరణము గావించి, జటాయువును సంహరించి, ఆమెను లంకకు గొనిపోయెను. సుగ్రీవమైత్రిని స్వీకరించి రాముడు వాలిని సంహరించి, ఆంజనేయునివలన సీతావృత్తాంతము గ్రహించి, సేతువు నిర్మింపజేసి, రావణుని హతమొనర్చి, విభీషణ పట్టాభిషేకము కావించి సీతను పరిగ్రహించెను. పదంపడి అప నిందావ్యాజమున శ్రీరామ పరిత్యక్తయైన సీత వాల్మీక్యాశ్రమము ప్రవేశించెను. అచ్చటి మహర్షుల సంశయనివృత్తికై, పూర్వము టీటిభి అను వనిత పతిచే సంశయింపబడిన సందర్భమున ఆమె పారిశుద్ధ్యమునకై నిర్మింపబడిన సరస్సును జొచ్చి సీతాదేవి స్వీయపాతివ్రత్య నిరూపణము కావించెను.

ఈకథయందు టీటిభి సరస్సు వృత్తాంతముమాత్రము వాల్మీకి రామాయణమునుండి భేదించుచున్నది.

బౌద్ధ జాతక రామకథ :- బౌద్ధజాతకకథలందలి "దశరథ జాతకము" అను కథయందు రామాయణము కలదు.

వారణాసి అధినేతయగు దశరథుని పట్టమహిషి రామ, లక్ష్మణులు, సీత జన్మించిన తదుపరి పరమపదించెను. ద్వితీయ వివాహమువలన భరతుని బడసిన దశరథుడు మున్ను తాను రాణి కొసగిన వాగ్దానము ననుసరించి రాజ్యమును తత్కారణమున భరతాధీనము కావింపవలసివచ్చెను. సీతారామలక్ష్మణుల క్షేమమును శంకించి రాజు వారిని ద్వాదశవర్షములు హిమగిరులవసింప నియోగించి, నవ వర్షములు గడచిన తదుపరి దివంగతు డయ్యెను. భ్రాతృభక్తితత్పరుడగు భరతుడు ప్రార్థించినను రాజ్యస్వీకారమునకు సుముఖుడు కాని శ్రీరాముడు పాదుకాప్రదానము కావించెను. మిగిలిన మూడు సంవత్సరములు గడచిన పిమ్మట శ్రీరాముడు రాజ్యాభిషిక్తుడై పదహారువేల వర్షములు రాజ్యపాలనము కావించెను.

బుద్ధుని పూర్వజన్మవృత్తాంతముగ పేర్కొనబడిన ఈకథయందు దశరథుడే శుద్ధోదనుడు- శ్రీరామునితల్లి మాయాదేవి- సీత రాహులుని

తల్లి- భరతుడు ఆనందుడు- లక్ష్మణుడు శారిపుత్రుడు- రాముడు బుద్ధుడు. శకజాతియందు ఏకోదరులకు వివాహము కావించు ఆచారము కలదని పీకాక్ పేర్కొనెను. కాని ఇట్టిపద్ధతి ఆర్య హిందువులలో కానరాదు. కనుక బౌద్ధ జాతకమునందలి "దశరథ జాతకము కథ" బౌద్ధమత వ్యాప్తికై గ్రహింపబడినట్లు భావింపనగును.

## భారతీయేతర భాషలలో రామకథ :-

భారతీయ సాహిత్యాభివృద్ధికి ఒకవిధముగా ఆధారమైన దనదగిన రామాయణగాథ భారతీయేతరభాషలలోనికికూడ వ్యాప్తినొందినది. మలయా, జాపనీస్, చీనా, టిబెటన్ భాషా కుటుంబమునకు చెందిన తాయ్‌భాషలో కూడ రామాయణగాథ వెలసినది. రష్యన్ భాషయందుకూడ రామాయణానువాదములు కలవు. తాయ్‌భాషలోని రామకియన్ యందు (రామాయణము) తమిళ, కాశ్మీరీ, బెంగాలీ, మలయా, జాపనీస్ భాషారామాయణముల సామ్యములు అధికముగ కన్పట్టును.

[1] ఇండోనీషియా వాసులు రామాయణ మహాభారతములను తమ ద్వీపమున జరిగిన గాథలుగా విశ్వసింతురు. వారికి రామాయణ మహాభారతములు భారతదేశమందుకూడ వ్యాప్తిని పొందినవను విషయమే ఆశ్చర్యమును కలిగించును. ఇండొనీషియాలో ఈనాడు మహమ్మదీయులే అధికసంఖ్యలో ఉన్నను రామాయణభారతములు అధికప్రచారములో ఉన్నవి- తోలుబొమ్మలాటల రూపమున కూడ వ్యాప్తి పొందినవి.

ఇండోనీషియా రామాయణగాథ భారతీయగాథలతో పెక్కు సాదృశ్యములను కలిగి ఉండును. కాని కొన్ని భేదములుకూడ కలవు. సీతను సింతా (Sinta) గాను, వాలిని సుబాలిగాను పేర్కొనిరి. వీరి రామాయణము ప్రకారము వాలి శరీరములో తెల్లరక్తము ప్రవహించును. దాని ప్రభావమున అతనికి గాయములవలన బాధ కలుగదు.

1. ఎకాడమీ బహుమతి లభించినతదుపరి పుస్తకము ముద్రణ అయ్యే మధ్యకాలములో లభించిన సమాచార మిది. The Hindu- 19-9-71 ఆదివారము- పేపరులో ప్రకటితమయిన వ్యాస మాధారముగా ఈ ఇండొనీషియా కథ పేర్కొనబడుచున్నది.

సీతాన్వేషణమునకై బయలుదేరుటకు హనుమంతుడు, అంగదుడుకూడ ఉత్సాహము ప్రకటించగా, వారిరువురినడుమ కలహము రేగినది. చివరకు అంగదుడు హనుమంతుని గొప్పదనమును అంగీకరించెను. హనుమంతుడు అలెంగక (Alengka-లంక) చేరి, అంతయు వెదకి, చివరకు పరిచారికల సంభాషణముచే సీతగల ప్రదేశమును గ్రహించెను. అతడు మర్కటరూపమున పరిచారిక నొకతె గదిసి, ప్రఖ్యాతమైన సీతా సౌందర్యదర్శనార్థము తాను అలెంగక ప్రవేశించితిననియు చెప్పి, సీతను చూపిన పారితోషక మొసగెద ననియు ప్రలోభపెట్టెను. ఆమెసహాయమున హనుమంతు డా సాయంకాలము సీతకడ కరిగెను. సీత కతడు రామాంగుళీయక మొసగగా ఆమె దానిని గుర్తించి, ఒకమాసములోపల రాముడు రావలయు నని కోరెను. సీత కల గుడారమును కొబ్బరిచిపురులతో అలంకరించవలసినదిగా హనుమంతు డామెను వేడెను. పిమ్మట అతడు రావణుని బలపరాక్రమముల నెరుంగగోరి పట్టణవీధులందు జనమధ్యమున నిలచి శ్రీరాముడు రావణుని హతమార్చనున్నా డని బిగ్గరగ పలికి, వృక్షములను కూల్చి, భీభత్సమొనరించెను. ఆ సంరంభమున అతడు ఇంద్రజిత్తును కనుగొనక ఆతని శరమునకు నేలవ్రాలెను. అట్లు వ్రాలు హనుమంతుని శరీరముక్రింద అనేకమంది వీరులు మరణించిరి. బంధింపబడి తన సముఖమునకు గొనిరాబడిన హనుమను రావణుడు కాల్చి చంపునట్లాదేశించగా, హనుమ బంధముక్తుడై చేత కాగడా పట్టి కొబ్బరిచెట్లుగల భవనముతక్క మిగిలిన అలెంగకనంతయు అగ్నికాహుతి కావించెను. సీతాక్షేమమును దృఢపరచుకొని గువాకిష్కంధ(Guwakishkanda) కు మరలివచ్చెను.

రామరావణయుద్ధమున రావణుడు రామబాణములు తగులకున్నను, ఆతాకిడి కోర్వజాలక రణరంగమునుండి పలాయితుడయ్యెను. అట్లు పారివచ్చిన అతడు తాను రెండు శిలల మధ్యకు ఆకర్షింపబడుచున్నట్లు గ్రహించెను. ఆ శిలలు అంతలో కదలుట ప్రారంభించగా, ఆ రెంటికినడుమ రావణు డుండిపోయెను. అట్లా రెండు శిలలమధ్యనున్న రావణుడు నలిగి మరణించువరకు ఒకదానిసమీపము

నకు మరియొకటి వచ్చెను. ఈ రెండుశిలలు మరణించిన రావణుని పుత్రికల ఆత్మలు. రామునితో యుద్ధ సంరంభమున రావణుడు వారిని అగౌరవపరచి, సంహరించగా, వారి ఆత్మలు ప్రతీకారమునకై వేచి, చివరకు రావణుని సంహరించినవి. ఈ విధముగా ఇండో నీషియా రామాయణమున రావణుడు రామునిచే గాక, స్వీయపుత్రికల ఆత్మలచే కడతేరినాడు.

---

# తెలుగులో రామకథావృతము

రామాయణ మహాభారత భాగవతములు సంస్కృత వాఙ్మయము
ననే కాక భారతీయభాషావాఙ్మయము లన్నింటి యందును రత్నత్ర
యమువలె రాణించుచున్న గ్రంథరాజములు. అయినను ఉత్తర
భారత భాషాసాహిత్యములలోను, దక్షిణభారత సాహిత్యములలో
కొన్నింటియందును రామాయణ కావ్యమున కధిక ప్రశస్తి లభించినది.
తెలుఁగు సాహిత్యమునందు మాత్రము మహాభారత భాగవతముల కున్న
కావ్య ప్రశస్తి రామాయణమ్మునకు లేదు. దీనికి ప్రధానకారణము
తెలుఁగున కవిత్రయము, బమ్మెరపోతరాజు వంటి కవిశిఖామణులు
భారతభాగవతములను మూలములను మీరిపించునట్లుగా రచించి
యుండుటయు, రామాయణకావ్యముల కంతటి ప్రాచీనకవుల రచనా
ప్రాగల్భ్యము లభింపకపోవుటయు నని విమర్శకులు తలంచుచున్నారు.

అట్లని తెలుఁగున రామాయణకావ్యములు వేరియులేదని కాదు.
రసవత్తరములైన రామాయణకృతులు కోకొల్లలుగ రచింపబడినవి. రంగ
నాథరామాయణము మొదలు రామాయణకల్పవృక్షమువఱకు తెలుఁగు
రామాయణ కావ్యరచన మనంతముఖముగా సాగినది. తెలుఁగుసార
స్వతప్రక్రియ లన్నింటిలో రామకథ యవతరించినది. దానికిముఖ్య
కారణము రామకథపై తెలుగుజాతి కున్న ప్రత్యేకాదరాభిమానము.
ఆ పవిత్రదంపతుల యరణ్యవాస జీవిత మీ తెలుగునాటితో ముడిపడి
యున్నది. దండకారణ్య పుణ్యభూములు సీతారాముల విహార రంగ
ములు. తెలుఁగునాట నాదంపతుల పవిత్రపాదములు సోకిన పుణ్య
క్షేత్రములు, తీర్థములు తెలుగుజాతిచే నేటికిని దర్శింపబడుచున్నవి,
పూజింపబడుచున్నవి. ఆ పుణ్యమూర్తులు అర్చనామూర్తులై నిలచిన

భద్రాద్రివంటి క్షేత్రములకు మనదేశము పుట్టినిల్లు. తెలుగుపల్లె పట్టులందును, పట్టణములందును శివకేశవాది దేవాలయములతోపాటు రామాలయములు వెలసియుండుట సర్వసామాన్య విషయము. ఆదర్శ దాంపత్యమున కాదర్శమూర్తు లైన సీతారాములు తెలుగుప్రజకు ఐహి కాముష్మిక పురుషార్థసిద్ధికి మార్గదర్శకు లైన మహనీయమూర్తులు.

రామకథను తెలుగుజాతి రక్తితో పాడుకొనుటయే కాక, చంద్రుని కొక నూలుపోగు వలె ఆ కథకు నూత్నకల్పనలను సంతరించి- తన సామాజిక రసికత్వమును ప్రదర్శించుకొనినది. దేశీయతాదృష్టి కలిగిన తెలుగు కవులు జాతిలో ప్రచార మందిన కథాకల్పనల నౌచిత్య మెఱిగి తమతమ కృతులయందు యథావకాశముగా నిలుపుకొనిరి. సంస్కృత సారస్వతముననే విశ్వరూపముదాల్చిన రామకథను తెలుగుకవు లారాధించుటతోపాటు,దానికి నూత్నకల్పన లను ప్రసూన మాలికల నుపాయనములుగా నిచ్చి తమ ప్రత్యేకతను చాటుకొనిరి. రామకథలో తెలుగువారి కల్పన లనంతముగా నున్న వని చెప్పుటకు వీలులేదు కాని సంఖ్యకు పరిమితము లయ్యు రసదృష్టి కనల్పములై తెలుగువారి చిత్తవృత్తికి మణిదర్పణములై రాణించుచున్న వని మాత్రము నిస్సంశయముగా చెప్పవచ్చును.

తెలుగులో రామకథ వెలసిన కావ్యప్రక్రియలను స్థూలముగా నిట్లు పేర్కొనవచ్చును. 1. కావ్యములు (నిర్వచన, వచన, చంపూ, శ్లేషాదులు). 2. ఉపాఖ్యానములు. 3. ఖండకావ్యములు. 4. యక్షగానములు. 5. నాటకములు. 6. హరికథ. బుఱ్ఱకథ మొ॥నవి. 7. సంకీర్తనములు. 8. శతకములు. 9. జానపదవాఙ్మయము. వీనిలో పూర్వోత్తర రామకథలు వర్ణించిన కృతులను ప్రత్యేకముగా నెన్నవచ్చును.

పూర్వరామకథావస్తువు లైన తెలుగుకృతులను చంపూకావ్యములు, ద్విపదకావ్యములు, శ్లేషకావ్యములు, వచనకావ్యములు- అను విభాగము నాశ్రయించి మొదట సమీక్షించుట యగుచున్నది. భాస్కర రామాయణము, మొల్లరామాయణము, రామాభ్యుదయము, రఘునాథ రామాయణము, గోపీనాథ రామాయణము, రామాయణకల్పవృక్షము

మొదలగు చంపూకావ్యములును,రంగనాథ రామాయణము, కట్టావరద రాజరామాయణము, కాచవిభు విఠలరాజుల రామాయణము మున్నగు ద్విపద కృతులును. రాఘవపాండవీయము, నిర్వచన భారతగర్భ రామాయణము, యాదవరాఘవ పాండవీయము మొదలగు ద్వ్యర్థిశ్లేషకావ్యములును, దేవకి వెంకట సుబ్బకవి, పైడిపాటి పాపయ్యగారలు రచించిన రామాయణములు, వ్యావహారికాంధ్రరామాయణము, శ్రీనివాసశిరోమణి రామాయణము, దేవరాజసుధి రామాయణము, శ్రీమద్వాల్మీకి కథామృతము- మున్నగు ననేక వచన రామాయణములును, ఈ సమీక్షకు ప్రధానరంగములు కాగలవు.

తెలుఁగులో మొదటి రామాయణము వెలయునాటికే సంస్కృతమున రామకథ పురాణ కావ్యనాటకాదులలో నవతరించి వినూత్న కల్పనా మహనీయమై విస్తృతి చెందియున్నది. కావున తెలుగుకవుల రచనలపై వాల్మీకి, అధ్యాత్మాది రామాయణముల ప్రభావమే కాక, సంస్కృతపురాణ రామకథాకావ్యనాటకముల ప్రభావము కూడ పడక తప్పలేదు. కావున తెలుఁగు రామాయణ రచనావిశేషములను పరిశీలించునెడ తెలుఁగు రామాయణకృతులలోని వస్తువునకు మూలమును వివేకించుటయు, అవాల్మీకము లైన కల్పనల కాధారముల నన్వేషించుటయు, తెలుఁగుకవుల స్వకపోల కల్పనల నిగ్గుతేల్చుటయు నను నంశములకు సహజముగా ప్రాధాన్యము కలుగుచుండును. ఆపైన తెలుఁగుకవుల కవితాశిల్ప రామణీయకత్వమును, అనువాద విధానమును సమీక్షింపనగును. ఈ గ్రంథరచనమున నిట్టి ప్రణాళిక యనుసరింపఁబడినది.

తెలుఁగున వెలసిన రామాయణములలో మొదటిది తిక్కన సోమయాజి పితామహుఁడగు భాస్కరమంత్రి రచించినది (క్రీ. శ. 1190-1220 ప్రాంతము) ని సాహిత్యచరిత్ర ననుసరించి యూహింపవీలగుచున్నది. కాని ఇది ఉపలభ్యము కాలేదు. కొందఱు విమర్శకులు భాస్కరరామాయణములోని యారణ్యకాండ మీకవిచే రచింపఁబడిన దని భావించుచున్నారు. పెక్కుమంది దీనిని విశ్వసించుట లేదు. కాగా కాలక్రమమునుబట్టి చూచినచో నుపలభ్యములగు

చున్న రామాయణములలో గోన బుద్ధారెడ్డి విరచితమైన రంగనాథ రామాయణము మొదట లెక్కింపఁదగియున్నది. తెలుఁగునాట బహుళ ప్రచారము గలిగి, దేశికవితాసంప్రదాయమున వెలసిన రసవద్రామాయణకృతి యిది. కాని, మార్గసంప్రదాయజ్ఞులు ద్విపద కావ్యములను ప్రామాణికముగా గ్రహింపమిచే రంగనాథరామాయణము తరువాత వెలసిన భాస్కరరామాయణమునకు ప్రాశస్త్యము లభించినది. ఏమైనను మార్గ కవితాపద్ధతిలో భాస్కరరామాయణమును, దేశి కవితాపద్ధతిలో రంగనాథ రామాయణమును తెలుగున రామకథ నావిష్కరించిన గౌరవమును బొందుచున్నవి.

ఇక తెలుఁగుకవులు రామకథామృతమును తమతమ కవితాధారల నాశ్రయించి యెట్లు లోకమునకు బంచిపెట్టిరో నాయా ప్రకరణములందు పరిశీలించుట ప్రస్తుతాంశ మగుచున్నది.



# చంపూకావ్యములు–రామకథ

## భాస్కర రామాయణము

ఆదికావ్యము సంస్కృతమున రామాయణ మయ్యును, ఆంధ్రమున ఆదికావ్యగౌరవము ఆంధ్రమహాభారతమునకే లభించెను. ఆంధ్రమున సర్వలక్షణసమన్వితముగా వెలసిన ప్రథమరామాయణము భాస్కరరామాయణము. ఇతఃపూర్వమే రంగనాథరామాయణము రచితమైనను, అయ్యది ద్విపదకావ్య మగుటంజేసి, ఈ అధ్యాయమున సమీక్షింపబడుటలేదు. క్రీ. శ. 11 వ శతాబ్దమున నన్నయ స్థాపించిన చంపూకావ్యపద్ధతిని భాస్కరరామాయణము ఆంధ్రవాఙ్మయమున ఆవిర్భవించెను.

భాస్కరరామాయణ కాలకర్తృత్వములు వివాదగ్రస్తము లైన అంశములు. ఇందు ఆరణ్యకాండ, యుద్ధకాండలలో కొంతభాగమును భాస్కరుడు, బాలకిష్కింధ సుందరకాండలను తత్పుత్రు డగు మల్లికార్జునభట్టు, అయోధ్యాకాండను అంతేవాసియగు కుమార రుద్రదేవుడును, యుద్ధకాండ ఉత్తరభాగమును మిత్రుడగు అయ్యలార్యుడును రచించిరి. పైమువ్వురును భాస్కరశిష్యులుగనే భావింపబడిరి. కావున మూలపురుషుడగు భాస్కరునినామముననే కావ్యము ప్రసిద్ధి కాంచెను. గ్రంథము సాహిణిమారునకు అంకిత మొనర్పబడెను. ఇందలి కాండాంతగద్యములవలన మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, భాస్కరుడు, హుళక్కిభాస్కరుడు, అయ్యలార్యుడు- అను కవిపంచకముచే గ్రంథము వెలయింపబడినట్లు విశదమగును. ఇందు భాస్కరహుళక్కిభాస్కరశబ్దములు పునరుక్తిమాత్రమే అనియు, ఆరణ్యకాండాంతగద్యములలో పేర్కొనబడినభాస్కరుడు మంత్రిభాస్కరుడనియు, యుద్ధకాండప్రథమభాగమును హుళక్కిభాస్కరుడు తెని

గించెననియు, సోపపదముగాను నిరుపపదముగాను పేర్కొనబడిన భాస్కరద్వయము ఒక్కరే అనియు, నిరుపపదముగా ఉదాహృతమయిన భాస్కరపదము మంత్రిభాస్కరుడు లేక హుళక్కిభాస్కరుడు కాదేని ఉభయులు కలిసి వెలయించిరనియు- వివిధాభిప్రాయములు పండితలోకమున భాస్కరరామాయణకర్తృత్వవిషయమున వ్యాప్తమయ్యెను. వాదోపవాదముల అనంతరము హుళక్కిభాస్కరుడు క్రీ. శ. 14 వ శతాబ్దమున భాస్కరరామాయణమున అరణ్యకాండము, యుద్ధకాండపూర్వభాగములను రచియించినట్లును, 12 వ శతాబ్దము వాడైన తిక్కనసోమయాజి పితామహుడగు మంత్రిభాస్కరున కీకావ్యముతో ఎట్టిసంబంధము లేదనియు- ఇంచుమించు పండితప్రకాండులందఱు ఏకాభిప్రాయమునకు వచ్చిరి.[1]

6726 గద్యపద్యములు గల భాస్కరరామాయణము వాల్మీకి రామాయణానుసారియే అయినను, అధ్యాత్మరామాయణానుసారముగ కూడ సాగెను. ఇందు రాముడు సాక్షాద్విష్ణ్వవతారము, లక్ష్మణుడు ఆదిశేషువు, భరత, శత్రుఘ్నులు శంఖచక్రములు సీతాదేవి మధుకైటభమర్దని యగు యోగమాయ- అను అధ్యాత్మరామాయణపర మగు అంశము లిందు వాచ్యముగనే చెప్పబడెను. భక్తిమాయాసిద్ధాంతములతో ఆంధ్రజానపదజాతీయజీవనములోని బాల్యక్రీడాదులను మేళవించుటయే కాక పద్మపురాణాదిగ్రంథాంతర్గతేతివృత్తాంతములనుకూడ ఎడనెడ స్వీకరించి, భాస్కరరామాయణకర్తలు ఇతిహాసమునకు కావ్యశోభను అపాదించు ఆశయముతో ప్రబంధకవిత్వముతో పండితామోదమగురీతి తీర్చిదిద్ద ప్రయత్నించిరి. జయదేవుని ప్రసన్నరాఘవ నాటకమందలి భావములను కూడ భాస్కరుడు ఇం దాయాపట్టుల గ్రహించెను. వైష్ణవభాగవతపద్మాది పురాణములను తెనిగించినవారివలెనే కవిచతుష్టయముకూడ మూలశ్లోకార్థమును సరిగా గద్యపద్య

---

1. చర్చా వివరములు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి "భాస్కరోదంత గ్రంథము", భాస్కర రామాయణమునకు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు వ్రాసిన పీఠిక (వావిళ్ళవారి 1953 ముద్రణ) యందు గలవు. స్థలాభావమున ఆయంశములు ఇచ్చట పేర్కొనబడుట లేదు.

ములలో నిమిడ్చి కథాశరీరమును అనుసరించి తెనిగించినను కొన్ని చోట్ల స్వేచ్ఛానువాదము కావించిరి.

తెలుగున రామకథ వాల్మీకిరామాయణము ప్రమాణముగా పరిశీలింపబడుచున్నది గావున భాస్కరరామాయణమందలి అవాల్మీకీయాంశములను గురించి చర్చింతము.

పెక్కు తెలుగురామాయణములలో వాల్మీకి రామాయణము నుండి సర్వసాధారణముగ భేదించు ముఖ్యాంశములు కొన్నికలవు. అట్టివానిలో ప్రప్రథమమున పేర్కొనవలసినది బాలకాండమునందలి అహల్యాశాపవిమోచనఘట్టము. వాల్మీకిరామాయణమున అహల్య కేవలము వాయువును భక్షించు, నిరాహారియై సర్వభూతములకు అదృశ్యయై భస్మశాయినిగా ఉండు నని శపించినగౌతముడు భాస్కరరామాయణమున ఆ అమాంగల్యను గదిసి వాయుభక్షణ, నిరాహార, భస్మశాయినియే గాక శిలాకృతికూడ పొంది దృశ్యమాన కాకుండు నని పలికినాడు.[1] ఇట్లు అహల్య పాషాణ మగునట్లు శపింపబడుట పెక్కు తెలుగురామాయణములందు కాంచనగును. ఈవిధానము అధ్యాత్మ రామాయణానుసారి యని పేర్కొనవలెను. అందు అహల్యగౌతమ శాపమున శిలాకృతి నొందుట గలదు. తెలుగురామాయణములు వాల్మీకిరామాయణానుసారులుగనే వెలసినను, అహల్యాశాపము మాత్రము పెక్కురామాయణములందు అధ్యాత్మరామాయణానుసారముగ వర్ణింపబడుట కానవచ్చును.

బాలకాండమున వసిష్ఠుడు జనకాదులకు రఘువంశక్రమము వివరించుపట్టున వాల్మీకిరామాయణము వికుక్షిమహారాజు తరువాత

---

1. "వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మిన్ని వత్స్యసి-" (వాల్మీకిరామాయణము_ బాల. స. 48 శ్లో. 30)
"...ఇట్లయ్యింద్రుని శపించిన యహల్య నమాంగల్యం గదిసి యీవనంబున ననేక దివ్యవర్షంబులు వాయుభక్షణవు, నిరాహారవు, భస్మశాయినివియునై యెవ్వరికిం గానరాక పాషాణంబవై యుండు మని యంతటఁ గరుణార్ద్రమనస్కుండై..." (భాస్కరరామాయణము_ బాల_ 527)

బాణుని, పిమ్మట అనరణ్యుని పేర్కొనగా, భాస్కరరామాయణమున వికుక్షి అనంతరము అనరణ్యుడు పేర్కొనబడినాడు; బాణునినామము కానరాదు. ఇట్లిచ్చట బాణుని నామము పరిహరింపబడగా, త్రిశంకునితరువాత వాల్మీకిరామాయణము దుందుమారుని పేర్కొనగా భాస్కరరామాయణము త్రిశంకునితరువాత చక్రవర్తిగా హరిశ్చంద్రుని పిమ్మట లోహితాస్యుని, అతని పుత్రునిగ దుందుమారుని చూపుచున్నది.[1] ఈవిధముగనే జనకునివంశక్రమమునకూడ వాల్మీకిరామాయణము మిథి తదుపరివానిగ ఉదావసువును పేర్కొనగా భాస్కరరామాయణము వారిరువురినడుమ జనకుని, దేవమీఢ మహీధ్రకుల నడిమివానిగ సువీరుని చెప్పుచున్నది. మూలమున సువీరునిస్థానమున విబుధునినామము కలదు.[2]

మంథరాదుర్బుద్ధికి కారణముగ ఇంకొక చక్కని హేతువు చెప్పబడెను. పూర్వ మొకపరి మంథర బాలరామపాదప్రహారమునకు గురియయ్యెనట! అది వైరకారణముగా గొని ఆమె రామపట్టభంగమునకే సంకల్పించినది. "స్త్రీబుద్ధిః" ప్రళయాంతకః- అనునానుడిని సార్థకము చేసినది. శ్రీరాముడులనే చిటికెనవ్రేలిపై ఆడించి, రామాయణకథను నడిపిన మంథర.[3] ఇట్టి కల్పన యొకటి రంగనాథ రామాయణమునకూడ కాంచనగును. బాల్యమున రాముడు కందుకక్రీడావినోదియై యున్నసమయమున అట కేతెంచిన మంథర అరుదెంచి "చిట్టంటుచేతలఁ జెండు" పట్టగా కట్టలక్కతో రాముడు కాష్ఠముతో మంథరను గొట్టగా దాని కాలు విరిగెను. ఈబాల్యవైరమును మరువని మంథర పట్టాభిషేకమును భగ్నమొనర్చి పగ సాధింప నిశ్చ

1, 2. వంశక్రమపట్టికలు అనుబంధమున చేర్చబడినవి.

3. "కైకేయీ పరిచారిక... యగుమంథర యనునది యొక్కసౌధం బెక్కి... చూచి... యిది... రామచంద్రుని...పట్టాభిషేకమహోత్సవంబు గాఁబోలు... దీనికి విఘ్నంబు గావింపవలయు నని విచారించి తొల్లి కౌసల్యాతనయుచేసం దనకు నైన చరణతాడనభంగంబు వైరంబు కారణంబుగాఁ గొని... యక్కేకయరాజపుత్రిపాలికిం జని యిట్లనియె-"- భాస్కర. అయోధ్య. కాం. 52.

యించినట్లు రంగనాథరామాయణము మంథరపరాభవమును విపుల ముగ వివరించెను.

శ్రీరామదర్శనార్థము సపరివారముగ వెడలిన భరతునకు భర ద్వాజమహర్షి ఆశ్చర్యకరమైన ఆతిథ్య మొసగినట్లు వాల్మీకిరామాయణ మున పేర్కొనబడినది. అయ్యాతిథ్యమందలి ఆకర్షణలకు రామ వియోగదుఃఖిత యైన సేనయంతయు మోహవశము కాగా కేవలము భరతుడు మాత్రము రామపదధ్యానైకచిత్తుడుగ నిశ్చలుడై మునియాశీ స్సులను బడసెను. ఆతిథ్యవ్యాజమున ముని యిడిన పరీక్షయం దాత డుత్తీర్ణు డయ్యెను. భరతశీలమునకు నికషోపలము వంటి ఈ సన్నివేశము తెలుగు రామాయణకర్తలు పలువురి నాకర్షించెను. కాని ప్రథమాంధ్రరామాయణమునమాత్ర మీ అంశము కానరాదు. కేవ లము "మునినాథుఁ డతనిఁ గాంచి తగినవిందులు సేయ నద్దాశ రథియుఁ జిక్కి యారాత్రి మఱునాఁడు"- అని సంగ్రహింపబడెను- అ. 379.

ఆకర్షణీయములైన పెక్కు అవాల్మీకీయాంశములను గ్రహించిన భాస్కరరామాయణకర్తలు ఈ సన్నివేశమును విపులీకరింపనికారణము దురూహ్యము. ఈవిధముగనే మూలమున అరణ్యవాసియైన శ్రీరామునికి జాబాలిముని కావించిన చార్వాకమతోపదేశము కూడ ఇందు పరిహ రింపబడినది.

సీతాజన్మవిషయికమయిన విచిత్రకల్పన యొకటి భాస్కర రామాయణమున కలదు. జనకు డొకపరి సర్వభూషణాలంకృతయై నిజ సౌందర్యముచే దిక్కులు ప్రకాశమాన మగుచుండ నభోమండల మున నిలచిన అప్సరసయగు మేనకను గాంచి, ఆమె రూపవయోవిలాస ముల కలరిన మనముతో ఆమెయందు సంతానము బడయ నభిలషిం చెను. అట్లు తలపోయునంతలో, తద్భావమున రాజునకు మానస పుత్రిక గలుగనున్నటుల ఆకాశవాణి పలికెను. ఆచ్చెరు వొందిన నృపతి బీజముష్టివిక్షేప మొనర్పగా భూగర్భమునుండి శిశువు ఉద యించినది. ఆశిశువునకు "సీతాపద్ధతి....భూతలమునఁ బొడమెనది

కావున సీత యను నామము ఆకాశవాణి యొసగినది. మేదినీపుత్రిక జననక్రమము మరి యే ప్రసిద్ధరామాయణములందును ఈరీతిని పేర్కొనబడలేదు. బ్రహ్మవైవర్త పురాణాదులందు వేదవతియే సీతగా జన్మించినక్రమము వివరింపబడినది. కాని, ఇట్టివిధానము కానరాదు. భాస్కరరామాయణమందలి సీతాజనన వృత్తాంతము ఋశ్యశృంగాదుల జన్మములను పోలుచున్నది.

కిష్కింధాకాండమున కూడ ఇట్లొకనూతనాంశము అవాల్మీకమైనది కలదు. వాలివధఘట్టమున తారదుఃఖోద్వేగమున 'రావణసంహారమున సీత లభించినను, అనతి కాలముననే, ఆమె భూప్రవేశమొనర్చి, రామునకు శాశ్వతవియోగదుఃఖమును కల్పించు' నని శాపమొసగినట్లిందు కలదు.[1] ఉత్తరకాండమున సీతావియోగమునకు హేతువుగా చెప్పబడిన ఈ శాపవృత్తాంతము మరి యే ముఖ్యరామాయణమందును కానరాదు. కాని పద్మపురాణమున మాత్రము సీత కన్యాదశయందు కీరదంపతులకు అజ్ఞానముచే వియోగము కలిగించి, వారిశాపమునకు గురియైన ట్లొకకారణము కల్పింపబడియున్నది. జానపదవాఙ్మయమందు మాత్రము సీతారాముల శాశ్వతవియోగమునకు హేతువుగ విచిత్రములైనకల్పనలు కొన్ని కానవచ్చుచున్నవి. బహుశః భాస్కరరామాయణకర్త లానాటికి వ్యాప్తియందుండిన అట్టి వృత్తాంత మేదియైన గ్రహించియుండవచ్చును.

సంపాతి రామభక్తుని విశదీకరించుఘట్ట మిం దొకటి కలదు. సీతాన్వేషణమున వేసారిన హనుమదాదులకు రావణవృత్తాంతము వివరించినసంపాతి రామకార్యనిర్వహణమునకై సుతు డగు సుపార్శ్వుని రావించి సముద్రలంఘనమునకై ప్రేరేచగా అంగదుడు నివారించి,

1. నరవర ! యి ట్లకారణము నాపతిఁ జంపితి గాన యీవు బం
ధురభుజశక్తితో మహిఁ బోకొని వచ్చిన సీత నీకడం
జిరతరకాల మింపుగ వసింపక నీ పతిదుఃఖపాటుతో
నెరియుచు నుండి భూమిఁ జొరని మ్మనుచున్ శపియించెఁ గిన్కతోన్—"

భాస్కర. కిష్కింధ—305.

తత్కార్యనిర్వహణార్థము కపివీరుల సంసిద్ధతను తెలియజేసెను. అవాల్మీక మయ్యు ఇయ్యది సంపాతి భక్త్యుద్రేకమును, వానరవీరులకు కార్యనిర్వహణముపట్ల గలచిత్తశుద్ధిని తెలుపుచు అత్యంతరమణీయ ముగా నున్నది.

మూలమున సంగ్రహముగ చెప్పబడిన విషయములు కొన్నింటిని భాస్కరరామాయణకర్తలు తమకృతియందు కొద్దిమార్పులతో సుదీర్ఘముగ చెప్పినారు. అట్టివానిలో హనుమజ్జననవృత్తాంత మొకటి. కేసరి యనుకపివరుడు తీర్థోపద్రవకారి యగు శంబసాదను డను దానవుని సంహరించినట్లు వాల్మీకిరామాయణమున గలదు.[1] వానరులకు తన జన్మవృత్తాంత మెరిగించుచు భాస్కరరామాయణమున హనుమంతుడు కేసరి దుష్టగజములను సంహరించిన విధానాదులను వివరముగ చెప్పినాడు. ప్రభాసతీర్థమున గ్రుంకు లిడుమునులను శంఖశబలలను రెండుదుష్టగజములు బాధించుచుండెడివి. అవి ఒకనాడు పుణ్యవనమున భరద్వాజుని గలియబోవగా కపివీరుడు వాటిని సంహరించి భరద్వాజుని అనుగ్రహమునకు పాత్రుడై "కేసరి" యను నామమును బడయుటయే కాక, మునిగణప్రేరితుడై అనిలబలసము డైన పుత్రునిగూడ వరముగా కోరి, పొందెను. వాల్మీకిరామాయణము—సుందరకాండమున కేసరి అసురుని సంహరించగా, ఇందిట్లు మత్తగజముల రెండింటిని హనుమంతునిజనకుడు సంహరించినవిధానము విపులముగా గలదు.

భాస్కరరామాయణకర్తలు మూలమున వివరముగ నున్నవిషయములు సంగ్రహపరచిన సందర్భములుకూడ కలవు. సుందరకాండమున సీతాదేవి హనుమంతునకు చూడామణి నొసగుచు, అయ్యది వివాహమై మెట్టినింటికి పయనమయిన తనకు జనకపత్ని ఒసగినట్లు

---

1. మాలవ్యా న్నామ వైదేహిగిరిణా ముత్తమోగిరిః
తతో గచ్ఛతి గోకర్ణ పర్వతం కేసరీ హరిః॥
స చ దేవర్షిభి ర్దిష్టః పితామమ మహాకవిః,
తీరే నదీపతేః పుణ్యే శంబసాదన ముద్ధరత్॥''— వాల్మీకి. సుం. స. 35 శ్లో. 80, 81.

పూర్వవృత్తాంత మొకటి వాల్మీకి రామాయణమున పేర్కొనెను.[1] భాస్కరరామాయణమున అట్లేమియు జెప్పక శిరోరత్నము హనుమంతున కొసగినట్లు మాత్రము కలదు.

హనుమంతుని కుశలమునకై కుందు సీతకు విభీషణపత్ని యగు సరమ పవనాత్మజునిక్షేమవృత్తాంత మెఱింగించిన ట్లొక అవాల్మీకీ యాంశ మిందు కానవచ్చుచున్నది.[2] వాల్మీకిరామాయణము, అన్య రామాయణములు కొన్నింటియందు ముఖ్యముగ రూపకాదులందు అశోకవనిని కుములుసీతకు విభీషణునిపత్ని (కొన్నింటియందు పుత్రిక) సహాయ మొనరించినట్లు పేర్కొనుట ఇట గమనార్హము.

మూలముతో భాస్కరరామాయణము మరియొకముఖ్యవిషయమున భేదించుచున్నది. రణరంగమున కరుగుటకై తనను వేల్కొల్పగా కుంభకర్ణుడు శ్రీరాముడు రావణవధార్థము భువి నవతరించిన శ్రీమహావిష్ణు వను దేవరహస్యమును మున్ను తాను నారదునివలన నెఱింగినదానిని రావణునకు తెలిపి, సీత నొసగి రాక్షసకులరక్షణము గావింపు మని హితము గఱపెను. దానికి రావణుడు సీతను లక్ష్మిగాను, రాముని నారాయణునిగాను ఎఱింగియే వారిచే నిహతుడయి కైవల్యపదము నొందగోరి, తాను రామపత్నిని చెరగొనినట్లు స్పష్టము చేసెను. రావణకుంభకర్ణు లిట్లు ఆత్మజ్ఞాన పరాయణులుగ ఇందు ప్రత్యక్షమగుచుందురు. అధ్యాత్మరామాయణమున కుంభకర్ణుడు రావణునకు హితము గఱపెను కాని రావణుడు దేవరహస్యము తా నెఱిగియే యున్నట్లు పలుకలేదు. కాని సీతాపహరణానంతరము అశోకవనిలో నిర్బంధమున నున్న ఆమెను మాతృదేవిగ మనమున పూజించుచుండినట్లు కలదు. మందోదరికడ ఈరహస్య మాతడు యుద్ధకాండమున వెల్లడించినట్లు అధ్యాత్మరామాయణ, ఆనంద రామాయణములందు కూడ కలదు. మిగిలిన కథయందుకూడ రావణునికైవల్యపదకాంక్ష గోచరించుచునే యుండును- కాని భాస్కర

1. వాల్మీకి. రా. సుం. 39.

2. భాస్కర. సుం. ప. 492 నుండి 495 వరకు.

రామాయణకర్త లీవాంఛను దశకంఠుని ముఖమున ఇచటనే బహిర్గతము కావించినారు. రంగనాథరామాయణము కూడ భాస్కర రామాయణమువలెనే ఈఘట్టమున రావణకుంభకర్ణు లిద్దఱిని ఆత్మజ్ఞానపరాయణులుగ చిత్రించుట విశేషము!

రావణపరిత్యక్తుడైన విభీషణుడు ఇందు మాతృదేవియగుకైకసిని దర్శించి యావద్వృత్తాంతమును వివరించి శ్రీరామునిసన్నిధి కరుగవలయునను తనఆశయమును కూడ తెలిపెను. కైకసియు తనజనకుడగువిశ్రావసువువలన భవిష్యత్తును తాను పూర్వమే వినియున్న దని చెప్పి, రామరక్షను పొందు మని దీవించెను.[1] వాల్మీకిరామాయణమున విభీషణుడు కైకసిని దర్శించుటయే లేదు.

సాగర దశరథులకు మైత్రికూడ ఇందు చెప్పబడెను. దేవాసురసంగ్రామసమయమున తోడ్పడి నలుపుత్రులు కలుగునట్లు మహేంద్రునికడనుండి వరమును పొందిన దశరథుడు, సాగరునకు కూడ సహాయ మొనర్చి ఆతనినుండి అమూల్యరత్నములను కానుకగా బడసెను. పిమ్మట సాగరుడు ఒకమాసము దశరథునకు అతిథియై అయోధ్యయం దుండెను. శ్రీరామునిదైవత్వమును స్తుతించి సాగరుడు సేతుబంధనసమయమున ఈవృత్తాంత మెఱింగించెను. పంచవటియందు దశరథమిత్రు డైన జటాయువువలె సాగరుడుకూడ పూర్వపరిచితుడే యని పేర్కొని రామాదులకు ఆత్మీయులనడుమ నున్న భావమును కలిగించునుద్దేశముతో కవి యిట్టిఅంశమును జేర్చియుండురు.[2]

రణరంగమున నాగపాశబద్ధు డైన రాముడు అట కరుదెంచిన నారదునాదేశమున గరుత్మంతుని స్మరింప, ఆత డరుదెంచి, రామలక్ష్మణులను పాశవిముక్తుల గావించెను. ఇప్పట్టున నారదాగమనము అవాల్మీక మగు అంశము.[3] విభీషణుడు రణరంగమున కేల్మోడ్చి తనముందు నిలువగా కుంభకర్ణుడు,

1. భాస్కర. యుద్ధ. ప. 148_162.
2. భాస్కర. యుద్ధ. ప. 238.
3. భాస్కర. యుద్ధ. ప. 609_632.

"మనవంశము రక్షించుట
కినవంశజు నాశ్రయింప నేతెంచితి గా
వున రక్షణీయుఁడవు నీ
వనఘాత్మ తొలఁగిచూడు మిటు మాయన్నన్"- అనుటతో సర్వజ్ఞుడుగ, మహోన్నతుడుగ భాస్కరరామాయణమున చిత్రింపబడినాడు.

ఇంద్రజిత్తు మాయవపర్యాయము రణరంగమున కదుపెంచగా వానరవీరులు భీతిల్లి రాముని శరణువేడిరి. అంత అనిలదేవు డరుదెంచి ఇంద్రజిత్తుసంహారమునకై త్వరపడవలసినదిగా శ్రీరాముని హెచ్చరించినట్లు అవాల్మీకీయాంశము మరియొకటి ఇందు కలదు.[1]

అధ్యాత్మరామాయణాదులందు వివరముగ వర్ణింపబడిన కాలనేమివృత్తాంతముకూడ భాస్కరరామాయణమున సముచితస్థాన మాక్రమించుకొనినది. ఈఘట్టము రంగనాథరామాయణకర్తను కూడ ఆకర్షించుట మరియొకవిశేషము.

అధ్యాత్మరామాయణానుసారముగ రావణపాతాళ హోమము కూడ ఇందు స్వీకరింపబడినది. ఇయ్యది రంగనాథరామాయణమున కూడ కాంచనగును.[2]

భాస్కరరంగనాథరామాయణములు రెండింటియందును విభీషణుడు రావణునినాభియందు గల అమృతభాండమును గూర్చి రామున కెరిగింపగా, ఆత డద్దానిని భేదించి రావణసంహార మొనరించినట్లు కలదు. ఇది ఆనందరామాయణానుసారముగ రావణసంహారమును వర్ణించుట !

భాస్కరరామాయణమున శైలి సరసమయ్యును సంస్కృతపద భూయిష్ఠము. వ్యాసభాసకాళిదాసాదుల వర్ణనావైచిత్రులను

1. భాస్కర. యుద్ధ. 1268, 1269,

2. కాలనేమి, రావణపాతాళహోమ వృత్తాంతములు రంగనాథరామాయణము గురించి చర్చించుపట్టున వివరముగ పేర్కొనబడినవి.

ఆయాపట్టులందు వీరనుసరించినట్లు కనబడును. యథామూలముగ వర్ణనలు సాగినను అచ్చటచ్చట అవాల్మీకియాంశములు గ్రహించినట్లే మూలశ్లోకార్థమును సంగ్రహపరచి వర్ణనలు ఆయాతావులందు కావించి నట్లు పేర్కొనవలెను. మూలమున "యథామృతస్య సంప్రాప్తి ర్యథా వర్ష మనూదకే...." (బాలకాండము) అను విశ్వామిత్రాగమన సందర్భమునందలి దశరథుని పరవశత్వమును వర్ణించుతావున "అమృతంబు సంప్రాప్తమైనచందమున" అను పద్యమున మూలశ్లోకము స్వల్పముగమాత్రము స్వీకరింపబడినది.

భాస్కరరామాయణవర్ణనలందు జయదేవుని ప్రసన్నరాఘవ నాటకమందలి హృదయంగమము లగు కొన్నివర్ణనచ్ఛాయలు గోచరించును.

"సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
చండాంశో ర్నిశికా కథా రఘుపతే! చంద్రోఽయ మున్మీలతి
వత్సైత ద్విదితం కథ న్ను భవతా? ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి! హా కురంగనయనే! చంద్రాననే! జానకి!"

—ప్రసన్నరాఘవమందలి యీవర్ణననే

"తపనుఁడు వేపఁజొచ్చె ననుఁ దమ్ముఁడ! వృక్షముక్రిందఁ బెట్టు నాఁ
దపనుఁడు రేయి లేఁడు వసుధావర! చంద్రుఁడు గాని; చంద్రునిన్
నృపసుత! యెట్లెఱింగితివి నీవు; మృగాంకము చూడ నున్కి; హా!
చపలమృగాక్షి! చంద్రముఖి! జానకి! యెక్కడ నున్నదానవే?"

—అనుపద్యరూపమున గాంచవచ్చును. ఈరీతినే,

"వాహివాత! యతః కాంతా తాం స్పృష్ట్వా మా మపి స్పృశం
త్వయి మే గాత్రసంస్పర్శ శ్చన్ద్రే దృష్టి సమాగమః"

శ్లోకార్థము కొంత,

"మంగళపవనమ! నాయుప్రి
యాంగనపైఁ బొలసి పొలయుమా దట నాపై
నంగం బలపక పంపా
సంగ తరంగత్తరరంగశైత్యము పొలయన్"- ఆరణ్య. ద్వి. ఆ. ప. 438)

—అను పద్యమున కలదు.

శ్రీరాముడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రము రావణుని జీవములను హరించి,

"సీత నిమిత్తంబు వగచువసుమతికి రాక్షసాఘము వధియించితి నని చెప్పంబోవుపగిది ఛేదించికొని, పాతాళంబు సొచ్చి, నిమిషార్ధ మాత్రంబునం గ్రమ్మఱి, రాముతూణీరంబు సొచ్చె" నని వర్ణింపబడి నది. (యుద్ధ. 2192) రావణుని పరిమార్చి భూమి జొచ్చి మగిడి శరము శ్రీరాముని తూణీరమున జేరె నను వాల్మీకి వాక్యమునకు కవి కావించిన చమత్కారమైన వ్యాఖ్యాన మిది!

ఇట్లు, ఉపలబ్ధమగు ప్రథమాంధ్రచంపూ రామాయణమును ఆనా టికే వాల్మీకి రామాయణముతోపాటు అన్యసంస్కృతకవుల రామాయణ కీర్తనము ఆంధ్రదేశము నెట్లు ప్రభావితమొనర్చినదో స్పష్టమొనరించు చున్నది. మరియు, ప్రధానముగా పేర్కొనవలసిన విషయము ప్రథమాంధ్రచంపూ రామాయణమగు భాస్కరరామాయణము నరాంకిత ముగా రచింపబడుట!

## మొల్ల రామాయణము

సంస్కృతములోని ముఖ్యములైన ఇతిహాసపురాణాదులు తెలు గులో ననువదింపబడినతరువాత క్రమముగ తెలుగుకవులకు స్వతంత్ర కావ్యములపట్ల ఆసక్తి ప్రబలసాగినది. తత్ఫలితముగ ఆంధ్రవాఙ్మయ మున ప్రబంధయుగావతరణము జరిగినది. శృంగారరసప్రధానముగ పురవిహారాది అష్టాదశవర్ణనాత్మముగ ప్రబంధమందలికథ నడచును. ప్రబంధేతివృత్తము ప్రఖ్యాతముగనే యుండును. సాధారణముగ సంస్కృతపురాణేతిహాసాదులందు స్వల్పముగ నున్నకథ ప్రబంధో చితవర్ణనలతో విస్తృతమై తెలుగున ప్రబంధరూపమున సంపూర్ణత్వ మును చేకూర్చుకొనెను. ఇట్లు ప్రబంధములు తెనుగున వెలువడ నారంభించినకాలముననుకూడ రామకథావిశిష్టతకు తెలుగుకవు లాకృష్టు లగుచునే యుండుట విశేషము. ప్రబంధయుగమున వెలసిన రామా యణగ్రంథములలో ముఖ్యముగ పేర్కొనవలసినది మొల్లరామాయ

ణము, రామాభ్యుదయము, తెలుగుసాహిత్యమునందలి రామకథను పరిశీలించుపట్టున ఒకరామాయణమును మరియొకదానితో సరిపోల్చి గుణగణముల నెన్నుటకంటెను, ఆయాకావ్యములు రచింపబడిన నాటియుగధర్మములను ప్రధానముగ దృష్టియం దిడుకొని, ఏకావ్యమున కాకావ్యమునే వేర్వేరుగ పరిశీలించుట యుక్తము. అట్లొనర్చినచో ఆయాకావ్యముల విశిష్టతను సమగ్రముగ గురుతించుటకు సాధ్యమగును.

భాస్కరరామాయణముతరువాత చంపూకావ్యపద్ధతిని వెలసినది మొల్లరామాయణము.కవయిత్రిమొల్ల రామకథను తనకావ్యమున సంగ్రహముగ చెప్పఁ బ్రయత్నించినది. మహాభారతభాగవతములందలి రామకథ సంగ్రహరూపముననే యున్నను, అచ్చట నది కేవలము ఉపాఖ్యానముమాత్ర మగుచున్నది. రామకథను సంగ్రహపద్ధతిని ఒకకావ్యముగ వెలయించినఖ్యాతి ప్రథమముగ కవయిత్రిమొల్లకే లభించినది. మొల్లరామారాయణమే తెలుగునందలి మొదటిసంగ్రహరామాయణము. ఇందలికథను పరిశీలించుట యనగా అందు కథ సంక్షిప్తముగ చెప్పబడినవిధానమును పరిశీలించుట యగుచున్నది.

మొల్ల జీవించినకాలనిర్ణయము వివాదగ్రస్తము. శ్రీకృష్ణదేవరాయలకాలమునకు చెందినట్లును, క్రీ. శ. 1320 లేక 25 నుండి 1400 లేక 1405 ప్రాంతమునకు చెందినభిన్నాభిప్రాయములు కలవు.[1]

మహాకవిపోతనవలెనే మొల్లయు తనకావ్యమును శ్రీరామప్రేరణమున రచించితి నని పేర్కొనెను. శయ్యారీతిపాకము, చాటుప్రబంధలక్షణములు, ఛందోవ్యాకరణాదులు, దేశీయపదములను, రసభావచమత్కృతులు పలుకుసరణిని ఎరుగకున్నను శ్రీకంఠమల్లేశ్వరుని కృపచే చెప్పనేర్చిన కవిత్వముతో కావ్య మల్లితి నని సవినయముగ

1. స్థలవిస్తరణభీతిచే చర్చావివరము లిచ్చుట పరిహరింపబడినవి. చర్చావివరములు మొల్లరామాయణమునకు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు వ్రాసినపీఠిక యందు గలవు. ఆం. ప్ర. సా. అ. వారి ప్రచురణ.

మనవిజేసుకొన్నను ఆమెకావ్యము సర్వలక్షణసమన్వితమై రామకథా సాహిత్యముననే కాక, ఆంధ్రసారస్వతముననే విశిష్టస్థానము నధిష్ఠించినది.

అలతియలతిమార్పు లున్నను మొల్లరామాయణము యథావాల్మీకముగనే సాగెను. సంగ్రహముగ చెప్పబడిన ఈకావ్యమునందు శ్రావణకుమారచరిత్ర, మంథరావృత్తాంతము, అహల్యాశాపవృత్తాంతము, కబంధవధ, సుగ్రీవరావణద్వంద్వయుద్ధము, ఆదిత్యహృదయము, త్రిజట సీతను రణభూమికి గొనివచ్చుట - ఇత్యాదిఘట్టములు పరిహరింపబడెను. ఇట్టి విధము సంగ్రహరామాయణకర్తలకు అనివార్యమే యై ఉన్నది.

ఇందు, శివధనుర్భంగసమయమున లక్ష్మణుడు భూమ్యాకాశాదుల నుద్దేశించి పరాకు చెప్పెను. [2]

ఇట్లే, పరశురామగర్వభంగఘట్టమున శ్రీరాముడు "మావంటి నృపాలురైన" పోరాడ తగును గాని మహానుభావుడ వగు నీతో రణమొనరించుట పాడికాదు అనగా "విని యెంతయు సంతోషించి భార్గవరాము డప్పు"డు విష్ణువు చాప మెక్కిడు మంచు ఒసంగుటలో వాల్మీకిరామాయణమందు కంటె ఇందు పరశురాముడు శాంతమును ప్రదర్శించినవా డగుచున్నాడు.

ఇందు ప్రధానముగ పేర్కొనవలసినది కైకేయీవరప్రదానఘట్టము. ఇందు మంథర కానరాదు. కార్యభారము నంతయు ఇచ్ఛాపూర్వకముగ కైకయే స్వీకరించినది. దశరథునిచే శ్రీరాము యౌవరాజ్యనిర్ణయానంతరము సాయం, సంధ్య, అంధకారాదివర్ణనలు సంగ్రహముగ, ప్రబంధరీతిని కావింపబడినవి. ఈవర్ణనలందు కవయిత్రి లౌకికానుభవము, ప్రకృతిపరిశీలనానైపుణ్యము, స్త్రీసహజస్వభావము అంతర్గతముగా గోచరించును.

---

2. మొ. రా. బాల. 78. 79, 80.

"కాఱుమొగులురీతి కాటుక చందాన
నీటి భాతి, నింద్రనీలమహిమ
మాషరాశిపోల్కి, మఱిమఱి యపు డంధ
కార మవనియెల్ల గలయఁ బర్వె"- నట! అట్టి "రాత్రి రాజ శేఖరునిచిత్తంబు వచ్చునట్టుగా మెలంగి యాతఁడు దన్ను మెచ్చు టెఱింగి కైక "దశరథుని వరముల కోరెను. మంథరాప్రేరణము, కోపగృహప్రవేశాదులు పరిహరింబడి, ఇందు కైక దుష్టప్రవృత్తి గల దానిగ చిత్రింపబడినది. దిట్టతనమున కార్యసాఫల్యమునకై కష్టనష్ట ములకు ఎదురొడ్డి నిలచి, వాంఛాపరిపూర్ణత నొందగలిగిన ధీరవనితగ ఈఘట్టమున కైక ప్రత్యక్షమగును. "స్వామీ ! రామచంద్రునిఁ బట్టంబుగట్ట సుముహూర్తం బాసన్న మయ్యె" నని విన్నవింప వచ్చిన సుమంత్రునితో ఆమె,

"అనిలో నున్న నృపాలు చిత్తమున కే నాహ్లాదముం గూర్చి నా
తనయుం బట్టము గట్టి రాఘవుని బద్నాల్గేండ్లు కాంతారమం
దనువర్తిల్లఁగఁ బంపఁ గొన్నవరమున్ ద్రోయంగరా దెంతయు
న్వనసీమన్ మునివృత్తినుండు మనుఁడీ వైళంబ యారామునిన్"

అనుచు తనరాజ్ఞీత్వమును ప్రదర్శించెను. ఈపద్యమందు మొల్ల స్త్రీసహజమైన ప్రతిపదజాగరూకత, చిక్కనిమాటలపొదుపు, సార్థక పదప్రయోగ విజ్ఞత, సంభాషణాచాతుర్యము కానవగును.

అబల అయ్యును ప్రాణము లొడ్డి రణరంగమున సహాయ మొనర్చిన ప్రియభార్య కావున కైక కోరినవర మొసగుట దశరథుని కర్తవ్యము. "నృపాలుని" కర్తవ్యమును శిరోధార్యముగ నెరవేర్పవల సినబాధ్యత సచివునిది, అనగా ఇప్పటున సచివుడు సుమంత్రుడు కావున సుమంత్రుని దగుచున్నది. "అనిలో మున్ను నృపాలుచిత్తమున కే నాహ్లాదముం గూర్చి"- అనుటయం దింతటిభావము కలదు. పిదప "రాఘవుని బద్నాల్గేండ్లు కాంతారమందను వర్తిల్లఁగ" అనెను. సత్య వాక్పరిపాలనానిష్ఠులు రఘువంశీయులు, అట్టివంశమునకే కొలికిపూస యైన శ్రీరామునకు జనకునిసత్యవాక్పరిపాలనానిర్వహణమున సహక రింప వలసినబాధ్యత ఎంతయేని కలదు. అతడు శ్రీరాముడు అగుట

ముఖ్యము కాదు- 'రాఘవు' డగుట ప్రధానము! కైక యీభావము పద్యము చివర "ఆరామునిన్ అనుటతో మరెంత స్పష్టమగుచున్నది. అందును రాముడు రఘువంశచక్రవర్తి యగు దశరథునికి జ్యేష్ఠు డగు పుత్రుడు కనుక' రాఘవునిగ బాధ్యత గురుతర మగుచున్నది. వాల్మీకి రామాయణ బాలకాండమున "పూర్వమర్థం ప్రతిశ్రుత్య ప్రతిజ్ఞాం హాతుమిచ్ఛసి। రాఘవాణా మయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః- [1] అని రఘుకులమువా రైన రాఘవులకు ఆడి తప్పుట తగ దని నిండుపేరోలగమున విశ్వామిత్రుడు స్పష్టముచేసెనుకదా! అభావమునే కైక ఇట 'రాఘవ' పదప్రయోగమున వ్యక్తీకరించుచున్నది. ఇట్టి పద్యమున కైక 'గడసుదనమున' భరతయౌవరాజ్యాభిషేకమునకును, శ్రీరామ వనవాసములకును ఇక్ష్వాకులసత్యవాక్పాలన బాధ్యతను జోడించి రఘువంశీయుల నిరుత్తరుల గావించినది. ఈవిధముగ కవయిత్రి మొల్ల ఇందు మూడుకందములు, మూడుస్వల్పవచనములు,ఒకమత్తేభ విక్రీడితములలో రామాయణమునకు కేంద్ర మగు ఘట్టముతోపాటు కైకేయీశీలమునుకూడ ప్రతిభావంతముగ చిత్రించెను. ఇప్పట్టున మంథరాపాత్రను పరిహరించి కైకనే ప్రధానముగ స్వీకరించుటలో కవయిత్రికి పద్మపురాణ, మహాభారత, రఘువంశ, దేవీభాగవతము లందలి ఈ సన్నివేశము ప్రోత్సాహము నిచ్చియుండును.

కైకేయీవరములను సుమంత్రుడు వసిష్ఠునకు నివేదింపగా ఆలించినరాముడు "రాజచిహ్నాంబులు త్యజించి జటావిభూతిపల్కలంబులు దాల్చి ధనుర్ధరుం డై యున్నంత లక్ష్మణుడు భూపుత్రికయును దోడం జనుదేర" కానల కరిగెను. సంస్కృతాంధ్రమహాభారతములు, భాసుని ప్రతిమానాటకము మున్నగునవికూడ దశరథాదులదర్శింపకుండగనే రాఘవుడు కానల కరిగి నట్లు సంక్షిప్తముగ చెప్పుట ఇప్పట్టున గమనార్హము.

అరణ్యకాండమున, "అనుచు బలుకుచున్న నాయార్తనాదంబు విని జటాయు వనెడి విహగహనాథు, డరుగుదెంచి"- రావణునితో

1. వా. రా. బాల- సర్గ-21, శ్లో-2.

సీతాపహరణ సమయమున పోరుసలిపినట్లు చెప్పబడెను.(అరణ్య-43) వాల్మీకిరామాయణమున పంచవటిప్రవేశమునకు ముందు సీతారామలక్ష్మణులకు జటాయువుతో పరిచయము కలిగినట్లు కలదు. సీతాపహరణానంతరము జటాయువు కనిపించుట పద్మపురాణమున కలదు.

సీతావియోగమున క్రుంగు శ్రీరామునిశోకముచే వ్యసనపరుడైన లక్ష్మణుడు "కోపమూఁపుకోఁజాలక కన్నులు జేగురింప ప్రతాపమును ప్రదర్శించి వదినె సీతమ్మను గొనివత్తు ననిపలుక శ్రీరాముడు సాంత్వన వచనములు పలికెను. (అరణ్య 5-64). వాల్మీకిరామాయణాదులందు సీతాన్వేషణమున విఫలుడయి రాముడు ఆగ్రహావేశమున జగములను నిర్మూలన కావింప సమకట్ట, లక్ష్మణుడు శాంతింపచేసినట్లు కలదు. ఆంధ్రసారస్వతమున సన్నివేశమును మొల్లతక్క దాదాపు మిగిలిన రామాయణకర్తలందరు వాల్మీకమునే అనుసరించినట్లు కానుపించును. బహుశః శాంతస్వరూపుడైన శ్రీరామునికంటెను సులభకోపనుడుగ పేర్కొనబడు లక్ష్మణునికే ఆగ్రహము వచ్చుట సమంజసమని మొల్ల స్త్రీ హృదయము భావించియుండనోపు.

కిష్కింధాకాండమున శ్రీరాముడు అంగుళీయకము నొసగి హనుమంతునితో "ఆజానకీ శిరోరత్నంబు మాకానవాలుగా దెమ్మ"నికోరెను. ఇట్లు శిరోరత్నము కొనిరమ్మనుట అవాల్మీకీయమే కాకుండ ప్రఖ్యాతములైన తెలుగురామాయణములందుకూడ కానరాదు. (అరణ్య-26)

సముద్రోల్లంఘన ఘట్టమున

"మొగము బిగించి పాదములు మొత్తముగా నటనూఁది త్రొక్కి నీ
టుగ మొగమెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహు ల
త్యగణితలీల నూఁచి వలయంబుగ వాలముఁ ద్రిప్పి వేగునన్
నగము సగమ్ము గ్రుంగఁ గపినాథుఁడు నింగికి దాఁటె ఔవ్వనన్"
(సుందర-19)

—అని హనుమంతుని గగనప్రయాణసంరంభము కన్నులకుగట్టునట్లు చిత్రింపబడెను.

యుద్ధకాండమున త్రిజట స్వప్నవృత్తాంతమును నిండు పేరోలగంబున విభీషణుడు రావణున కెరింగించిన ట్లందొక కల్పన కలదు. (యుద్ధ- ఆ- 1-13) ఇట్టిది పెక్కు అన్యరామాయణములందు కానరాదు. భాస్కర, రంగనాథాది రామాయణములవలెనే యిందుకూడ విభీషణుడు కైకసిఅనుమతిని బడసి రామశరణార్థియై ఏగెను. (యుద్ధ- ఆ- 1- 30) అధ్యాత్మ ఆనందరామాయణాదులందలి కాలనేమి వృత్తాంతము కలదు కాని తదంతర్గతమగు ధాన్యమాలిచరితము "తనదు వృత్తాంతమంతయును జెప్పి"అని సంక్షిప్తము కావింపబడెను. సంజీవి సహితముగ మరలివచ్చు పవనాత్మజుడు దుస్స్వప్నముచే కలతనొంది "వెలుపల నున్న భరతభూవిభుని గని" రామునిగ భ్రమించుట, మాల్యవంతసంహారము, రావణపాతాళహోమము మున్నగు అవాల్మీకీయాంశములు కూడ ఈ సంగ్రహరామాయణమున చోటుచేసికొనినవి.

ఈ రామాయణము మహిళావిరచిత మగుటంజేసి కృత్యాదియందలి త్రిమూర్తుల దేవేరుల వర్ణనలో ప్రత్యేకత భాసించెను.

"కరిముఖుడుం గుమారుడు వికారపుజేతుల ముద్దుసూపుచున్
గురువులువారుచు న్నరిగ గుట్టలుదాటుచు జన్నుదోయితో
శిరములు రాయుచుం, గబరి, జేర్చిన చంద్రుని బట్టి తీయగా
గరముల జాప నవ్వెడు జగమ్ములతల్లి శుభంబు లీవుతన్"

—ఇత్యాది పద్యములందు హిందూగృహిణీత్వము ప్రతిబింబించెను.

ప్రతిభాసమన్వితమగు మొల్ల కవితావైశిష్ట్యమునకు ఇందలి అహల్యాశాపవిమోచనఘట్టము పరాకాష్ఠయై విలసిల్లుచున్నది.

'క॥ ముదితాపసి వెనువెంటను
వదలక చనుదెంచునట్టి వడి రాముని శ్రీ
పదరజము సోఁకి చిత్రం
బొదవఁగఁ గనుపట్టె నెదుట నొక యుపల మటన్.

క॥ పదనై యొప్పిదమై కడుఁ
గదలుచు బంగారుపూదె కరఁగినరీతిన్
మెదలుచు లావణ్యస్థితి
సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిరలీలన్.

ఉ॥ ఆమునివల్లభుండు గొనియాడుచుఁ బాడుచు వేడ్కతోడ శ్రీ
రామునిఁ జూచి యిట్లనియె రామ! భవత్పదధూళి సోఁకి యీ
భామినీ రాయి మున్ను కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగు వారలకు నమ్మఁగవచ్చును భుక్తిముక్తులన్'

అని యక్కాంతారత్నంబు పూర్వ వృత్తాంతంబంతయు నెంతయు సంతసమ్మున నమ్మనుజేంద్ర నందనుల కెఱింగింపుచు మిథిలానగరంబునకుం జనియె."— బాల- 62- 65.

ఇందు అహల్యా నామము పేర్కొనబడలేదు. ఉత్పలమాల
పద్యము సంపూర్ణముగ రామస్తుతి కుద్దేశింపబడెను. మిగిలిన రెండు
కందపద్యములందుకూడ రాహుముక్త యగు చంద్రికవోలె శాపవిముక్త
అయిన వనితారత్నము మాత్రము వర్ణింపబడెను. ఆమె వృత్తాం
తము వివరింపబడలేదు. స్పర్శమాత్రమున కఠినశిలను సహితము
పరమపవిత్రము, జగదానందకారకము, పునీతము అయిన స్త్రీరత్న
ముగా రూపొందించు రాముని శ్రీపదరజమహిమను పేర్కొనుట
ఇచ్చట మొల్ల ఆశయము కాని, మునిపత్నిని ధూళిధూసరితమగు
శిలగా మార్చిన వృత్తాంతము విపులముగా వివరించుట ఎంతమాత్రము
కాదు. అంతియకాదు ఇప్పట్టున విశ్వామిత్రుని నామముకూడ పేర్కొన
బడక అతడు కేవలము 'ముదితాపసి' 'మునివల్లభుడు'గ వ్యవహరింప
బడుట గమనార్హము. రామశ్రీపదరజః ప్రభావము ఋజువగు పర్యం
తము 'ముదితాపసి'గ నున్న యాతడు, అహల్యాసాక్షాత్కారానంతరము
శ్రీపదమహిమను వర్ణించుకొరకు 'మునివల్లభు డ'య్యెను. శిలయై
ముడిబంగారమువోలె పడియుండిన అహల్య రామపాదనికషోపల
స్పర్శనమున 'కరగిన బంగారుపూదె' వోలె 'లావణ్యస్థితిని' 'కుల
పావన'గ మెరయుట కనులార గాంచుటచే అతడు 'మునివల్లభు'
డయ్యె నని కవయిత్రి భావమై యుండనోపు! రామాయణమును రచి

యించుపట్టున సంక్షిప్తీకరణము ప్రధానమయ్యెను, అందు కవయిత్రి ప్రదర్శించిన అసామాన్య ప్రతిభావిశేషమునకీ ఘట్టము ఒక మచ్చు తునకమాత్రమే! సంగ్రహరామాయణకర్తలు మరికొందరుకూడ అహల్యా శాపవిమోచనఘట్టమున రామ పదరజఃప్రభావమును మాత్రమే వర్ణించిరి. ఇప్పట్టునకథాసంక్షేపము వారి ప్రధానాశయము కావచ్చును. అసహాయముగ లంకయందు బందీకృతయై తన దిక్కులేమికై తల్లడిల్లిపోవుచు ప్రాణత్యాగమే శరణ్యముగ భావించు పట్టునకూడ పరపురుషునితో తృణము చేపట్టి సంభాషించిన సతీ చరిత్రమున అహల్యా సంక్రదన వృత్తాంతము పరిహరింపవలయు నను అభిలాష వారి ఆశయమును ఇప్పట్టున బలపరచియుండును. అందును ముఖ్యముగ మొల్ల స్త్రీహృదయము అవాంఛనీయము లైన ఇట్టిఘట్టములు తనకావ్యమున చోటుచేసుకొనరాదనియే అభిలషించి నది. సంగ్రహరామాయణమయ్యెను సంజీవిపర్వతమును గొనివచ్చుతరి హనుమంత భరత సమాగమము, మాల్యవంతసంహారము, రావణపాతాళ హోమములవంటి రంగనాథరామాయణాంశములను, అవాల్మీకీయము లైన వాటిని గ్రహించిన మొల్ల కాలనేమి వృత్తాంతమును వివరించుపట్టున ధాన్యమాలిచరితము 'తనదు వృత్తాంతమంతయును జెప్పి' అనిమాత్రము పేర్కొని,శాపవిమోచనమును వర్ణించినది. ఇట్లు మొల్ల స్త్రీహృదయమార్దవము వర్ణనాదులయందే కాక ఘట్టముల గ్రహించుటయందు కన్పరచిన ఔచిత్యానౌచిత్య వివేచనము వలన కూడ వ్యక్తమగుచున్నది.

సుందరకాండమున హనుమంతుడు ఒసగిన అంగుళీయకమును, "....జూచి రామ ధరణీశ్వరు ముద్రికఁగా నెఱింగి తా నిచ్చిన మెచ్చి యా కువలయేక్షణ యాత్మగతంబునందు"- అను పద్యమున. ఆహారాదులను గైకొను పట్టున పరిసరములను విశ్వసింపక విపరీతముగ చలించు హరిణముయొక్క నేత్రములతో సీతానయనములను సరిపోల్చి 'కువలయేక్షణ' అను ఒక్కపదప్రయోగమున సీతాచిత్తవ్యాకులము, సంభ్రమము, పరిసరములను స్పష్టముగ ప్రదర్శింపగలిగిన మొల్ల మహాకవయిత్రి అనుట అతిశయోక్తి కాజాలదు.

ఇంకను, ఆంధ్రసారస్వతమునకే అలంకారప్రాయమై అలరారు

"సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడనొక కాంత యయ్యెనఁట పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడ వడి నోడసోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రామపద కంజయుగంబు భయమ్ము పెంపునన్"
-(అయోధ్య. 32)

—పద్యము ఇందలిదే. అధ్యాత్మరామాయణము-బాలకాండమున మునితో మిధిలకరుగుచు గంగ దాటబోయిన రాముని పాదములను నావికు డొకడు అహల్యాశాపవిమోచనము స్ఫురణకు రాగా, ప్రక్షాళన మొనరించినటుల గల అంశమును స్వీకరించి హిందీకవి తులసీదాసు తన తులసీరామాయణమున, మొల్ల తన మొల్లరామాయణమున అతిచమత్కారముగ గుహున కన్వయించి, ఆ ఘట్టమునకు, భావమునకు హిందీ, తెలుగు భాషా సాహిత్యములందే శాశ్వతస్థాన మొనగూర్చిరి.

ఇట్టి కవితాశిల్పము, కల్పనా చమత్కృతులవలన మొల్ల రామాయణమునకు మధురవాణి సంస్కృతరామాయణము (రఘునాథనాయకుని ఆంధ్రరామాయణమునకు సంస్కృతీకరణము) శీరము సుభద్రయాంబ సుభద్రారామాయణము, చేబ్రోలు సరస్వతీదేవి సరస్వతీరామాయణములకన్న అధికప్రచారప్రాచుర్యములు కలిగినవి.

## రామాభ్యుదయము :-

క్రీ. శ. 1540 ప్రాంతమున అళియారామరాజు మేనల్లుడగు గొబ్బూరి నరసరాజునకు అంకితముగ అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయ ప్రబంధమును రచించెను. రామభద్రకవికి 'రామకవి అను బిరుదము కలదు.

ఆంధ్రసారస్వతమున రామకావ్యములు ప్రబంధరీతిని అధికముగ వెలసినవి కాని ప్రబంధముగ కవియే పేర్కొని తల్లక్షణముల కనుగుణముగ కథాక్రమమును కూర్చి రూపొందించిన రామాయణ ప్రబంధము లధికముగా కానరావు. లయగ్రాహి గరుడాచల కవి కౌసలేయచరిత్ర మహాప్రబంధము, రంగయ్యకవి రామోదయము,

చింతలపల్లి ఘనసూరపతి రాఘవాభ్యుదయప్రబంధము మున్నగు ప్రబంధములు మాత్రము కలవు. సత్కావ్యరచనాసామర్థ్యముచే అల్లసాని పెద్దన నందితిమ్మన పింగళిసూరన రాజరాజభూషణాది ప్రబంధకవుల కెనవచ్చు రామభద్రకవి రామాభ్యుదయ ప్రబంధము రామాయణ ప్రబంధములందు ప్రశస్తిని పొందెను. నరాంకిత మగు రామకావ్యము లం దిదియొకటి యగుట మరియొక విశేషము!

అల్లసాని పెద్దన అల్లిక జగిబిగి మూడాశ్వాసములతోడను, పింగళి సూరన కల్పనా చమత్కృతి ఆరాశ్వాసములతోడను తుదముట్టెను. కాని రామభద్రుని రామాభ్యుదయము ఆమూలాగ్రము అల్లిక జిగిబిగి, కల్పనాచమత్కృతులతోడను, విలసిల్లుచుండును.

ప్రబంధపద్ధతి ననుసరించి ఇందు కథ ఆశ్వాసములందు చెప్పబడుటయే కాక తదనుగుణముగ వాల్మీకి రామాయణ కాండలకు భిన్నముగ విభజింపబడెను. ప్రథమాశ్వాసము ప్రధానముగ నగర, పుష్పలావిక, దశరథ, వసంతర్తు, వనవిహార, పుష్పాపచయకేళి, జలక్రీడా వర్ణనలతో ముగియగా ద్వితీయాశ్వాసము దశరథుని మృగయా విహారముతో ప్రారంభమై వేశ్యలు ఋష్యశృంగుని వశపరచుకొనుట వరకు చెప్పను. పీఠికయందు రామరాజాదులను గురించిన విపుల వర్ణన కలదు. రామాభ్యుదయము ఎనిమిది అశ్వాసముల ప్రబంధము. ఎందరెన్ని విధముల రామకథ వ్రాసినను వారందరు వాల్మీకి అడుగు జాడలలో నడువవలసిన వారే! అయినను "కవయః నిరంకుశాః" కనుక వారు రామకథయందు కూడ ఎడనెడ స్వకపోల కల్పన లొనర్చిరి. సంస్కృతమున అట్టివారిలో ప్రథమునిగ భాసమహాకవిని పేర్కొనవలెను. అయ్యలరాజు రామభద్రుడు కూడ అవాల్మీకములగు కల్పనలు కొన్నింటిని తన ప్రబంధమున ప్రవేశపెట్టెను.

అయోధ్యాపుర వర్ణనతో ప్రారంభమయిన ఈ ప్రబంధమున శ్రీరామజననానంతరము పురవర్ణనాది ప్రబంధవర్ణనలకు అవకాశము అధికముగ లేకుండుటచే ప్రథమాశ్వాసమునను ద్వితీయాశ్వాసము పూర్వభాగమునను దశరథ నాయకమున ప్రబంధోచితములగు

పుష్పలావిక వసంతర్తు వనవిహార పుష్పాపచయకేళి జలక్రీడ మృగయావిహారాది వర్ణనలు కావింపబడెను. అనగా రామాభ్యుదయమున రామప్రసక్తి రాకుండగనే దశరథ ప్రధానముగ ప్రబంధలక్షణములగు శృంగారాత్మక వర్ణనలతో ప్రథమాశ్వాసము సంపూర్ణముగను ద్వితీయాశ్వాసమున కొంతభాగము గడచెను. దశరథ నాయకముగ ప్రబంధవర్ణనలు కావింపబడిన కారణమున ఇందు కౌసల్యాది రాజపత్నుల ప్రసక్తి ప్రథమాశ్వాసముననే వచ్చినది. వాల్మీకి రామాయణమునను, పెక్కు తెలుగురామాయణములందును వారిప్రసక్తి దశరథాశ్వమేధయాగ నిర్ణయము జరిగిన తరువాత వచ్చును. ద్వితీయాశ్వాసమున దశరథుడు వేంచులకోరికపై మృగయావిహారార్థ మడవి కేగి మునిశాపమును పొందెను. మునికుమారనిధనవృత్తాంతము వాల్మీకి రామాయణమున అయోధ్యాకాండయందు కలదు. అవసానసమయమున దశరథుడు కౌసల్యకు తన శాపము నెరింగించెను. శాపము నొందు సమయమునకు అందు దశరథుడు అవివాహితుడు. రామాభ్యుదయమున అట్లుకాక మునిశాపముతో శ్రీరామకథకు నాంది జరిగెననదగును. తత్పర్యంతము దశరథ వైభవము మాత్రము వర్ణింపబడెను. రామభద్రు డిట్లు అయోధ్యాకాండమునందలి శాపమును ద్వితీయాశ్వాసారంభముననే మృగయావిహారాది ప్రబంధవర్ణనా సౌలభ్యముకొరకు చెప్పియుండును. అందువలన ప్రబంధవర్ణనలలో నొకటియగు మృగయావిహారవర్ణన కేవలము లక్షణముకొరకు నామమాత్రముగ కాకుండ శాపప్రధానమై కథాగమనమునకు తోడ్పడి సార్థకమగుచు ఇతివృత్తమును సందర్భమున కనుగుణముగ మలుచుకొనుటలో రామభద్రునికి గల ప్రతిభకు చక్కని ఉదాహరణ మగుచున్నది. మృగయా విహారమున,

"కల్పవూనెచ్ఛలికాని యుంకస్థితి
రంజిల్లు శశికిశోరంబు దక్కఁ
జలిమలచూలిచూపుల మరుల్‌గొని చూచు

శివుచేతిముద్దులజింకదక్క
........................................... ।
నితర దృగ్గోచర మృగంబు లెన్నిగలిగె"- నన్నింటిని పరిమార్చె నట! విశ్వామిత్రయాగ సంరక్షణమున సుబాహుని సంహరించి శ్రీరాముడు పరిమార్పక వదలిన మారీచుడు మృగయావిహారమున దశరథుడు సంహరింపక విడచిన హరిణరూపమున శ్రీరాముని కికురించె నని చెప్పఁబూనుట కవిభావ మనవచ్చును. ఇట్లు మృగయా విహార వృత్తాంతము భావికథకు తోడ్పడినట్లే అందలి వర్ణనలుకూడ కూడ భావ్యర్థసూచకములై ఒప్పారుచున్నవి.

వాల్మీకిరామాయణమున వేశ్యలచే ఋశ్యశృంగుని ఆకర్షింప జేసినది రోమపాద మహారాజు. కాని ఇందు దశరథుడే అట్లు కావించి కోసల కేగుదెంచుచు మార్గమధ్యమున ఋశ్యశృంగుడు అంగదేశము నకు వెడలగా, అనావృష్టి తొలగిన కారణమున సంతుష్టుడయిన రోమ పాదుడు తన పుత్రిక శాంతను ఋషి కొసగిన ట్లిందొక ఆకర్షణీయ మైన మార్పు కలదు. అంతియేగాక, ద్వితీయాశ్వాసము శాంతాకల్యాణ ముతో ముగిసినది.

పాయసవిభాగమునకూడ రామాభ్యుదయము వాల్మీకి రామాయణమ నుండి భేదించుచున్నది. అందు దశరథుడు పాయసమునం దర్ధ భాగము కౌసల్యకు, మిగిలిన సగములో సగము సుమిత్రకు, పిమ్మట మిగిలిన దానిలో సగభాగము కైకేయికి, చివరకు మిగిలినదంతయు తిరిగి సుమిత్రకు ఒసగెను. రామాభ్యుదయమున పాయసమును రెండు భాగములుగ చేసి కౌసల్యా కైకేయీల కొసగగా వారాదరమున సుమిత్రను బిలిచి తమ తమ భాగములందు చెరిసగము ఒసగినట్లు అధ్యాత్మ రామాయణానుసారముగ చెప్పబడినది.... [2]

1. ద్వి. ఆ. ప_58.
2. "కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌదతా... పాయసం పృతక్"–
వా. రా. బాల. స. 16. శ్లో. 17_29.
"వసిష్ఠ ఋశ్యశృంగాభ్యా... ప్రియోసమన్వితా"–
అధ్యాత్మ. రా. బాల. శ్లో. 10_12.

విశ్వామిత్రుడు రామునికై దశరథుని కోరు సందర్భమున అతడు రాముడు దైవమను దేవ రహస్యము రాజుకడ వెల్లడి గావింపగా దశరథుడు సంతసించి రామలక్ష్మణుల నొసగినట్లు అధ్యాత్మ రామాయణానుసారముగ చెప్పబడినది కాని అందు దేవరహస్యములు వసిష్ఠుడు తెలిపెను. కాగా ఇందు ఇప్పట్టున వసిష్ఠుని ప్రసక్తియే లేకుండగ సంభాషణ యంతయు దశరథ విశ్వామిత్రుల నడుమనే జరిగినట్లు వ్రాయబడినది. తదనంతరకథలో తాటకాసంహారము మారీచ సుబాహు నిరాసము తక్క మిథిలానగర ప్రవేశమువరకు గల వృత్తాంతమంతయు వదలివేయబడెను. అనగా రామభద్రుడు రామాయణమందలి ప్రధానఘట్టములను సంగ్రహముగ స్వీకరించుచు ప్రబంధ వర్ణనాత్మకముగ తన గ్రంథమును రూపొందించె ననవచ్చును. అహల్యా శాపవిమోచన ఘట్టమును కూడ తక్కుంగల సంగ్రహరామాయణ కర్తల వలెనే అహల్యాసంక్రదనవృత్తాంతమంతయు విడచి కేవల మొక రాతిని నాతిగా జేసిన రామపదరేణుమహిమాభివర్ణనతో క్లుప్తీకరించెను. ఈ సందర్భముననే పేర్కొనవలసిన మరియొక విశేషము మిథిలా నగర ప్రవేశానంతరము విశ్వామిత్రుడు రామునకు జనకజాసౌందర్యమును వర్ణించి చెప్పుట. కుమారసంభవ గంగావతారణాది వృత్తాంతముల నన్నియు వదలి అతిసంగ్రహముగ మిథిలా ప్రవేశ పర్యంతకథను చెప్పిన రామభద్రు డిట సీతాసౌందర్యమును విశ్వామిత్రునిచే సుదీర్ఘముగ పదునాలుగుపద్యములందు వర్ణింపజేయుట ఇందు ప్రత్యేకముగా పేర్కొనవలసిన విశేషము. ఈ విధముగనే శ్రీరాముని యువతులు పెండ్లికుమారునిగ అలంకరించుట గూడ వివరముగనే వర్ణింపబడినది.

పరశురామ గర్వభంగ ఘట్టమున కల్యాణానంతరము" జనపీ జనక బంధుమిత్ర కళత్ర సహితంబుగా రాఘవేశ్వరులు మగిడి చనం దత్కాలకలం బాలకించి" పరశురాముడు శ్రీరాముని ఎదుర్కొనినట్లుగా రామాభ్యుదయము పేర్కొనుచున్నది. నవవధూవరులైన సీతారాముల ప్రథమసమాగమాదులు అన్యప్రబంధములలో నాయికా

నాయకుల కేళీవర్ణన లంత విస్తృతము కాకున్నను కొంతవరకు దీర్ఘము గనే వర్ణింపబడినవి.

"రాముం బట్టము గట్టఁగా దొడరు వార్తల్ నుబ్బినం గైకయా
నామస్త్రీ పతిపూర్వదత్తవరవిఘ్నం బాచరింపన్ సతీ
సౌమిత్రుల్ దనుఁ గొల్వఁ గానలకుఁ గౌసల్యాదశస్యందనా
జ్ఞామాత్రంబు ధరించి యామిహిరవంశస్వామి యేఁగెన్
ధృతిన్" 1

—అనుచు రామాయణమున అతిముఖ్యమయిన ఘట్టము అతి క్లుప్తముగ ముగింపబడుట సంక్షిప్తీకరణమున కవి అవలంబించిన మార్గమును విశదము చేయుచున్నది. అట్లు వెడలిన వారిని వనముల విడువ చింతాకులిత మానసుడయిన దశరథుడు సుమంత్రునిచే స్యందన మంపెను.

ఇందలి అవాల్మీకాంశములలో ప్రధానముగ పేర్కొనవలసినది కాకాసుర వృత్తాంతము. ఒకనాడు సీత మునిస్త్రీలతో కలసి ఫలముల గొని రామసన్నిధి కరుదెంచుతరి కాక మొకటి ఆమెను వెన్నాడుచు విసిగింప దొడగెను. కుపితుడై రాముడు శరప్రయోగము గావించి, తనను శరణువేడిన కాకము నేత్ర మొకటి గ్రహించి, ప్రాణదాన మొనర్చెను. 2 ఇట్లు కాకము ఫలముల గొనివచ్చు సీతను వేధించుట అను అంశము ప్రఖ్యాతములైన రామాయణము లెందును కనరాదు.

వాల్మీకి రామాయణమందు వలె గాక ఇందు జటాయువుతో పరిచయము సీతాపహరణానంతరము జరిగెను. ఖరదూషణులు శ్రీరామునిపై దండయాత్రకు పదునాలుగు వేలమంది రాక్షసవీరులతో మొదటనే వచ్చిరి. పదునాలుగురు రాక్షసులను పంపి, తదుపరి వారు వచ్చుట లేదు. విభీషణుడు రామశరణార్థిగా వెడలు సందర్భమున ఇందు మాతృదేవిని దర్శించి ఆమె అనుమతిని పొందెను. 3 సువేలాద్రిని ససైన్యముగ విడిసిన రాముడు హనుమంతుని అభ్యర్థన అంగీక

1. పం. అ. ప. 3.
2. పం. అ. ప. 66-71.
3. ప. అ. ప-82.

రించి దివిజగరుడ గంధర్వ కిన్నర కంజముఖుల చెఱ విడిపించెను.[1]
అట్లు చెఱవిడినవారు వడివడి తమతమ నెలవుల కరిగిన విధము వారి
జాతులను స్ఫురింపజేయునట్లు చమత్కారముగ వర్ణింపబడినది.

రామభద్రుని కవితాసామర్థ్య మంతయు చమత్కారావహము
లను ఆతనివర్ణనలలో ప్రస్ఫుట మగుచుండును. కరుణరసమును
వర్ణించుపట్ల ఈతడు ఏదేని మరియొక రసమును కూడ జోడించు
చుండుట ప్రబంధమం దెడనెడ కానవచ్చుచుండును. దండకారణ్య
మును ప్రవేశించు సీత

"చయ్యన నేఁగి డయ్యు నొకచక్కి రవిచ్ఛవిఁ జొక్కి వేనలిం
బయ్యెదకొంగు చాటుగొను భర్తకరం బవలంబ యుట్టిగా
నొయ్యనఁ జేరి యూఁతఁగొని యూరటఁగాంచు గమించు నివ్విధిం
దొయ్యలి యవ్విధిం గనలి దూఱుచుఁ బూఁబొదరిండ్లు
దూఱుచున్"_ 2

కటకటబడుచుకూడ ఱాతినేలపై నడయాడుటవలన రామపాద
స్పర్శనమున శిలలు సతీశతంబు లగు నని శంకించి, చరణాబ్జములు
నొచ్చును గాన శిలాతలముల నడయాడ వల దని పతిని హెచ్చరింపగా
సీతామనోభావము గ్రహించిన రాముడు నగుచు దవ్వుల కేగెను.

ఈ విధముగనే, అశోక వనిలో,
"ఘూకకుటుంబినీ కోటిలో నడిరేయి
జక్కవజవరాలు చిక్కినట్లు
జరఠబిడాలికాజాలంబులోపలఁ
జిలుకముత్తైదువ మెలఁగినట్లు
మత్తశిఖండినీమాలికలోపలఁ
బాఁపకన్నియ దగుల్పడినయట్లు
కితవమృగాదనగృహిణీగణంబున
లేడియిల్లా లుమ్మలించినట్లు

1. స. ఆ. ప. 153_155.
2. ఆ. 5_ప. 105.

వేషభీషణ దానవ వితతిలోన!
దల్లడంబులఁ బెదవులు దడుపుచున్న...." సీత
"వల్లభుండు రాక కెల్లప్పుడును దన
యుల్ల మెదురు చూచుచుండు కతన
గాలిఁ గసవు కట్టు కదలినఁ గను విచ్చి

దీన వీక్షణములఁ దేఱిచూచు"[2] -చు, రాక్షసవనితల దుర్వాక్యములకు భీతిల్లి, అడలు నిలుపలేక వాయెత్తి దుఃఖించె నని ప్రబంధమున కరుణరసమునకు పరాకాష్ఠగా రూపొందింపబడిన సన్నివేశమున, అట్లు దుఃఖించు ఆమెయే సీతగా నిశ్చయించి హనుమంతుడు సంతోసాతిశయమున ఫలపుష్పశీధువులు చిప్పిలునటు జెట్టుజెట్టునకు చివ్వున దాటుచు, వాలము త్రిప్పుచు, కొమ్మల వ్రేలాడుచు వానర సహజమైన చేష్ట లొనర్చె నని హాస్యరసము జోడింపబడెను.

ఈ రీతిగనే భీభత్సమున కాలవాలమయిన లంకాదహన ఘట్టమున భయంకరరూపమున హనుమంతుడు అగ్ని ముట్టించుచు "వారింప రాక యథేషవిహారంబు సలుపుచు"న్న సమయమున

"పొదివితేఁ గానక పొత్తులలోపట్లఁ
బోనాడుకొనిన లేఁబురిటియాంద్రుఁ
బొగ చుట్టుకొన వెంటఁ దగుల నేరని వయ
స్యల మోసపోయిన జవ్వనులును
దొడవులేమేనియు వెడలింపఁ బోనిచ్చి
పతులఁ గోల్పోయిన భామినులును
నరుగ లేని ముసళ్ళ నత్తమామలఁ బాయఁ
బాలైన ప్రోషిత భర్తృకలును
జాలిఁ దమతమ ముంగిళ్ళఁ గూలఁబడుచు
నూఁచముట్టుగ గీము లాహుతి గొనంగ

1. ఆ. 6.-ప. 130.
2. ఆ. 6. ప. 133.

నూఁచముట్టుగ గీము లాహుతి గొనంగ
ముఖరపావకశిఖలపై మోఁదుకొనిరి

యది దశగ్రీవు కీడుగా నరయరేమొ ?- [1] అనుచు లంకావాసులు కకావికలై పరువులెత్తుట సకరుణముగా వర్ణింపబడెను.

రంగనాథరామాయణాదులందువలె ఇందుకూడ విభీషణుడు కైకసి అనుమతి బడసి రామశరణార్థి యయ్యెను.

ఇయ్యది ప్రబంధము కావున ప్రబంధోచితములైన అష్టాదశ వర్ణనలకు కథయందు స్థానమొసగి రామభద్రుడు సంతృప్తి నొందలేదు. సంగ్రహరామాయణ మనదగిన ఇందు ఎడనెడ మనోహరవర్ణనలు, అయాసన్నివేశములకు చమత్కారములగు కల్పనలు జోడించి గ్రంథమును అనర్ఘరత్నముగా రామభద్రుడు రూపొందించెను.

ఇట్లు హృదయంగమమగు సన్నివేశముగా తీర్చి దిద్దబడిన వాటిలో హనుమంతుడు సీతను దర్శించి అంగుళీయకమును ఒసగుట ఒకటి. అంజనేయుడు ఒసగిన అంగుళీయకమును స్వీకరించిన సీత మూర్ఛిల్లి, పదంపడి కళ్యాణ మాదిగా గడచిన దాంపత్యజీవితపు వివిధములైన మధుర స్మృతులను స్మరించును. ఇట్లే హనుమంతు డొసగిన చూడామణిని స్వీకరించి యురమున సంప్రీతిం జేర్చుకొనిన రాముడు

"మును వెక్కసముగఁ గ్రోలిన
వనితావార్తాసుధాద్రవము చిప్పిలునో
కనుఁగవ ననఁ బ్రమదాశ్రులు
మొనతెప్పలఁ గురియఁ బ్రణయమూర్ఛం [2] బొరసె"నని- సన్నివేశము కరుణోద్వేలముగ చిత్రింపబడెను.

సేతుబంధన సమయమున రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా సాగరగర్భమున చెలరేగిన సంక్షోభము వర్ణింపబడిన విధము కూడ ప్రత్యేకముగ పేర్కొనదగినది.

1. ఆ. 6 . ప . 250
2 . ఆ. 7 . -ప. 16.

సీతాపహరణ ఘట్టము :-

"తనయాపహరణవేదన
యొనగూడిన రత్నగర్భ నూరార్చుటకుం
జనులీల రాలె సీతా
స్తనముక్తామణులు గుణులు తగవరు లెందున్"-[1] మున్నగు పద్యములు, షష్ఠాశ్వాసమున రాముడు జనకతనయా వియోగవేదనా భారమున క్రుంగు సమయమందలి

"పడియె వడగండ్లు నింద్రగోపములుఁ గూర్మి
ఘనవిభుఁడు క్రొమ్మెఱుంగు జవ్వనిఁ బెనంగ
బన్న సరమున సడలి పైపైని రాలు
విమలముక్తాఫలాబ్జరాగము లనంగ"[2] -అనుచు రాముని విరహము అధికమగు రీతిని కావింపబడిన వర్షరు వర్ణనము కూడ ప్రశంసింపదగినది. "తనయాపహరణవేదన"- పద్యభావము "నీకూఁతుఁ జెఱఁబెట్టి నీచభావమునఁ- గైకొనఁ దలఁచిన ఖలుని ప్రాణములు- కైకొంటి నే నని కదిసి భూస్థలికిఁ- బ్రాకటంబుగఁ జెప్పఁ బఱచెనో యనఁగ"- రావణుని వధించిన రామబాణము భూమిం జొచ్చి మగిడి రామతూణీరమున ప్రవేశించిన దను రంగనాథ రామాయణమందలి వర్ణనను పోలియుండుట- ఇట గమనింపదగిన విషయము.[3]

ఇట్లు రామాభ్యుదయ ప్రబంధము హృదయంగమ మగు సన్నివేశములతో, వర్ణనలతో రామకథాసాహిత్యమున ప్రత్యేకస్థానమును పొందినది.

## రఘునాథ రామాయణము :-

క్రీ. శ. 1535 నుండి 1673 వరకు అనగా తంజావుర నాయక రాజుల కాలమున ఆంధ్రవాఙ్మయము సర్వతోముఖాభివృద్ధిని పొందెను. తంజావురాంధ్ర నాయకరాజ శిరోమణి యనందగిన రఘునాథ నాయ

---

1. అ. 5. ప - 209
2. అ. 6. ప - 14
3. అ. 7. - ప. 103 - 111

కుడు దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమునకు శ్రీకారముచుట్టిన రాజకవి యనందగును. రఘునాథనాయకుడు నలచరిత్ర యను ద్విపద కావ్యమును శ్రీరామాంకితముగను. రఘునాథ రామాయణము, వాల్మీకి చరిత్ర కావ్యములను రచించెను. రఘునాథ రామాయణమున చతుర్థాశ్వాసమున శ్వేతదీప వర్ణనవరకు గల (26 పద్యములు మాత్రము) లభ్యమయ్యెను. ఇం దంతయు బాలకాండకథయే కలదు. ప్రథమాశ్వాసమున అవతారిక, సంగ్రహ రామాయణము, వాల్మీకి శోకము శ్లోక మగుట, ద్వితీయాశ్వాసమున కోసలదేశ అయోధ్యపుర దశరథ వర్ణనలు, పుత్రకామేష్టికై యత్నము, ఋశ్యశృంగ చరిత్రము, తృతీయాశ్వాసమున అయోధ్యకు ఋశ్యశృంగాగమనము, అశ్వమేథ యాగము, చతుర్థాశ్వాసమున శ్వేతద్వీప వర్ణన కలవు. అనగా ఉపలబ్ధ మగుచున్న ప్రథమభాగమందలి కథ యథావాల్మీక మని స్పష్టమగుచున్నది. రసవత్కావ్య మనదగిన ఇందలి కవిత జాతివార్తాచమత్కార యుతము. ఋశ్యశృంగుని దర్శింపగనే అప్సరసలు (ఇందు అప్సరసలను పదము ప్రయోగింపబడుట గమనార్హము-)

"కొమ్మరో నడినెత్తిఁ గొమ్మేమంది యా చుట్టు
జడలు చెంపల వ్రేలఁబడుట యేంది
మెడచుట్టుఁ జిల్లుల చిడిపిరా ల్గూర్చిన
తీరునఁ బూసలపేరు లేంది
............గనుఁగొన మమ్మక్క చూచినపుడె

వెఱపడరె యంచుఁ జేతొమ్ము చఱచి కొనుచుఁ
గడఁగి దగ్గఱఁ జేరక కడనె యుండి-" రట!

—ద్వి. ఆ. ప. 145.

"కలుగునొకో చకోరహితుఁ గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి యుద్ధమునఁ దోఁచిన చందురుఁ జూప రెండుచే
తులఁ గొని పట్టి సంతసముతోఁ దన చేతికిఁ జిక్కె నంచు న
గ్గలికఁ జెలంగు బాలకునిఁ గన్నులఁ జూడగఁ గల్గు భాగ్యముల్"
—(ద్వి. ఆ. ప. 52)

—ఇత్యాది పద్యములందు దశరథుని పితృ హృదయము, పసిపాపల బాల్యచేష్టలు హృదయంగమముగ వర్ణింపబడెను. బాలరామునకు అద్దమున చంద్రుని జూపు యైతిహ్య మిందు చోటుచేసుకొనుట ఇచ్చట గమనార్హము.

విజయనగర సామ్రాజ్యకాలమందలి సాహిత్యమునందువలెనే ఇందుకూడ సమకాలిక జాతీయ జీవిత ప్రతిబింబణము కాంచనగును. కోసలదేశ వర్ణనయందలి ప్రాసంగులు, సన్నవంకలు, బంగారు తీగెలు మున్నగు ధాన్యములను గురించి వివరించుట, పైరులకు గల జలసమృద్ధిని గురించి ప్రత్యేకముగ పేర్కొనుట తంజావూరు రాజ్యమండల సుక్షేత్రత్వ విశదీకరణ మననగును.

ఇందలి శ్వేతద్వీపవర్ణనలందలి కొన్ని భావములు ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యము నందలివిగా గోచరించును. శ్వేతద్వీప వర్ణనము రఘునాథుని వస్తుకవితాసామర్థ్యమునకు (అనగా ఒక్క విషయమునే బహుభంగుల వర్ణించునేర్పునకు) చక్కని తార్కాణము.

సీ. "రమపెండ్లినాఁటి ముత్తెములప్రా ల్పిండిన
విధుకాంత మణికాంతవేది యనఁగ
జలవారణములపోరులు చూచు సలిలభ
ర్తకు నొనర్చిన వెండితమక మనఁగ
జలశాయి హరినాభి చతురాస్యుఁ గొలువ వ
చ్చిన వాహన మరాళసేన యనఁగ
మున్నీటిరాయని ముంజేతి వజ్రమ
యంపుహంపీరు తాయత యనంగఁ

గీ. బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ
దోరహత్తుగాఁ దనరసపూర మిత్తు
ననుచు నెత్తిన ధవళపట్టాంబరాధ్వ
జం బనఁగఁ బాండురాంత రీపంబు వెలయు" (చతుర్థ.ఆ.ప.11)

శ్రీనాథుని కవితయందు మక్కువగల రఘునాథుడు తన కావ్యములందు తద్భావముల నెడనెడ పొందుపరచెను.

'తన దానమహిమ సంతాన చింతారత్న
జీమూతముల సిగ్గు (జెంద (జేయు'—
శ్రీనాథుని శృంగార నైషధము- ఆ. 1- ప. 9.

"తన దానమహిమ చింతామణి కామధు
క్సంతానముల కోజబంతిc గా(గ"—
రామాయణము ఆ. 2. ప. 38.

"పంచమవేదమై పర(గు భారతసంహిత నాంధ్రభాష గావించె"
—(భీమఖండము - ఆ. 1-5)

"పంచమవేదమై పర(గు భారత మంధ్రవచోవిలాసము ల్మించ"
—రామాయణము- ఆం. ప్రథమ- ప. 11.

—ఇత్యాదులు పెక్కుగలవు.[1] రఘునాథ నాయకుని ఆస్థాన కవయిత్రి యగు మధురవాణి ఈ రామాయణమును సంస్కృతీకరించెను.

సాహిత్యరంగమున తంజావురాంధ్రవాఙ్మయయుగము పరిగణింపబడిన కాలమున రామాయణ చంపువు (కర్త: తులజాజీ లేక తుక్కోజీ- 1728-1736), విశేష రామాయణము (కర్త: యాదవ రాఘవ పాండవీయము రచించిన వీరరాఘవ కవి పుత్రుడగు నెల్లూరి శివరామకవి- 1740), రెండవ ఏకోజీ ద్విపదరామాయణము (1737) —మున్నగు రామాయణములు వెలసినవి. ఇప్పట్టున నివి స్థలాభావమున వివరింప(బడుటలేదు.

## అచ్చ తెలు(గు రామాయణము :-[2]

క్రీ. శ. 15-16 శతాబ్దముల రఘునాథ రామాయణము తరువాత పేర్కొనవలసినవాటిలో అచ్చ తెలుగు రామాయణము ముఖ్యమైనది.

1. కాకినాడ ఆంధ్ర సారస్వత పరిషత్తుచే రఘునాథ రామాయణము ప్రకటింపబడెను.
2. పురాణం సూర్యనారాయణ తీర్థులచే పరిష్కృతమై వావిళ్ల రామస్వామి గారిచే 1972 లో ఆంధ్ర సరస్వతీ నిలయం ప్రెస్ మద్రాసున ప్రకటింపబడినది.

కవి సార్వభౌమ బిరుదాంకితుడగు కూచిమంచి తిమ్మకవి పీఠికా పుర కుక్కుటేశ్వరాంకితముగ అచ్చ తెలుఁగు రామాయణమును రచించెను. క్రీ. శ. 17 వ శాతాబ్ది నాల్గవభాగమునుండి 18 వ శతాబ్ది ఉత్తరార్ధము వరకు కవి కాలముగ పరిగణింపబడెను. శ్రీరావు మాధవ రాయ మహీపాలుడు పీఠికాపుర సంస్థానమును ఏలిన కాలమున ఈత డమ్మహీపాలుని ఆస్థానమును అలంకరించెను. రావు మాధవరాయ మహీపాలుడే తిమ్మకవికి కవిసార్వభౌమ బిరుదము నొసగెను. అధునిక కవులలో పెక్కుగ్రంథముల రచించినవారిలో తిమ్మకవిని ప్రధానముగ పేర్కొనవలెను.

"మహేశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి కావ్యరచన కానతి యొసగినట్లు", ఇం దీతడు పేర్కొని తిక్కనాదుల మార్గముననే కావ్యారంభము కావించెను (పీఠిక 13). షష్ఠ్యంతములు కూడ గలవు.

అయోధ్యాపుర వర్ణనము వాల్మీకిరామాయణానుసారిగ కావింపబడినను,

ఉ॥ అందలి కత్తలానిగమినందఁగ గాడుపు తట్టువాలు వే
పందెము వైచి పర్వులిడు పట్టున నోడియకాదె లేళ్ళు బ
ల్గొందలమంది పూరిఁ దినుకొంచును రిత్తయ జంకిచూచుచుం
బందతనంబు మీఱఁ గడుఁబాఱఁ దొడంగెను నాఁటనుండియున్"
—(బాల-11)

—మున్నగు వర్ణనలు స్వకపోల కల్పితములు కూడ కలవు. రావణ సంహారమునకై వేడిన సురలతో శ్రీవిష్ణువు రానున్న రామావతారమును వివరించి, దేవతలను

"క్రమ్మకొని మీరు చెట్టుం
ద్రిమ్మరులై పుట్టు డరిది తేజులెలర్పన్"- (బాల-40)

—అని ఆనతిచ్చెను. వాల్మీకి రామాయణమున శ్రీరాముడిగ జన్మించు మహావిష్ణు సహాయార్థము చతుర్ముఖుడు దేవతలను కపివీరుల సృజింప కోరెను. (వా. రా. బాల. స. 17- శ్లో. 2-6) అధ్యాత్మరామాయణ

మున కూడ బ్రహ్మయే దేవతల కాదేశ మొసగినట్లు కలదు. (అ. రా. బాల. ద్వితీయసర్గ-"విష్ణు ర్మానుషరూపేణ భవిష్యతి రఘోఃకులే.... విజ్వరస్సుఖ మాస్థితః"). పెక్కు తెలుగురామాయణములందు శ్రీవిష్ణువే వరుణాది దేవతలను కపుల సృజింప ఆదేశించినట్లు పేర్కొనుట ఒక విశేషము.

అహల్యాశాప మోచన ఘట్టముగ అధ్యాత్మ రామాయణానుసారముగ ఇందుకూడ "పెనుఱాయి ముద్దుతెఱవ యై" నిల్చినట్టులే చెప్పబడెను. -(బాల. 118)

అయోధ్యాకాండమందలి సాయం, నిశావర్ణనలందు వెన్నెల వర్ణన మొల్లరామాయణమందలి వర్ణనను స్ఫురింపజేయును.

"వేల్పుటేనిక లయ్యెఁ బోల్ప నేనుఁగు లెల్లఁ
గొండ లన్నియు వెండికొండ లయ్యెఁ
బలుకుచేడియ లైరి పొలఁతుకలందఱుఁ
జెట్టు లన్నియుఁ బెట్టుచెట్టు లయ్యెఁ
బాలసముద్రము లయ్యె నోలి నేళ్లన్నియు
నలువబాబా లయ్యెఁ బులుఁగులెల్లఁ
బుడమిఁదాలుపు లయ్యెఁ బడగదా ర్లన్నియు
మేటిసింగ లయ్యె మెకము లెల్ల.

తే. బండురేయెండ కన్నులపండు వగుచుఁ
బిండిచల్లిన తెఱఁగున మెండుమీఱి
యొండుకడనైన నెడలేక యుండి యప్ప
డండఁగొనక జగంబెల్ల నిండుటయును"

—(అచ్చ తెనుగు రా. అయోధ్య - 19)

ఉ. "నారదు లైరి సన్మునులు నాకమహీజము లయ్యె భూజముల్
శారద లైరి భామినులు శంకరశైలము లయ్యె గోత్రముల్
పారదమయ్యె నీరధులు పన్నగనాయకు లయ్యె నాగముల్
వారిదవర్గమెల్ల సితవర్ణము లయ్యెను బండువెన్నెలన్".

—(మొల్ల రా. అయోధ్య - 15)

మొల్లరామాయణమందు వలె ఇందుకూడ కైకేయి సుమంత్రునితో స్వీయవరములగూర్చి తెలిపెను. —(అయోధ్య. 48-49)

మొల్లరామాయణమునందువలెనే, సీతాపహరణ సమయమున ప్రప్రథమముగ జటాయుప్రవేశము కావ్యమున జరిగెను. సీతాపహరణ జనిత సోదర పరిదేవనమునకు ఆగ్రహావేశపరవశు డయిన లక్ష్మణుడు లోకవినాశమునకై సమకట్ట, శ్రీరాము డాతనిని శాంతపరచెను. —ఇట్లు మొల్లరామాయణ ప్రభావ మిందు కానవచ్చు టొక విశేషము. —(అరణ్య - 108, 112)

లంకాదహనానంతరము హనుమంతునకు "వేగ లంకిణి యనెడు తొల్వేల్పు పడఁతిఁ ద్రోవ కడ్డంబుగా వచ్చి"నట్లు చెప్పబడుట మరియొక విశేషము (సుందర. 175). వాల్మీకి, తదితర రామాయణములు పెక్కింటియందు లంకాప్రవేశ సందర్భముననే హనుమంతుడు లంకిణిని నెదుర్కొనినట్లు కలదు.

సముద్రమున పడు వస్తువులు మునుగుటకుగల కారణము, రావణునికి మేలొనర్చు నుద్దేశముతో రెండు చేపలు కపులు వేయు శిలలను కబళించుచుండుట యని సముద్రు డిందు రామునకు లియజేసిన ట్లొక కల్పన కలదు. —(యుద్ధ. 81, 82)

రంగనాథ రామాయణాదులందువలె ఇందుకూడ నాగాస్త్ర బంధన సమయమున నారదు డరుదెంచి, శ్రీరాముని అవతారమూర్తిగ హెచ్చరించి, గరుత్మంతాహ్వానమునకై రాముని ప్రోత్సహించెను. ఇప్పటున దండక మొకటి మనోహరముగ వ్రాయబడెను. —(యుద్ధ- 55-64)

## శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణము :-

ప్రాచీనాంధ్ర సాహిత్యమునందు వలెనే ఆధునిక యుగమున కూడ రామాయణము సముచితస్థానమునే ఆక్రమించినది. ఆంధ్ర వాల్మీక బిరుదాంకితు లైన శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) సవ్యాఖ్యానంబుగ వెలయించిన నిర్వచన శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణమున ఆధునిక యుగమున ప్రభవించిన రామాయణ మహా

కావ్యములందు ముఖ్యముగ పేర్కొనవలెను. వాల్మీకిప్రోక్త మగు సంస్కృత రామాయణమునకు ఇది వ్యాఖ్యానయుక్తం బగు ఆంధ్రీకరణం బగుటంజేసి ఇందు అవాల్మీకీయాంశములు కానరావనియే చెప్ప తగును. వైదర్భీరీతిశైలితో, ద్రాక్షాపాకమున సాగిన ఈ బృహత్కావ్యమందు శృంగారాది నవరసములు వాల్మీకి రామాయణమందు వలె మనోహరముగ పోషింపబడెను. ఇందు,

"పురసింధునగర్త్వినశశి
సరసీవనమధురతిప్రసంగవిరహముల్
పరిణయతనయోదయనయ
విరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్" —అన్నియు వాల్మీకి రామాయణానుకారిగనే కావింపబడెను.

"ఉపమా కాళిదాసస్య'' అని ఖ్యాతిఁగాంచిన కాళిదాస మహాకవికి కూడ తద్విషయమున గురుతుల్యు డయిన వాల్మీకి ఉపమాద్యలంకారములుకూడ సుబ్బారావుగారిచే ఆంధ్రవాల్మీకి రామాయణమున పొందుపరుపబడెను.

ఉదా॥ "గుణవంతోఽనురూపాశ్చ, రుచ్యా ప్రోష్ఠపదోపమాః"
—(బాల. స. 18) - శ్లో. 15.

కం॥ "కాంతిని ప్రోష్ఠపదోపము
లెంతయు ననురూపసుగుణులు" —(ఆం. వా. రా. బాల.506)
—ఈ ఉపమాన సాదృశ్యము నక్షత్ర స్వరూపము నెరింగినవారికి విశదమగును.

రావణ వధానంతరము రాముడు సీతతో

"ప్రాప్తచారిత్ర సందేహా
మమప్రతిముఖే స్థితా
దీపో నేత్రాతురస్యేవ
ప్రతికూలాసి మే దృఢమ్" —యుద్ధ. 118 వ సర్గ- శ్లో. 17.

కం॥ జనశంకిత చారిత్రవు
జనకసుతా ! నీవు నాదుసన్నిధి నిలువన్
గనుకలకవానిముందటి
పెనుదీపమువోలె దాయవిధ మైతి చుమీ. —(యుద్ధ-2702)

—సీత నిర్దోషి యనియు, శ్రీరాముడే శంకాకులితమానసుం డనియు ఈ ఉపమ స్పష్టము కావించెను.

ఈవిధముగ వావిలికొలను సుబ్బారావుగారు వాల్మీకి ఉపమాద్యలంకారములను కూడ ఆంధ్రభాషామతల్లికి అలంకారముల కావించుటలో సఫలీకృతమనోరథు లయిరి.

## గోపీనాథ రామాయణము :-

గోపీనాథము వేంకటకవి ప్రణీతం బగు 'గోపీనాథ రామాయణము' ప్రఖ్యాతిగాంచిన ఆధునిక రామాయణములలో ఒకటి. వాల్మీకి రామాయణమును ఆంధ్రీకరించుటలో వేంకటకవి మూడు విధానముల నవలంబించెను. కృష్ణుడు స్వప్నమున దర్శన మొసగి కావ్యరచన కావింపు మని ఆదేశించినట్లు ఇందు స్వప్నవృత్తాంతము కలదు.

పూర్వ ప్రబంధకవుల ననుసరించి యమకానుప్రాసాది శబ్దాలంకారములతోడను, రూపకోత్ప్రేక్షాతిశయోక్త్యాద్యలంకారములతోడను స్వతంత్రరీతిని అర్థమును పెంచుచు పద్యముల వ్రాసెను.

సీ. బుధజన కులవనంబులు పల్లవింపఁ జే
యుటఁజేసి మాధవసూక్తి గాంచి
కొనరొప్ప నతలోక తమముఁ బాయఁగఁ జేయు
కతన విధుం డన ఖ్యాతి వడసి
సాధుమానససరోజము వికసింపఁ జే
యుటఁజేసి హరి యన నొప్పుమీఱి
భూరివిశ్వంభరాభారంబు దాల్చుట
వలన ననంతాఖ్య వాసి కెక్కి

తే॥ గదయు శంఖంబు చక్రంబు గౌస్తుభంబు
లక్ష్మినందకశ్రీ వత్సలాంఛనములు
శార్ఙ్గవనమాలికలు హైమచారుపటము
మేన దీపింప భార్గవీ జాని దోఁచె" —బాల-359. బాలకాండ మందలి 831; అయోధ్యకాండయందు 90,400; అరణ్యకాండమందు 63, 138; కిష్కింధాకాండమున 90; సుందరకాండమున 864, 258, యుద్ధకాండమున 99 పద్యములు కొన్ని ఇందుల కుదాహరణములుగా గ్రహింపనగును. యుద్ధకాండాంతమున సంధ్యాసమయ, చంద్రోదయ, సూర్యోదయాది వర్ణనములు మున్నగువాటిని స్వతంత్రరీతిని అతిరమణీయముగ, హృదయంగమ మగు కల్పనలతో కూర్చెను.

మరికొన్ని స్థలములందు మూలమునకు సరియగు తెలుగర్థము ను చెప్పుట.

| ఉదా.— వాల్మీకిరామాయణము | గోపీనాథరామాయణము |
|---|---|
| బాల - 18 | బాల - 433 - 436 |
| బాల - స. 53 - 9 - 14 | బాల - 1005 - 1006 |
| కిష్కింధ - స. 3 - శ్లో. 28 - 34 | కిష్కింధ - 150 - 154 |
| అయోధ్య - స. 8 శ్లో. 14 - 19 | అయోధ్య - 197 - 202 |
| అరణ్య - స. 16 - శ్లో. 29 - 37 | అరణ్య - 261 - 266 |
| సుంద - స. 5 - శ్లో. 3 - 7 | సుంద - 186 - 191 |

—ఇత్యాదులు.

వాల్మీకి రామాయణమునకు మతత్రయ పూర్వాచార్యుల వ్యాఖ్యానములనేకములు వెలసెను. వానిలో కతక, మహేశ్వర తీర్థీయ, గోవింద రాజీయ వ్యాఖ్యానములు ప్రఖ్యాతములు. కతక వ్యాఖ్యానము ఉత్తర హిందూస్థానమునందు బహువ్యాప్తియందు కలదు. మహేశ్వర తీర్థీయ, గోవిందరాజీయ వ్యాఖ్యానములు రెండింటియందును విశిష్టాద్వైతులను గోవిందరాజీయ వ్యాఖ్యానము రసవత్తరము అని చెప్పనగును. వాల్మీకి రామాయణ మెట్టిదో ఈ వ్యాఖ్యానము అట్టిదనదగును.

విశిష్టాద్వైతమతసిద్ధాంతనిష్ణాతుడగు వేంకటకవి రామాయణ మందలి వేదాంత ఘట్టములయందును, అన్యస్థలములయందును కూడ గోవిందరాజీయ వ్యాఖ్యానము ననుసరించియే, రమారమి గ్రంథ మంతయు ఆంధ్రీకరించె ననుట సాహసము కానేరదు :

దశరథుడు పట్టాభిషేకమును గురించి శ్రీరామునితో-
"విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః
తావదేవాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ"
-(వాల్మీకి. రా. అయోధ్య- స. 4 శ్లో. 25)

అని పలికినటు లున్న శ్లోకమునకు,

"కేకయరాజ్యాయ రాజ్యశుల్కం దత్వా కైకయా వివాహం కృతవాన్"- అని గోవిందరాజీయ వ్యాఖ్యానావతారిక కలదు.

"అయంవృత్తాంత స్సప్తోత్తరశతితమే సర్గే- "పు"రాభ్రతః
పితావస్సమాతరం తే సముద్వహన్
మాతామహెూ సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్"
ఇతి స్పష్టీ భవిష్యతి"- అని వ్యాఖ్యానము. గోవిందరాజీయ వ్యాఖ్యానానుసారిగ వేంకటకవి ఆంధ్రీకరించిన కారణమున ఇప్పట్టున "దశరథుండు తొల్లి కేకయరాజునకు రాజ్యం బుంకువసేసి కైకేయిని పెండ్లియైనవాఁడు గావునఁ దద్వృత్తాంతంబు మనంబున నిడికొని వెండియు నిట్లనియె"- అని వ్యాఖ్యానార్థమునే సంగ్రహపరచెను.

యుద్ధకాండమున విభీషణశరణాగతి సందర్భమున హితబోధ యొనర్చిన తనను పరాభూతు కావించి, ఖడ్గముచే శిరస్సు ఖండింప ఉద్యుక్తు డయిన రావణుని పరిత్యజించిన విభీషణుడు కైకసికడ కేగి, తద్వృత్తాంతము వినిపించి విలపించెను. అంత, "....అక్కైకసి కొండొకసేపు దుఃఖించి పదంపడి భర్తృవచనంబు దలంచి వత్సా! రావణుని యపరాధంబున సీతానిమిత్తంబుగా సకల రాక్షసులు హతు లయ్యెదరు. రావణుండు రామునిచేత హతుండగుఁ బిమ్మట నీవు రాక్షస

రాజ్యాధిపత్యంబు నధిగమించి చిరకాలంబు లంకఁ బాలింపఁగలవు-మీతండ్రి వచనం బిట్టిది నీ విప్పుడు శరణాగతరక్షణదీక్షితుం డైన రాముని పాలికింజని య మ్మహాత్ముని చరణంబులు శరణంబు నొంది తత్ప్రసాదంబు వడసి సుఖివై జీవింపు మని దీవించి...." (యుద్ధ-320) పంపినట్లు కలదు. ఇట్లు విభీషణుడు మాతృదేవికడ కరిగి విన్నవింప, ఆమె భర్తృవచనముల నెరింగించె నని భాస్కరరామాయణాదులందు కలదు కాని రామశరణార్థిగఁ బొమ్మనుట కానరాదు. మూలరామాయణప్రతులం దెచ్చటను ఈ విషయము లేదు. ఇందు లక్ష్మణ మూర్ఛాఘట్టమున కాలనేమి, ధాన్యమాలిని వృత్తాంతములు భాస్కర రంగనాథ రామాయణాదులందలివికూడ కలవు. శ్రీరామాదులు జన్మించిన తిథి వారములు ఇం దిట్లు కలవు.

ఉ. మేటిగఁ జైత్రశుద్ధనవమీబుధవార పునర్వసూడు క
ర్ణాటక లగ్నమందు గురురాజులు నొక్కటఁ గూడి పర్వస
య్యాటముతో శుభగ్రహము లైదు సముచ్చగతిం జరింప నా
ఖేటవిభుండు మింటినడుమ్రేప సముజ్జ్వలుఁడై వెలుంగఁగన్".

(బాల. 416)

—వాల్మీకిరామాయణమునుండి గోపీనాథరామాయణమున భేదించు కొన్ని ప్రధానాంశములుగా వీటిని పేర్కొనవలెను.

## చంపూ రామాయణము :-

సంస్కృతమున రఘువంశాదిక పద్యమునకును దశకుమార చరితాది గద్యమునకును విలక్షణమై తరువాత తదుభయాత్మక మగు కావ్య ముదయించెను. అదియే చంపువు. ధారానగరాధీశుఁడైన భోజ మహారాజు చంపూరామాయణమును రచియించెను. భోజ చంపువుగ ప్రఖ్యాతిని గాంచిన చంపూరామాయణ మిదియే. షట్కాండలు కల యీ కావ్యమున సుందరకాండపర్యంతము భోజునిచేతను, యుద్ధకాండము లక్ష్మణకవిచేతను రచింపబడెను. ఈ యుద్ధకాండ

మును ఘనశ్యాముడు, రాజచూడామణి దీక్షితులు మున్నగువారు పూరించినను, లక్ష్మణకవియే ప్రథమమున రచించెను.

భోజలక్ష్మణకవుల సంస్మరణార్థముగ ఉత్తరరామాయణ కథను ఉత్తరచంపువుగా పెక్కండ్రు రచించినట్లు తెలియుచున్నది. తంజావూరు పాలకుడైన ఏకోజీరాజు అమాత్యుడగు గంగాధరుని కుమారుడగు భగవంతరాయడు, వేంకటాధ్వరకవి, రాఘవుడు, వేంకటకృష్ణకవి- మున్నగువారు ఉత్తరచంపూకావ్యముల వెలియించిరి- ఇవి అముద్రితములు.

భోజుని చంపూరామాయణము కార్వేటినగర సంస్థానవిద్వత్కవి యగు ఋగ్వేదకవి వేంకటాచలపతిచే ఆంధ్రీకరింపబడెను.

"గద్యానుబన్ధ రసమిశ్రిత పద్యసూక్తి ర్హృద్యాహి వాద్యకలయా కలితేవగీతి"- (గద్యముతోకూడిన పద్యకావ్యము వాద్యముతో పాడిన గీతమువలె హృద్యము)అని భావించిన భోజుని చంపూరామాయణము ఋగ్వేదకవి వేంకటాచలపతి "శబ్దం బనుసరించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున" అనువదించవలె ననెడి శ్రీనాథ (నైషధకావ్య) మార్గానుసారముగ ఆంధ్రీకరింప ప్రయత్నించెను.

మూలమున క్రౌంచమిధునములో ఒక్కదానిని బోయ వధించినట్లుండగా, ఇతడు మిధునమునే సంహరించినట్లు పేర్కొనెను. అమూలకము లగు వసంతవర్ణనము, బాలకాండమున సంతానమునకై దశరథుని విచారము, మిధిలాపుర వర్ణనము, విశ్వామిత్రునిచే సీతా సౌందర్యవర్ణనము, వివాహవర్ణనము మొదలగునవి కలవు. అష్టాదశ వర్ణనములు స్వతంత్రముగ నీ కవి కావించెను. మూలమును విరాధుడు సీత నపహరించిన సందర్భమున, "యాతునః పదవి సైషా యాతునశ్చాస్య లక్ష్మణ....కామం నహన్యతామ్....", "అయికబలయ....భుజభారహీనమేనమ్", "రక్షోవధః ప్రకృత ఇత్యయమేవ.... సరామ"- అను శ్లోకములు, శూర్పణఖ రామునిగూర్చి, "లావణ్యామ్బునిధే

రముష్య.... నిర్మమే"- అను శ్లోకము మున్నగు రమణీయములైన శ్లోకములు అనువదింపబడలేదు. కాన్ని వర్ణనలు మూలమునకంటె విస్తృతముగ, హృదయంగమముగ వ్రాయబడెను. ఇతడు వ్యర్థపదములు ప్రయోగింపకుండ, మూలమునం దాయాపట్టుల రసమును పోషించుచు అలంకారబంధురముగ అనువదించెను.

''అజరాదుల్ పొడగాంచఁ గూడని యసూర్యంపశ్య నారాముదే
వి జనానీకవిలోకభాజనము గావింపన్ మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నానగరలోకశ్రేణికిం జూడ్కి భా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతక్షాత్త్రాభిమానోన్నతిన్''.
(అ. 4. ప. 52.)

—ఇట్లు సందర్భోచితముగ కరుణరసమును చక్కగా పోషించుచు రచించిన పద్యములిం దింకను కలవు.

## శ్రీమదాంధ్ర చంపూరామాయణము :-

భోజరాజవిరచితం బగు సంస్కృత చంపూరామాయణమును అల్లమరాజు రంగశాయికవికూడ ఆంధ్రీకరించిరి. క్రీ. శ. 1860 న జన్మించిన రంగశాయికవి చంపూభారతాంధ్రీకరణముకూడ కావించిరి. వీరి ఆంధ్రీకరణము ఆద్యంత మొకేరీతిగ, రసపుష్టితో, ప్రౌఢముగ చిత్రబంధాదులతోడను, శ్లేషయమకాదులతోడను అలరారుచుండును. దేశ్యతత్సమముల అనుసంధానము సందర్భశుద్ధి కలిగి సరళమై,

"అచ్చతెనుంగుశబ్దములు నచ్చట నచ్చట దత్సమంబులున్
వచ్చుచునున్నయట్లు నుడువంబడి-ముత్యములుం బ్రవాళముల్
గ్రుచ్చిన పేరుతీరుఁగను గూర్చి సమంజసశైలితోడ వా
క్రుచ్చినకైత మంచి దనుకొంచును మెచ్చుచు నుంద్రు కోవిదుల్"

—అని కృత్యాదిని పేర్కొనిన విధమున రంగమశాయికవి గ్రంథమును రసానుకూలముగ నిర్వహించెను. చంపూరామాయణమును ప్రాచీను డగు ఋగ్వేది వేంకటాచలకవియు, అర్వాచీను డగు

పూసపాటి రంగనాయక కవియు కూడ ఆంధ్రీకరించిరి. -అయ్యవి మూలాతిక్రమణలుగ, దీర్ఘసమాస భూయిష్ఠములుగను కన్పట్టు చున్నవి. జయంతిరామయ్య మున్నగువారుకూడ చంపూరామాయణ మును ఆంధ్రీకరించిరి.

## రామోదయము :-

చంపూరామాయణము తరువాత పేర్కొనవలసినది రామో దయము. రామోదయ కృత్తికర్తను గూర్చిన వివరములు అలభ్య ములు. చిన్నయసూరి కాలమున జీవించి అతని శిష్యగణమున కల డనువాదము ఒకటి మాత్రము కలదు. కావ్యకర్తనామము "....రంగ యాభిదాన ప్రణీతంబైన...." అని కాండాంతములందు పేర్కొనబడు టచే ఇయ్యది రంగయ్యకవి కృతముగా భావింబడుచున్నది. ఇట్లు కావ్యాంతర్గత విషయములవలన దక్క, ఇతరముగా కావ్యకర్త వివ రములు అలభ్యములు.

"సంగ్రహము గాక మిగుల విస్తరము గాక
పుడమిఁ బండితపామరబోధకముగఁ
బద్యఫణితిని శ్రీరామభద్రుకథన
మెఱుఁగ బల్కుము మాపేర నింపుమీఱ"- అని ఉత్తర రంగ నాధుడు స్వప్నమున ఆదేశించినట్లు కవి కృత్యాదిని పేర్కొనెను.
(బాల. 26.)

"....అడుతటి నొక్కనాఁడు సమానవయస్కులతోడ రామచం ద్రుండు గందుకక్రీడ సల్పు సమయంబునఁ గైకేయిదాసి మంథర యనునాతి యడ్డంబురా రాముండు సేతికోలఁ గాలు విఱుగవ్రేసిన నది యాత్మగతంబున గ్రోధం బుంచి చనియె"- (బాల. 166.) అని అవాల్మీకీయాంశము కలదు. ఇయ్యది రంగనాథరామాయణాదులందు కాంచనగును.

"రాముఁ డాత్మజుడంచు నెంచకు రాజసత్తమ.... అతఁడు విష్ణువు, దైత్యవధార్థమై మానవుఁడై వెలసినాడు"- అని విశ్వామిత్రుడు

బాలకాండమున దశరథున కెరింగించెను. ఇది అధ్యాత్మరామాయణ పరమగు అంశమయ్యెను, అందు వసిష్ఠుడు ఈ దేవరహస్యమును దశరథున కెరింగించెను. (బాల. 184, 185.)

"వామనుండై జనించిన వనజనాభుఁ
డీవె కద నిక్కముగ నిప్పు డెంచిచూడ
నినకులంబున శ్రీరాముఁ డనఁగ బుట్టి
మునులఁ బాలింప వచ్చితి వనఘచరిత" -(బాల. 226) అని సిద్ధాశ్రమమున వామనావతార వృత్తాంతము వివరించు పట్టునను,

"ఆదివరాహం బై యి
మ్మేదిని నొకకోఱ నిల్పి మెఱసిన నీకీ
పేద యగు ధనువు నెత్తఁగ
రాదే యెక్కిడఁగదయ్య రాజీవాక్షా". -(బాల. 475.) అని శివధనుర్భంగ సమయమునను విశ్వామిత్రుడు శ్రీరామునికడనే అతని అవతారరహస్యమును వెల్లడి కావించెను.

అయోధ్యాకాండమునందు, గుహునిరాజ్యమున సీతారాములు

"శయనింప సౌమిత్రి శరచాపహస్తుఁడై
యగ్రజుసంరక్షణార్థ మపుడు
పదునాలుగేం డ్లన్నపాననిద్రాదులఁ
బరిహరింతు నటంచు బ్రతినఁజేసి"
—అని రంగనాథరామాయణాద్యనుసారముగ చెప్పబడెను. (అయోధ్య. 200.) ఈవిధముగనే అరణ్యకాండమున, రంగనాథ రామాయణాదులందలి జంబుమాలివృత్తాంత మిందు గ్రహింపబడెను.
—(అరణ్య. 119-138)

అరణ్యకాండమున, పర్ణశాలముంగిట బంగరుజింక

గీ॥ "కాలసన్నిహితం బయ్యెఁగానఁ బూని
లంక దగ్ధంబు సేయఁగా రమ్మటంచుఁ
బిలువనేతెంచు యమదూత చెలువుదోఁపఁ" కన్పట్టెనట!
(అరణ్య. 269.)

భాస్కరరామాయణాదులవలె యిందుగూడ విభీషణుడు మాతృదేవియగు కైకసి అనుమతి బడసి రామశరణార్థిగా వెడలెను. బ్రహ్మవరమున నిద్రించు కుంభకర్ణుని పాలికి జని, సోదరునకు ప్రణామం బాచరించి, పిమ్మట రామస్కంధావారమునకు వెడలిన ట్లొక నూతన కల్పనము, విభీషణుని భ్రాతృభక్తిని వెల్లడించునది కలదు. (యుద్ధ. 111.)

"....వలీముఖ సంఘంబులు తరులుగిరులు వర్షధారల బోలె గురియ నన్నియు నలుం దొక్కకరంబునఁ గొని పాథోనిధిని వైచుచుండం గని యాంజనేయుండు క్రోధంబునం జని యోజనసప్తకంబగు నగం బొక్కటిం గొని వచ్చుటఁ గాంచి రాఘవుండు ప్రబోధింప నలుడిరుకరంబుల నందికొనియె...." అను చమత్కారకల్పన యిందొకటి కలదు. (యుద్ధ. 187.)

తనకు ధర్మమార్గ ముపదేశించు జనని కైకసికి "మున్ను శుక్రుడెఱింగించియున్న తెఱంగు మనంబునం దోపం దెలివొంది రావణుండు కైకసింగని"- తొలిజన్మమున జయవిజయులగు తాము (అనగా రావణకుంభకర్ణులు) బడసిన శాపవృత్తాంతాదులను శ్రీరామావతారావసరమును, మోక్షప్రదాయిని యగు సీత ఎడల తనకు గల భక్తిప్రపత్తులను వివరించెను. అవాల్మీకీయమగు ఈ అంశము భాస్కర, రంగనాథులందు కాంచనగును.

రామోదయ కావ్యమున రావణ కైకసీ సంవాదఘట్టము రంగనాథరామాయణాదులకంటెను రావణహృదయమును స్పష్టమొనరించుచుండును.

క. "కామకుడ నగుచు సీతా
భామను నేఁ దేను వినుము పాపవుఁదను వీ
భూమిం బడద్రోయుటకై
నామదిఁ దలపోసి తెచ్చినాఁడ నెఱుఁగుమా.

ఆ. ఎట్టులయిన రాముఁ డీతను వెడఁ బాపు
నవలిజన్మమునకు నరుగువాఁడఁ

గాన వినుము నీదు కడగొట్టుసుతునిచే
దనుజకులముఁ ద్రోచికొనుము మనుము.

ఆ. తల్లి నీ వెఱుంగు ధర్మశాస్త్రంబుల
నెల్ల నేర్చినాఁడ నెఱుకగలను
వేయిమాటలేల....?”- ఈ పద్యములలో రావణుని ధీరభక్తి, మహోన్నతశీలము విశదమగును. ఇప్పట్టున రామాయణమున రావణుడే రామభక్తాగ్రేసరుడుగ కన్పట్టును. రావణు డింతటిభక్తుడు కనుకయే, శ్రీరాముడు వనవాసాదిక్లేశముల కోర్చి, నిజభక్తుని శాప విముక్తికై లంక కేతెంచె ననిపించును. ఇట్లు రావణహృదయమును స్పష్టముగ చిత్రించు ఈసన్నివేశము ఈకావ్యమందలి ఆకర్షణీయము లైన ఘట్టములలో ప్రధానముగ పేర్కొనవలెను.

దేవరహస్యము, సీతయే వేదవతి యను సత్యమును చెప్పి, హిత బోధ కావింప యత్నించు జననితో “లంక నిశ్శంక నేఁ బదిలక్షవేలేండ్లు పూని పాలించు యెనలేని భోగభాగ్య వైభవము లంది నిర్జరవరులు గొల్వ వెలసినాడ నిజబలవిక్రమమున్”- అంతటి రాక్షసరాజునైన నేను ధరణిజ నొసగి పౌరుషదూరముగ ప్రవర్తింపజాల ననిన రావ ణుడు క్రమముగ తాను కరగి-కైకసిని ప్రసన్నురాలిం గావించుకొని, తుదకు కైకసితోపాటు ఆంధ్రపాఠకలోకమునుకూడ కరుణోద్వేగ మన స్కు లగునటుల వీర, దయాకరుణ ప్రధానముగ ఇప్పట్టున కైకసితో భాషించెను. లోకమున ఎన్ని ప్రవాదములు ప్రబలినను ఆత్మీ యులు సత్యము నెరుగవలయునను మానవసహజమగు మనోవేద నము ఇప్పట్టున రావణునిలో కన్పట్టును. తత్కారణముననే హృద యాంతర భావమును హితవరిగ స్వీకరించిన కైకసికి మాత్రము విదిత మొనర్చెను. తన తదనంతరము దానవరాజ్య భారమును వహించ వలసిన విభీషణుని ఆతడు ప్రయత్నపూర్వకముగ రామశరణార్థిని కావించె ననికూడ ఈసన్నివేశము భావింపజేయును. దేవరహస్యము విభీషణు డెరింగిన, కార్యహాని కాగల ప్రమాద మున్నదికదా! అందు వలన పరిత్యాగ వ్యాజమున రావణుడు సోదరుని తన యభీషమున కనుగుణముగ ప్రవర్తిఁజేసి యుండెను. భాస్కర రంగనాథ రామా

యణాదులందుకూడ రావణ కైకసీ సంవాదము కలదు కాని రామో దయమందలి ఘట్టము కరుణోద్వేల సమన్వితము. భాస్కర రంగనాథాదులందు దయాకరుణములకంటెను ఆశ్చర్యాద్భుతములు అధికస్థానము నాక్రమించుకొనుచున్నవి.

ఇం దింకను రంగనాథరామాయణమునందలిఘట్టములు కలవు.

## కౌసలేయ చరితము :-

లయగ్రాహి గరుడాచలకవి కృతమగు "కౌసలేయచరిత మను మహాప్రబంధము"- అయిదాశ్వాసముల కావ్యము. గరుడాచలకవి బోర్వెల్లి సంస్థానమం దుండెను. బోరవెల్లి సంస్థానాధీశ్వరులు పాక నాటిరెడ్లు. కౌసలేయచరిత్రము వీరి ఇలవేల్పగు కేశవస్వామికి అంకితముగా రచింపబడినను కవిపోషకులు సంస్థానాధీశులయిన కతమున వారి చరిత్రముకూడ ఇందు విపులముగా కలదు. గ్రంథస్థాంశముల వలన కవిని గద్వాల పెదసోమ భూపాలునకు సమకాలికునిగ స్వీక రింపనగును.

బోర్వెల్లి కేశవస్వామి స్వప్నమున సాక్షాత్కరించి కౌసలేయ చరిత్రమును తనకు అంకితముగా రచింపవలె నని ఆదేశమిచ్చినందున "-అంకితముగా నాయెనర్పంబూనిన కౌసలేయచరిత్రం బను మహా ప్రబంధమునకు కథాప్రారంభం బెట్టిదనిన"-

ఉ. శ్రీనిలయాగ్రజస్థితి ధరించి గురున్నతరీతిచే సుధ
ర్మానఘ భోగభాగ్యము లహర్నిశ మీాయగ నోపి సాధశో
భానిరవద్యనిర్జరశుభక్రియ లూని యసాధ్యమై యయో
ధ్యానగరంబు పొల్చు వసుధన్ వసుధామనియుక్తి స్వర్గమై"

—అని అయోధ్యాపురవర్ణనతో కథాప్రారంభము కావించెను....

ఆశ్వాసాంత గద్య మిట్లు కలదు :

"ఇది శ్రీమదహోబలనృసింహ కరుణాకటాక్షలబ్ధోభయభాషా నిరంకుశ లయగ్రాహి సీతాపతిపౌత్ర నృసింహకవిపుత్ర హరితసగోత్ర

పవిత్ర గరుడాచల కవీంద్రప్రణీతం బైన కౌసలేయచరిత్రంబను మహాప్రబంధంబునందు పంచమాశ్వాసము".

అముద్రితమయిన ఈ గ్రంథమున, గ్రంథాద్యంతము లిఖింపబడిన లిపి, ఆశ్వాసాంతగద్యములన్నిటితోను భేదించుచున్నది. కొన్ని ఆశ్వాసముల చివర గద్యము వ్రాయబడక స్థలము విడువబడినది. ఒకగద్యమున "అష్టవిధబాషాకవిత్వసంపన్న సారస్వతాభినందిత" యని విశేషణ మధికముగ కానవచ్చుచున్నది. కనుక లభ్యమగు గ్రంథము కూడ మూలమునకు ప్రతిమాత్ర మనియు గ్రంథకర్త వ్రాసిన ప్రతి కాదనియు భావించుట కవకాశమున్నది. అచ్చుటచ్చుట శిథిలమైపోయినది.

## మాలికా రామాయణము - షట్కవి ప్రణీతము :-

మాలికా రచనము ఆంధ్రసారస్వతమున విశిష్టస్థానమును ఆక్రమించెను. ఆంధ్రకవితాపితామహుడు పెద్దనామాత్యుడు "పూపమెఱుంగులున్" అను మాలికారూపమున ఆంధ్రకవిత్వమందలి తీయందనమును నాటి పండితులకు విశదము కావించెను.

మహాభారత భాగవతములు ఆంధ్రమున కవిత్రయము, పోతనయు తచ్ఛిష్యులును అనువదించిరి. భాస్కరాదులు రామాయణానువాదము కావించిరి. ఆవిధముగనే ప్రథమాంధ్ర మాలికా ప్రబంధ మనదగిన "మాలికారామాయణము"ను ఆరుగురు కవులు వెలయించుట ప్రశంసార్హము.

| | | |
|---|---|---|
| బాలకాండము | — | అకుండి వేంకటశాస్త్రి, |
| అయోధ్యాకాండము | — | పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, |
| అరణ్యకాండము | — | దేవగుప్తాపు వేంకటరమణ కవిరాజు, |
| కిష్కింధాకాండము | — | చింతలపూడి సన్యాసిరావు, |
| సుందరకాండము | — | మూలా పేరన్నకవి, |
| యుద్ధకాండము | — | ఉప్మాక నారాయణమూర్తి |
| | — | రచించిరి. |

ఇందలి కథ కవుల స్వకపోలకల్పితమే కాని ఆంధ్రీకరణముకాని, సంస్కృత గ్రంథముల నాధారముగ గ్రహించినట్లు కాని కానరాదు. వర్ణనలందు పరవశులు కాక, కథాగమనమును అతిత్వరితముగ సాగించిరి. కవుల అతిప్రసన్న మగు శైలికి యీ పద్యములను గ్రహింపవచ్చును.

"....వేల్పులార ! కా
లమెగద కారణమ్ము సకలమ్మున కయ్యది రాకయున్న దై
త్యమద మడంపజాల విను డయ్యది వారికి జేరు వయ్యె దు
ర్దములగు వారి ద్రుంపగ నరత్వముతో నిలగోసలాఖ్య దే
శమున నయోధ్యయ న్నగరసత్తమ మేలుచు రాజమౌళి యై
యమలచరిత్రుడౌ దశరథావనిభర్తకు నందనుండ నై
మిము మనుపం దలంచితి"– (బాలకాండము)

కొన్ని ఎడల చక్కని సంస్కృతపదప్రయోగము హృదయాకర్షకముగ కలదు.

"ఆరాకేందుముఖిన్ మృగేంద్రతనుమధ్యన్ చంద్రికాహాసినిన్
చారుస్వర్ణశరీరసట్చరణకేశన్ చంపకఘ్రాణ జం
బీరప్రౌఢఫలస్తనిన్ అపరలక్ష్మిన్ జానకీదేవినిన్"
–(అరణ్యకాండము)

సుందరకాండకర్త రసానుగుణముగ కావ్యమును రచించి రస పోషణమును చక్కగా నొనరించెను. ఈ కావ్యమున కథ మొదటి అయిదు కాండములందును ప్రబంధరీతిగనే వర్ణింపబడెను. యుద్ధ కాండమున మాత్రము రామకథకు యోగశాస్త్రము జోడింపబడి వ్రాసి నట్లు కానుపించును. రామాయణ షట్కాండలు మాలికగ ఒకే వృత్తమున ఒకే ప్రాసముగ రచింపబడెను.

ఇందు కథ సంగ్రహముగ చెప్పబడెను. తాటక, అహల్యాది వృత్తాంతములు కలవు. కాని అతిసంగ్రహములు. బాలాయోధ్య కాండములు ఒకేప్రాసమున(మాలికా)వృత్తమున ఆద్యంతము నిర్మింప బడెను. అరణ్య, కిష్కింధాకాండములు మాత్రము పీఠికాభాగమం

తయు కందాదిపద్యములతోడను, కథారంభమునుండి మాలికగను కలవు. సుందరకాండము ఉత్పలమాలావృత్తమున కూర్పబడి నను అద్యంతమునకు కథావిషయమునుండి భేదించు పద్యములు మాత్రము భిన్నప్రాసమున రచింపబడెను. రామాయణకథాభాగ మంతయు మాలికయందే కలదన దగును.

## శ్రీ యోగానం దాంధ్ర రామాయణము :-

చిల్లరిగె యోగానందయ్య పంతులుగారిచే రచింపబడిన యోగానందాంధ్ర రామాయణమున పదకొండువేల గద్య పద్యములు కలవు. పండితపామరజనరంజక మగురీతిని వీరికవిత్వము ధారాళమై గంభీరమై యుండును. శైలి రమణీయము-కదళీపాకమునకు స్ఫోరకముగా నుండును కథ యథావాల్మీకము. అహల్యాశాపవిమోచన ఘట్టమున మాత్రము భేదము కలదు.

అహల్యా గౌతములు సుఖముండిన తఱి,

"ఇంద్రుండురుమోహతమ
స్సాంద్రుండి....
....సాంద్రాశ్రమమర్ధరాత్రి సమయము సొచ్చెన్.

చోరబడి యెక్కి కుటీరము
వెరవున నెఱకలు విదిల్చి వేఁగినదని కొ
క్కొరొకోకో యని యఱవఁగ
సరిదాప్లావార్థము ముని చయ్యన చనియెన్" (బాల 798. 800)

అహల్యను "మహాశ్మాకారముం దాల్చి నీ, దోసం బేగెడిదాక నీడఁబడి వాతూలమ్ము భక్షింపవే"- అని శపించెను. -(బాల. 808)
ఇట్లులతిమార్పు లటనట గోచరించుచుండును.

ఈవిధముగ సారస్వత ప్రపంచమున ఆధునిక యుగమున సంప్రదాయ మార్గానుసారముగ రామాయణము పెక్కుకవులకు కావ్య వస్తువుగ మహాకావ్యములు వెలసినవి. పై రామాయణముల పరిశీలన మువలన తెలుగున వెలసిన రామాయణకావ్యములు అధికముగ వాల్మీకి

రామాయణానుసారులనియు, కొందరు కవులు వాల్మీక్యేతరములయిన రామాయణములనుండి, చమత్కార సౌరభమును వెదజల్లి ఆకర్షణీయాంశములను తమ గ్రంథములందు స్వీకరించి రనియు తెలియును. మరికొందరు కవులు గోవిందరాజీయాది వాఖ్యలను, యోగశాస్త్రాది శాస్త్రలక్షణములను కూడ మేళవించి రామాయణమును నవ్యరీతిని రూపొందింప ప్రయత్నించిరి ఆంధ్రసారస్వతమున పద్యకవిత్వమునకు అగ్రస్థానము నన్నయాదుల కాలమునుండి కలదు. భాస్కర రామాయణాది మహాకావ్యములవలెనే, సారస్వతమున నాటక, ఖండకావ్య, భావకవిత్వాది శాఖోపశాఖలు విస్తృతముగ వ్యాప్తినొందిన ఆధునిక యుగమునకూడ వావిలికొలను రామాయణము, రామాయణ కల్పవృక్షాది మహాకావ్యములు వెలసినవి. యథావాల్మీకము లనదగిన వావిలికొలను రామాయణాదులవలెనే, రామరాజ్యము (కాండూరు నరసింహాచార్య విరచితము), రామచంద్రోపాఖ్యానము (వారణాసి వేంకటేశ్వరకవి ప్రణీతము) మున్నగు కావ్యములు, వాల్మీకి రామాయణమునకు అన్యరామాయణకథలను విస్తృతముగ జోడించిన జగన్నాథ రామాయణము (కవి: తంగిరాల జగన్నాథశాస్త్రి), గోవింద రామాయణము మున్నగు రామాయణములు ఇతోధికముగ రచింపబడెను.

స్థల విస్తరణ భీతిచే అందు కొన్ని కావ్యముల దిఙ్మాత్ర పరిశీలనము మాత్ర మీ ప్రకరణమున కావింపబడినది.

## శ్రీ జనమంచి శేషాద్రిశర్మ రామాయణము :-

వాల్మీక రామాయణౌన్నత్యమును లోకమున విదితము కావించు సదాశయముతో పెక్కుమంది రామాయణమునకు వ్యాఖ్యలు వ్రాసిరి. సామాన్యదృష్టికి గోచరముకాని పలువిషయములు ఈ వ్యాఖ్యలవలన సర్వవిదితములైనవి. జనమంచివారు రామాయణమునకు వ్యాఖ్యలు రచించి మహోపకారము కావించిన వ్యాఖ్యాతల కృషిని ప్రశంసించుచు "వారి వ్యాఖ్యల చేతనే శ్రీమద్రామాయణ మింత విఖ్యాతి నొందెను గాని లేకున్న నేమూలనో పడియుండు. కావున వా రేయర్థమును

దెల్పిరో యా యర్థమును విస్పష్టముగా నాకుం దెలిసినంతవఱకు దెలుపుటకే నా యీ ప్రయత్నము"– అని రామాయణమును రచించుటయందు వారి మనోగతాభిప్రాయమును, ప్రణాళికను పీఠికయందు పేర్కొనిరి. జనమంచి వారి రామాయణకావ్యము యథావాల్మీకముగ, ఎడనెడ గోవిందరాజీయాది వ్యాఖ్యాంశములను గ్రహింప సాగెను.

"ఏత న్మే ప్రియ మాఖ్యాతుః కిం వా భూయః కరోమి తే
రామేవా భరతే వాహం విశేషం నోపలక్షయే"
(అయోధ్య. స. 7– శ్లో. 34.)

చ. "మనమున కింపుఁ బెంపఁదగు మాటను జెప్పిన నీకు నేమి యి
య్యనుగలదాన; నీసవతి యాత్మజుపై నిటు ప్రీతి యేలొకో
యనియెదనేమొ రాఘువునియందును నాసుతునందు భేదమున్
గనుఁగొనఁజాల నిద్దఱును గాదిలిపుత్రులె నాకుఁ గావునన్"
(అయోధ్య. ప. 297)

గోవిందరాజీయమున,

"నను సపత్నీపుత్రే-కథంవై తాదృశీ ప్రీతి రిత్యత అహ" –అని అవతారిక వ్రాయబడెను. జనమంచివారు వాల్మీకి శ్లోకమునకు గోవిందరాజీయ వివరణమును కూడ జేర్చి పైరీతిని అనువాదము కావించిరి.

"దదర్శ చంద్రం స హరిప్రవీరః
పోప్లూయమానంసరసీవ హంసమ్" (సుందర. స. 2– శ్లో. 58)

తే. "సరసునం జనుచున్నట్టి సన్మరాళ
మట్లు వనచరకుంజరుం డమలశశిని
గాంచి లంకఁ బ్రవేశించి కార్యసరణిఁ
దీర్ప మది నెంచె, రామభక్తిని జెలంగి".

—ఇందు నాల్గవపాదమందలి "రామభక్తిని జెలంగి" యనునది ప్రకృతార్థమును పోషించును కావున అధికముగ చేర్పబడెను.

"న వీరసేనాగణ శోచ్యవంతి
న వజ్ర మాదాయ విశాలసారమ్
న మారుతస్యాస్యగతేః ప్రమాణం
న చాగ్ని కల్పః కరణేన హంతుమ్".

(సుందర. స. 48- శ్లో. 12)

సీ. "పరుని మర్దింపుమా; సురపతిని జయించి
నట్టివీరా! విను మాతఁ డొకఁడె
శత్రుబలౌఘంబు సమయించుచున్నాఁడు
కనుక నాతనిపయి, జనుతరుణము
నందు సైన్యములు సహాయము చేయంగఁ
జాలవు; మఱి యల్పసార మైన
వజ్రముఁ గొని కపివరుపైకిఁ బోకుము
వాయువుకంటె జవంబు మిన్న

తే. గాఁగ నాతని కుండును గాఢవహ్ని
కల్పుఁ డగుఁగాన ముష్ట్యాదికములఁ జంప
నలవి గాకుండు; నేఁ జెప్పినట్టి విషయ
మునసె చక్కఁగఁ బరికించి పనిని దేర్పు".-అనునది పై శ్లోకమునకు ఆంధ్రానువాదము. —ఇట్లు మూలార్థము సమగ్రముగ విశదమగుటకై జనమంచివారు వ్యాఖ్యల సాహాయ్యము స్వీకరించుచు తమకృతిని వెలియించిరి.

## శ్రీ వేంకట పార్వతీశ్వరకవుల రామాయణము :-

సుప్రసిద్ధ జంటకవులగు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు కూడ "శ్రీమద్రామాయణము" రచియింపఁ బ్రయత్నించిరి. కాని దురదృష్ట వశమున బాల అయోధ్య అరణ్య కిష్కింధ కాండల రచనానంతరము ఓలేటిపార్వతీశముగారు పరమపదించినందున సుందరకాండమున పదునారవ సర్గతో రామాయణరచనకు అంతరాయము కలిగి, అసంపూర్ణముగ మిగిలిపోయెను. ఓలేటి పార్వతీశముగారి పుత్రులైన ఓలేటి శ్రీరామ

చంద్రమూర్తిగారు ప్రస్తుత మిందలి సుందరకాండను పూరించిరి. యుద్ధకాండ ఇంకను వ్రాయవలసి యున్నది. ఈ రామాయణము యథావాల్మీకము. మృదుపదములతో లలితమైన శైలితో రూపొందింపబడిన ఈ రామాయణము ప్రస్తుతము పిఠాపురము రాజాగారైన శ్రీ రాజారావు వేంకటకుమార మహీపతి గంగాధర రామారావుగారికి అంకిత మొనర్పబడెను.

కం. "తెనిఁగించితి మనిగానీ
యనువాదము చేసి నార మనిగానీ మే
మన మ్మామునినుడులు ప్రతి
ధ్వని మాయెద నొదవి యిట్లు వాకొన వెడలెన్". —అని

వేంకట పార్వతీశ్వర కవులు కృత్యాదిని వినయాంజలి ఘటించిరి.

ఇది యథావాల్మీకము గనుక, అహల్య,

గీ. అతఁడు మునివేషి యగు నింద్రు డని
గ్రహించి దుర్మతి యహల్య యపుడు
కుతూహలమున యమరవిభుఁడు
లభించెగదా యటంచు అన్య మెంచక"- ఇంద్రునిపట్ల ఆకర్షిత

యయ్యెను.

ఇట్లు లలితపదజాలముతో ఈ రామాయణము రచింపబడెను.

ఆధునికయుగమున వెలసిన రామాయణ కావ్యములలో ప్రత్యేకముగ పేర్కొనవలసినది కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యము. కల్పవృక్ష నామమును బహుముఖముల సార్థక మొనరించు ఈ కావ్యవిశిష్టత ప్రత్యేక ప్రకరణమున వివరింపబడుచున్నది.

తెలుగున ప్రథమ శుద్ధాంధ్ర రామాయణము రచియించినది అడిదము బాలభాస్కరకవి. కాని ఈ కావ్యము అలభ్యము. ద్వితీయ స్థానము కూచిమంచి తిమ్మన్న కవి అచ్చ తెలుఁగు రామాయణమునకు లభించుచున్నది. నడిమింటి వెంకటకవి భోజుని చంపూ

రామాయణమును అభిషిక్తరాఘవ మను కావ్యముగ ఆంధ్రమున రూపొందించెను. ఇట్లే, మరింగంటి సింగరాచార్యుల వారి దశరథ రాజనందన చరితమును ప్రథమ నిరోష్ఠ్య రామాయణముగా పేర్కొన వలెను.

తెలుగు సాహిత్యమున వెలసిన రామాయణ కావ్య, ప్రబంధ ములు ఇంకను అనేకములు కలవు. బులుసు సీతారామ కవి 'చంపూ రామాయణము', జేతపూడి కృష్ణకవి 'జానకీరాఘవప్రబంధము', జన్నయ్యకవి 'రామకథాభిరామము', పసుపులేటి రంగాజమ్మ 'సంగ్రహ రామాయణము', ఏనుగులక్ష్మణకవి 'రామవిలాసము', మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి 'సీతారామ చరితము', గుండు లక్ష్మణశాస్త్రి 'రామ చంద్ర విలాసము', హొూతా వెంకటకృష్ణయ్య 'రామాభ్యుదయము' సురవరము కేతయ్య 'నిరోష్ఠ్యరామాయణము'- మున్నగు రామాయణ ములు ఆంధ్రసరస్వతి కలంకారములై సాహిత్యరంగమును పరిపుష్టము కావించినవి. అధ్యాత్మ రామాయణమున కనువాదములుగా వెలసినకావ్య ములుకూడ తెలుగు సాహిత్యమున సముచిత స్థానమును ఆక్రమించు కొన్నవి. కాణాదము పెద్దనసోమయాజి, మోతుకూరి పండరినాథకవి, అల్లమరాజు రామకృష్ణకవి, ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు, పరశురామపంతుల రామమూర్తి మున్నగువారు అధ్యాత్మ రామాయణ మును ఆంధ్రమున వెలయించిన వారిలో కొందఱు. ఓఢ్ర భాషయం దలి విచిత్రరామాయణము కూడ తెలుగున పలువురిచే కావ్య రూప మును పొందినది. వ్యాసవిస్తరణభీతిచే ఈ కావ్యములన్నింటి వివ రము లిచ్చుట పేర్కొనబడుట లేదు.

---

# ద్విపద వాఙ్మయము – రామకథ

దేశిసాహిత్యమున ప్రధానశాఖలలో ద్విపద ఒకటి. 'ద్విపద' సంస్కృత నామమైనను, తెలుగు ప్రత్యేకతను నిరూపించుచు, తెలుగు సాహిత్య రంగమున వెలసిన దేశిచ్ఛందము కన్నడులకు త్రిపద, షట్పదులు మాత్రము ఆదరపాత్రములైన ఛందస్సులు– తెలుగున ద్విపదను సర్వాంగ సుందరముగ తీర్చి దిద్దిన మహాకవి పాల్కురికి సోమనాథుడు. గేయరూపమగు జానపద వాఙ్మయము నుండి గ్రహించి, మహాకావ్య పథమున ద్విపదను ప్రవేశపెట్టిన ఖ్యాతి పాల్కురికి సోమనాథునిదా రంగనాథునిదా అను విషయము వివాద గ్రస్తము. రంగనాథుడే అయినచో అట్టి గౌరముతోబాటు ప్రథమ ద్విపద రామాయణ బిరుదము కూడ రంగనాథ రామాయణమునకే లభించుచున్నది. క్రీ. శ. 1280 ప్రాంతమున రచింపబడినట్లుగా భావింపబడుచున్న రంగనాథ రామాయణమునకు తరువాత కాలక్రమమున తాళ్లపాక అన్నమయ్య రామాయణము, కట్టా వరదరాజు రామాయణము, భోసల యేకోజీ రామాయణము, రాఘవరెడ్డి రామాయణము ద్విపద వాఙ్మయమున కలంకారములై ఆంధ్రసాహిత్యమున వెలసినవి.

## రంగనాథ రామాయణము :-

క్రీ. శ. 1280 ప్రాంతమున రచింపబడినట్లు భావింపబడినను రంగనాథ రామాయణ కాలనిర్ణయము వివాదాస్పదము.[1] ఇట్లే ఈ గ్రంథకర్తృత్వము కూడ వివాదాస్పదముగనే యున్నది. గోన బుద్ధరాజు తన తండ్రియగు విట్ఠల నృపాలుని ఆజ్ఞచే అతనికి అంకితముగ

1. కట్టా వరదరాజు రామాయణమునకు నిడదవోలు వేంకటరావుగారిపీఠిక– vol. I Madras Govt. Oriental Series No. L.

రామాయణమును ఆంధ్రీకరించె నని గ్రంథమునందలి ఉపోద్ఘాతము నందుండుటచే దీనిని రచించిన కవి గోన బుద్ధరాజని ఎన్నదగి యున్నను, చిరకాలమునుండియు దీనికి రంగనాథ రామాయణ మనియే వ్యవహారనామ ముండుటంజేసి గోన బుద్ధరాజుకడ నాస్థానకవిగ నున్న రంగనాథు డీకావ్యమును రాజాజ్ఞానుసారంబుగ విఠ్ఠల ధరణీశాంకిత ముగ రచియించి యుండనోపు నని రంగనాథ రామాయణ పీఠికయందు పేర్కొనబడెను.[2] రంగనాథ రామాయణ కాల, కర్తృత్వములను గురించిన విస్తృతమగు వాదోపవాదములను స్థల విస్తరణ భీతిచే ఇట నుటంకించుట మాని, కేవలము గ్రంథమునందు రామకథ స్వీకరింప బడిన విధానమును మాత్రము వివరించుచున్నాను.

ఉపలభ్యమగు ప్రథమాంధ్ర రామాయణమైన రంగనాథ రామా యణము వాల్మీకి రామాయణానుసారి యయ్యును అవాల్మీకములగు అంశములు అనగా శ్రీరామదైవత్వమును నిరూపించునట్టివి, అన్య సంస్కృత రామాయణముల నుండి గ్రహించుటయే కాక, జనబాహు ళ్యమున నాటికే ప్రచారమునం దుండిన ఆకర్షణీయాంశములను కూడ స్వీకరించి పండితపామరజనహృదయరంజక మగు రీతిని రూపొందింప బడెను.

రంగనాథ రామాయణము వాల్మీకి రామాయణమునకు అను వాద మయ్యును ద్విపద మార్గమున వెలసి, ప్రక్రియయందే గాక కథా స్వీకారమునందును స్వయంవ్యక్తిత్వమును నిలుపుకొనుట కెట్లు ప్రయత్నించెనో కావ్యారంభముననే విశదమగుచున్నది. వాల్మీకి రామాయణమున గేయమై పాఠ్యమై కేవల పుణ్యదాయక మైన రఘూత్త ముని చరిత్రమును రచించి, వాల్మీకి తన కడ అంతేవాసులుగ నున్న కుశలవులకు దానిని ప్రీతితో అభ్యసింపజేసెను. రంగనాథ రామా యణమున "....నిర్వది నాల్గువేల శ్లోకములు- గలిగి, యేనూఱు సర్గల విస్తరిల్లి - కాండంబు లాఱింటఁ గరమొప్ప మిగిలియుండ, రామా యణ మొప్పఁ గావించి - యొనరఁ దక్కిన కథ లుత్తరకాండమునఁ

2. వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్ చెన్నపురి - వారి ప్రచురణ.

జెప్పి"- వాల్మీకి "ఈ కథ పఠెయింప నెవ్వారు నేర్తు - రీ కథ జగముల నెబ్భంగి వెలయు"నని యోచించుచుండగా, మనిసిజాకారులు, మంజు భాషణులు, సంగీత సాహిత్య పరులు మిాదుమిక్కిలి మునివేషధారు లైన కుమారు లిరువురు కుశలవ నామధేయు లరుదెంచి, మ్రొక్కి, "రామాయణం బర్థితోఁ జదువ - జనుదెంచితిమి మమ్ముఁ జదివింప వలయు" నని వేడగా "తన మనోరథమెల్లఁ దలకూడె" నని సంత సించి వాల్మీకి "అనుపమ తంత్రీలయాన్విత ఫణితి" రామకథను వారిచే అభ్యసింపజేసెను. ఇట్లు కుశలవులే రామాయణమును కోరి నేర్చుకొనినట్లుగా పేర్కొనబడినది.

అవాల్మీకాంశములను గ్రహించుటలో రంగనాథ రామాయణ మార్గమునే ఇంచుమించు అనుసరించిన దనదగిన భాస్కరరామా యణ మిప్పట్టున వాల్మీకి మార్గగామిగనే పేర్కొనుట ఇట గమనించ వలసిన విషయము.

వాల్మీకి రామాయణమున దశరథ పత్నులు ముగ్గురు- వారు రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులను గన్న మాతృమూర్తులు. వారి ప్రసక్తి అందు ప్రథమముగా పుత్రకామేష్టికై దశరథు డాయత్తపడు సందర్భమున మాత్రము వచ్చును. ఇప్పట్టున రంగనాథ రామా యణ కర్త దశరథునకు వందలసంఖ్యలో భార్యలు గలరనెను; "అన్నర నాథు కులాంగనామణులు - మున్నూటయేబండ్రు ముఖ్యులై యందు" కౌసల్య, కైక, సుమిత్రలు మెలగుచుందు రని పేర్కొనెను. ఆనంద రామాయణమున దశరథునకు ఏడువందల మంది భార్య లున్నట్లు చెప్పబడెను. ఇట్లు రాజపత్ను లధిక సంఖ్యలో పేర్కొన బడుటయే కాక వారి ప్రసక్తి కావ్యారంభమున నృపాలుని వర్ణించు పట్టుననే వచ్చినది. రంగనాథ రామాయణమునకు తరువాత వెల సిన రామాభ్యుదయాది కావ్యములందు దశరథునికి మున్నూట ఏబది మంది పత్నులు గలరనియే కవులు పేర్కొనుట జరిగినది.

మంథరావైరమునకు హేతువుగ ఇం దొక ఆకర్షణీయాంశము కలదు. బాల్యమున "మాయావినోదము ల్మరగి, యాడుచుండి"స

రాముడు ఒకనాడు క్రీడాకందుకముతో చెలరేగి ఆడుచున్న సమయమున కైకేయి పరిచారిక యగు మంథర యరుదెంచి "చిట్టంటు చేఁతలఁజెండు" దట్టెను. అలిగిన రాముడు కాష్ఠముతో నడచగా దాని కాలు విఱిగెను. క్రోధముతో మందర యేగి కైకకు మొఱపెట్టుకొనగా, కైక యావల దశరథునకు యావద్వృత్తాంతము ఎరింగించెను. అంత దశరథుడు వసిష్ఠుని రావించి విద్యాశిక్షణకై పుత్రుల పనిచెను. శ్రీరామాదుల బాల్యక్రీడ లిట్లు ఆసక్తికరముగ అధ్యాత్మ రామాయణము వర్ణించినది. అందు రాముడు భాగవతమునందలి బాలకృష్ణునివలె పాలుపెరుగులు త్రావుచు కౌసల్యను విసిగించెను. కాని మంథరను నొప్పించురీతిని కందుక క్రీడతో వినోదించినట్లు పేర్కొనబడలేదు. రంగనాథ రామాయణము అధ్యాత్మరామాయణమును రామబాల్యమును వర్ణించుటకు ఆధారముగ గ్రహించినను, ఆ ఘట్టమును కేవలము వినోదాత్మకముగ కాకుండ, కథకు ఆలంబన మగు రీతిని మలచినది. రాముడు మంథరకాలు విరచుటతో దశరథుడు రాముని స్వేచ్ఛాప్రియత్వమునకు, బాల్యచాపల్యమునకు స్వస్తి చెప్పి, కుమారుని విశిష్టుని గావింప వసిష్ఠున కొసగినాడు. ఇట్లు బాధ్యతాజీవనమునకు నాంది పల్కిన ఈ సన్నివేశమే మంథర రాముని కఠోర వనవాసమునకు గురిగావించుటకు కూడ హేతువయినది. "పనివడి రాముడు బాల్యంబునందుఁ- దన కాలు విఱిచిన తప్పు సాధింప" చిరకాలమునుండి అదనుకై వేచియుండిన మంథర, పట్టాభిషేక సమయము అందులకు సరియైనదిగ నిశ్చయించి, కైకను ప్రేరేచి, కృతకృత్యురా లయినది. ఇట్లు రాముని బాల్యక్రీడలు వర్ణించు ఘట్టము రంగనాథ రామాయణమున ఏకకాలమున రెండు ఫలితములను సాధించి, సార్థకమగుచున్నది. అంతియకాక త్రొక్కుడుబిళ్లాట, బంతాట మొదలగునవి ఆంధ్రులజాతీయజీవనమునకు దర్పణము పట్టుచు రాముని కందుకక్రీడా ఘట్టమున కవికి గల లోకపరిశీలనాశక్తికి కావ్యమున తార్కాణమగుచున్నది. ఇట్లు శ్రీరాముడు బాల్యచాపల్యముచే ఒనర్చిన స్వల్పాపరాధము భవిష్యత్తున రాముని కఠోరజీవనమునకు గురికావించినది. శ్రీనాథుని పల్నాటివీర చరితమునకూడ

ఈ విధముగనే బాలచంద్రుని క్రీడాసక్తి ఘోరరణముగ పరిణమించి నది గదా! భాస్కర రామాయణమున కూడ మంథర ఇట్టి హేతువు చేతనే పగగొని రాముని సాధింప సమకట్టినట్లు పేర్కొనబడినది గాని, కారణము దీనియందు వలె వివరముగ పేర్కొనబడలేదు.

యాగ సంరక్షణార్థము రాముని తోడ్కొని పోవవచ్చిన విశ్వామిత్రుడు సంశయించు దశరథునితో,

"అనఘ! రాముఁడు బాలుఁ డను బుద్ధిమాను
మనఘ! నీ పుత్త్రకుం డను లోభ ముడుగు;
క్రతుకర్త క్రతుమూర్తి క్రతుభాగభోక్త
యతఁడు లోకారాధ్యుఁ"[1] —డని, శ్రీరాముని దైవత్వము

గురించి తెలియజెప్పుటయే కాక, రాముని గొనిపోయి అనితరసాధ్యము లైన శస్త్రాస్త్రముల నొసగెద నని కూడ పల్కినాడు. దేవరహస్యము నిట్లు వెల్లడించుట అవాల్మీకము. ఇప్పట్టున కవి అధ్యాత్మ రామాయణము ననుసరించెను. కాని— అందు విశ్వామిత్రుడు కాక వసిష్ఠుడు దశరథుని రహస్యము నెరింగించినట్లు కలదు.[2]

ఇట్లే, శ్రీరామ దైవత్వమును బహిర్గత మొనర్చిన సన్నివేశము బాలకాండమునందే మరియొకటి కానవచ్చుచున్నది. తనతో సిద్ధాశ్రమమును ప్రవేశించు రామలక్ష్మణులకు విశ్వామిత్రుడు అయ్యాశ్రమ నామసార్థక్యము వివరముగ చెప్పి చివరకు రామునితో,

"నీవు వామనుఁడవై నెగడిత్రివిక్ర
మావతారము దాల్చినట్టి విష్ణుఁడవు
నాడుఁను నిది నీవనంబు శ్రీరామ
నేడుఁను నారీతి నీవనంబయ్యె".[3]

రామదైవత్వమును గురించి స్పష్టమొనరించెను. ఇప్పట్టున వాల్మీకి

---

1. రంగనాథ రా. బాల. 624, 625.
2. "శృణు రాజన్ దేవగుహ్యం గోపనీయం ప్రయత్నతః
రామో నమానుషోజాతః పరమాత్మా సనాతనః" -(అధ్యాత్మ. బాల. చతుర్థ సర్గ)
3. రం. రా. బాల- 880, 881.

రామాయణము రాముని అవతారమును సూచనప్రాయముగ మాత్రము చెప్పుచున్నది.[4] రంగనాథ రామాయణము తరువాత వెలసిన రామోదయాది కావ్యములు అవతార మాహాత్మ్యమును గురించి. ఈ సందర్భమున పేర్కొనబడినవి.

ఇందు విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు వివరించిన కుమారస్వామి జన్మవృత్తాంతము కూడ వాల్మీకి రామాయణమునుండి భేదించుచున్నది. వాల్మీకి రామాయణమున గంగ శరవణమున విడిచిన ఈశ్వరతేజము కాంచనము, తామ్రము మొదలయిన లోహములుగ బహువిధములైన ధాతువులుగ రూపొందినది.[5] రంగనాథ రామాయణమున, అగ్నిదేవుని ఆదేశమున ఈశ్వరతేజమును ధరించిన గంగ, దానిని ధరింపజాలక శరవణమున విడిచెను. స్నానార్థమట కరుదెంచిన ఋషిపత్నులు ప్రకాశించుచున్న తేజమును గాంచి అగ్నిగా భ్రమసి, శీతలబాధను బాపుకొనుటకై దాని జేరబోవగా, వారు గర్భవతులైరి. యావద్వృత్తాంతము యోగదృష్టి నరసిన పతులు వారిని పరిత్యజించిరి. వారు జాహ్నవికడ కరిగి బాహుతాడనములచే గర్భమును బాధింప, ఆరు ఖండములుగా నది అవనిపై బడెను. ఆ ఖండచయములను శరవణమున బెట్టి ఋషిపత్నులు తపమున కరిగిరి. అంత నాఉగ్రవీర్యము "అవనిపై శ్వేతాద్రి యనఁ గడు నొప్పె - నరయ నాశైలంబునందుఁ గుమారుఁ డరుదార జన్మించె"ను.

రంగనాథ రామాయణమందలి మునిపత్నీ వృత్తాంతము అధ్యాత్మ రామాయణమున కూడ కానరాదు.

---

4. "తదాశ్రమ పదం తాత తవాప్యేత ద్యథామమ".
-(వా. రా. బాల- స. 29- శ్లో. 24.)

5. "యదస్యా నిర్గతం తస్మా త్తప్త జాంబూనదప్రభమ్-కాంచనం ధరణీం ప్రాప్తం హిరణ్య మమలం శుభమ్
తామ్రం కార్ష్ణాయసం చైవ తైక్ష్ణ్యా దేవాభిజాయత, మలం
తస్యాభవ త్తత్ర త్రపు సీసక మేవచ-తదేతద్ధరణీం ప్రాప్య నానాధాతు రవర్ధత"
-(వా. రా. బాల. సర్గ 37- శ్లో. 18, 19, 20.)

అహల్యా శాప విమోచన ఘట్టమున ఇందు గౌతముడు అహల్యను శిలాకృతి ధరించునట్లు అధ్యాత్మ రామాయణానుసారముగనే శపించెను. వాల్మీకి అధ్యాత్మ రామాయణాదుల నుండి భేదించు అంశమిప్పట్టున, ఒకటి గలదు. అది మహేంద్రుడు అతిఘోరతపము చేయు గౌతముని "....తపంబు దా నంతయుఁ జెఱుప"-గోరి కుక్కుట వేషధారియై ఆశ్రమమును జేరి "కొక్కొరో యని కూ"సి మునిని కికురించి పిమ్మట గౌతమవేషధారియై అహల్యను జేరుట! తపోవిఘ్న మొనరించు నుద్దేశముతో తానట్టి అకృత్యమునకు బాల్పడినట్లు వాల్మీకి రామాయణమున శాపమును పొందిన మహేంద్రుడు దేవతలతో పలికినట్లు కలదు కాని కుక్కుటవేషధారి యాట మాత్రము వాల్మీకి, అధ్యాత్మ రామాయణాదులందు కానరాదు. రంగనాథ రామాయణమందలి మహేంద్రుని ఈ కుక్కుట వేషధారిత్వము అనంతరము ఆంధ్ర వాఙ్మయమున వెలసిన పెక్కు రామాయణములందు చోటు చేసికొనినది. యథావాల్మీకముగ రామాయణమును ఆంధ్రీకరించిన కవులు కూడ కొందరిప్పట్టున కుక్కుట వేషధారిత్వమును, మఱికొందరు 'అహల్యా పాషాణత్వము'ను స్వీకరించుట గమనార్హము.

రంగనాథ రామాయణమున అతిసుందరమైన సన్నివేశములలో శివధనుర్భంగ ఘట్ట మొకటి. జనకుని అనతిపై పదివేల మంది భటులు శివధనుస్సును కొల్వుకూటమునకు గొనిపోవుచుండిన వార్తను అంతఃపుర పరిచారికలు "జానకి నూర్మిళ జనకుదేవి" కాంచి ఎరింగించినంత వారందరు తోరణగండ్లనుండి శ్రీరామలక్ష్మణుల దర్శించిరి. సఖీజనము "జనకజ దగు రామచంద్రున కిరవు-ఒనరు సౌమిత్రికి నూర్మిళ యనుచుఁ" భావించిరి. అంత "హరునిచాపము రాముఁ డతి సత్త్వయుక్తిఁ- బెరిగి నేఁడిదె! యెక్కుపెట్టు చున్నాఁడు; అదరకు భూదేవి! యాత్మలో నీవు - చెదరి చలింపకు శేషాహి! నీవు, కదక ధరింపుము కమఠేంద్ర! నీవు - కదు నేమరకుఁడు దిక్కరులార! మీర"ని కౌశికుడు పరాకు చెప్పుచుండగా శ్రీరాముడు శివధనువు నెక్కుడినాడు.

అధ్యాత్మ రామాయణమున ఈ సన్నివేశమున స్త్రీలు అంతః పురమునుండి శ్రీరాముని గాంచినట్లు గలదు. ఆనందరామాయణమున అట్లు రాముని జూచి స్త్రీజనము ఆతడే సీతాపతి కావలయునని దేవతల ప్రార్థింపగా, అటు లౌనన్చిన పదునాలుగు వర్షములు వనవాస మొనరింతు నని సీత మ్రొక్కులిడినది. ఈ రెండు రామాయణముల ఆధారముతో తన కావ్యమున సీత రాముని గాంచుటను పేర్కొనుటలో రంగనాథ రామాయణకర్త ప్రతిభ వ్యక్తమగుచున్నది.

సొరణగండ్లనుండి కొలువుకూటమును తిలకించి రమ్మని పిలువ వచ్చిన చెలువ శ్రీరాముని- "కులము శౌర్యము రూపు గుణమును బొగడ- చెలఁగి చెవుల సుధ చిలికినట్లుండ - ప్రేమ వెగ్గలమైన పృథివిజ"కు సఖులు పరిచర్యలు చేసిరి. ఆ పరిచర్య లెట్లున్నవనగా,

"పన్నీట కుంకుమ పద నిచ్చి యొకతె
చెన్నార మకరిక ల్చెక్కిళ్ళ వ్రాసె
తట్టుపునుంగును దగు చందనంబుఁ
దట్టంబుగాఁ బూసెఁ దరళాక్షి యొకతె
నుదుటఁ గస్తురి లేఖ నుతముగాఁ దీర్చె
నెదుట నద్దముఁ బెట్టె నెలనాఁగ యొకతె
కురులు నున్నగఁ దువ్వి కొప్పమర్చుచును
విరులందు నొకతన్వి వింతఁగాఁ దురిమె
వాసించు బాగాలు వడి నాకుమడుపు
లాసతిజనముఖి కందిచ్చె నొకతె
అలినీలవేణికి నందంబుగాను
మొలనూలిఘంట లిమ్ముల మ్రోయనిడిమె
కులుకుఁబాలిండ్లపై గొప్పముత్యముల
విలసిల్లు హారముల్ వేసె నొకరితె"- (బాల. పం. 1885-1891)

—ఇట్లు సాలంకృతయై తలవాల్చి హేమపీఠమున ఆసీనయైయున్న సీతను జనకపత్ని మోదముతో గవాక్షముల కడకు గొనివచ్చినది. అప్పుడు వారు,

"రాముని లోకాభిరాముని దివ్య
ధాముని.........................
ఘన శౌర్య రూపముల్ గలిగినవానిఁ
గనకచేలునిమాడ్కిఁ గళ లొప్పువాని
జోకపువ్వుల విల్లుఁ జొనిపినవాని
జ్యాకిణాంకితహస్తజలజుఁడౌ వాని"- కనుగొనిరి. ఇట్లు సఖీ సమేతయై సీత, విశ్వామిత్ర శతానందాది మహితాత్ములతో అమరేంద్ర సభవోలె చెన్నమరు జనకుని సభయందు "ఆదివరాహమై యవలీల గోట-మేదినీతల మెత్తి మెఱసిన నీకు- దనర నీ విల్లెంత ?"- ఎక్కిడుమను విశ్వామిత్రుని అనతి మేరకు

"....దనమీఁది చెఱఁగు రాఁదిగిచి
మొలనూలు బిగఁజుట్టి మోహనాకృతులఁ
దిరముగా నిగ్గులు దిశల శోభిల్ల
.................................
మొలనూలి ఘంటలు మురువు మించగను
మలఁగుచు నవరత్నమాలిక ల్వొరల
బాహుపు ర్లంగరాల్పటు కంకణములు
బాహువు లంగుళావళికాంతు లీన
....................................
కోటిమన్మథలీలఁ గొమరు దీపింప"- కౌసల్యానందనుడు ''ఇది చాలఁ జులకన యిది చాలఁ బ్రాత - యిది చాల నిస్సార మిది చాల నలఁతి - తెగఁ గొన నిలువదు దీని నాయెదుటఁ- బొగడితి పలుమాఱు భూపాల"-యని జనకునితో పలికి''ధరణీతలంబును దవ మీఁదనునిచి-చిరనిద్ర సుఖియించు శేషాహి''వలె నున్న శివధనస్సును భగ్నము కావించెను.

ఇట్టి సన్నివేశము అత్యంత రమణీయముగ, కన్నులకు గట్టునట్లుగ వర్ణింపబడి రంగనాథ రామాయణమందు మనోహర వర్ణనలు గల ఘట్టములలో నొకటియై కవిప్రతిభకు చక్కనితార్కాణ యగుచున్నది.

అయోధ్యాకాండమున రాజ్యమును త్యజించి శృంగిబేర పురమున గుహుని యాతిథ్యము స్వీకరించి "ధరణిపై దృణశయ్య" సీతారాములు నిద్రించుచుండగా, లక్ష్మణుడు పదునాలుగేడుల వనవాసము ముగియువరకు 'నిదురవోవక' యుండవలయు నను నియమము పూని, సోదరుని సెజ్జకు దప్పల నిలిచి కాపుండెను. అంత నిద్రాదేవి లక్ష్మణుని సమీపించి, నిశా సమయమున నిద్రించవలెనను విధివిధానమునే ధిక్కరించితివి కనుక, నిన్ను విడచు మార్గమును జెప్పుమనగా, లక్ష్మణుడు వనవాసము ముగియువరకు తనకు మారుగ ఊర్మిళను ఆవేశించినచో, తా నటుదెంచిన పిమ్మట నిద్రను తిరిగి స్వీకరింపగలనని నిద్రాదేవితో నియమ మొనర్చుకొనెను. లక్ష్మణుడు శీలౌన్నత్యమును ద్విగుణీకృతము కావించుచున్న ఈ అంశము రంగనాథ రామాయణమున ముఖ్యముగ పేర్కొనదగిన అవాల్మీకాంశములలో నొకటి. లక్ష్మణుని భాతృభక్తిని, సేవాపరాయణత్వమును కరుణోద్వేలముగ చిత్రించు ఈ కల్పనము "ఊర్మిళాదేవి నిద్ర" యను జానపద గేయమున కూడ కలదు.

అయోధ్యాకాండము దశరథ శాప వృత్తాంతమున శరప్రయోగమున కూలిన మునికుమారుడు యజ్ఞదత్త నామధేయుడు తన జననీ జనకులను కావడియం దుంచి, దానిని రక్షణకై ఒక వటవృక్ష కోటరమున దాచియుంచువాడ నని చెప్పగా, దశరథుడు ఆ వృక్షముకడ కరిగి, కావడి దించి, అం దున్నవారికి యావద్వృత్తాంత మెరింగించెనని రంగనాథ రామాయణము చెప్పుచున్నది. వాల్మీకి రామాయణమున వారు ఆశ్రమమం దుండి రని మాత్రమే కలదు, మరియు, మునికుమారుడు యజ్ఞదత్త నామధేయుడుగ పేర్కొనబడక, కేవలము మునికుమారునిగనే వ్యవహరింపబడినాడు. అంతియకాక, ఇప్పట్టున వాల్మీకి రామాయణము మహర్షి శోకమును వర్ణించగా రంగనాథ రామాయణము మునిపత్ని శోకమును వివరించుట మరియొక విశేషము!

శూర్పణఖా ప్రవేశమునకూడ ఈ కావ్యము వాల్మీకి రామాయణమునుండి భేదించుచున్నది. పంచవటి కేతెంచిన శూర్పణఖ యాదృచ్ఛి

కముగ రాములక్ష్మణులను గాంచి నట్లు మాత్రము వాల్మీకి పేర్కొనెను. రంగనాథరామాయణమున ఒకనాడు వనమూల ఫలములకై వనమున నరయుచున్న లక్ష్మణుడు ఆధారరహితముగ వ్రేలాడుచున్న ఖడ్గ మొకదానిని జూంచి అచ్చెరువొంది, దానిని గ్రహించెను. తపసుల కెల్ల ఆధారమైన ఫలవృక్షాదుల ఖండింప పాడిగా దని తలచి ఆతడా ఖడ్గముతో సమీపమందున్న వెదురుజొంపమును నఱుకగా అందు తపమొనరించుచున్న తాపసి యొకడు మరణించెను. అసంకల్పితముగ బ్రహ్మహత్యా పాతకము ఒనగూడె నని చింతించుచు, ఆశ్రమమునకు జని రామునికి యావద్వృత్తాంత మెఱింగించెను. అప్పట్టున మునులందరుకూడి రామసన్నిధి కరుదెంచి లక్ష్మణునిచే హతుడయిన తాపసి శూర్పణఖాపుత్రు డయిన జంబుమాలి యని చెప్పి, ఆతని వృత్తాంతము నెఱింగించిరి. రావణు డొకపరి దిగ్విజయమున కరుగుచు సోదరియైన శూర్పణఖ యొక్క పతియగు విద్యుజ్జిహ్వునకు తాత్కాముగ లంకాధిపత్యము నొసగెను. దురాశాపూరితుడైన విద్యుజ్జిహ్వుడు దశకంఠుని కొనసగక లంకను శాశ్వతముగ పాలించు నుద్దేశముతో పాతాళమున కరిగి మాయల నేర్చుచు మదవృత్తి నుండెను. దిగ్విజయానంతర మరుదెంచిన రావణుడు విద్యుజ్జిహ్వుని విషయమెల్ల దెలిసి, సోదరికి పతియని కూడ లెక్కింపక వానిని సంహరించి, శూర్పణఖను స్వేచ్ఛావిహారిణిగ లోకముల సంచరింపు మనెను. ఆ సమయమునకు అంతర్వత్నిగ నున్న శూర్పణఖకు కొన్నినాళ్ళకు జంబుకుమారుడు జన్మించెను. జంబుకుమారుడు తండ్రివగ దీర్పగోరి సూర్యు నుద్దేశించి తపమొనర్ప దొడంగెను. వనరుహాప్తుడు మెచ్చి వగదీర్ప ఖడ్గ మొకటి పనుపగా, దర్పాంధు డగుచు ఆదానవుడా ఖడ్గమును గ్రహింపలేదు. అట్లు దానవుడు దానిని తిరస్కరించిన సమయముననే లక్ష్మణు డద్దానిని గాంచి, గ్రహించి, విధివశమున దానితో నా జంబుమాలినే సంహరించెను. మును లీ వృత్తాంత మెరిగించి చనిన పిమ్మట, యథాప్రకారము శూర్పణఖ పుత్రునికై ఆహారము గొని వచ్చి, వాని కళేబరమును గాంచి, శోకించి, అగ్నిసంస్కార మొనర్చి, పిమ్మట ఆగ్రహావేశములతో సమీపస్థులగు మునులపైకి బోవ వాడు రామ

లక్ష్మణు లున్న జాడ నెరింగించిరి. అంత భీకరాకారముతో శూర్పణఖ వారున్న తావునకు జని రాముని సౌందర్యమును గని మోహపరవశు రాలయ్యెను.

ఆనందరామాయణమున లక్ష్మణుడు శూర్పణఖా పుత్రుని వధించినట్లుగా పై కథనమంతయు గలదు. కాని అందు జంబుమాలి నామమునకు బదులుగ సాంబుడను పేరు కన్పట్టుచున్నది. రంగనాథ రామాయణ కర్తవలె భాస్కరరామాయణ కర్తలు కూడ ఆనంద రామాయణమందు గల ఈ అంశమును స్వీకరించిరి కాని. అందు వెదురు పొంపమును నరుకవలసినదని మునులే లక్ష్మణుని ప్రేరేచి నట్లు ప్రథమాంధ్ర రామాయణములు రెండింటను స్వీకరింపబడిన ఈ అవాల్మీకాంశము తదనంతర ఆంధ్ర రామాయణ కర్తలు పలువు రిని కూడ ఆకర్షించినది.

ఇట్లే ఆనందరామాయణమునుండి స్వీకరింపబడి తరువాతి కవు లను కూడ ఆకర్షించిన అంశము రంగనాథరామాయణమున మరి యొకటి కలదు. అది సీతాపహరణ ఘట్టమున రామాన్వేషణము నకై వెడలుచు పర్ణశాలకు చుట్టు ఏడుబరులు వ్రాయుట. లక్ష్మణుడు ఏడు బరులు వ్రాసి "....ఈ బరుల్ వడి దాఁటకమ్మ - ఎవ్వఁడే నీ బరుల్ వెసదాఁటి వచ్చు - నవ్వీరవరు తల లవియు నాక్షణమె"- అని పలుకుటయే కాకుండ అనిలుని ప్రార్థించి,జానకి నేమఱకు నీ వవి యొప్పగించి, రామునికై యరిగెను. ఆంధ్ర జానపద గేయవాఙ్మయ మున కూడ అధిక ప్రచారము నందిన అంశములలో నిది యొకటి!

పరివ్రాజక వేషమున పర్ణశాల సమీపించిన రావణుడు నిజ రూపమును దాల్చిన విధము ఇందు అతిచమత్కారముగ వర్ణింప బడినది.

"......................నీవు
ననవిని రావణుం డాగ్రహోదగ్ర
జనితోగ్రదృష్టియై జానకిఁ జూచి
యనుపమాటోపుఁడై యారూప ముడిగి
తన మనోపేక్షిఁ గందర్పుండు వెలుఁగ

బదియవస్థలు దోఁచి భాసిల్లు పగిదిఁ
బదితలల్ మణిజూటపంక్తుల నొప్ప
నాయవస్థలఁ గోర్కు లవి యిన్మడింపఁ
బాయని గతి నొప్ప బాహు లిర్వదియుఁ
గొన లిన్మడింపఁ గోర్కులు పల్లవించె
ననఁ బద్మరుచు లైన హస్తంబు లొప్ప
లలి దోఁచు కోర్కి పల్లవములఁ బుష్ప
ములఁ బోలు నాయుధంబులు పొల్పు మిగుల
బరఁగ దివ్యాంబరాభరణౌఘకాంతు
లరుదార మదనాగ్నులై మండుచుండ
నతి భీకరాకారుఁడై"- ధరణిజ ముందట నిలచెను. ఈ వర్ణనను కట్టా వరదరాజు రామాయణములోనిదిగా వాఙ్మయ పరిశోధకులు నిడదవోలు వెంకటరావుగారు కట్టా వరదరాజు రామాయణ పీఠికయందు పేర్కొనుట యిచ్చట గమనింపవలెను.

(అరణ్య. 995 - 1003)

కిష్కింధాకాండమున ఫల మొకటి గొని వటువేషధారియై హనుమంతుడు రామలక్ష్మణుల సన్నిధి కరుగగా, అతని రూపరేఖా విలాసముల కలరి రాముడు అచ్చెరువొందెను. హనుమంతుడును "ఒనరంగ నీమేని యురుభూషణములు - కనుఁగొన్న యాతఁడె గతి యును బతియు-....అతఁడె విష్ణుండు- అతఁడె నీగతి యని యది యాత్మఁ దెలియు" మన్న బ్రహ్మ వాక్యము స్ఫురణకు రాగా శ్రీరాముని తాను కొలువవలసిన దైవముగ గుర్తించెను. ఇట్లు పవనాత్మజుడు రాముని దైవముగ బ్రహ్మవాక్యముచే గుర్తించుట రంగనాథ రామాయణకర్త అవాల్మీకాంశములను ప్రధానముగ గ్రహించిన ఆనంద రామాయణ, అధ్యాత్మరామాయణ, పద్మపురాణములందు కానరాదు.

కాకాసురుడు సీతాస్తనమును జీరిన వృత్తాంతము సీత హనుమంతుని ద్వారా శ్రీరామునికి పంపిన సందేశమున మాత్రము వాల్మీకి ప్రకాశింపజేసెను. రంగనాథ, భాస్కరరామాయణములం దట్లు

కాక అయోధ్యాకాండము,సుందరకాండము లందుకూడ పేర్కొనబడెను. పద్మపురాణ,ఆనందరామాయణము లందు కాకాసురవృత్తాంతము అయోధ్యాకాండముననే వచ్చినది.

రావణునికి హితము గరుపుచున్నవారి నుడుల నాలించిన కుంభకర్ణుడు

"తమ్ముని మాటలు తగ వనలేక
యెమ్ములాడెడి నన్న నెట్టనరాక
యగ్గౌరవము తోడ నన్నకు మ్రొక్కి
దిగ్గున గుహకు నిద్రింపఁగఁ జనియె"-ను. అంతకు పూర్వమే రావణుడు సీతాపహరణమును గూర్చి చెప్పగా, అయ్యకృత్యము నేవగించుకొని కుంభకర్ణుడు అధర్మమార్గగామియై కులనాశన మొనర్చె నని సోదరుని తూలనాడెను. కాని ఎట్టి సందర్భమునందైనను రాజసేవ యొనర్చుట తనధర్మము కావున, రామునితో రణ మొనరింతు నని రావణునితో పలికెను. ఇట్లు కుంభకర్ణు డాది నుండియు ధర్మాధర్మవిచక్షణ మొనర్చువానిగ చిత్రింపబడినాడు. భాస్కర రామాయణమున కూడ విభీషణుడు రావణుని హెచ్చరించు సమయమున సోదరు లిరువురిలో నెవరిని సమర్థింపజాలక సభాభవనమునుండి కుంభకర్ణుడు వెడలిపోయినట్లు రంగనాథరామాయణమునందు వలెనే కలదు. వాల్మీకి రామాయణమున ధర్మాధర్మములు యోచింపక సీతను అపహరించుట పాడిగా దని రావణునితో కుంభకర్ణుడు పల్కినాడు.

రావణపరాభూతుడైన విభీషణుడు రామునికడ కరుగుచు ముందుగా శాస్త్రములను ఆలించుచున్న వృద్ధమాత కైకసి కడ కేగి రావణవర్తన మెరింగించెను. దుఃఖితయై కైకసి ఇట్లు జరుగు నని తన తండ్రివలన, భర్త వలన పూర్వమే వినియుంటినని చెప్పి, రావణమరణానంతరము విభీషణుడే లంకను పాలించు ననియు, ఆతడిప్పుడు శ్రీరాముని శరణుజొచ్చుటయే కర్తవ్యమని ఉద్బోధించి,దీవించి పంపెను. అవాల్మీకమగు ఇయ్యంశము పెక్కు తెలుగు రామాయణ

ములందు కలదు. ఇప్పట్టున కొందరు కవులు విభీషణుడు కుంభకర్ణుని యనుమతిని గూడ బడసినట్లు వ్రాయుట విశేషము!

రంగనాథ రామాయణమందలి అవాల్మీకాంశములలో అతి సుందరమైన కల్పన మరియొకటి కలదు. వానరులు వార్నిధిపై సేతువును నిర్మించుచున్న సమయమున ఉడుత ఒకటి శ్రీరామునిపై గల భక్త్యావేశముతో తాను కూడ రామునకు సహాయపడవలె నని ఆశించెను. అందులకై అది సముద్రజలములలో మేను దడిపి, తడి యారకుండ తీరమునందలి ఇసుకపై పొర్లాడి, మేనున అంటిన ఇసుకను వానరులు నిర్మించుచున్న సేతువునందలి శిలల మధ్య విదుల్చుచుండెను. ఇట్లవిరామముగ కృషి చేయుచున్న దాని గాంచి ముగ్ధుడైన రాముడు లక్ష్మణునిచే దానిని బట్టితెప్పించి, దాని పైభాగమున దక్షిణ కరాగ్రముతో నిమురగా, నచ్చట దానికి మూడు రేఖలమరెను. ఈ మనోజ్ఞకల్పనమే ఉడుతాభక్తి సామెతగ తెలుగునాట నిలచి పోయినది. ఈనాటికిని ఉడుతల వెనకభాగమున నుండు మూడు రేఖలు ఆనాటి రాముని అనుగ్రహమునకు చిహ్నము లని ఆంధ్రుల విశ్వాసము.

సువేలాద్రిని విడిసియున్న రామాదులకు తన వైభవము ప్రదర్శింప గోరి రావణుడు ఉత్తరగోపురమున ధవళాతపత్రములు దనుజులు పట్టగా కొలువు తీరెను. ఆ గొడుగుల నీడ అదిత్యుని గప్పగా చీకటి విలసిల్లెను. లక్ష్మణాదులతో పరివేష్టించి యున్న రాముడు దేవారి గర్వమును దీర్పదలచినవాడై అలవోకగ శర మొకటి వేసెను. అది అసంఖ్యాకములుగ మారి,

"తాలవృంతంబులు దాల్చుచేడియల
మేలిచామరములు మెఱయించు సతుల
సంగీతములు సేయు సరసిజముఖులఁ
బొంగుచుఁ గైవారములు సేయుబోంట్ల
ధవళాతపత్రముల్ ధరియించు దైత్య
నివహంబులను గొల్చి నిల్చిన భటులఁ

గరములు ద్రుంచక గళములు ద్రెంచ
కురములు నాటక యురుకిరీటములు
ధర డొల్లఁ జేయక తలలు ఖండింప
కరుదరు దిది యని యమరు లుప్పొంగ
నాలవట్టంబులు నాతపత్రములు
చాల శోభిల్లు వింజామరంబులును
కత్రించికొని పో"వగా- (యుద్ధ. పం. 2153-2159) కంఠ మాత్రములుగా చిత్రమై తనరిన సితచామరాదులు లంకయం దెల్లెడల చిమ్మెను. అంత "మహితాతపత్రచామరతాలవృంత - రహిత దండధరాసురశ్రేణి నడుమ-నున్న రావణు"డు యమదూతల నడుమ నున్నవానివలె కాంతి జెడెను. అప్పు డాతడు "వెఱఁగంది రఘురాము విలువిద్య పెంపు - తఱిగొని తలపోసి తలలూచి యూచి" శ్రీరాముని అస్త్రవిద్యా నైపుణ్యమును ప్రశంసించెను. పగవాని పొగడదగ దని దైత్యప్రముఖులు పలుకగా, వైరివీరు లయినను శౌర్య మున్న ఎడల మెచ్చుటయే వీరగుణ మని వారిని వారించెను.

అవాల్మీకమయ్యును రాముని అస్త్రవిద్యా నైపుణ్యముతో బాటు రావణుని ఉదాత్తతను గూడ వివరించు ఈ సన్నివేశము తరువాత కవులను గూడ విశేషముగ ఆకర్షించెను. అధ్యాత్మరామాయణము ఈ సన్నివేశమును చిత్రించినది కాని రావణుడు రాముని పరాక్రమ మును అభినందించుట లేదు.

నాగపాశబద్ధు లైన రామలక్ష్మణుల కడకు నారదు డరుదెంచి, రాముడు దైవమను విషయము స్ఫురణకు తేగా, రాముడు తా నాది హరి యౌట దలపోసి, నారదుని హెచ్చరిక మేరకు వైనతేయుని తల చెను. అంత నత డరుదెంచి వారిని పాశవిముక్తుల గావించెను. నారదు డరుదెంచుట వాల్మీకి రామాయణమున లేదు. రంగనాథ రామాయణమున ఇట్లు రాముని దైవత్వము ఎల్లెడల ప్రకటిత మగు చుండును. భాస్కరరామాయణమున గూడ నారదాగమనము గలదు.

ఇందు రావణ కుంభకర్ణు లిరువురును ఆత్మజ్ఞాన పరాయణులు. రణరంగమున కేగ తన్ను మేల్కొల్పిన రావణునికి కుంభకర్ణుడు, సీతాపహరణము అవివేకమని చెప్పి దేవతల ప్రార్థన నంగీకరించి రావణ వధార్థము శ్రీహరియే రాముడై జన్మించెనను దేవరహస్యము, మున్నొకపరి నారదుని వలన వినిన దానిని తెల్పి. జనకనందన నొసగి శరణువేడుట యుక్తమని పలికెను. రావణుడును లక్ష్మీనారాయణులైన సీతారాములను నొప్పించుట రామునిచే సంహరింపబడి మోక్షము నొందుట కను మనోగతవాంఛ తెల్పెను. అవాల్మీకమగు ఈ విధానము అధ్యాత్మ రామాయణమున గలదు. కాని అందు ఈ సందర్భమున కేవలము కుంభకర్ణుడు మాత్రము దేవరహస్యము నెరిగి నట్లు పేర్కొనబడెను. రావణుడు విషయము నెరింగియే తా నట్లు ప్రవర్తించు చుండినట్లు నుడవలేదు. అయినను అధ్యాత్మరామాయణ మున రావణుడు కూడ సర్వజ్ఞుడుగనే చిత్రింపబడినాడు. ఆరణ్య కాండమున శూర్పణఖ వలన ఖరదూషణాదుల వధ విని రాముని నారాయణునిగ గుర్తించి, ఆతనిచే మరణము మోక్షదాయక మని భావించి, రామునితో వైరము నెరపుటకు నిశ్చయించుకొనెను. మారీ చునితో నత డందువలననే రాముడు విష్ణ్వవతారమైనచో అతనివలన మోక్షము లభించుననియు. కాదేని సీత లభ్యమగు ననియు పలుకును. సుందరకాండమున కపివీరు డొకడు సూక్ష్మరూపమున లంకలో తిరు గాడుచున్నట్లు స్వప్నమున గ్రహించి, ఆత డశోకవనిని దాగియుండు ననియు, నాతని సమక్షమున సీతను కామించినట్లు భాసించినచో, కృద్ధుడై యాతడు శ్రీరాముని త్వరితముగ గొనివచ్చుననియు భావించి, అశోకవని కరుగును. ఇక యుద్ధకాండమున పాతాళ హోమము మొన రించుతరి అవమానితయై తనను తూలనాడు మండోదరితో నాతడు విష్ణ్వవతారమైన రాముని వలన మోక్ష మాశించి తా నింత చేసితి ననియు, తన మరణానంతర మామె సీతను వధింపవలయు ననియు కోరెను. ఇప్పట్టున మాత్రము రావణుడు తన యభీష్టము నిట్లు స్పష్టముగ వెల్లడించినాడు. హితము గరుప ప్రయత్నించిన సోద రులకుంటె బహుశః కష్టసుఖములయందు సమభాగిని యైన ధర్మ

పత్నికి మనోవాంఛను దెలియజేయుట యుక్తమని ఇప్పట్టున అతడు భావించి యుండనోపును. రాముడు కూడ ఈ విధముగనే సీతకు సర్వము తెలియజేయుటయే గాక ఛాయాసీతను పర్ణశాలకడ నుంచు మనుచు రావణవధకై ఆమె సహాయమును కోరెను. కాని సర్వము త్యజించి తనకై కానల కేతెంచిన యనుజునికడ రహస్యమును వెల్లడింపక, సీతావిరహవేదనతో తపించుచున్నట్లు అభినయించెను.

రావణహృదయమును అధ్యాత్మ రామాయణానుసారముగ చిత్రించినను, రంగనాథ, భాస్కర రామాయణకర్త లిప్పట్టున మూలమునుండి భేదించి, రావణుడు కుంభకర్ణునకు కూడ తన యభీష్టమును తెలియజేసినటుల పేర్కొనిరి. ఇప్పట్టున వారు, తనకై శ్రమించు సోదరునకు కూడ రావణుడు సర్వము తెలియజేయుట యుక్తమని భావించి యుందురు.

ఈ విధముగనే కుంభకర్ణ విభీషణుల శీలమునకు వన్నెపెట్టు మరియొక అంశ మిందు అధ్యాత్మ రామాయణమునుండి గ్రహింపబడినది. రణరంగమున విభీషణుడు రావణుడు అధర్మము ననుసరించుట వలన రాక్షసకులక్షయమును శంకించి తాను రామశరణార్థి యైనట్లు కుంభకర్ణునకు విన్నవించెను. కుంభకర్ణుడు కూడ,

"అన్నదమ్ముల పాడియని స్రుక్కవలదు
.................................
భాను వంశ్యుని కృపఁ బడసితిగాక !
నారాము దయగల దటుమీఁద నీవు
సారదయోదయ ! శ్లాఘచిత్తుఁడవు !
లంక సద్గుణాలంకృతి నేల
నింక నెవ్వరు గల రిట నీవెకాక ?
.................................
... ....ఈ పట్టున నిలువ
వలదొకఁడైనను వలయు వంశమున"- అని విభీషణుని చర్యలను సమర్థించుటయే కాక, తనతో యుద్ధ మొనరించవల దని హెచ్చరించెను.

తెలుగు కవులలో పలువురిని ఆకర్షించిన అవాల్మీకాంశములలో నిది యొకటి.

రంగనాథ రామాయణమందు ముఖ్యముగ పేర్కొనవలసిన అవాల్మీకాంశములలో మేఘనాథుని పత్నియగు సులోచనా సహగమన మొకటి. మేఘనాథుని మరణవార్త నెఱిగి సులోచన రావణుని కొలువుకూటమునకు జని తన పతి దేహమును తెప్పింపుమని అర్థించెను. ఆహవమం దున్న దానిని గొనివచ్చుట దుర్లభ మని రావణుడు నిరాకరించగా, అతని యనుమతి బడసి ఆమెయే స్వయముగ రణస్థలి కరగి, శ్రీరాముని దర్శించి, పతిని పునర్జీవితుని చేయుమని వేడినది. దయార్ద్రచిత్తుడైన రాముడు అట్లొనర్ప మనమున అభిలషించుట హనుమంతు డెఱిగి వారించెను. అంత శ్రీరాము డామె మరుజన్మమున పతిని కలుసుకొను నని వర మొసగెను. పిదప సులోచన పతికళేబరమును తెప్పింపు మని కోరగా సుగ్రీవాదులు పతివ్రత యగుదువేని ఇంద్రజిత్తుతో సంభాషించు మనగా నామె పతిశిరస్సును సమీపించి, పతివ్రత నగుదునేని నాపతి జీవము వచ్చి, నాతో పల్కుననె శిరస్సు కన్నులు విచ్చి, తనను సంహరించినది సులోచన జనకుడే యని చెప్పి, ఆమెకు తత్వబోధ గావించెను. అంత సుగ్రీవాదుల అనుమతిని సులోచన పతికళేబరమును గొనిపోయి సహగమన మొనర్చెను. సులోచనా వివాహ సమయమున ఆదిశేషుడు ఇంద్రజిత్తునకు శాప మిడెనను ఐతిహ్య మిట స్వీకరింపబడెను.

అవాల్మీకాంశములను స్వీకరించుటయందు ఇంచుమించు రంగనాథ రామాయణ ప్రణాళికనే అనుసరించిన భాస్కర రామాయణ కర్తలు సులోచనా సహగమన వృత్తాంతము పేర్కొనకుండుట విశేషము! తదితరాంధ్ర కవులు పెక్కు రీ అంశమును గ్రహించిరి. సులోచనా సహగమనాది వృత్తాంతముతో పెక్కు స్వతంత్ర కావ్యములు రచింపబడుటయేకాక జానపదవాఙ్మయమున కూడ ఈ కథ అధిక ప్రచారమును పొందినది.

అధ్యాత్మ రామాయణమందలి కాలనేమి వృత్తాంతము,[1] రావణ పాతాళ హోమము కూడ రంగనాథ రామాయణమున చోటు చేసికొనినది. రంగనాథ, భాస్కర రామాయణ కర్తలతోపాటు పలువురు తరువాత కవులను ఆకర్షించిన అవాల్మీకాంశములలో నివికూడ ముఖ్యములు.

రంగనాథ రామాయణమందలి ముఖ్యములైన అవాల్మీకాంశములుగా వీటిని పేర్కొనవలెను. అలతిమార్పు లింకను గలవు. ఈ అంశములు ఉపలబ్ధమగుచున్న ప్రథమాంధ్ర రామాయణము రామకథను గ్రహించిన విధానమును తెలియజేయును. రంగనాథ రామాయణమున శైలి ద్రాక్షాపాకమున రసవంతమై మనోహరముగ ముగ సాగెను. అన్వయ కాఠిన్యము ఇసుమంతయు లేక చక్కని జాతీయములతో, సమయోచితములైన శబ్దాలంకార, అర్థాలంకారముల ప్రయోగములతో కావ్యము ఒప్పారుచుండును.

సౌమిత్రి ఖడ్గమును గొని జంబుకుమారుని వధించుటకు ముందు రాముడు కావించిన హేమంతఋతు వర్ణనము సంభవింపనున్న సీతా వియోగ దుఃఖమును సూచించుచు మనోహరముగ సాగెను.

"కాముసమ్మోహనకాండంబు లనఁగఁ
హైమయుగ్వాయువు లలతిమై సోఁక
వెఱపున వణఁకెడు విరహిణు లనఁగఁ
దెఱఁగొప్పఁగదలు పూఁదీఁగె వీక్షింపు
మంచున జారు తామరల కన్నీరు
ముంచిన విరహుల మోములఁ గేరు
పొదిగొన్న యకరువుల్ పొట్టుగా మీఁద
గదలు తేటుల పొగల్‌గా చలికొన్న
కొలను దేవతలకుఁ గుంపట్లఁ బోలె
విలసిల్లు కెందమ్మి విరులఁ జూచితివె ?"– (అరణ్య. 246–250)

1. కాలనేమి వృత్తాంత, రావణ పాతాళహోమములగూర్చి– సంస్కృతవాఙ్మయములో రామకథ ప్రకరణమున– అధ్యాత్మరామాయణమును గూర్చిన ప్రస్తావనలోవివరముగ చెప్పబడినది.

ఇందలి మనోజ్ఞములైన వర్ణనలలో మాయామృగ వర్ణన కూడ ఒకటి. మేలైన కనకపు మేనితో, రుచిర నీలనీలాయత నేత్ర యుగ్మముతో రాక్షస క్షయము గావింపగోరి అబ్జసంభవుడు మెఱుగు లెల్లను గూర్చి రూపొందించినట్లున్న యా కురంగము,

"..................యఖిల రత్నములు
రత్న గర్భాత్మజా రత్నంబు నలఁప
యత్నంబుతో మృగంబై వచ్చినవియొ!
సీతకై తనవిల్లు చేకొని విఱిచె
నీతఱి రఘురాము నెలయింతు ననుచు
హరుఁడు పుత్తేరఁగా నాతని చేతి
హరిణ మిచ్చోటికై యరుదెంచినదియొ?
సీత మోమున కోడి చెలగి భ్రమింప
శీతాంశుఁడనుప వచ్చిన మాయలేడొ?"- అనునట్లుగ చెలువు మీరు చుండినదట!

అశోకవనియందే కాక, అపహరణ సమయమున కూడ సీతాదేవి "తృణముగాఁ, జూచు- తీరునఁ దనచేతి తృణము చూచుచు" రావణునితో మాటలాడినటుల వర్ణింపబడినది. ఇట్లు రంగనాథ రామాయణ కర్త సీతాదేవిచే రావణునితో రెండుమారులు తృణము పట్టి సంభాషించినదని చమత్కారముగ చెప్పినాడు.

"ఘనమైన పరుష రాక్షస బాషణములు
సనకాది యోగీంద్ర సన్నుతుల్ గావు
ఉఱవడిఁ బఱతెంచు నుగ్రదానవులు
పరిచారికామర ప్రతతులు గావు
చలమము నార్చు రాక్షస భటోత్తములు
నలిఁ బాడు తుంబురనారదుల్ గారు
వ్రాలుచు నీమీద వచ్చునాగాలి
యాలవట్టంబు లయ నిలయంబు గాదు

యుద్ధరంగం బమ్మృతోదధి గాదు
యుద్ధంబు మఱి కొలు వుండుట గాదు"- వంటి చమత్కార వర్ణనలు తరువాత కవుల నాకర్షించెను. బమ్మెర పోతన తన భాగవతమున,

సీ. చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు
నిగిడి గోత్రము దండి నిలువరాదు

.... .... .... .... .... .... .... .... .... ....

కల్కితనము చూసి గర్వింపగారాదు,
తరముగాదు కృష్ణ! తలఁగు తలఁగు.

సీ. మహిమతో నుండంగ మథురాపురముగాని పొలుపార వైకుంఠ పురము గాదు,
గర్వంబుతో నుండఁ గంసుని సభగాని సంసార రతులనౌ సభయు గాద...."

అని వర్ణించెను. (భాగ. స్కం - 10)

రంగనాథ రామాయణ ప్రతులందు క్రీ. శ. 17 వ శతాబ్ది మధ్యముగ రచింపబడిన కట్టా వరదరాజు రామాయణ మందలి భాగములు కొన్నింటిని లేఖకులు జేర్చినట్లు వాఙ్మయ పరిశోధకులు కొందరు భావించిరి. ఈ విషయము క్రీ. శ. 1942 లో వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే పరిష్కృతమై, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటింపబడిన రంగనాథరామాయణము వలన స్పష్టమగుచున్నదని నిడదవోలు వేంకటరావుగా రభిప్రాయపడిరి.[1] వారి ముద్రిత ప్రతియందు రెండనుబంధములు కలవు. రెండవ అనుబంధములో పరిష్కర్తలు చూపిన అధికభాగములందు కట్టా వరదరాజు రామాయణ భాగము లున్నట్లు వేంకటరావుగారు నిరూపింప బ్రయత్నించిరి. వ్యాస విస్తరణ భీతిచే ఆ వివరము లిచ్చుట పేర్కొనబడుటలేదు.

1. కట్టా వరదరాజు రామాయణము - VOL I- పీఠిక.

## తాళ్ళపాక అన్నమయ్యగారి ద్విపద రామాయణము :-

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు, పదకవితా సార్వభౌమ బిరుదాంకితులు అయిన తాళ్ళపాక అన్నమాచార్యుల వారు ద్విపద రామాయణమును రచించినట్లు, వారి మనుమడగు చిన్నన్న తన అన్నమాచార్య చరిత్రయందు పేర్కొనెను.

"నవముగా రామాయణ దివ్య భాష
నా వేంకటాద్రి మాహాత్మ్య మంతయును
గావించు రుచుల శృంగార మంజరియు"- అన్నమాచార్య చరిత్ర [2] - పు. 46, 47.

ఈ రామాయణమున యుద్ధకాండము మాత్రము లభ్యమగుచున్నది.

## కట్టా వరదరాజు రామాయణము :-

"ఇనకులంబున వేంకటేశుండు మున్ను
జనియించి తన పుణ్యచారిత్రమెల్ల
బోయకులంబునం బుట్టు వాల్మీకి
సేయ నందు బ్రమోదచిత్తుండు గాక
అర్కవంశమున నీవై జనియించి
తారా్కణ గాఁగనే తత్కథావిధము
రచియింప మనియె శ్రీరామచంద్రునకు
నచలిత ప్రీతిగదా నిజాన్వయుఁడు
తన చరిత్రంబు కీర్తన సేయ వినుట"- (అవతారిక. 150-160 పంక్తులు)-అని రామాయణము వ్రాయుటకు తనకు గల అధికార్హతను సగర్వమున పేర్కొనిన కట్టా వరదరాజు రాజకవి - సూర్యవంశ క్షత్రియుడు - కావేరి నదికి ఆనకట్ట నిర్మించిన చోళరాజులకు మూలపురుష

---

2. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాలయమువారిచే ప్రకటితము. వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే సంపాదితము.

డగు (దక్షిణ హిందూదేశమున) కరికాల చోళుని వంశమున వరద రాజు జన్మించెను. మూలపురుషుడు ఆనకట్ట నిర్మించుటంజేసి తద్వం శీయులు కట్టావారిగ వ్యాప్తినొందిరి. వరదరాజు కాలనిర్ణయమును గూర్చిన వాదోపవాదములు పెక్కు కలవు. వరదరాజు రామాయణ మును పరిష్కరించిన నిడదవోలు వెంకటరావుగారు ఆ కవి క్రీ.శ.17వ శతాబ్ది మధ్యన ఉండినట్లు నిర్ణయించిరి.

"కలకల నవ్వు చ - క్కని నెమ్మొగంబు
గలగల మొరయు బ - ల్కెంపు టందియలు
తళతళ మెఱచు బి - త్తరిఁదాల్చు నురము
........................................
చకచకలల పొంచ - జన్యంబు నమరు
నొక దివ్యమూర్తి నా - యొద్దఁ జూపట్టి
........................................
ననుఁదిరు వేంగళ - నాథుఁగాఁదెలియు
........................................
కావ్యంబులం దాది - కావ్యంబు సకల
సేవ్యంబు భువన ప్ర - సిద్ధంబు.........
వల్మీక తనయ కా - వ్యసుధారసంబు....
నొప్పు లభించె దీ - ని తెలుంగు చేసి....
ద్విపద గావింపుము - తేటతెల్లముగ"–(అవ-పంక్తులు 88-124)

అని తిక్కన సంప్రదాయాను సారముగ స్వప్నవృత్తాంతముతో కావ్యము ప్రారంభింపబడెను. వరదరాజు కవిస్తుతియందు "నన్నయ భట్టారకాది" కవులను మాత్రము పేర్కొని రంగనాథ రామాయణ కర్తను స్తుతింపకపోయినను, ఆ రామాయణ ప్రశంస యిందు కాన రాక పోయినను రంగనాథ రామాయణ స్వరూపము వరదరాజుకు సుపరిచితమే యని అతని భాషాంతరీకరణ పథకమే తెలుపును.

కట్టా వరదరాజు రామాయణము యథావాల్మీక మనవొప్పును. గ్రంథ విభాగము సంస్కృత రామాయణ సర్గలను అనుసరించి

కావింపబడెను. అచ్చటచ్చట స్వల్పమైన మార్పులు కలవు. బాల కాండమున రామాదులు జన్మించిన వారాది విశేషములు మఱికొన్ని చేర్చబడెను.

అహల్యా శాప మోక్షణములో :- వాల్మీకి రామాయణమునందు వలె కాకుండ ఇందు,

"నీకు నాహారంబు - నిద్రయు సుఖము
లేక తపించి ధూ - ళి మునింగి యొరులు
గనరాక పాషాణ - గతిని వేయేండ్లు
చనిన యవ్వెనక...." (బాల- పంక్తులు- 3667-3670) -అని

భాస్కర రంగనాథ రామాయణములందువలె శాపము కలదు.

సీతా కళ్యాణమునకు ముందు జనకమహారాజు దశరథునకు పనిచిన శుభలేఖ విజయనగర సామ్రాజ్యమున రాయసమువారు వ్రాసెడు లేఖను పోలెను.

"....రా - యసములవారు
అందుక" శ్రీమన్ మ - హా మండలేశ్వ
రేందుకులోత్త మా - హీన ప్రతాప
జనకమహారాజ - చంద్రులంగారు
మన వంశ దశరథ - మనుజేశునగరి
చాలు మానసులకు - సంప్రీతిఁ బంపు
మేలువార్త నిరు ద్ధ - మితమున కేము
అందఱుఁ బరిణామ - మచటి మీరాజు
నందు యోగక్షేమ - మప్పటప్పటికి
వ్రాసి యంపునది - మా వైదేహిఁ బెండ్లి
చేసెద మిపుడు మీ - శ్రీరామునకును
మీ రాజువారును - మీ పురోహితులు
చారువైఖరులఁ గౌ - సల్యాది సతులు
రావలె నని తమ - రాజుతోఁ దెలుపఁ
గావలె- ననెడి వక్కణఁ జదివి"రి. (బాల- పంక్తులు-

4906-4920)

సీతా వివాహమునకు ముందు జనకుడు :
"అయింటి కీయింటి కరమర యేది ?
ఆ యయోధ్యయు విదేహము మీకు సరియె
నీవు వసిష్ఠమౌనియు విచారించి
కావలసిన పనుల్ గావించుకొనుఁడు
..............................
మాకు నొక్క స్వతంత్రమా ? అన్ని పనుల
మీకెట్లు సరిపోవు మేలవి మాకు
నొప్పు నే నెవ్వఁడ నొక ముహూర్తమున
నిప్పుడ నిఱువుర కిత్తుఁ గన్నియల" (బాల- పంక్తులు-
**5214-5224**) అనెను.

నామతీర్థాదికములు తీర్చుట - వైష్ణవ సంప్రదాయము. (పుట-312- పంక్తి- 1698)

అంతఃపురమునందు నరపాలుడు ప్రవేశింపగనే, మహారాజు ఆగమనమును తెలియజెప్పెడి బిరుదు గద్యలు చిలుకలు చదువును.

మహారాజు నిదుర మేల్కాంచగనే పరిచారకులు దర్పణములు దాల్చి నిలుచుట- "పరిచారకులును దర్పణములుదాల్చి"(పుట-308)- మున్నగు జాతి వార్తా చమత్కారము వరదరాజు రామాయణమం దెల్లెడల కన్పట్టుచుండును. జాతీయములు, సామెతలు కూడ విరివిగ ప్రయోగింపబడెను.

కవితా శిల్పమున, రచనా సౌందర్యమున రంగనాథ రామాయణముతో సరితూగు వరదరాజు రామాయణము అతి సరళము- సర్వజన సులభగ్రాహ్యము. సంస్కృత సమాస రచన వర్ణనల యందు మాత్రము కావింపబడెను.

భాస్కర రంగనాథ రామాయణములలోని కైకసి, సులోచనా వృత్తాంతములు, రామేశ్వరమున రామలింగ ప్రతిష్ఠ మున్నగు వృత్తాంతములు ఇందు లేవు. శ్రీరాము డిందు రామలింగ ప్రతిష్ఠ కావింప లేదు.

చాల చింతిలి విభీ - షణుఁడు పాదముల
వ్రాలి యోదేవ ! నీ - వాఁడనై యిచట
నుండు నంతియె కాని - యొండెడ కేఁగ
నెందుకు లంక నా - కేల ? పోననిన
నెందుచే సీతనిఁ దృప్తునిఁ జేతు
నెందుల ననబాయఁ డితఁ డని యెంచి
తనమారు తన కుల - ధనము పూర్వమున
మన పుత్రుఁ డిక్ష్వాకు - మనుజేశ్వరుండు
నిలిపిన మాపాలి - నిక్షేప మీవు
కొలువుము లంకకు - గొనిపొ మ్మటంచు
సజ్జతో శ్రీరంగశాయి నొసంగ
నజ్జ చేసుక య- మ్మహాను భావుండు
గైకొని లంకకుఁ - గదలిపోవుటయు"- (అరణ్య. పంక్తులు- 12302-12314) అని శ్రీరాముడు రామలింగ ప్రతిష్ఠ చేయుటకు మారుగా విభీషణునికి శ్రీరంగసాయిని ఒసగెను. యథావాల్మీకముగా రామాయణమును ద్విపద గావించినను కట్టా వరదరాజు వర్ణనలలో ఎడనెడ స్వాతంత్ర్యమును ప్రదర్శించెను. బాలకాండమునందు విశ్వామిత్రుడు శ్రీరాముని మేల్కొల్పు "కౌసల్యా సుప్రజారామ పూర్వా సంధ్యా ప్రవర్తతే - ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్"- (వా. రా. బాల. 23-2) -సుప్రసిద్ధమగు ఈ శ్లోకభావమును వరదరాజు ఇరువది నాలుగు ద్విపదలలో పెంచివ్రాసెను. అంతియేకాక మేలుకొలుపు అనంతరము ఒక జోలపాట వంటిది కూడ వ్రాయబడినది. ఈ విధముగనే యాగసంరక్షణానంతరము అయిదు శ్లోకములందు గల నిశావర్ణన ద్విపద రామాయణమున "ప్రొద్దు గూకియు ప్రొద్దు బోయెను"- అనుచు గేయరూపమున కావింపబడినది.

చిన్నన్న ద్విపద లక్షణానుసారిగ ఈ ద్విపద కావ్యము రచింపబడెను. ప్రాసయతులు, పాదాంతము నందును, పద మధ్యమందును విఱుపులు ఇందు కానరావు.

ఇంద్రజిత్తు నాగపాశములచే రామలక్ష్మణుల బంధీకృతులైన సన్నివేశమున ఇందు భాస్కర రంగనాథ రామాయణములందు వలెనే నారదాగమనము గలదు.

## భోసల ఏకోజీ రామాయణము :-

ద్రవిడ దేశమును పాలించిన మహారాష్ట్రరాజగు ఛత్రపతి శివాజీ సోదరుడగు (సవతి తమ్ముడు) ఏకోజీ ఈ రామాయణమును రచించెనని తంజావూరు తాళపత్రపు తెనుగు పుస్తకముల వివరణమున కలదు.ఏకోజీ క్రీ. శ. 1676 నుండి 1683 వరకు తంజావూరును పాలించెను.కాని ఈ రామాయణమందలి వంశక్రమమును తద్రచయిత క్రీ.శ. 1729-36 వరకు పాలించిన తులజాజీ కుమారుడనియు ఇతడు బావా సాహెబు నామమున ప్రసిద్ధుడనియు శ్రీ నిడదవోలు వెంకటరావుగారభిప్రాయబడిరి.[1] బావాసాహెబు 1735-36 - ఒక సంవత్సరకాలము మాత్రము రాజ్యపాలన మొనరించెను. ఈ గ్రంథము అముద్రితము. ఇంకను తెలంగాణా ప్రాంతమందలి దమ్మారావుపేట నివాసియగు చేడ రాఘవరెడ్డి - ద్విపద రామాయణము వ్రాసెనని అనుమకొండ పరిశోధకమండలి యందు గోలుకొండ కవుల సంచికయందు పేర్కొనబడెను. ఇంతియకాక మామిడమ్మ సుభద్రమ్మ అనునామె అధ్యాత్మ రామాయణమును ద్విపదగా వెలయించినట్లు ఆంధ్ర వాఙ్మయ సూచి పేర్కొనుచున్నది.

---

1. కట్టా వరదరాజు రామాయణము - VOL I- పీఠిక.

# శ్లేషకావ్యములు — రామకథ

చంపూ, ద్విపద మున్నగు సుప్రసిద్ధములైన ప్రక్రియల వలెనే మహాకవుల ప్రతిభా సామర్థ్యముల వలన శ్లేషకావ్య శాఖ సాహిత్య రంగమున వెలసినది. తెలుగు సరస్వతికి నూతన కథా కల్పనా చమత్కృతి నీరాజనము పట్టిన పింగళి సూరన కవియే అనన్యసామాన్యంబగు శ్లేష మూలక కథాద్వయ ఘటనా వైచిత్రికి ఆలవాలమగు కావ్యమును కూడ రచియించెను. సూరనకవి రాఘవపాండవీయము తెలుగున వెలసిన ప్రప్రథమ ద్వ్యర్థికావ్యము. నూతన కథా కల్పనయైన కళా పూర్ణోదయమును అంతకుమున్నే పరివ్యాప్తమయిన ప్రబంధ రీతిని, ప్రసిద్ధేతివృత్తములైన రామభారతకథలను జోడించి వినూత్నమగు శ్లేష ప్రక్రియ యందును పాత కొత్తల మేలుకలయిక నొనర్చిన వారిలో ప్రప్రథముడు అద్వితీయుడు అయి ఆంధ్ర సాహిత్య రంగమున తన కొక విశిష్ట స్థానమును శాశ్వతముగ సాధికారముగ సముపార్జించుకొనెను. భారతీయ వాఙ్మయమునకు ఆధారములైన రామ భారత కథలే తెలుగున తొలి ద్వ్యర్థికావ్యమునకు కూడ ఇతివృత్తమగుట ఇట విశేషము! సూరన కాలమును వీరేశలింగముగారు తమ కవుల చరిత్రమందు సయుక్తికముగ చర్చించి క్రీ. శ. 1566 ప్రాంతముగ నిర్ణయించిరి. సూరన చిన్నచిన్న కృతు లెన్నియోగాక గరుడ పురాణము, రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నములను రచియించినట్లు ప్రభావతీప్రద్యుమ్నమందలి "జనముల్ మెచ్చఁగ మున్ రచించితి..." అను పద్యము వలన తెలియుచున్నది. రామ భారత భాగవత కథలు మూడింటిని కూడ నాటకములుగ కాని కావ్యములుగ కాని రచియించిన వారు అధికసంఖ్యయందుండుట ఆధునిక యుగమునందలి ప్రత్యేకతలలో నొకటి. ప్రాచీన

కవులలో రాఘవ పాండవీయమును, భాగవతాంతర్గతమగు ప్రభావతీ ప్రద్యుమ్నుల కథను కావ్యముగను రచియించిన పింగళి సూరన ఇట్టి పద్ధతిని కావ్యముల వ్రాసిన వారిలో పేర్కొనవలెను.

శా. "రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహెూ యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగు కబ్బం బద్భుతం బంద్రు ద
క్షుండెవ్వాఁ డిల రామ భారత కథల్ జోడింప భాషాకృతిన్"[1]

—అనుచు తన కావ్య ఘనతను వెల్లడించిన సూరన కవి రాఘవ పాండవీయమున నాలు గాశ్వాసములందు, 607 గద్య పద్యములలో రామ భారత కథలను జోడించి రచియించెను. ఈ కావ్యము కథా ప్రధానము ఇందు కవి అహల్యా శాప విమోచనము, విరాధ వధ మున్నగు ప్రధాన ఘట్టములను మాత్రము స్వీకరించి, ఋష్య శృంగ చరిత్ర, గంగావతరణము, విశ్వామిత్ర చరిత్ర, దశరథ విలాపము, గుహ సమావేశము, తారా విలాపము మొదలైన సన్నివేశములను పరిహరించి సంగ్రహముగ త్వరితముగ కథను చెప్పినను అటనట వసంతఋతువు వంటి వర్ణనలకు తావొసగెను. ఇట్లే భారతమున కూడ ప్రధాన ఘట్టములే గ్రహింపబడెను. ప్రథమాశ్వాసము రామాది రాకుమారుల జననము, ద్వితీయాశ్వాసమున పరశురామ గర్వభంగము పర్యంతము, తృతీయాశ్వాసమున హనుమంతుడు అశోకవనిని జనకజను తిలకించువరకు, చతుర్థాశ్వాసమున పట్టాభిషేక పర్యంతము గల కథ చెప్పబడెను.

రామ భారత కథ లిందు అతి లాఘవముగ సంఘటింపబడినవి. ప్రథమాశ్వాసమున దశరథ పాండురాజులు శాపము నొందుట, రామాదులు, పాండవుల జననము, సీతా ద్రౌపదుల కళ్యాణములు మున్నగు ఘట్టములు సంధింపబడినవి. రామ పరముగ పరశురామ గర్వభంగ ఘట్టమున కార్తవీర్యార్జున శౌర్యము పరశురాముని చేతను, శ్రీరామ పరాక్రమ వినయ శీలము లక్ష్మణునిచేతను వచింపబడి-

1. ఆ- 1- ప. 10.

తదవసరమున భారత పరముగ ద్రౌపది విషయకముగ పాండవుల నియమము, అర్జున కృత నియమోల్లంఘనము, తీర్థయాత్ర, చిత్రాంగదాదుల పరిణయము మున్నగు అంశములు వర్ణింప బడెను. ద్రౌపది విషయికముగ పాండవులు నియమ మేర్పరచుకొనుటకు ప్రేరేచినది నారదుడు. ఆ సందర్భముగ పరశురామ గర్వభంగ ఘట్టము తిలకించుట కటకు నారదుడు అరుదెంచినట్లు రామాయణ పరముగ పేర్కొన బడెను. ఇటులనే కావ్యప్రారంభమున పాండురాజు శాపము కథారంభముననే బారతమునవచ్చును గాన దశరధుని శాపము కూడ కథా ప్రారంభముననె దశరథ పాండురాజుల వనగమన, విహారములు సంధింపబడి, చివరకు శాపము నొందుట, తదుపరి పుత్ర జననములు కూడ జోడింపబడెను. అందువలన కావ్యమునందలి ప్రథమాశ్వాసమంతయు ఇంచుమించు రామ భారత పరముగ సమానమైన సన్నివేశములతో ప్రారంభమయి, ఆవిధముగనే ముగిసెను. తృతీయాశ్వాసమున రాఘుపట్టాభిషేకము, యుధిష్ఠర రాజసూయ యాగమునకై ప్రేరణ, రామ పాండవారణ్య గమనములు, శూర్పణఖా ఊర్వశుల మోహములు మున్నగు ఘట్టములు సంధింపబడెను.

రాముని రాజ్య పరిత్యాగము, దశరథుని నిర్యాణము, భరతుని దుఃఖము, పాదుకా ప్రదానము- మున్నగు అంశములన్నియు అతి క్లుప్తముగ చెప్పబడెను. శ్రీరాముడు శరభంగాశ్రమమునకు చనినప్పుడు "...ముఖ్య భృత్యు లమర సంయముల్ ముదముతో మది మ్రొక్క నటించె మర్త్యతన్"–[1] అని శ్రీరాముని దివ్యత్వము సూచింపబడెను. ఇట్లు పాత్రల ముఖతః రాముని దివ్యత్వము గూర్చి పలికించకున్నను ఆయా సందర్భములందు కవియే స్వయముగ రామ దైవత్వమును గూర్చి పేర్కొనుచుండుట ఇందు పలుతావులందు కలదు. శ్రీరామ శరభంగాశ్రమ గమన సందర్భమున భారతపరముగ కిరాతార్జునీయ కథ సాగుచుండుటచే పరమేశ్వరుడు మర్త్యరూపమున అర్జునుని దరియు సన్నివేశము ఇట వర్ణింపబడుటచే భారతార్థమును సాధించుటకై కవి ఇప్పట్టున శ్రీరాముని దివ్యత్వమును సూచించె ననదగును. సీతారామలక్ష్మణులు అగస్త్యమహర్షి దర్శ

1. ఆ. 3- వ- 40.

నార్థ మరిగిన ఘట్టమున భారతార్థమున అర్జునకృత పరమేశ్వరస్తవము రామాయణార్థమున తన దర్శనార్థ మరుదెంచిన సీతారామలక్ష్మణుల కాతిథ్య మొసగిన అగస్త్య మహర్షి శ్రీరాము నుద్దేశించి మానసికముగ కావించిన స్తోత్రముగ అన్వయింపబడెను.[1] భారత పరమగు సైంధవ పరాభవకథనార్థము వాల్మీకి రామాయణమున ఆరణ్య పర్వమున జరిగిన కాకాసుర వృత్తాంతము ఇందు హనుమంతునిచే సుగ్రీవునకు శ్రీరామ సుగ్రీవమైత్రి సందర్భమున చెప్పబడినట్లు క్రమము మార్చబడెను.[2]

ఇట్లు వివిధ రీతులలో రెండు కథలను రమణీయముగ జోడించిన సూరన ఘంట మంతటితో సంతృప్తినొందక అటనట పరస్పర విరుద్ధములైన రసములను ఒకే సన్నివేశము ఒకే పద్యమందు ప్రతిభావంతముగ జొప్పించుచు సాగినది. కావ్యారంభమున ప్రథమాశ్వాసమున శాపముల బడసిన దశరథ పాండురాజుల వర్తనములు తెలుపుచు వ్రాసిన అయిదు పద్యములందు దశరథపరముగ భక్తిశృంగారములు పాండురాజు పరముగ భక్తివైరాగ్యములు జోడింపబడినవి.[3] అందును ముఖ్యముగ

"అనిభృత దాక్షిణ్యండై
తనయాలోకన విదూరతకుఁ గుందు నిజాం
గనలం గూడి యవని నా
ఘనుఁడు నడపెఁ బెంపుమీఱఁగా మునిచర్యల్" -అను పద్యమున-

రామాయణార్థమున : అనిభృత = గూఢముగాని, దాక్షిణ్యండై = దక్షిణనాయకత్వము గలవాడై, తనయ = కుమారుల యొక్క, ఆలోకన విదూరతకుఁ గుందునిజాంగనలన్ = కౌసల్యా కైకేయీ సుమి

1. ఆ. 3- ప- 59-63.
2. ఆ. 3- ప. 119, 120.
3. ఆ- ప. 36-40.

త్రలను కూడి, అవనిన్ = భూమియందు, అఘనుడు = అలాగున ప్రసిద్ధుఁడైన దశరథుడు, కాముని చర్యల్ = మన్మథ క్రీడలను, పెంపు మీఱ నడపెను.

భారతార్థమున : అని ఇట, భృత దాక్షిణ్యుండై, తనయొక్క, ఆలోకన విదూరతకున్ = చూడకుండుటకు, కుందుచున్న నిజాంగన లను, కూడియ = కూడుకొనియే, వనిని. అ ఘనుడు = పాండురాజు, ముని చర్యలను పెంపుమీఱగా నడపెను.

ఇట్లు శృంగార వైరాగ్యములు ఏకకాలమున సంధింప బడినవి.

రామ భారత కథా సంఘటనమునకు అనివార్యములైన అలతి మార్పులు తప్ప రాఘవ పాండవీయమందలి కథ యథావాల్మీక మన దగును. అతి విస్తృతములైన రామాయణ భారత కథార్థములను వివరించు పట్టున అనేకార్థక శబ్ద ప్రయోగము శ్లేష ప్రధానము కాని కావ్యములందువలె అత్యంత విరళము కాగ కేవల పద విభాగ మాత్రమున శబ్ద భేదము ఏర్పడగా తనంతన వివక్షితైకార్థ ప్రతిపాదక ముగా కావ్యమెల్ల రచియించుట పింగళి కవికి గల ఉభయభాషా పాండిత్య సామర్థ్యమునకు నిదర్శనము.

సీ. "ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొక్క చోట నొక్కొకచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్క చోట న
ర్థశ్లేష యొక్కొక్క తఱిని ముఖ్య
గౌణ వృత్తి శ్లేష ఘటన యొక్కొక తఱి
నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయ విభేదసంగతి యొక్కొక్క
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు

తే. మూఁడు గూడుట యన సముజ్జ్వలము గాఁగ
నాకుఁ దోచినగతిఁ బెక్కుపోక లమర

రామభారత కథలు పర్యాయ దృష్టిఁ
జూచు సుమతుల కేర్పడ నాచరింతు"–[1] నని కొన్ని నియమము లేర్పరచికొనియు ముఖ్యముగా ప్రథమ తృతీయములనే ప్రయోగించెను కావున గ్రంథ రచన వచనాతీతాద్భుతావేశభాసురమై విరాజిల్లెను: ఒక ఉదాహరణముగా

క. "ఘనవిగ్రహజృంభణమున
ననయము దన కట్లు దుగఁగ నవ్వాహినిఁ గ్రీ
డన గెలిచి వచ్చు నబ్బా
లునిఁ గని వెఱఁగంది రాత్మలో నచటి జనుల్"– [2]

ఇందు రామాయణార్థమున విగ్రహజృంభణము యుద్ధాతిశయ మనియు, వాహిని సేన యనియు భారతార్థమున విగ్రహజృంభణము ఒడలు విఱుచుకొనుట యనియు, వాహిని నది యనియు, ననేకార్థక సంస్కృత శబ్దములప్రయోగముతో ఇచ్చట సంస్కృత భాషార్థశ్లేషసాధింపబడెను.

పింగళి సూరన అధిక నియమముతో కథా ద్వయమును కూర్చునెడ, భాషా జాతీయములగు వాడుక పదములనుకూడ అటనట ప్రయోగించెను. శబ్దార్థాలంకారములును, నగరార్ణవాది మహాకావ్య లక్షణములును ఇందు కలవు. వర్ణనలందు ముఖ్యముగ పేర్కొనవలసినది ద్వితీయాశ్వాసారంభమున గావింపబడిన వసంతఋతు వర్ణనము.

రాఘవ పాండవీయముచే ప్రభావితుడయిన రామరాజ భూషణుడు హరిశ్చంద్ర నలోపాఖ్యానమును వ్రాసెను. కాల క్రమమున ద్వ్యర్థికావ్యములే కాక త్ర్యర్థికావ్యములు కూడ భాషాసరస్వతి కలంకారములుగ వెలసినవి.

## నిర్వచన భారత గర్భ రామాయణము :–

చతుర్విధాంధ్ర కవిత్వములో గర్భ కవిత్వము ఒకటి. ఒక పద్యమందు మరియొక పద్యము గర్భస్థమై యుండుట గర్భకవిత్వముగా

1. పీఠిక– ప. 17.
2. ఆ. 2– ప. 25.

పేర్కొనబడును. ప్రాచీన సాహిత్యమున ప్రబంధాదులందు అచ్చ టచ్చటను, ఆశ్వాసాంతములందును, గణపవరపు వేంకట కవి 'ప్రబంధరాజ పరమేశ్వర వేంకటేశ్వర విలాస'మందు కొంచె మధిక ముగాను గర్భకవిత్వము కలదు. గ్రంథాద్యంత పర్యంతము గర్భ కవిత్వము వెల్లివిరిసిన కావ్య మీ నిర్వచన భారత గర్భ రామాయణ మనియే పేర్కొన వలెను. కవి శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ. భావ కవిత్వ వచన కవిత్వములు సాహిత్యాకాశము నాక్రమించు అత్యాధు నిక కాలమున గర్భ కవిత్వమున నిర్వచన భారత గర్భ రామాయ ణము వంటి- అందును ప్రప్రథమ ప్రయత్నముగ- కావ్యమును రూపొందించిన రావిపాటి లక్ష్మీనారాయణ కవి అభినందనీయులు. 126 పద్యములు గల ఈ చిన్న కావ్యమున మూలపద్యములు రామా యణార్థములు గాను, గర్భస్థ పద్యములు భారతార్థముతోడను నిండి యుండును.

ఇందు ఉభయకథలను ఒకేతావున వివరింప ప్రయత్నించుట వలన అటనట కథాభాగములను కొన్నిపట్టుల పెంచి, మరికొన్ని తావుల సంగ్రహముగ చెప్పుట సంభవించెను. ఉదాహరణమునకు ఉభయకథలందును వివాహములను శ్లేషించిన పిమ్మట, అరణ్యగమ నమును శ్లేషింపవలసిన సందర్భమును స్వీకరింప నగును. రామా యణమున సీతాకళ్యాణానంతరము వనగమనమునకు నడుమ కథాం శము భారతకథతో సరిపోల్చిన మిగుల స్వల్పముగా నుండును. భారత మున ద్రౌపదీ కళ్యాణానంతరము పాండవులు నియమ మేర్పరచు కొనుట, అర్జున తీర్థయాత్ర, సుభద్రా వివాహము, అభిమన్యు జననము, ఖాండవదహనము, ధర్మరాజు యౌవరాజ్యాభిషేకము, మయసభ, జరాసంధవధ, రాజసూయయాగము, శిశుపాలవధ, జూదము, ద్రౌపదీ వస్త్రాపహరణము, భీమప్రతిజ్ఞ, పునర్ద్యూతము మున్నగు సంఘటనలు పెక్కు కలవు. ఇప్పట్టున రెండు కథలను జోడించుచు, పింగళి సూర్యనార్యుడు తన రాఘవ పాండవీయ ద్వ్యర్థి కావ్యమున రామకథా పరమగు పరశురామ వృత్తాంతము నిలిపి, భారత కథా గమన మొన ర్చెను. రావిపాటి లక్ష్మీనారాయణ అట్లు చేయకుండ, పై కథాం

శము లన్నియు వ్రాసెను. ఈ విధముగనే రాఘవపాండవీయముతో పోల్చిన ఈ కావ్యమున కథాద్వయ మైత్రిలో కొన్ని భేదములు కన్పట్టు చున్నవి.

| రాఘవ పాండవీయము | నిర్వచన భారత గర్భ రామాయణము |
|---|---|
| 1. విశ్వామిత్రుని రామలక్ష్మణులు అనుసరించుట - పాండురాజు మరణము. | 1. విశ్వామిత్రుని రామలక్ష్మణులు అనుసరించుట - పాండవులు వారణావతమునకు వెడలుట. |
| 2. రామపరశురామ సంభాషణము -భారతములో కథ కొంతవఱకు. | 2. రామ పరశురామ సంభాషణము లేదు. |
| 3. సీతాపహరణము - ద్రౌపదిని జటాసురుడు హరించుట. | 3. సీతాపహరణము- సైంధవుడు ద్రౌపదిని హరించుట. |
| 4. అంగదుని రాయబారము-కృష్ణుని రాయబారము. | 4. సుందరకాండములో హనుమ ద్రావణ సంభాషణము-కృష్ణుని రాయబారము. |
| 5. అతికాయ వధ - ద్రోణవధ. | 5. మూలసైన్యవధ - ద్రోణవధ. |
| 6. ఇంద్రజిద్వధ - కర్ణవధ. | 6. కాలనేమి వధ - కర్ణ వధ. |
| 7. విరూపాక్ష వధ - శల్యవధ. | 7. మాల్యవంత వధ - శల్యవధ. |

— ఇత్యాదులు.

ఉ. [1] "తా(సిత కీర్తి యా నృపుఁ డుదగ్రత వెల్గెను భాసురంబుగా
వాసి జరా)గమంబునను భార్గవి గేహహితుండు గ్రుంకెఁ బ
ద్మా (సుతుభీము డల్లి యెడదన్ హత మత్యధికోగ్రమూర్తియై
చేసె లలిన్) లసన్నటనఁ జేయు నతం డిపు డంచసూయనాన్"

రామాయణార్థము : జరాగమంబునను = ముసలితనము వచ్చుటచే (దినమంతయు ప్రకాశించి వృద్ధుడగుటచే;) భార్గవి = లక్ష్మీదేవి యొక్క, గేహ = ఇంటికి (పద్మమునకు), హితుండు = మిత్రుడు (సూర్యుడు)పద్మాసుతు = లక్ష్మీదేవి కుమారుని(మన్మథుని)భీముడు = శివుడు, అతండు = ఆ శివుడు, లక్ష్మీదేవి ఇంటికి హితుడు గనుకను,

1. ప. 59.

లక్ష్మీదేవి కుమారుని శివుడు సంహరించెను గావున, పరమేశ్వరునిపై సూర్యునకసూయ గలదనియు, సాయంకాలమున మహేశ్వరు డొనర్చు నాట్యమును తిలకించనోపక గ్రుంగె నని భావము.

భారతార్థము : జరాసుతు = జరాసంధుని, లలి = ఉత్సాహము.

ఇట్టీరీతిని రామాయణ పరమగు సూర్యాస్తమయ వర్ణశ్లేషలో జరాసంధ వధను చెప్పగలుగుట బహు క్లిష్టసాధ్యమై కవి ప్రతిభకు చక్కని తార్కాణ యగుచున్నది. ఆ విధముగనే సీస పద్య గర్భ మును శార్దూలోత్పల చంపకమాలలలో భూషిత మొనర్ప గలుగుట కూడ కష్టము. అయినను మూలపద్యమున గురువైనదానిని గర్భపద్య మున లఘువు [2] గాను, లఘువైనదానిని గురువు [3] గాను మార్చి చిత్ర బంధ కవిత్వము కవిసామర్థ్యము వలన సాధింపవచ్చునని నిరూపిం చెను. అచ్చ తెలుగు పద్యము, చతుర్విధాష్ట కందములు, నిరో ష్ఠ్యము, ముక్తపదగ్రస్తము, పుష్పమాలికా బంధము, నాగబంధము లందు కూడ గర్భపద్యములు విడువక వ్రాయబడెను. సీతాకల్యా ణమున పుష్పమాలిక వేసుకొనుట పుష్పమాలికాబంధమునందే [4] వ్రాసెను. కృష్ణుని రాయబారము, హనుమద్రావణ సంభాషణము అర్థోక్తి పూరితములుగా నుండును. 98, 99, 100- పద్యములలో ఒక్కొక్క పద్యమం దొక్కొక్క రసముతో ఆయా రసనామములను ఆయా రామాయణార్థ పద్య చతుర్థ పాదాంతమున చమత్కారముగా పేర్కొనబడెను.

"నేత విడుము కుమతిని విను సీత జననంబు లంకజేటునకె సుమీ" -అనుచు భారతార్థమున "సీతా జననంబు లంక చేటునకె సుమీ" అనునది సామెతగా స్వీకరించి, అటులనే దుర్యోధనుని జన్మము కౌరవ వంశ నాశనమునకే అను అర్థమును ధ్వనింపజేసెను."

2. ప. 53.
3. ప. 54.
4. ప. 51.

దుర్లభమగు గర్భశ్లేష లున్న కావ్యమందు అటనట లోకోక్తులు, దేశీయములు, కవిసమయములు, అలంకారములు కూడ ప్రయోగింప బడెను. 'అవనిఁదామర తంపలైరి చాల', 'శుభస్య శీఘ్రము మ్మని', 'ఒకటి తా నెంచ దైవ మింకొకటి సేయు', 'మూడుపూవు లాఱుకాయలగు టంచు', 'రంగరంగ వైభవములతో' -మున్నగు లోకోక్తులు ఎన్నియేని కలవు.

"రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గాకుండుం దద్గతి కావ్యమెల్ల యగునే"- అని పింగళి సూరనార్యుడే స్వయముగ పేర్కొనిన శ్లేషకు గర్భ కవిత్వమును కూడ జోడించి, "స్వాత్మాపదోషో శ్లేషాదాని హతార్తా ప్రయుక్తతే" అని ఆలంకారికవచన మున్నను, సుప్రసిద్ధార్థములు గల పదప్రయోగముతో, లక్ష్యలక్షణ సమన్వితముగ, సరళముగ, స్వతంత్రరీతిని కావ్యమును వెలయించుట బహు కష్టతరము.

[1] యాదవ రాఘవ పాండవీయము:-

"రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా కుండు"- ఆ రీతిని శ్లేషయందు కావ్యమంతటిని పండితామోద కరమగునట్లు రచియించుట కష్టసాధ్యమని శ్లేషకావ్యముల కాద్యుడైన పింగళి సూర్యనార్యుడే స్వయముగ పేర్కొనెను. కాని సూరన మార్గానుసారులైన తరువాతి కవులు కొందరు ద్వ్యర్థికావ్యములతో సంతృప్తినొందక త్ర్యర్థికావ్యములను కూడ రచింప బూనుటతో శ్లేష కావ్యశాఖ చిలువలు పలువలుగ విస్తరిల్లెను. త్ర్యర్థికావ్య మనగా మూడర్థములతో వెలయు కావ్యము గావున ఇప్పట్టున రామ భారత కథలకు భాగవతము కూడ జోడింపబడెను. శ్లేషకావ్యేతివృత్తము లుగ హరిశ్చంద్ర నల శివాది కథలు స్వీకరింపబడినను ద్వ్యర్థికావ్య ములందు రామ భారత కథలు, త్ర్యర్థి కావ్యములందు భారత భాగ వత రామాయణములు ప్రముఖ స్థానమును ఆక్రమించును.

1. నిర్ణీతకాలములో పూర్తికావ్యము దొరకనందున, లభించిన భాగమును అనగా కావ్యారంభ భాగమును గుఱించి ఇచ్చట పేర్కొనబడుచున్నది.

ఇట్లు భాగవత రామ భారత కథలు జోడింపబడిన కావ్యములలో యాదవ రాఘవ పాండవీయము–ఒకటి. గోపాలకృష్ణున కంకితముగా నెల్లూరి వీరరాఘవ కవి దీనిని రచించెను. కావ్యము "......విభవానుభావసాత్త్వికభావసంచారీభావసముదయసముజ్జృంభిత సుభగంభావుక గంభీర సముల్లసదసదృశ రసరంగదుత్తుంగా భఙ్గిభంగీ తరంగిత ప్రాణబంధ ప్రతీయమానధ్వని విజిత విభ్రాజమానంబును సకలాలంకారాలంకృతంబును, ఓజస్సౌకుమార్య ప్రసాద మాధుర్యతా ముఖ్య గుణచిరత్నరత్నరంజకంబును, పురాకృత పుణ్యాతిశయ పరిలబ్ధ భాగ్యప్రవర్ధమాన నిరుపమానప్రతిభావిశేష పరిచిత నిఖిలవిద్యావిజ్ఞానాత్మిక కారణద్వయ విజృంభమాణ నిర్దోష మధురతర వచన రచనా సరస విచిత్రాభినవ శబ్దార్థ యుగళమూర్తికంబును, రసాశ్రయీభూత చతుర్వృత్తి విలసితంబును అనుపమానంబును...." అనుచు తనకావ్య లక్షణమును దీర్ఘవచనమున పేర్కొనుటయే కాక నెల్లూరి కవి,

సీ. [1] "ఒకచోట శబ్దార్థ యుగళ చమత్కార
సందర్భ గర్భిత చతుర వృత్తి
మొకవంక నకలంకితోదయధ్వని ముఖ్య
మొకవంక వాచ్యార్థ యోగ విభవ
మొక చక్కఁ జక్కని ప్రకటిత శ్లేషోక్తి
యొకచక్కని నభంగయుతపదాప్తి
యొకదారి పదవాక్య నికరగవ్యంగ్యంబు
నొకదారి బహుళార్థ యోగ గమ్య

గీ. మొకటి పూర్వాపరాన్వయయోగ గతుల
నొకట నేకార్థ వైభవ ప్రకటయుక్తి
సరస గుణములు విలసిల్ల సరసరీతి
వృత్తుల రస ప్రబంధము విస్తరింతు"– నని సీసపద్యమున

కావ్యప్రణాళికను విస్తరించి చెప్పెను. పద్యమును మూడర్థములలో

1. ఆ. 1–ప. 32.

గ్రహించిన విధము తెలియుటకు కావ్యారంభమందలి ఈ పద్యమును గ్రహింప వచ్చును.

ఆ. "శ్రీల కిరవు బహుళసితభానుకులులకు
నాటపట్టు సజ్జనాస్పదంబు
మహి నయోధ్య కాంతి మధురసాలోజ్జ్వల
నాగ పురి దనర్చు నవ్యలీల.

యాదవ :- శ్రీలకు + ఇరవు = సంపదలకు స్థానము, బహుళ + సిత + భాను + కులులకున్ + ఆటపట్టు = పలువురు చంద్రవంశపు రాజులకు ఉనికిపట్టు, సజ్జన + ఆస్పదంబు = సుజనులకు చోటు, మహిన్ = భూలోకమున, కాంతిన్ = తేజమున, అయోధ్య = జయింప నలవికానిది, సాల + ఉజ్జ్వల = ప్రాకారములచే శోభావంత మైనది, మధుర + నాగ + పురి = మధుర అనే పట్టణము, నవ్యలీల = నూతన విలాసములతో, తనర్చు = ఒప్పు.

రాఘవ :- బహు + లసిత + భాను కులులకు = విఖ్యాతిగాంచు సూర్యవంశ క్షత్రియులకు ఆటపట్టు, మహిన్ అయోధ్య + నాగ + పురి తనర్చు = అయోధ్యఅను పట్టణము కలదు, కాంతిన్, మధుర + సాల + ఉజ్జ్వల.

పాండవ :- మధుర = ఇంపైనది, నాగపురి = హస్తినా పురము, నవ్యలీల + తనర్చు = ఒప్పును.

కవి తన కావ్యమును చిత్రవ్యంగ్య చమత్క్రియలతో శోభిల్ల జేసినట్లు కూడ పేర్కొనెను.

శ్లేష కావ్య ప్రపంచమున వెలసిన రామకథాత్మక కావ్యములు మృత్యుంజయ కవి ధరాత్మజా పరిణయము, అయ్యగారి వీరభద్ర కవి రాఘవ పాండవ యాదవీయము, ఓరుగంటి సోమశేఖర కవి రామ కృష్ణార్జున రూప నారాయణీయము—మున్నగునవి.

## తిట్టుకవిత్వము-రామకథ :-

తెలుగుసారస్వతమున ప్రత్యేకముగ పేర్కొనవలసిన తిట్టు కవిత్వమున వెలసిన కావ్యములలో లంకా విజయమువంటి శ్లేష కావ్యములు రామకథాత్మకము లైనవి కలవు. తత్కారణమున తెలుగు తిట్టు కవిత్వమందలి రామకథ కూడ శ్లేష కావ్య ప్రకరణమున జేర్చుట యుక్తము.

సరస్వతీ మూర్తులైన కవుల హృదయములు పరులవలన గాయపడి వ్యథాభరితము లయినప్పుడు 'తిట్టు' రూపముగ వెల్వడిన కవిత్వమే తిట్టుకవిత్వము. ప్రాచీన కవుల తిట్టు కవిత్వము చాటుధారగానే మిగిలి పోయినది కాని గ్రంథరూపమును దాల్చలేదు. తరువాతి కాలమున కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపము, పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయము మున్నగు కావ్యములు వెలసినవి తిట్టుకవిత్వమునకూడ రామకథకు గల ప్రముఖస్థానము గమనించినచో తెలుగు కవి భావనాప్రపంచమును రామకథ ఎట్లు శాసించగలిగినదో విశదమగును. తిట్టుకవిత్వమందలి రామకథలలో ప్రథమముగ పేర్కొనవలసినది పిండిప్రోలు లక్ష్మణకవి "లంకా విజయ"మను రెండాశ్వాసముల కావ్యము. సుమారు 230 గద్య పద్యములం దీ కావ్యమును వ్రాసిన లక్ష్మణకవి క్రీ. శ. 1840 ప్రాంతము వఱకు జీవించి యుండినట్లు భావింపబడుచున్నది. లంకావిజయము కవి స్వవిషయము రామకథకు జోడించి వ్రాయబడిన శ్లేష కావ్యము. లక్ష్మణ కవికి ఆతని తండ్రి స్వప్నమున సాక్షాత్కరించి ధర్మారావు అనునతడు,

"నీదు లంకమాన్యము బల్మినిన్ హరించె,
గానఁ దత్ప్రాప్తికై రామకథయు మన క
థయును జతగూఁగ నర్థంబు ఘటనపఱిచి
కృతి రచించి గోపాలున కిమ్ము తనయ"- అని కోరుటచే ఈ

కావ్యమును వ్రాసెనట! దీనికి రావణ దమ్మీయమను నామాంతరము గలదు. ఆదియందు కవి రావణదమ్మీయమని పేరిడగా శిష్టు కృష్ణమూర్తి అను కవి "అల్పాచ్చులు గల పదము పూర్వమందుండవలసి

వచ్చుటచే దమ్మ రావణీయమని యుండవలయు” ననగా తరువాత లంకా విజయముగా మార్పు చేసినట్లు వదంతి కలదు. ధర్మారావను నతడు కవిలంకను ఆక్రమించుకొనుట సీతాపహరణముతో పోల్ప బడిన కారణమున ఇందలి ఘట్టములు ఇంచుమించు అన్నియు రామ కథ యందలి ముఖ్యఘట్టములతో సరిపోల్పబడుటచే రెండు కథల యందు వైరుధ్యము అధికముగా కానరాదు. కవికి ముగ్గురు సోద రులు కలరు. వారిక వివాహములై సుఖమున్న తఱి లక్ష్మణ కవి ప్రభువువలన వాగ్దత్తమైనలంకమాన్యమును సాగుచేయించుటయేకాక, విద్వత్కవిగ సత్కీర్తిని కూడ బడయుచుండుట గాంచి, అసూయా గ్రస్తుడైన ధర్మారావను నతడా లంకను బలిమిని ఆక్రమించెను. ఎంత వేడినను తన విన్నప మాలించని ధర్మారాయని తన దైవమైన మహావిష్ణువే శిక్షించు నని భావించి ‘తిట్టు’ పద్యముల చెప్పసాగెను. పద్యముల వ్రాయుట పూర్తియగు సరికి ధర్మారాయడు మరణించెను. లక్ష్మణ కవికి లంక లభించెను. కవివిషయక మగు ఈ కథ రామ కథతో సంధింపబడెను. అందువలన రామాదుల వివాహములు, కవి, అతనిసోదరులకల్యాణములు, రామాభిషేకయత్నము దశరథమరణము_ కవి జనకుడు కవి సోదరుడైన తిరుపన్నకు బాధ్యతల నొసగబూనుట, పినతల్లి అభ్యంతరపరచుట, తిరుపన్న వేరింటి కాపురము, తిరుపన్న మరణము; అరణ్యమున సీతారాములు అత్రిమునిని దర్శించుట- కవి మరియొక సోదరుడు అత్రేయీనదిని దర్శించుట; మాయామృగమును రాముడు వెన్నంటుట- ధర్మారావు తన సోదరుడైన భావన్నను లంకను గ్రహించుటకై అధికారియొద్దకు పంపుట- (అనగా సీతాప హరణమునకు లంకను ఆక్రమించుటకు సన్నాహము లొక్కసారి జరిగినట్లుగా కథా సంవిధాన మేర్పడెను); సీతాపహరణము- లంకను ఆక్రమించుట; సీతా పరిదేవనము- లక్ష్మణ కవి పరితాపము; సుగ్రీ వుడు రాముని విశ్వసించుట- కవి శ్రీహరిని నమ్ముకొనుట; హనుమం తుని అన్వేషణము, సీతాదర్శనము, రావణుడు సీతకడ కఠినోక్తులు పలుకుట, హనుమద్రావణ సంభాషణము- కవి ధర్మారావుకడ కరు గుట, దర్శించుట, హితము గరుప బ్రయత్నించుట; అంగదుని రాయ

బారము- కవి మరల సందేశపత్రమంపుట; రావణ సంహారము- ధర్మారావు మరణము.

—ఈరీతిని రెండు కథలు జోడింపబడెను.

కవి పరమగు కథయందు కంటెను రామకథ యందలి ఘట్టము లధికము లగుటచే ఆయాపట్టుల రామకథ సాగుటకై కవి కథయందలి సన్నివేశములు సుదీర్ఘముగ విస్తరింపబడెను. రామపరమగు యుద్ధ ఘట్టమును వర్ణించుటకై రెండవ కథయందు సూర్యాస్తమయ, నిశి, చంద్రోదయ, ప్రత్యూష వర్ణనలు మనోహరముగ కావింపబడెను. రావణునకు విభీషణుని వలె ధర్మారావునకు కూడ ధర్మపరుడైన సోదరుడు, లక్ష్మణకవికి మిత్రుడయినవాడు భద్రయ అనునాతడు కలడు. రామకథాకథనపద్ధతి పలుతావులందు రాఘవ పాండవీయమును పోలుచుండును. పాయస విభాగము రాఘవ పాండవీయమందు వలెనే కావింపబడెను. శ్రీరామ దైవత్వమును గూర్చి ఇందు జనకుడు స్వయముగ,

క. "మారమణుఁబట్టిఁ గాఁ గని
యే రంజిలు చుంటి గాక యిట్లిత్తరి ని
న్నారిన్ శ్రీమత్కన్యక
నీరలు స్నుషఁ జేసికొనుట నే ధన్యుండన్"- అని సీతాకల్యాణ ఘట్టమున పేర్కొనెను. వివాహములు గౌరీపూజ నాగవల్లి మొదల యినవాటితో తెలుగు పద్ధతిని జరిగెను. ఇంద్రజిత్తు నాగాస్త్రబంధన సందర్భమున నారదుడు రామునికడ కరుదెంచెను. రావణ పాతాళ హోమము, అంగదునిచే మండోదరీ పరాభవము, రావణునకు మండోదరీ హితోపదేశము- మున్నగు అవాల్మీకాంశములు కూడ గ్రహింపబడెను. ముఖ్యముగ పేర్కొనవలసినది- ఇందు రావణునకు నాభియందు అమృతకలశ మున్నటుల పేర్కొనబడుట. ఇది అధ్యాత్మ రామాయణానుసారముగ చెప్పబడిన అంశము.

లంకా విజయము రాఘవ పాండవీయాదులవలె నిర్దుష్టశ్లేష భాసురము గాక నిర్బంధ శ్లేష బంధురముగా నుండును. కవిత్వ

మంత ప్రౌఢము కాకున్నను కొన్ని పద్యముల శైలి ధారాళముగనే యుండును. అయినను రాఘవ పాండవీయాదుల వలె లోకోపకరణమునకు గాకుండ, ఒక వ్యక్తిని నిందింప వలెనను ఆశయముతో రచియింప బడిన కారణమున ఇందు రాఘవపాండవీయ హరిశ్చంద్ర నలోపాఖ్యానాదులందలి కవితాపద్ధతి కానరాదని విమర్శకుల అభిప్రాయము.

పన్నాల బ్రహ్మన్న 'ఖలకర్ణ విషాయన రామాయణము' వంటి శ్లేషకావ్యములు తిట్టు కవిత్వమున ఇంకను గలవు.

"హయమది సీత, పోత వసుధాధిపు డారయ రావణుండు, ని
శ్చయముగ నేను రాఘవుడ, జాహ్నవి వారిధి, మారు డంజనా
ప్రియతనయుండు, లచ్చన విభీషణు, డాగుడిమెట్ట లంక, నా
జయమును బోతరక్కసుని చావును నేడవనాడు సూడుడీ"-

—అను పద్యము, స్వీయదుఃఖమును రామాయణ కథతో అన్వయించి నెల్లూరి తిరుమలయ్యకవి చెప్పినది ఎరుగని ఆంధ్రు డుండడన్న అతిశయోక్తి కానేరదు.

———

# ఉపాఖ్యానములు–రామకథ

శ్రీరామకథా సుధారసమును తనివితీర గ్రోలని తెలుగు కవి అరుదుగా కనుపించును. అట్లు తాము గ్రహించిన రామకథను భాస్కర రంగనాథాదులు మహాకావ్య వృక్షములుగా తెలుగునాట నిలుప, వాని నీడలో తెలుగు ప్రజ సేద దీరినది. కాగా మరి కొందరు కవులు తమ తమ కావ్యములందు రామకథను ఉపాఖ్యాన రూపమున సంక్షిప్త మొనర్చి సీతారాముల కథ పట్ల తమకు గల ప్రత్యేకాభిమానమును పొందుపరుపగా అవి చక్కని చిక్కని మల్లె గుబురులై తెలుగు నేలను గుబాళింపజేసినవి. అనంతమైన సాహిత్యమున రామకథ ఉపాఖ్యానముల రూపమున గల కావ్యముల సంఖ్య నిర్దిష్టముగ చెప్పుటయే కష్టతరము. "తెలుగు సాహిత్యములో రామకథ" అను మాలయందు ప్రసూనములగుటకై పుష్పగుచ్ఛము వంటి రామోపాఖ్యానము నుండి కొన్ని పుష్పములు మాత్రము గ్రహింపబడుచున్నవి.

## భారతాంతర్గత రామోపాఖ్యానము :-

మహా భారతమున రామాయణ ప్రసక్తి కథారూపమున నాలుగు తావులందు కలదు. అరణ్యవాస కాలమున పాండవులు లోమశ మహర్షి సమేతులై పుణ్యతీర్థములను సేవించు తఱి లోమశుడు ఆయా క్షేత్ర మాహాత్మ్యములను వివరించు పట్టున రామకథా ప్రసక్తి వచ్చెను.

1. అగస్త్యాశ్రమము దర్శించిన పాండవులకు వాతాపి ఇల్వలులను రాక్షస సోదరుల వృత్తాంతమును, భృగుతీర్థ మాహాత్మ్యమును తెలిపిన లోమశుడు ప్రసంగవశమున పరశురామ గర్వభంగ వృత్తాంతము వివరించెను. ఇప్పట్టున రామాయణ కథాంశములు కొన్ని సంగ్రహముగ పేర్కొనబడెను. ఇందు శివధను

ర్భంగము కాకుండగనే పరశురాముడు అయోధ్యయం దున్న రామునికడ కరుదెంచి, విష్ణుచాపము చూపి అవహేళన మొన ర్పగా, శ్రీరాము డా ధనుస్సును విరిచి, విశ్వరూపమును ప్రద ర్శించెను.

2. తీర్థయాత్ర పర్వముననే లోమశుడు కాలకేయదైత్యుల సంహర ణార్థము అగస్త్యమహర్షి జలము పానము చేయగా శూన్యమయిన వారాశిని భగీరథుడు పూరించునని మున్ను బ్రహ్మ ఆనతిచ్చిన విషయము పాండవుల కెరింగించి, గంగావతరణము కూడ వివ రించెను.[1] ఋశ్యశృంగ వృత్తాంతమున రోమపాదుడు బ్రాహ్మ ణాపచారము కావించినందున రాజ్యమున క్షామమేర్పడినట్లు భారతము పేర్కొనుచున్నది. ఋశ్యశృంగుని తోడ్కొని వచ్చుటకు వెడలిన వేశ్యాంగనలలో వేశ్యమాత యొకర్తు నేర్పరి యైన కుమార్తెను "ఋశ్యశృంగు పాలికింబుచ్చి"నదని చెప్ప బడెను.[2] వాల్మీకిరామాయణమున "గణికా స్తత్ర గచ్ఛంతు రూపవత్య స్స్వలంకృతాః"– అని సాలంకృతలైన గణికల పనిచినట్లు కలదు.[3] ఆధునిక యుగమున వెలసిన శాంతా కల్యాణాది నాటకములందు గణిక ఒకర్తుక సపరివారముగ వెడలినట్లు పేర్కొనబడెను.

3. సౌగంధిక కమలాపహరణ ఘట్టమున భీమునకు హనుమంతునిచే రామాయణము సంగ్రహముగ చెప్పబడెను.[4]

4. జయద్రథ మోక్షణానంతరము ధర్మజునిచే కోరబడి మార్కం డేయ మహర్షి పాండవులకు రామాయణమును వివరించెను. ఇదియే రామోపాఖ్యానముగ ప్రసిద్ధిగాంచిన భారతాంతర్గత రామాయణము.

---

1. అరణ్యపర్వము–ఆ. 3.
2. ఆ. ప. 3–ప. 96,
3. వా. రా, బాల. కాం, స. 10–శ్లో. 5.
4. అరణ్యపర్వము–ఆ. 3. ప. 325–335.

సంస్కృత భారతమున ఏడువందల యిరువదియేడు శ్లోకము లందు గల రామోపాఖ్యానమును ఎఱ్ఱన మూడువందల పదునారు గద్య పద్యములుగా ఆంధ్రీకరించెను.

ఇందు కథ శ్రీరామజననముతో ప్రారంభమయినను వాల్మీకి ఉత్తర రామాయణమున గల రావణాదుల జనన క్రమము, వారి పరా క్రమాదులు, వారి నణచుటకై చతుర్ముఖాదు లొనర్చిన యత్నములు వివరముగ ప్రారంభముననే వర్ణింపబడెను. ఈ రావణ వృత్తాంతము అటనట వాల్మీకి ఉత్తర రామాయణముతో భేదించుచున్నది. వాల్మీకి రామాయణమున పులస్త్యుని పుత్రుడైన విశ్రవసువునకు భరద్వాజుని పుత్రిక యైన 'దేవవర్ణిని' వలన వైశ్రవణుడు (కుబేరుడు), సుమాలి పుత్రికలైన కైకసి, పుష్పోత్కట, పాకల వలన రావణ కుంభకర్ణ విభీషణ శూర్పణఖలు జన్మించిరి. రామోపాఖ్యానమున పులస్త్యుని పుత్రు డగు వైశ్రవణుడు తండ్రిని విడిచి బ్రహ్మనుగూర్చి తపము జేసి 'నలకూబరు' డను పుత్రుని, లోకపాలకత్వము, లంకాధిపత్యము, ధనేశ్వరత్వము, ఈశ్వరసఖ్యము వరములుగా బడసెను. ఆగ్రహించిన పులస్త్యుడు తన శరీరములో అర్ధబాగమును విశ్రవసుగా జేసి వైశ్రవణునకు హాని యొనర్పుమనెను. విషయము నెఱింగిన వైశ్రవణుడు (కుబేరుడు) విశ్రవసుని సమీపించి ఆతనికి పుత్రునిగ నుందునని సమ్మత పఱచి 'పుష్పోత్కట' 'మాలిని' 'పాక' అను సుందరాంగులైన ముప్పురు రాక్షసస్త్రీలను అతని పరిచర్యలకై నియోగించెను. సేవలతో తనను పరితృప్తుని జేసినవారికి విశ్రవసువు పుత్రదాన మొనర్పగా, పుష్పోత్కటకు రావణకుంభకర్ణులును మాలినికి విభీషణుడును పాకకు ఖరశూర్పణఖయు జన్మించిరి.

రావణ దిగ్విజయయాత్ర సందర్భమున విభీషణుని యోగ్యతకు ముగ్ధుడైన కుబేరుడు ఆతనికి యక్ష రాక్షస సైన్యాధిపత్య మొసగినట్లు సంస్కృత భారతమున కలదు.

ఆంధ్ర భారత రామోపాఖ్యానమున బ్రహ్మ "దుందుభియను గంధర్వ కామినిం బిలిచి నీవు కుబ్జరూపంబున మంధర యను పేర

భూలోకంబున నుద్భవించి నీ నేర్పు విధంబున దేవకార్యంబులు నిర్వహింపుమని పని"చినట్లు కలదు.[1]

పుత్రకామేష్టి, శివధనుర్భంగాదులు ఇందు కానరావు. కేవలము[2] "రామునకు విదేహరాజనందన యైన సీత ప్రియాంగన యయ్యె"-నని మాత్రము కలదు.

కైక ఇందు కోపగృహమున ధూళిధూసరితాంగయై అలుక నటింపలేదు. తద్భిన్నముగ సర్వభూషణ భూషితాంగిగా దశరథుని చేరి "అలనాటి వరముల ప్రదానంబు" చేయవలయునని కోరెను. కైకేయీ వరముల గురించి ఎరింగి రాముడు దశరాథాదులను దర్శింపకయే కానల కరిగెను. వాల్మీకి రామాయణానుసారముగ తమ కావ్యముల రచియించిన సంగ్రహ రామాయణ కర్తలు-ముఖ్యముగ మొల్ల ఇప్పట్టున భారతమందు వలెనే కైకేయీ కోపగృహ ప్రవేశమును పేర్కొనకుండుట గమనింపవలసిన విషయము!

ఇంకను, ఇది ఉపాఖ్యానము గావున గుహవిరాధ అత్రిసుతీక్ష్ణ మాందకర్ణి అగస్త్యాదుల గాథ లిందు ఉపసంహరింపబడెను. సంస్కృత భారతమున సాగరుడు[3] రామునకు స్వప్నమున సాక్షాత్కరించినట్లుండగా ఆంధ్రీకరణ కర్త ఉపవసించిన సోదరులకు సాగరుడు దర్శనమొసగినట్లే పేర్కొనెను.

అవింద్యుడను రాక్షసుని పనుపున అరుదెంచి త్రిజట సీతకు రామ సుగ్రీవ సఖ్యము, రావణునకు నలకూబరుడు ఇడిన శాపము, స్వీయస్వప్న వృత్తాంతము చెప్పెను. వాల్మీకి రామాయణమున అవింద్యుని నామము కానరాదు, మరియు కేవలము స్వప్న వృత్తాంతమును మాత్రము సీతకు వినిపించెను.

ఇందు రాముని పనుపున లక్ష్మణుడు కిష్కింధ కరుదెంచుసరికే సుగ్రీవుడు జానకి నన్వేషించుటకై నలుదెసలకు వానరులను పని

1. ఆం. భా, అరణ్య ప. ఆ. ౭-ప. 291.
2. అరణ్య ప. ఆ. 6-ప. 26.
3. సంస్కృత భారతము వనపర్వము-282 అధ్యా.

చెను.[1] వాల్మీకి రామాయణమున సైన్య సమీకరణమునకై నలుదెస లకు ఆజ్ఞలు మాత్రము సుగ్రీవుడు పంపియుండెను. సుందరకాండ వృత్తాంతము అనగా సీతాసందర్శనము ప్రత్యక్షముగ వర్ణింపబడక, శ్రీరామ సమక్షమున హనుమంతుడు వివరించినట్లుగ వ్రాయబడుట విశేషము![2]

వాల్మీకి రామాయణమున నీలునిచే ప్రహస్తుడు సంహరింప బడిన తరువాత రావణుడు ప్రథమముగ యుద్ధరంగమున కవతరిం చెను. భారతరామోపాఖ్యానమున మొదటిసారి రణరంగమున కరు దెంచి వెడలిపోయినతరువాత విభీషణుడు ప్రహస్తుని సంహరించెను.[3] ఇంద్రజిత్తు నాగాస్త్రముచే రామలక్ష్మణులను బందీకృతుల కావింపగా విభీషణుడు బ్రహ్మాస్త్ర ప్రయోగమున వారిని బంధవిముక్తులను గావిం చెను. అంతియకాక కిన్నరనాథుడు శ్వేతునిచే పనిచిన దివ్యజలము లతో విభీషణుని హెచ్చరిక మేరకు నయనములను ప్రక్షాళన మొనర్చు కొని రామలక్ష్మణులు అంబరవీధిని అదృశ్యునిగ నిలిచి మాయాయుద్ధ మొనరించుచున్న ఇంద్రజిత్తును గాంచినట్లు ఇందు పేర్కొనబడెను.[4] కుంభకర్ణుడు సీతాపహరణ వృత్తాంతము నిందు నిదురనుండి మేల్కొల్ప బడినప్పుడు మాత్రము వినెను. వాల్మీకి రామాయణమున సేతు నిర్మాణమునకు పూర్వము రావణు డేర్పాటుచేసిన మంత్రాలోచన సభలో సోదరునకు హితము గరుప ప్రయత్నించి విఫలుడై కుంభ కర్ణుడు నిద్రింప గుహకు అరిగినట్లు కలదు. ఇందలి ప్రధానమయిన మరియొక భేదము కుంభకర్ణుని లక్ష్మణుడు సంహరించుట! ముఖ్యము లైన రామాయణములు వేటియందును ఇట్లు కుంభకర్ణుడు లక్ష్మణునిచే సంహరింపబడినట్లు కానరాదు. మహాభారత రచనా కాలమునకు లక్ష్మణుడే కుంభకర్ణ సంహారియని లోకమున నుండుటచే సౌతిచే ఆ రీతిగనే స్వీకరింప బడియుండును.

---

1. ఆరణ్య ప. అ. 7_ప. ర.
2. ఆరణ్య ప. అ. 7_ప. 12_32.
3. ఆరణ్య ప. అ. 7_ప. 82_84.
4. ఆరణ్య ప. అ. 7_ప. 129.

ఉపాఖ్యాన మయ్యును రామకథను అష్టాదశ వర్ణనలతో మహా కావ్యము రీతిని ప్రబంధ పరమేశ్వరుడు మలచెను. సంస్కృతమున లేని లంకాపుర వర్ణనమును అతిశయోక్తితో గావించెను.[1] సంస్కృత భారతమున "తావృష్యమూక మభ్యేత్య బహుమూల ఫలద్రుమం" అని మాత్రమున్నది. ఆంధ్రమున "ముందట నతిబహుళ బలాహకవ్యూహ సన్నాహ...." యని పర్వత వర్ణనగా పెంచబడెను. అట్లే మూలమున 'లంకోద్యానాని' అని యున్నవాక్యము "తాలైలగురు చందన- సాల తమాలామ్రనింబ" అను ఉద్యానవనవర్ణనరూపమును దాల్చెను. మూలమున రేఖామాత్రముగ నున్న సరోవర వర్ణనము,

"కమనీయ కమలినీ కల్హార దళకేస
రాన్విత జలముల నర్ఘ్యవిధియు...." అనుచు విస్తరింపబడెను. మూలానుసరణముగ శ్రీరాముని ప్రయాణము వర్ణింపబడినను అమూలకమగు ఋతువర్ణన కూడ కలదు. ఇటులనే మూలాతిక్రమణమగుచు హనుమదాదుల మధువన విహార వర్ణనము కావింపబడెను. ఇంకను అంగదుని రాయబారమున దౌత్యము, పలుతావులందు యుద్ధవర్ణన; రామ సుగ్రీవుల మధ్య మంత్రాలోచనము, కుమారుని యౌవరాజ్యాభిషిక్తుని కావింపవలయునని దశరథు డభిలషించినప్పుడు శ్రీరామ గుణాదికవర్ణన మొనర్చిన "అభినవ పద్మదళాక్షు..." పద్యమున నాయకాభ్యుదయము- ఈ రీతిని అష్టాదశవర్ణన లందలి పెక్కువర్ణనలు "వాక్యం రసాత్మకం కావ్యం" అను రీతిని హృదయంగమముగ కావింపబడెను.

రామోపాఖ్యానమున అతి ప్రధానముగ పేర్కొనవలసినది శ్రీరాముడు సీతను రావణవధానంతరము స్వీకరించు ఘట్టము. శ్రీరామ తిరస్కృతయైన సీత అగ్ని జొత్తు ననగా పృథ్వ్యాది దేవతలు జానకి పతివ్రతయని ముక్తకంఠమున పలికిరి. చతుర్ముఖుడు సకలసురముని సహితముగ అరుదెంచి "నలకూబరు శాపంబునం జేసి దశగ్రీవునకుఁ పరస్త్రీలయందు బలాత్కారంబు సెల్లదు గావున, నీ ధర్మపత్ని యొం

1. "ఆలవణాబ్ధి మధ్యమున యందు"- అనుపద్యము.

డొక్క దురితంబును బొరయదు" అని వచించెను. ఇట్లు రామాయణ మున అతి ప్రధానమైన సీత అగ్నిప్రవేశము భారతాంతర్గత రామోపాఖ్యానమున పరిహరింపబడెను.

## భాగవతాంతర్గత రామాయణము :-

పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతమున ద్వితీయ స్కంధమున చతుర్ముఖుడు నారదమహర్షికి వివరించిన విష్ణ్వవతారములలో రామకథ కూడ సంగ్రహముగ కలదు. ఇందలి ఇక్ష్వాకు వంశక్రమము వాల్మీకి రామాయణమునుండి భేదించుచున్నది.[1]

భాగవత నవమస్కంధమున రామాయణమందలి ముఖ్య ఘట్టములు చెప్పబడెను.[2] అహల్యాశాపవృత్తాంతముల వంటి ఉపకథలిందు పరిహరింపబడి కథ సంగ్రహముగ సాగెను. రావణ వధానంతరము విభీషణునిచే రావణున కుత్తరక్రియలు నిర్వహింపజేసి, "రాఘవేంద్రుండు నశోకవనంబున కేగి, శింశుపాతరుసమీపంబునందు, దైతేయప్రమదాపరీత నతిభీతన్ ... కృశీభూతన్ బ్రాణసమేత సీతఁ గనియెన్-"[3] అని అశోకవనికి శ్రీరాము డరిగినట్లు చెప్పబడెను.

ఉత్తరకాండ కథ కూడ ఇందు సంగ్రహముగ కలదు. సీతాపవాదమును "వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు కొఱకునై రాముండు గూఢవృత్తి నడిరేయిఁ దిరుగుచో" నాలించి, తద్వార్తారూఢత్వమునకై పదంపడి చారులనుకూడ పృచ్ఛించి నిర్ధారించుకొనెను. అనంతరము నిద్రించుచున్న సీత "జెప్పక వాల్మీకి పర్ణశాలఁ బెట్టఁ'' రాత్రియే పనిచెనట[4]. ఈతీరు భాసుని ఉత్తరరామచరిత నాటకమున రాముడు సీతను పరిత్యజించిన విధమును స్మరింపజేయును. యజ్ఞవాటిక

1. వంశపట్టిక అనుబంధమున జేర్చబడినది.
2. ప. 257_362.
3. ప. 310-311.
4. ప. 345.

కరుదెంచిన కుశలవులు "ఏము వాల్మీకి శిష్యులము" అన "మెల్లన నగి, యెల్లిప్రొద్దున మీ తండ్రి నెఱింగెదరు, ఉండుండు" అని రాముడు వారిని గురుతించినటులే కలదు. ఇందు కూడ కుశలవులు యాగాశ్వమును బంధించుట మొదలుగాగల వృత్తాంతము లేదు.

భారత భాగవతములందు అతి ముఖ్యముముగ గమనింపవలసిన విషయము రెండింటను సీత అగ్నిప్రవేశము లేకుండుట !

## హరి వంశాగ్గత రామకథ :-

ప్రబంధపరమేశ్వరుడు ఎఱ్ఱాప్రెగడ భారతమునందేకాక తన హరి వంశమున కూడ రామకథ సంగ్రహముగ కలదు. హరివంశ పూర్వభాగము నాలుగవ ఆశ్వాసమున 57 వ పద్యమునుండి పన్నెండు పద్యములలో రామావతారము సంక్షిప్తముగ చెప్పబడెను. ఇందు తాటకవధ, అహల్యాశాపవిమోచనము, కైకేయి వరములు, పాదుకా ప్రదానము,, జటాయు మరణము, లంకా దహనము మున్నగు ఘట్టములన్నియు పరిహరింపబడెను. అతిసంగ్రహముగ అయిదు పద్యములు ఒక గద్యమందు పట్టాభిషేక పర్యంత కథ, ఒక పద్యమునందు రామ వర్ణనము, మిగిలిన పద్యములందు రామరాజ్య వర్ణనము కలవు. వైశంపాయనుడు జనమేజయునికి హరి అవతార క్రమమును వివరించు పట్టున శ్రీరామావతారమును గురించి కూడ చెప్పుట దీనికి సందర్భమైనది.

ఇట్లు అత్యంతసంగ్రహముగను, ఉపాఖ్యానముగను, సంపూర్ణ కావ్యముగను కూడ రామాయణము రచించిన ప్రాచీన కవులలో ఎఱ్ఱాప్రెగడ ముఖ్యముగ పేర్కొనదగినవాఁడు.

## యయాతి చరిత్ర - రామోపాఖ్యానము :-

తెలుగు సాహిత్యమందలి అనేక ప్రక్రియలందు ప్రథమముగ రామకృతులు వెలసినవి. మొదటి అచ్చ తెలుగుగ్రంథ మయిన యయాతి చరిత్రమున కూడ రామకథ ఉపాఖ్యాన రూపమున చోటు

చేసికొనుట విశేషము! పొన్నగంటి తెలగనార్యుడు రచియించిన యయాతి చరిత్రమున మృగయావిహారమునకు వనమున కరిగిన యయాతి హరిణ మొకదానిని తఱుముచు జాబాలి మహర్షి ఆశ్రమమున కరిగెను. అంత జాబాలి మృగయావినోద వ్యసనము హానికర మనియు తొల్లి శ్రీరాము డిట్టి మృగము వలననే కికురింపబడె ననియు చెప్పగా యయాతి రామకథా వివరములనుగూర్చి తెలుపకోరెను. అంత జాబాలి సంగ్రహముగ చెప్పినదియే ఇందలి రామకథ.

జాబాలి చెప్పిన రామాయణము రావణచరిత్రముతో ప్రారంభ మయ్యెను. పులస్త్యుని కుమారుడగు విశ్రవసువు పుత్రులైన రావణ కుంభకర్ణ విభీషణుల పరాక్రమము, రావణుడు ఇంద్రునిపై దాడి వెడలుట - సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనలు రంభా పరాభవము- నలకూబర శాపము- ఇట్టి బాధల కోర్వజాలక మొఱలిడిన దేవతలకు శ్రీహరి అభయప్రదానము- పిమ్మట కొంతకాలమునకు దశరథుని వివాహము- కథ యీ క్రమమున సాగెను. ఇంతవఱకు కొంత వివరముగనే చెప్పబడిన కథ రామకథారంభముతో క్లుప్తీకరింపబడి సంక్షిప్తముగ సాగెను. తాటకసంహారమునకు కినిసి చనుదెంచిన మారీచుని మదమును రాము డణచెను. అరణ్యవాసి యగుచున్న శ్రీరాముడు "...గంగయవలి కరిగి - గుహుని మన్నించి యమ్మేటికోర్కులొస"[1] గెను.

ఈ రామోపాఖ్యానము ద్వితీయాశ్వాసమున 60 వ పద్యమునుండి ప్రారంభమై 115 వ పద్యము వరకు రావణునకు నలకూబర శాపము గల వృత్తాంతమును, 116 పద్యము నుండి 121 వ పద్యము అనగా ద్వితీయాశ్వాసాంతము వఱకు, తిరిగి తృతీయాశ్వాసమున 40 వ పద్యము వఱకు రామచరితమును చెప్పెను. ఈ ఉపాఖ్యానమును రంభా రావణ వృత్తాంతము, రామచరితముగా రెండువిభాగము లొనర్చిన, ఇందు మొదటిది విస్తృతమగు సూర్యాస్తమయ నిశా చంద్రోదయాది వర్ణనలతో అతిదీర్ఘముగను, రెండవది అతి సంగ్రహముగను చెప్ప

1. ఆ. 3. ప. 14.

బడెను. ప్రధాన ఘట్టములను చెప్పి తక్కిని కూడ సంక్షిప్తముగ నడచిన రామకథ యందును సేతుబంధన సమయమందు శరమునకు సంక్షోభము నొంది ప్రత్యక్షమయిన సముద్రము మూడుపద్యములందును, సేతునిర్మాణమున శిలలు గొనివచ్చు కపులను రాము డెచ్చరించుట ఒక ప్రత్యేక[1] పద్యమందును చెప్పబడెను. ప్రారంభమున దేవతలు పాలసముద్రము కడకు విష్ణువును ప్రార్థించుట కరిగిన సందర్భమందలి,

సీ. "కరుచలి నెగయు తుంపరుల ముమ్మర మెల్లఁ
క్రమ్మెడు పుప్పొళ్లు దుమ్ముగాఁగ
గరముపై గదలెడు తరగల మొత్తముల్
సమకొన్న కొమ్మల గములు గాఁగఁ
దనలోన నెలమిని దరిఁజేరి యున్నము
త్యాలెల్లఁ దెలిచాయపూలు గాఁగ
గొప్పలై వెన్నెలకుప్పలో యన నొప్పు
బలితంపు నురుగులు పండ్లు గాఁగ"-[2] ఆర్త

త్రాణ పరాయణుడైన ఆదివిష్ణువు పవళించియుండు సాగరము కోర్కెల తీర్చు కల్పవృక్షముతో ఉపమింపబడుట ఉదాత్తముగా నున్నది.

ప్రధాన ఘట్టములను కొద్ది వివరణముతో చెప్పుచు రామకథను ఉపాఖ్యానముగ కవులు పెక్కు కావ్యములందు పొందుపరచిరి. అటులనే అత్యంత సంగ్రహముగ 'కట్టె కొట్టె తెచ్చె' పద్ధతిని రామకథ పూర్వోత్తర భాగములు రెండింటిని లేక ఒక్క భాగమును చెప్పు కావ్యములు కూడ సారస్వతమున అధికసంఖ్యయందే యున్నవి. ఉదాహరణముగా కళాపూర్ణోదయమందు మణికంధరుడు కావించిన శ్రీరామ స్తోత్రమున సంగ్రహముగ కథ పొందు పరుపబడుటను గ్రహింపవచ్చును. మరికొన్ని కావ్యములు ఆయా సన్నివేశములకు సరిపడు రామాయణ ఘట్టములను పేర్కొనుచుండును. అంతియకాక జాన

---

1. ఆ. 3. ప. 35.

2. ఆ. 2. ప. 108.

పద యక్షగాన నాటకాది ప్రక్రియలందు వలెనే రామకథ యందలి వివిధ ఘట్టములు ఉపాఖ్యానములు కూడ కావ్యములుగ రూపొందింపబడెను. అహల్యా సంక్రందనము, కౌసల్యా పరిణయము, మైరావణ చరిత్ర, మండోదరీ పరిణయము, సులోచనా వృత్తాంతము, హనుమత్సందేశము, శబరి కథ- మున్నగు ఘట్టములన్నియు కావ్యములుగ వెలసినవి. అసంఖ్యాకముగ నుండు ఇట్టి కావ్యములు స్థలవిస్తరణ భీతిచే ఇందు సమగ్రముగ చర్చింపబడక, కేవలము రామకథను సంపూర్ణముగ చెప్పుకొన్ని కావ్యములు, ఉపాఖ్యానములు మాత్రము పరిశీలింపబడినవి.



# ఖండకావ్యములు—రామకథ

నవ్యతాప్రీతి మానవుడి సహజ ప్రవృత్తి. నవ్యత రమణీయతను, రమణీయత లోకోత్తరానందమును కల్గించును. "తాళబద్ధాక్షర సమం తంత్రీలయ సమన్వితం కావ్యమేత న్మయాకృతమ్"- అనుచు వైదిక ఋక్కులపై ఛందోవిషయికముగా నూతనప్రయోగమును కావించిన వాడు ఆదికవి వాల్మీకి. తదాదిగా ఇతరములైన భారతీయ భాషలయందు వలెనే తెలుగుసాహిత్య ప్రక్రియలందును ఆయాయుగప్రభావానుసారము మార్పులు వచ్చినవి. చంపూకావ్యములు, ప్రబంధములు, ద్విపదలు, శతకములు, యక్షగానములు, పదకవితలు- ఇత్యాదులన్నియు ఆయా కాలములనాటి వారి అభిరుచి కనుగుణముగ ఉద్భవించినవే. నవ్యాంధ్ర యుగమున పేర్కొనవలసిన ప్రక్రియలలో ప్రధానముగ పేర్కొనవలసినది ఖండకావ్యము. బాహిరముగ ప్రక్రియలలో ఎన్ని మార్పులు జరిగినను సత్యాన్వేషణమే ధ్యేయముగా గల వేదకాలము నాటి హైందవ సంస్కృతి అంతస్సూత్రమై ప్రాచీనార్వాచీన కవులను ఏక సూత్రమున నిబంధించుచున్నది. ధర్మార్థకామము లను త్రివర్గ ములలో ధర్మము అగ్రస్థానమును వహించెను. మతముకంటె విస్తృత మయిన ధర్మము స్వపరభేద రహితముగ మానవుని బాధ్యతను నిర్దే శించును. ధర్మార్థ కామమోక్షములందు ధర్మమే ఆచరణ యోగ్య మని కామసూత్రములను రచించిన వాత్స్యాయనుడు సహిత మంగీక రించెను.

అర్థకామములు కూడ దిలీపునకు ధర్మముగానే పరిణమించిన వను కాళిదాసు "అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మఏవ మనీషిణః"-(రఘు వంశము - ప్రథమసర్గ) అభ్యుదయకవులు కొందరకు మార్గదర్శక మైనది. క్షీణ ప్రబంధ యుగమున వెఱ్ఱితలలు వేసిన రీతి ప్రాధా

న్యము, శబ్దచిత్ర వ్యామోహము, నిర్మల శృంగారము, ఛాందస సంప్రదాయములకు విరుగుడుగ రమ్యకావ్యముల సృష్టించిన సుబ్బారావుగారు అమలిన శృంగార సిద్ధాంతమునకు ప్రాముఖ్య మొసగిరి. శృంగారమును గృహస్థాశ్రమ ధర్మముగ సుబ్బారావుగారు చిత్రించ ప్రయత్నించిరి. కాళిదాసుకూడ రఘువంశమున "ప్రజాయై గృహమేధినాం" అని ఈ ధర్మమునే ప్రతిపాదించెను. అంతియ కాకుండ "శృంగారః శుచిరుజ్జ్వలః" అను ప్రాచీనార్యోక్తి కూడ వీరి అమలిన శృంగార సిద్ధాంతమున కాలంబనమయ్యెను. సుబ్బారావుగారి నాటికి ఆంగ్ల విద్యానాగరకతల ప్రభావమున నూతన భావములు అప్పుడప్పుడే తలలెత్తసాగెను. ఒక రకముగా అది ప్రాచీన నవీన బావములు ఘర్షణస్థితియందున్న సంధియుగము. 'ప్రేమ' సిద్ధాంతము వలన ఏర్పడుచుండిన దుష్పరిణామములు గ్రహించిన రాయప్రోలువారు ఈ రెంటికి పరిష్కార మార్గముగ 'అమలిన శృంగారము'ను, వియోగాధిక్యమును ప్రతిపాదించిరి. సంభోగ శృంగార మప్రధాన మన్నంత మాత్రమున రాయప్రోలువారు స్త్రీని అప్రధానముగ చూడలేదు. వీరి కావ్యములందు స్త్రీకే ప్రాధాన్యతను ఒసంగుటయేకాక రామాయణాది మహాకావ్యములందు అపహాస్యముల పాలైన స్త్రీపాత్రములకు నవ్యరూపము నిచ్చి, ఉన్నత పీఠమున అధిష్ఠింప ప్రయత్నించిరి. వారిని సహనమూర్తులుగ ధీరస్వాంతలుగ, త్యాగజీవనులుగ చిత్రించి ప్లేటో ప్రేమ సిద్ధాంతమును ప్రాచీనుల శృంగార రస తత్త్వమునుండి భిన్నముగ, శృంగార, ప్రేయో, వాత్సల్యాది రసముల సమీకరణముగ నూతన సిద్ధాంతమును ప్రతిపాదించిరి.

"ధృతిః క్షమా దయా శౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః
సప్తైతాః సమిధః స్త్రియః"- (భారతము-అరణ్యపర్వము) -అనుమున వ్యాసుని మహెూన్నతాశయము వీరి కీ విషయమున ఆలంబనమయిన దనవచ్చును. "ఉవిదలకు బుద్ధి పెడతల నుండుగాదె" మున్నగు స్త్రీల కవమాన మొనగూర్చెడి అభిప్రాయములను త్రోసి

రాజని స్త్రీలోని మహోన్నత గుణములకు అంజలి పట్టిరి. ఈ ఉన్నతాశయముతో వారు తమ రూప నవనీత కావ్యమున- రామాయణమున నిషిద్ధ శృంగారమునకు ప్రతీకగా నిల్చి, అపహాస్యములపాలైన అహల్యకు నూతన రూపముతో ఉన్నతపీఠ మొసగిరి.

రూపనవనీతమున నవనీతుని పత్ని "దైన్యయాచనాదులకు అవశంగా కరిగిపోయే స్వభావ శీల" (పుట-39) యగు వకుళమాల తన మిత్రుడగు సుందరుడు 'స్తన్య ప్రదానము'ను చిత్ర సందర్శన ప్రేరితుడై "అమె స్తన్యదానం చేస్తుంటే నీవు నాకు స్నేహదానం చేయరాదా" (పుట-38) అని "క్రూరంగా మోమోట పెట్టితే... (వకుళ) అమలినమైన తన స్నేహంతోపాటు, అస్ఖలితమైన తన శీలమును కూడ ధారపో''సెను. (పుట-83) చిత్తవికారము కలుగని వకుళ, తను కావించిన శీలదానమును కేవలము స్తన్య ప్రదానముగనే భావించినట్లు సుబ్బారావుగారు పేర్కొనిరి. కాని అప్పటినుండి అమె విరక్తయై అకామయోగ మవలంబించి, భర్తతో కలయికను కూడ పరిహరించెను. వల్లభమతము శీలదానమును మహాదానముగ పరిగణింతురు. వకుళ త్యాగమునకు అమెలోని ''దైన్యయచనాదులకు అవశంగా కరిగిపోయే స్వభావశీల"మే(పుట-39)కారణము. శీలదానము తరువాతనే అమె ఉదాత్తత అధికమయ్యెను. అమె త్యాగ శీలమును సమర్థించుటకు రాయప్రోలువారు రామాయణమందలి అహల్యా వృత్తాంతమును ఉదాహరించిరి. అహల్య ఇంద్రుని మారువేషమునకు భ్రమించి భ్రష్టశీల కాలేదనియు, మహేంద్రుడు యాచించగా ఎదురాడలేక, శీలదానము కావించి శిలయైపోయిన దని వీరు క్రొత్తవ్యాఖ్యానము కావించిరి. రామప్రోలు వారి ప్రకారము శీలదానము చేసి జీవితము సమాప్తము కావించుకొనిన అహల్య కర్ణుడు, బలి మున్నగు మహాదాతల స్థాయిని చేరుకొనెను, త్యాగమునే జీవిత సాఫల్యముగ భావించిన అహల్య వృత్తాంతమున జారత్వమునకు, శీలదానమునకు గల భేదమును గమనింపవలె నని వీ రభిప్రాయపడిరి.

ఈ విధముగా రామాయణ పాత్రల అంతర్యమునకు నవ్యత నొసగి ఆధునిక కవులు అనేకులు ఖండకావ్యములను వెలయించిరి.

చతుర్దశ వర్షముల పర్యంతము భర్తృ వియోగ క్లేశమును అనుభవించిన ఉర్మిళ, భ్రాతృ భక్తి వినా జీవనము లేని త్యాగశీలి లక్ష్మణుడు, తార, మండోదరి, శ్రీరామాదులకు ఖండాంతర కీర్తిని రామాయణమునకు శాశ్వతత్వమును ఆపాదింపజేసి, తాను 'క్రూరాత్మగ' మిగిలిపోయిన కైకేయి-కూడ 'మరో ప్రపంచ నిర్మాణాసక్తులయిన ఆధునిక కవుల దృష్టిపథములో నిలిచి మెరసినవారే. కైకేయి ఉదాత్త శీల చిత్రణమునకు భాసమహాకవి తన ప్రతిమాది నాటకములలో (భాసుడు ప్రథమ సంస్కృత నాటక కర్తగ పరిగణింపబడెను.) యత్నించినను, క్రీ. శ. 18 వ శతాబ్దియందు నాటక ప్రక్రియ తెలుగులో వికసించు పర్యంతము కైకేయి వ్యక్తిత్వమునకు కావ్యాదులయందు తగినస్థానము లభింపలేదనియే చెప్పతగును. శ్రీరామ వ్యక్తిత్వ చిత్రణమే కావ్యకర్తలు ప్రధానముగ భావించుట ఇందులకు కారణమై యుండవచ్చును.

[1] సంధ్యా సౌమిత్రి వంటి ఖండకావ్యములందు భ్రాతృ సేవకై సర్వము అంకితము కావించిన సౌమిత్రి శీల చిత్రణమున కవులు శ్రీరామోపాలంభనమునకు కూడ వెనుదీయలేదు. ఇట్లు లక్ష్మణ పరముగ సీతారాముల నుపాలంభించు జానపద వాఙ్మయ మందును అటనట కానవచ్చును. రంగనాథ రామాయణాదులందు సేతుబంధన సమయమున ఉడుత ఒకటి ప్రదర్శించిన భక్తి తత్పరతకూడ ఆధునికుల దృష్టిపథమును దాటిపోలేదు. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి తన 'ఉడుతభక్తి' ఖండకావ్యమునందు ఉడుత హృదయమును, ప్రవర్తనమును హృదయంగమముగ వర్ణించెను. ఛందోబద్ధమైన ఈ కవిత కందము, గీతము, ఆట వెలదులలో ముప్పది పద్యములందు కలదు.

> "ఎగిరి పక్షివోలెఁ దగ నబ్ధితటమున
> వ్రాలఁదలచి కాక వగచి వగచి
> ..................................
> కడలఁ దిరిగివచ్చి తడపలుం దారముల్
> విసురుచుండె వార్ధిఁ బిచ్చుకలును,

1. కర్త : శ్రీ గాదెరాజు వేంకట శేషయ్య.

బారులుంగట్టి చీమలుబఱచుచుండెఁ
గడలివంకకె సాహాయ్య పడఁగనేమొ ?
నెమలిపిండులు తమదు పింఛమును విప్పి
అవుర ! పనివారి చెమ్మట లార్చుచుండె"

—ఇట్లు సేతునిర్మాణ సందర్భమున వనమున పశుపక్ష్యాదుల సంరంభము మనోహరముగ ఇందు వర్ణింపబడెను.

రావణవధయై, సీతాసమాగమానంతరము ఒక నిశిరాత్రి,

"కామనలేని లేమ, తన
కై తన సర్వము వీడుకొన్న శ్రీ
రామ, అమానుషన్మగు చె
రన్ బడి కుందిన తావు చూ'' డగోరి శ్రీరాముడు ఒంటియై అశోకవని కరిగినట్లు భావించి శ్రీ బోయి భీమన్న ఆ సందర్భమున శ్రీరాముని భావములను మనస్థితిని వ్యాఖ్యానించుచు ''అశోకవనిలో రాముడు" అను కావ్యమును వ్రాసిరి. ''ఈ కావ్యంలో రాముడు మాట్లాడడు. తోటలో తిరుగుతాడు. సూర్యుడినుంచి కిరణాల్లా, అనేక భావాలు ఆయన మనస్సునుంచి పుడతై. విశ్వం నిండాప్రసరిస్తై. వాటిని అందిపుచ్చుకొంటూ నడిచింది ఈ కావ్యం. అంటే-రాముడి భావాలను, తదనుగుణమైన ప్రకృతివర్ణనను గ్రహిస్తూ, వ్యాఖ్యానిస్తూ నడిచిందన్నమాట''. (వనద్వారం-పుట 7) అని కవి స్వయముగ పేర్కొనెను.

భాగవత నవమస్కంధమున గల రామకథలో రావణవధ జరిగి, విభీషణ పట్టాభిషేకానంతరము శ్రీరాముడు అశోకవని కేగి సీతను కనుగొనెను అని- వ్రాయబడిన విషయము ఇప్పట్టున స్ఫురించును.

మానవుని కాంక్ష లన్నింటికి కామవాంఛ (Libido) ప్రధానమను ఫ్రాయిడ్ సిద్ధాంతానుసారముగ"సీత'' అను గేయము శ్రీ పఠాభి రచించెను. ఇందు కవి ప్రేయసి సీత- శ్రీరాముని సతిగ జీవించుట

కంటెను రావణ మనోరాణిగ నుండుటయే తన కిష్టమని ఇం దామె పల్కెను. అప్పుడు కవి తాను రావణుడనై "పది మూతుల తోను, నీ పెదవులను, మృదు శరీరమును వదనమును అదుముతా"- అనుచు, పాశవిక శృంగార క్రీడలను, అసంపూర్ణ కామవాంఛలకు నిలయములైన గేయములు, ధోరణులు ప్రజాభిమానములేక పతాభి సదృశుల కవితలతోడనె అంతరించెను.

అభ్యుదయ కవులుగ పరిగణింపబడిన వారెల్లరు సంప్రదాయ మును క్షుణ్ణముగ గ్రహించినవారే. సోమసుందర్ మున్నగు అభ్యుదయ కవులు తమ సమరగీతములలో ప్రజాకంటకులగు నైజాము ప్రభువు మున్నగువారిని మారీచులుగను, రావణులుగను, కబంధులుగను చిత్రించిరి. పురాణసంప్రదాయములను ఆధునికజీవనమునకు మలచుకొనిన విధాన మిది. అట్లే విప్లవవీరులు పరశురాములు, అభి మన్యులు కాగా, వీరవనితలు ప్రళయకాళిక లైనారు. దాశరథి కృష్ణమాచార్య "దానవుల నంతమొందింప నేను గూడ- రామ కృష్ణావ తార ధారణము సేతు" నని (అగ్నిధార పుట-89) వీరావేశమును పొం దగా, రామదాసు "మీ కల్యాణానికి రణ ధనుస్సు విరిగిం దీరోజున" అని ఆశాపూరితు డయ్యెను. బ్రతు కొక అశోక వృక్ష మది ప్రపంచ మొక లంకానగర మని, తాను సీత నని 'లంకాదహనం' కోసం ఎదురు చూస్తూ కూర్చున్నా నని వ్రాసెను (కల్పన-పుట. 225).కుందుర్తి నియం తలను కర్కోటకులుగ భావించెను. రామాయణ మంతయు ఆధునిక కాలమున పాలకులకు వ్యతిరేకముగ పాలితులైన ప్రజ జరుపుతున్న సమరగాథగా మరొక కవి చిత్రించెను.

"ఇరవై చేతుల తెగగొట్టండి
పది శిరముల తెగనరకండి
అసురుడు చావక తప్పదు
నరునకు చావన్నది లే దెప్పుడు"- (అశ్రుమాల-పు. 68) -అని

రామాయణము నవ్యమార్గమున నిర్వచింపబడెను. "శివునిజటల్లో చొరబడి సురధుని విడిపించుకొన్న'' వారుగా దుర్గానంద్ కృషికుల చైతన్యమును వర్ణించెను. (అంతర్గోళాలు-పుట. 24)

నవ్య కవులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మున్నగువారు సంప్రదాయానుసారముగ రామాయణ కల్పవృక్షమువంటి బృహద్గ్రంథముల వెలయించిరి. కల్పవృక్షమును వ్రాసిన శ్రీ విశ్వనాథ వారి కిన్నెరసాని పాటలు ఇతివృత్తము రామాయణము- బాలకాండమునందు విశ్వామిత్రుని సోదరియగు కౌశికి నది అయిన విధమును స్ఫురింపజేయుటయే కాక,

"తెలుగు దైవమ్ము భద్రాదిపై నెలకొన్న
రామయ్య అతని దర్శనముచేసే త్రోవ కాచిం"దట !- (కిన్నెరసాని పాట- పుట-65) స్ఫూర్తిశ్రీ 'అహల్య' అను చిన్న కావ్యమున ఇంద్రునికలసినది అహల్యారూపమునఉన్న శచీదేవి యని చెప్పబడెను. హరికథా పితామహులు తమ సీతాకల్యాణమునందు అహల్యను చిత్రించిన విధానము, సెట్టి లక్ష్మీనరసింహముగారు 'హల్య' సోదరుడు 'అహల్య'గా మారినట్లు చిత్రించుట గమనార్హము.[1] "దుఃఖయోగిని" అను చిన్న కావ్యమున సుప్రసన్న దుఃఖమునె సుఖముగా సీతాదేవి మలచుకొన్న విషయము ప్రగాఢమైన అనుభూతి శిలముతో వర్ణించెను. "ఆనంద లహరి"లో శబరి గాథ (సంపత్కుమార విరచితము) హృదయంగమముగ వర్ణింపబడెను. పుట్టపర్తి నారాయణాచార్యులవారు తమ "సాక్షాత్కారము" అను చిన్న కావ్యమున తులసీదాసు శ్రీరామ సాక్షాత్కారమును బడయుట రమ్యముగ చిత్రించిరి.

ఇట్లు అధునిక కవిత్వమున రామకథ నవ్యరూపమును పొందెను.

---

1. తేజశ్చక్ర అను పుస్తకమున కలదు.

# రామకథ—ఉత్తరకాండము

అపవాద వ్యాజమున సీతాపరిత్యాగము, కుశలవజననము, శ్రీరామనిర్వేదము, అశ్వమేధయాగము, శ్రీరామ కుశలవ సమాగమము, సీతా భూప్రవేశము, కుశలవ రాజ్యాభిషేకము, అవతార సమాప్తి- ఇత్యాదిగా గల రామాయణము ఉత్తరకాండ వాల్మీకి ప్రోక్తమా కాదా అను వివాదము కలదు. ప్రస్తుతము వాదవివరములు స్థల విస్తరణభీతిచే పేర్కొనక ఉత్తరకాండము ఆవశ్యకత పూర్వరామాయణమునకు ఎంతవరకు గలదను విషయమే పరిశీలింపబడుచున్నది.

మహాకావ్యముగా భారతీయ సాహిత్యమున మహోన్నత స్థానమును అలంకరించి సారస్వత రంగమును, దేశ సంస్కృతిని ప్రభావిత మొనర్చిన రామాయణము ప్రధానముగా ఇతిహాసము.

"ఇతి = ఏవమర్థే ప్రత్యక్ష నిర్దేశం ద్యోతయతి• హః = ఇహ శబ్ద ఆగమః; ఆసః = ఆసనం; ఏవం ప్రకారాః ప్రత్యక్ష పరిదృశ్యమానా ఆగమికార్థాః కర్మఫల సంబంధ స్వభావా యత్ర ఆసతే" మరియును ఇంకొక విధముగా "ఇతిః = జ్ఞానం; తస్యహాసః = హర్ష పూర్వకో వికాసః"- అని అభిగవగుప్తులు ఇతిహాసమును నిర్వచించిరి.[1] కర్మ ఫలముతో సంబంధించు అర్థములు ప్రత్యక్షముగా చూపునది ఇతిహాసమని ఒక నిర్వచనము. జన్మరాహిత్యము కలుగు పర్యంతము కర్మ ఫలానుభవము జీవిని వెన్నంటును. ఇతిహాస నాయకుని కర్మఫలముతో సంబంధించినఅర్థము ప్రత్యక్షముగ చూపవలెనన్న ఆ నాయకుని ఇహ పరములయందలి స్థితిని నిరూపించుట ఆవశ్యకమై యున్నది.

రామాయణము ఇతిహాసము. నాయకుడైన శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే అని బాలకాండము పేర్కొనెను. రామాయణేతిహాస

1. నాట్యవేదము_పుట. 6.

మున నాయకుడు శ్రీరామరూపమున స్వస్థానమునుండి మానుష వేషధారియై, స్వకర్మాచరణమున కర్మఫలానుభవమును పొంది, చివరకు స్వస్థానమును పొందుట యొక్క ప్రత్యక్ష ప్రదర్శనమే కథా వస్తువుగా నున్నది. ఇతిహాస శబ్దమునకు అభినవగుప్తుల నిర్వచనము రామాయణ పరముగ ఇట్లు అన్వయించును. కనుక ఉత్తరకాండము లేనిదే పూర్వ రామాయణము స్వయంసంపూర్ణము కాదు.

ధర్మసంస్థాపనార్థము భగవంతుడు ఇలపై అవతరించును. అట్టి అవతారమూర్తి అయిన శ్రీరాముఁడు దుష్టశిక్షణ, శిష్టరక్షణాత్మకమగు ద్విధాభూత మయిన ధర్మమును నెలకొల్పవలెను. పట్టాభిషేక పర్యంతమందలి కథయందు దుష్టశిక్షణము మాత్రము వర్ణితము. శిష్ట రక్షణరూపాత్మక మగు ధర్మసంస్థాపనము ఉత్తర కాండమున కలదు.

'సీతాయాశ్చరిత' ముగా సంభావింపబడిన రామాయణమున సీతాభూప్రవేశ పర్యంత వృత్తాంతము పేర్కొనబడుట సమంజసము.

1. రావణవధానంతరము సీతాసమేతుడైన శ్రీరాముని రాజ్య స్వీకారము, 2. రాక్షస వంశ వివరణము, 3. సీతారాముల గార్హస్థ్య జీవనము, 4. సీతా పరిత్యాగము, 5. శ్రీరామ ప్రేరణమున శత్రుఘ్న కృత లవణ సంహారము, 6. శంబూక వధ, 7. రామాశ్వమేధము, శ్రీరామ కుశలవ సమాగమము, 8. సీతా భూప్రవేశము, 9. కౌసల్యాదుల స్వర్గప్రాప్తి, 10. కుశలవ పట్టాభిషేకము, 11. శ్రీరామావతార సమాప్తి- ప్రధానముగా గల ఉత్తర కాండమున కూడ నాయకుడు శ్రీరాముడు. అనగా, పూర్వ రామాయణమున బాలకాండతో ప్రారంభ మయిన శ్రీరామావతారము ఉత్తరకాండమున మహాభినిష్క్రమణముతో సమాప్త మగుచున్నది.

ఇత్యాది హేతువులు రామాయణమున ఉత్తర కాండ ఆవశ్యకతను నిరూపించును. పై కారణములే ఉత్తరకాండ వాల్మీకి కృతమనుటకు కూడ ఆధార భూతము లగుచున్నవి. కానిపట్టున ఆదికావ్యమునకు సంపూర్ణ స్వరూపమును ఒసగి, ఇతిహాస పీఠమున అలంకరించిన మరొక వాల్మీకి అగుచున్నాడు.

శ్రీమదాంధ్ర వాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు ఉత్తర కాండము ప్రక్షిప్తము కానేరదనియు, వాల్మీకి ప్రోక్తమేననియు తొమ్మిది కారణములను తమ రామాయణమున (మందరము-ఉత్తర కాండము-పుటలు 2, 3, 4.) నిరూపింప యత్నించిరి. శ్రీరామాశ్వమేధమును విపులముగ వివరించిన పద్మపురాణము ఉత్తరకాండకర్త వాల్మీకి అనియే పేర్కొనెను. ఆనందవర్ధనులు[1] ధ్వన్యాలోకమున సీతాత్యంత వియోగము పర్యంతము తన ప్రబంధమున రచించి వాల్మీకి కరుణరసనిర్వహణము కావించె ననెను.

దిఙ్నాగుడు కుందమాలా నాటకమును, భవభూతి ఉత్తర రామ చరిత నాటకమును ఉత్తరకాండ ఆధారముగా వ్రాసిరి-

## జైమినీభారతము-ఉత్తరకాండ కథ :-

సంస్కృత జైమినీ భారతమును పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు ఆంధ్రీకరించెను. ఇందు శ్రీరామాశ్వమేధ వృత్తాంతము కలదు. సీతా పరిత్యాగము, కుశలవ జననము మున్నగు ఉత్తర కాండ సంఘటనము లన్నియు ఇందు కలవు. శ్రీరామాశ్వమేధమునకు ఇందును పద్మపురాణము వలెనే బ్రహ్మహత్యా దోష నివారణార్థమను హేతువు చెప్పబడెను.

ఉత్తర కాండమున, పద్మపురాణమున పేర్కొనబడని విశేషాంశము లిందు రెండు మూడు కానవచ్చును.

సీతాదేవి అంతర్వత్నియై నాలుగు మాసములు గడచిన తదుపరి శ్రీరాముడు సీతను గంగాతీరమున దిగవిడుచుటకు లక్ష్మణుని పనిచినట్లు ఒక విచిత్రమైన స్వప్నమును కాంచెను. కలత చెందిన రాముడు తద్వృత్తాంతము వసిష్ఠమహర్షికి ఎఱింగించెను. ఆయన జనకుని రావించి సీతాగర్భరక్షణార్థము పుంసవనము కావింపు మని హితము చెప్పెను. శ్రీరామాదేశమున లక్ష్మణుడు జనకుని తోడ్కొని రాగా పుంసవన మహోత్సవము జరిగెను. ఉత్సవ వైభవమునకు

1. ధ్వనిసారము-పుట 61.

అలరిన జనకుడు మిథిలారాజ్యమును శ్రీరామార్పణము కావించి కానలకు ఏగెను. ఉత్తరరామచరిత నాటకమున జనకుడు కానలందు వసించుచున్నట్లుగా చెప్పబడుట ఇట గమనింపవలసిన విషయము! అయోధ్యలో నివసించు ఒక రజకునిభార్య రజకునితో కలహించి, పుట్టినింటికి వెడలెను. నాలుగు దినములు గడచెను. ఆమెతండ్రి హితము కరపి, ఆమెను తిరిగి మెట్టినింటికి తోడ్కొని వచ్చెను. అగ్రహమణ గని రజకుడు గృహము త్యజించి నాలుగు దినములు గడపిన వని తనుస్వీకరించుటకు నేను రాఘవుడను కాను- అని తిరస్కరించెను. ఈవృత్తాంతమునే చారులు శ్రీరామునకు ఎరింగించిరి- ఈ వృత్తాంతము పద్మపురాణమున కొలది మార్పులతో కలదు. వనగమనోత్సాహమున సీతాదేవి దశరథపత్నులకు అభివందనము కావించి, అనుజ్ఞకై వేడెను. వారు అంగీకరింపలేదు. అయినను సీత కౌతూహలమును అణప జాలనిదై లక్ష్మణునితో వెడలెను.

—ఇత్యాది నూతన కల్పనలు ఇందు కాంచనగును. శంబూక కథ ఇందుకూడ కానరాదు. మరియొక ముఖ్యమయిన అంశము జైమిని భారత, పద్మ పురాణములందు కలదు. ఉత్తర కాండమువలె సీతా భూప్రవేశము ఇది పేర్కొనలేదు. సీతారాముల పునస్సమాగమమును పద్మ పురాణ, జైమినీ భారతములు చెప్పుచున్నవి.

ఉత్తర కాండ ప్రాచీనత ఈ రెండు గ్రంథముల వలన స్పష్టమగును.

ఉత్తర కాండమందలి రామకథను తెలుగు కవులు స్వీకరించిన విధానము తెలియుటకు ఇంతవరకు సంస్కృతమందలి కొన్ని ముఖ్యమయిన గ్రంథములందు ఉత్తరకాండ కథ పేర్కొనిన తెరంగు సంగ్రహముగ చెప్పబడెను.

## నిర్వచనోత్తర రామాయణము :-

కవిబ్రహ్మ తిక్కన నిర్వచనోత్తర రామాయణమును ప్రథమాంధ్రోత్తర రామాయణముగ సంభావింపనగును. కాకతి గణపతి

దేవ మహారాజుకు సమకాలికుడై — నెల్లూరు మండలమును పాలించిన మనుమసిద్ధికి సచివుడైన తిక్కనామాత్యుడు క్రీ. శ. 1210_1300 ప్రాంతమున జీవించి యుండవచ్చునని భావింపబడినది. "తిక్కన జీవితము ఇంచుమించు క్రీ. శ. 13 వ శతాబ్ది ఆదినుండి అంతము వరకు విస్తరిల్లి యుండె"నని పింగళి లక్ష్మీకాంతముగారి అభిప్రాయము 1

"ఉత్తర రామాయణోక్తి యుక్తు డనైతి" 2 అని అవతారిక యందును, "ఉత్తర రామాయణంబను మహాకావ్యం"బని ఆశ్వాసాంత గద్యములందును తిక్కన పేర్కొనెనే కాని "నిర్వచనోత్తర రామాయణ"మనునది కవి స్వకపోల కల్పిత నామము కాదు. నిర్వచనముగ రామాయణ కావ్యమును చెప్పబూనినట్లు మాత్రము తిక్కన పేర్కొనెను. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణ కావ్యము సాహిత్యమున వెలసిన తదుపరి, సౌలభ్యమునకై తిక్కన కావ్యము నిర్వచనోత్తర రామాయణముగా పేర్కొనబడినట్లు పండిత లోకమున భావన కలదు. అంతమాత్రమున కంకంటి పాపరాజు ఉత్తర రామాయణమునకు పూర్వ మీ నామము వ్యవహారమున కానరా దనలేము.

ఉత్తర కాండ కథ సంపూర్ణముగ తిక్కన తన కావ్యమున స్వీకరింపలేదు. కావ్యము సుఖాంతము కావలెనను భారతీయ సంప్రదాయానుసారము, ఇందు సీతా భూప్రవేశానంతరము శ్రీరాముడు కుశలవులను రాజవిద్యాగరిష్ఠుల గావింపుచు "ధర్మపత్ని... ధారుణి యేలె మహోన్నతి'' నని సుఖాంతముగా కథ ముగింపబడెను. కావ్యమున నాయకుని ఐహికజీవితమే ప్రవచింపబడును కాని, నాయక నిర్యాణము సూచింపరాదను నియమ మిప్పట్టున తిక్కన అనుసరించెనని భావింపవచ్చును. ఇతిహాసము నందలి ఒక భాగమును ఇతివృత్తముగా స్వీకరించిన కిరాతార్జునీయ కావ్యములున్నను వాటియందలి నాయకుడు ఇతిహాసమునందలి నాయకుడు కాడు.

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము_పుట_809.
2. అ. 1. ప. 11.

నిర్వచనోత్తర రామాయణమున మొదటి ఏడాశ్వాసములందును రావణాది రాక్షస వీరుల చరిత్రములు (హనుమజ్జనన క్రమము మినహాయించి) అష్టమ, నవమ, దశమాశ్వాసములందు శ్రీరామ కథయు కలవు.

ఉత్తర కాండము నుండి నిర్వచనోత్తర రామాయణము కొన్ని అంశములందు భేదించుచున్నది.

మూలమున, బ్రహ్మ ప్రథమమున ఉదకములను మరికొన్ని సత్వములను సృష్టించెను. ఆ సత్వములందు కొన్ని రాక్షసు లయినవి. ఆ రాక్షసులనుండి హేతిప్రహేతు లుద్భవించిరి. ఈ క్రమమును తిక్కన అనుసరింపలేదు.

సుమాలి కుమార్తె యగు కైకసితో భూలోక సంచారము కావించుచు. జనకుని కడకు అరుదెంచి చనుచున్న ధనదుని కాంచి, పాతాళమునకు వెడలి, తమవెతలు తీరు ప్రతీకారమునకై యోచించెను. పిమ్మట పుత్రికను పౌలస్త్యునకు పత్నిగ అనిపెను. ఇది ఉత్తరకాండమందలి సన్నివేశము.[1]

కైకసి వలన మేలు కలుగవలెనను వాంఛతో ఆమెను తోడ్కొని వరాన్వేషణమునకై వెడలిన సుమాలి ధనదుని భాగ్యగరిమను కాంచి, ధనదుని జనకునకు కొమార్తెను పత్నిని కావింపకోరి, ఆమెను అంగీకరింపచేసినట్లు తిక్కన రామాయణమున కలదు. ఇందువలన సుమాలి ఆంతర్యము మరింత స్పష్టమగుచున్నది.

రావణుడు లంకను స్వాధీనము చేసుకొని, వివాహితు లయిన తరువాత, లోకకంటకుడుగ విజృంభించిన తరి కుబేరుడు హితము గరుప దూతను పుత్తెంచెను. ఆతడును రావణుని సముఖమ్మున కుబేరుని తపశ్చర్యను ఈశ్వరునితోడి చెలిమియని వివరించి, సోదరుడగు వైశ్రవణుని వలె సన్మార్గమున వర్తించుట శ్రేయోదాయక మని నుడివెను. క్రుద్ధుడైన రావణు డా దూతను వధించెను.[2]

---

1. సర్గ-9. శ్లో. 1-10.
2. సర్గ. 16. శ్లో. 17-33.

మూలమున ధనదుని సందేశ శ్లోకములు పదునారింటను పది అతని తపశ్చర్యను వివరించెను. ఇట్లు సందేశమున వైశ్రవణుని తపశ్చర్యకు ప్రాధాన్య మొసగబడెను. అందువలన వైరితపమును వర్ణించిన కతమున రావణుడు దూతను వధించినట్లు భావించుటకు అవకాశము కలదు.

తిక్కన అట్లుకాక ఇప్పట్టున రావణుని వక్రించిన తీవ్రబుద్ధి వెల్లడి యగునట్లే సన్నివేశమును రూపొందించెను. కుబేరుని తపమును చాల అప్రధానమైనదిగ వ్రాసి మూలార్థము నంతయు దశగ్రీవుని బుద్ధి తీవ్రతవలన తిక్కన సాధించెను. సందేశము చివర,

"ఇంతకాలంబు నే బోయి హిమనగమున
శాంకరం బగు ధర్మంబు సలుపుచునికి
నెఱుఁగనైతి; మగుడివచ్చి యెల్ల నెఱిఁగి
యెఱుఁగఁజెప్పితి హితము నా యెఱిఁగినంత"– అని (ఆ. 4. ప. 30) దూత పల్కగా, రావణు డంతకుముందర హితవాక్యముల ప్రసక్తిని వదలి, ఈ గీతపద్యమందలి రెండు పంక్తులను మాత్రము స్వీకరించి, తపస్సిద్ధిని గూర్చి పృచ్ఛించెను. అంత దూత మహేశ్వర సఖ్యాది వృత్తాంతమును ఎరిగించెను. సందేశవ్యాజమున ఈశ్వర సఖ్యమును తెలిపి తన ఘనతను వెల్లడించు కోరికతో దూతను పుత్తెంచెనను నెపమిడి రావణుఁ డాదూతను వధించెను. మూలమున కూడ...." ఆగమ్యచ శ్రుతోయం మే తవ పాపవినిశ్చయః" (శ్లో. 31) అని ఉన్నను, ధనదుని తపశ్చర్య. రావణుడు పృచ్ఛింపకుండగనే వివరింపబడెను. మూలానుసరణము కావించినను యిప్పట్టున తిక్కన రావణుని మనోలక్షణ మభివ్యక్త మగునట్లు చిత్రించెను. వచ్చిన దూతను నెప మిడి వధించుటయేకాక, తదాలంబనముగ వైశ్రవణుని తోడి రణమును కూడ రావణుడు ప్రకటించెను.

కైలాసగిరి నూటాడించిన సందర్భమున రావణునిహస్తములు పర్వతముక్రిందబడి వేయిసంవత్సరములు నలుగగా• అట్లు పీడింపబడుచు అతడు ఈశ్వరస్తవమును కావించెను. ప్రసన్నుడైన మహేశుడు చంద్రహాసమును బహూకరించెను. మూలమునందలి (స. 16– శ్లో. 36-47) ఈవిషయమును తిక్కన స్వీకరింపలేదు.

రావణుడు మహేంద్రునిపైకి దాడి వెడలి కైలాసనగమున విడిసినప్పటి అంధకార వర్ణనము, చంద్రచంద్రికావర్ణనము తిక్కన స్వయముగా చేసెను. మూలమునం దీప్రసక్తి వేరొకవిధమున కలదు. మదనార్తులైన కిన్నరమిధునములు ఆ ప్రాంతమున గానము చేయుచు విహరించుచుండ విద్యాధరమిధునములు క్రీడించుచుండె ననియు— ఇత్యాది వర్ణనములు కావింపబడెను. (సర్గ. 26. శ్లో. 7,8). ఇట్లు కాంతాసమూహము తత్ప్రాంతమున మెలగుచున్న విషయము గ్రహించియు కామార్తుడగు రావణు డటు వారి దర్శనార్థము ఏల వెడలలేదను సంశయము ఉత్తరకాండమున ఇప్పట్టున జనించు అవకాశము కలదు. ఇట్టి ప్రశ్నమునకు తావు లేకుండ తిక్కన ఈ సన్నివేశమును చిత్రించెను. రావణుడు మోహాంధకారుడైన తీరు కూడ సుకుమారముగ వర్ణింపబడెను. చకోరదంపతుల క్రీడలను కనుగొనిన రావణునిలో క్రమముగ కామవికారము జనించెను. తత్సమయమున అటకు రంభ అరుదెంచెను.

తనను బంధించు ఉద్దేశముతో వెనుక పాటుగ అరుదెంచు రావణుని వాలియే ముందుగ కడిసిపట్టి కక్షములందు బంధించి ఆకసమున కెగిరి పోవుచుండగా, రావణుని మంత్రులు వెంబడించినట్లు మూలమున కలదు. (సర్గ 34-శ్లో. 14-24)

రావణుడే వెనుక పాటుగ వాలిని బంధించగా వాని వచ్చుట గ్రహించియు ఎరుంగని వానివలె మిన్నకుండిన వాలి, వెంటనే కక్షములందు బంధించి మింటి కెగసినట్లు తిక్కన రామాయణము. రావణుని మంత్రులు వాలిని వెన్నంటుట ప్రయోజన రహితము కావున తిక్కన పేర్కొనలేదు.

సీతారాముల వనవిహారము మూలమున ముప్పదియారు శ్లోకములలో (స. 42) వర్ణింపబడెను. మొదటి పదునారు శ్లోకములు ఉద్యానవనమందలి వృక్షలతాపుష్పాదుల వర్ణనాత్మకములు. తరువాతి పదిశ్లోకములు అరుంధతీవసిష్ఠులట్లు, శచీపురందరుల భాతి సీతారాములు విహరించుచుండగ దశవర్షములు గడచినట్లు చెప్పను.

అనంతర మూరు శ్లోకములందు సీతారాముల పూర్వాహ్ణ అపరాహ్ణము లందలి దైనందిన కృత్యములు, సీత అంతర్వత్ని యగుట, శ్రీరాము డామె కోరికలను దీర్ప సంసిద్ధుడగుట, సీతా వనగమనాభిలాషయు వర్ణింపబడెను.

ఈ వనవిహార ఘట్టము తిక్కన నిర్వచనోత్తర రామాయణమున సుదీర్ఘముగ వ్రాయబడెను. కేళీవనగమనమునకు ముందు సీతారాములు నెత్తమ్ము లాడుట- గంధము లలదుకొనుట- ప్రణయకోపమును అభినయించుట- ఇత్యాదులు వర్ణింపబడెను. "ఉపానృత్యం శ్చ రాజానం నృత్తగీత విశారదాః, బాలాశ్చ రూపవత్యశ్చ స్త్రియః పానవ శానుగాః" (సర్గ. 42. శ్లో. 21) రూపవతులు, నాట్యవిశారదలు అగు కాంతలు మద్యపానప్రమత్తులై రాముని్రమోల నాట్యములు సల్పిరి- అను శ్లోకమును తిక్కన విస్తరించెను.

లక్ష్మణునితో సీతను వనములకు పంపునపుడు శ్రీరాము డామెతో సంభాషించినట్లు మూలమున లేదు. నిర్వచనోత్తర రామాయణమున రాముడు లక్ష్మణ సముఖమున ఇప్పట్టున సీతతో సంభాషించెను. కావ్యమున తిక్కన కవితా వైశిష్ట్యమున కీసన్నివేశము ఒక తార్కాణము. సంభవింపనున్న సీతావియోగము విధికృత్యముగ భావించిన శ్రీరాముడు "నేత్రంబుల బాష్పవారి నిద్ర నడుప" (ఆ. 8. ప. 128) దగిన స్థితికి లోనయ్యెను. ధీరోదాత్తుడయిన నాయకుడగు శ్రీరాముడు రాజధర్మ నిర్వాహణాయత్తచిత్తుడుగ, శోకావేగమును కన్పట్టనీక ధీరశాంతమున "అడ లడచి నెమ్మనంబున వెడతెలి వొడగూర్చి" (ఆ. 8, ప. 311), కోగినరీతి గంగాతీర దర్శనమును చేయుమని సీతతో పల్కెను. "పొలతుక గంగచేరువ....రమ్ము"(ఆ. 8 ప. 132) అనుటలో వాచ్యార్థము సీతపరముగను, సూక్ష్మార్థము అచ్చటనే యున్న లక్ష్మణపరముగను అన్వయింపబడెను. అంతకు పూర్వము ఏకాంతమున సీతరామునితో సింగంబుల్ మునిబాలకుల్ ధర్మప్రీతిమై జూచుచున్ గంగాతీరమున కానలోన్ దిరుగంగా గౌతుకంబయ్యెడి" (ఆ- 8- ప. 89) అనెను. రాముడు కూడ "నీవు గోరి

నట్లు చేయు టెంత పెద్ద శీఘ్రుంబ యచటికి బుచ్చువాఁడ" అని బదు లొసగెను. (ఆ. 8- ప. 90). ఇట్లన్నిచోట్లను తిక్కన తిరిగివచ్చు పదము రాకుండగ జాగరూకత వహించెను. అనగా భవిష్యదర్థ సూచకముగ పాత్రములచే పలికించి కావ్యశిల్పమును శోభింపఁజేసెను. కావ్యమున నాటకీయతకు తిక్కన పెట్టినది పేరుకదా! మూలమున సీత "అప్యేక గాత్రం కాకుత్స్థ నివసేయం తపోవనే'' (సర్గ. 2- శ్లో. 35) అనెను. సీతారాములకు సీతాపరిత్యాగ సమయమున సంభాషణము నేర్పరచి, మూలమందున్న 'ఒకరాత్రి' విషయమును తొలగించి, జరుగబోవు కథను, శ్రీరాముని ఉదాత్త ప్రకృతిని, ధర్మనిష్ఠను తిక్కన అతి సుందరముగ తీర్చిదిద్దెను.

లవణునిగూర్చి మహర్షులు ఎరింగించుటకు ముందు సీతావియోగమునకు ఏకాంతమున చింతించుచున్నట్లుగ ఏడు పద్యములు- అమూలకములైన వాటిని- తిక్కన వ్రాసి అందు శ్రీరాముని ఉదాత్తతను పరమరమణీయముగ చిత్రించెను. (ఆ. 9-ప. 86-92)

శంబూకవధ సమయమున శ్రీరాముడు శంబూకునకు తన్నెరింగించుకొని అనంతరము సంహరించినట్లు ఉత్తరకాండమున కలదు. (సర్గ-75. శ్లో. 16). తిక్కనరాముడు శంబూకునకు తన్ను పరిచయము కావించుకొనకయే సంహరించెను.

శ్రీరాముడు అశ్వమేధయాగ మొనరించు సందర్భమున స్వర్ణ సీతాప్రతిమతో పత్నీకృత్యములను కొన్నిటిని నెరవేర్చెనని తిక్కన వ్రాసెను. అమూలకమగు ఈ అంశము తదుపరి ఉత్తర రామాయణ కవులను అపరిమితముగ ఆకర్షించెను. పద్మ పురాణమునందు కుంభసంభవుని ఆదేశమున రాముడు, కనకసీతా ప్రతిమను తొలగించి ఆ స్థానమున సీత నధిష్ఠింపజేసినట్లు కలదు.

రామాయణ గాన మొనర్చిన కుశలవులు శ్రీరామప్రశ్నమునకు సమాధానముగా రామాయణ వివరములను చెప్పిరి. (స. 94-శ్లో. 25-27). తిక్కన రామాయణమున కుశలవు లాప్రశ్న విని వాల్మీకిని తిలకించి, తదనుమతిని "ఈ సందర్భము వీరలు చేసినయది- మేము

వీరి శిష్యులము- రసోల్లాసమధురమగు దీని నుపాసింతుము"(ఆ. 10-ప. 124) అని వాల్మీకిని చూపి, పల్కినట్లుగా కలదు.

ఉత్తర కాండేతివృత్తమును కూడ కుశలవులు గాన మొనర్ప ఆలించిన శ్రీరాముడు "సీతకు కుశలవులు జన్మించిరను" వాక్యమున, బాలకులను సీతాపుత్రులుగ గ్రహించినట్లు మూలమున కలదు. (స. 95-శ్లో. 2). తిక్కన రామాయణమున కుశలవులతో వాల్మీకికూడ రామ సభకు అరుదెంచెను. కుశలవుల చరిత్రమును తెలుసుకొన గోరిన రామునకు వాల్మీకి వారిని సీతాపుత్రులుగ నెఱింగించెను. ఇందు సీత శపథము చేయుటను అయోధ్యావాసులు, దేవతలు దర్శింప నేతెంచుట, సీతా భూప్రవేశానంతరము వారి ఆహారవములు, శ్రీరామ దుఃఖము, భూదేవిపై ఆగ్రహము- ఇత్యాదు లన్నిటిని తిక్కన గ్రహింపలేదు. ఇందు భూదేవిపై శ్రీరామాగ్రహము వ్యక్తము కాకుం డగనే వాల్మీకి ఆదేశానుసారము లవకుశులు శ్రీరాముని ప్రార్థింపగా, రామకోపోపశమనము జరిగెను. మూలమున ఇప్పట్టున చతుర్ముఖుడు చనుదెంచి రామదుఃఖోపశమనమునకై రామాయణ మంతయు సంపూర్ణముగా తిలకించు మని శ్రీరాముని కోరెను. (సర్గ. 98. శ్లో. 13-22). ధీరోదాత్తుడు, ధర్మవీరుడు నైన నాయకుని హర్షశోకాదుల వలన అనభిభూతత్వమే చిత్రింపబడవలయును కాన సీతావియోగ దుఃఖమును రాముడు స్వయముగ మనఃపరిమితము కావించికొనినట్లు పేర్కొనుటయే నిర్వచనోత్తర రామాయణమునకు రమ్యతను చేకూర్చెను.

ఇవి ప్రధానముగా నిర్వచనోత్తర రామాయణమున మూలమునుండి భేదించిన కథాంశములు. మూలమునుండి సంపూర్ణముగా వదలబడిన భాగములు :-

సీతను అరణ్యమున విడచి వచ్చిన లక్ష్మణునకు నృగు మహారాజ, నిమి యయాతి చరిత్రములను శ్రీరాముడు వివరించుట (సర్గలు. 53 - 59) యిందు లేదు. శంబూక వధానంతరము అగస్త్యుడు రామునకు చెప్పిన శ్వేతకేతుని కథ (సర్గలు. 77-81), అశ్వ

మేధ యాగనిర్ణయ సందర్భమున లక్ష్మణునిచే ఇంద్రకృత యశ్వమేధము, రామునిచే ఇలమహారాజు కథ తిక్కన స్వీకరింపలేదు (సర్గలు 55-90).

ఇత్యాదులు ఇంకను కలవు.

నిర్వచనోత్తర రామాయణమున తిక్కన ధర్మసంస్థాపనము నందలి ద్వితీయాంశమగు శిష్టరక్షణమును ప్రధానముగ గైకొని కావ్యమును స్వయంసంపూర్ణము కావించెను. శ్రీమద్రామాయణమును కావ్యదృష్టితో తిలకించి "ధీరోదాత్త నృపోత్తముడు రామ ధరణీపతి సద్వృత్తము సుభావ్యమని (ఆ-1. ప. 111) మది నెంచి కావ్యమును వెలయించెను. నరులను కాపాడువాడు నరపాలుడు. ధీరోదాత్తుడు ఉత్తముడు అయిన రాము డట్టి నరపాలురలో శ్రేష్ఠుడు. క్లేశ సహనము ధీరత్వ మనబడును. ఇది రామునియందు ఉదాత్తముగ భాసించెను. ఆయన నృపాలుడయిన కారణమున పాలిత ప్రజల అభీష్టానుసారమును స్వయంకృతమయిన భార్యావియోగక్లేశమును అనుభవించెను. ఉత్తరకాండమున శ్రీరాముడు 'ధరణీపతిత్వము' నే నెరపినాడను విషయమును, తిక్కన ప్రధానముగ స్వీకంచి కావ్యమును వెలయించినట్లు "ధీరోదాత్తనృపోత్తముడు రామధరణీపతి సద్వృత్తమును" గైకొని, "శ్రీరామచంద్రు డిట్లు మహారాజ్య పదస్థుడై" (ఆ-2. ప-2.) అని ప్రారంభించి, "ధరణి నెందును కాలవర్షము.... ధరణి యేలె రాఘవపుంగవుండు మహోన్నతి'' (ఆ. 10 - ప. 160) అని ముగించెను. సీత పాతాళమునకు అరుగుటతో శ్రీరాముని ధీరోదాత్తత్వము పరాకాష్ఠ నందెను. ఇక కథ లేదు. కనుక, కుశలవులను రాజశాస్త్రపారంగతులను కావించుచు, రాజ్యపాలనము కావించె నని వెంటనే కావ్యమును ముగించెను. ఇట్లు శ్రీరాముని ధీరోదాత్తత్వ నిరూపణము ధర్మానుప్రాణితముగ జరుగుటవలన ఇందు ధర్మవీరము అంగి రసమగును.

ఇట్లు ఇందు ధర్మవీరము అంగిరసము, శ్రీరాముడు నాయకు డని చెప్పుటలో ఒక విప్రతిపత్తి యేర్పడెను. పది అశ్వాసముల కావ్యమంచు ఇంచుమించు ఏడాశ్వాసములు శ్రీరాముడు ఆలించిన రాక్ష

సోత్పత్తి క్రమ, వికాస, వినాశములు, రావణప్రధానముగ వివరింప బడెను. కనుక ఇందు నాయకుడు రావణుడు. అష్టమ, నవమ, దశమాశ్వాసములందు కథ శ్రీరామ ప్రధానము కనుక అందు నాయకుడు శ్రీరాముడు. ఇట్లిందు ఏక నాయకత్వము, ఏకరస నిరూపణము లోపించి 'మహా కావ్యము'గా తిక్కన వ్రాయుట అసంబద్ధము అను అభిప్రాయము పండితలోకమున కలదు. ఈ విషయమునే సహేతుకముగ చర్చించుచు "ఇరువురు నాయకుల నాశ్రయించుకొని రెండు కథలతో నున్న యొక గ్రంథమున కొక యేకవాక్యతగాని రసముగాని యుండదు. ఒక యేకవాక్యత కగుచున్న నొక కథతో నొక రసముతో నిర్భరము కాని యొక గ్రంథము కావ్యము కాజాలదు. కావ్యమే కాజాలని గ్రంథమున మహాకావ్య ప్రసక్తియే లేదు. కనుక నిర్వచనోత్తర రామాయణము మహాకావ్యము కాదు. ఒక ప్రధాన ఫలమును సాధించుట నభిలషించిన నాయకుని చిత్తవృత్తి రూపమైన కథావస్తు వొకటి నిర్వచనోత్తర రామాయణమున సంధి, సంధ్యంగ విన్యాసము కలిమిని నిర్మింపబడలేదు గనుక నిది మహా కావ్యము కాజాలదు. నిర్వచనోత్తర రామాయణమునందలి పూర్వోత్తర భాగములు దేనికదిగా నొక నాయక పురుషుని చుట్టుకొని యేక వాక్యత కగుచున్నవి. (హనుమజ్జన్మ వృత్తాంతము లెక్కలోనికి తీసికొనకుండ పూర్వభాగము ప్రస్తుతము గ్రహింపబడినది.) అందువలన రెండు లఘు కావ్యముల సంపుటిగా నీ తిక్కన్నగారి యుత్తర రామాయణమును సంభావింపదగును..... ఉత్తర భాగము శ్రీరామ నాయకము. రాముడు ధీరోదాత్తుడు, ఈ యుత్తరభాగమే ఉత్తర రామాయణ శబ్ద వాచ్యము. ....ధీరోదాత్తనృపోత్తము డైన రామ ధరణీపతి సద్వృత్తమును సంభావ్యమనియే తా నీయుత్తరరామాయణము వ్రాయుటకు పూనుకొనినట్లు స్వయముగా చెప్పుకొనెను. అయినచో రావణోదంతమును అంత విపులముగా నేడాశ్వాసముల గ్రంథముగా నేల వ్రాసెనన్న ప్రశ్నయు పుట్టును. దీనికి వచ్చు సమాధాన మంత సంతృప్తికరముగా నుండదు....రావణోదంతము గ్రంథ విస్తరమై విపులముగా కనిపించుచున్నది కాని కాలము మీద విస్తరించలేదు. అగస్త్యుడు శ్రీరామున కారాక్షస వంశ వృత్తాం

తమంతయు నొక కొన్ని గంటలలో చెప్పెను. (సంస్కృతమున సుమారు దినమంతయు చెప్పబడినట్లు కలదు.) ....రెండు లఘుకావ్యముల సంపుటిగా అంగీకరించి పూర్వోత్తర గ్రంథములను వ్యస్తముగా రావణ శ్రీరామ నాయకములుగా పరామర్శించుట యుచితము. అయినచో పూర్వభాగమునకు రావణుడు నాయకుడు, రసము రౌద్రము- లేక రౌద్ర రసస్ఫూర్తి కలిగిన యుద్ధవీరము-" అని డాక్టర్ కేతవరపు రామ కోటి శాస్త్రిగారు "తిక్కన కావ్య శిల్పము- తత్త్వదర్శనము-'' అను తమ పరిశోధన వ్యాసమున పేర్కొనిరి.

తిక్కనకంటె పూర్వము ఉత్తరకాండ కథను దిఙ్నాగుడు కుంద మాల నాటకముగను, భవభూతి ఉత్తర రామ చరిత నాటకముగను సంస్కృతమునరూపొందించిరి. (భవభూతి ఉత్తర రామ చరిత మున తన కావ్యముకంటె ముందు వెలసిన కుందమాలా నాటకమును అటనట అనుసరించెను. ముఖ్యముగ ఉత్తర రామ చరిత తృతీయాం కము, కుందమాల చతుర్థాంకముతో సరిపోల్చిన ఈ విషయము విశదమగును.) నిర్వచనోత్తర రామాయణమున ఎడనెడ ఈ నాటక ముల ప్రభావము నూహించుటకు అవకాశము కలదు.

వనమున సీతాదేవికి రామాజ్ఞను విన్నవించుతరి లక్ష్మణుడు పరిదేవనము కావించుచు సీతాపాదముల వ్రాలినట్లు తిక్కన రచిం చుట, కుందమాలా ప్రథమాంకమున లక్ష్మణుని అభినయ సూచనను అనుసరించి కానోపును.

శంబూక వధా సమయమున ఉత్తరకాండమున శ్రీరాముడు సం శయ రహితముగ సంహరించినట్లు కలదు. (స. 76-4) తిక్కన రామాయణమున "రేహస్త దక్షిణ మృతస్త శిశోర్ద్విజస్య, జీవాతవే విసృజ శూద్రమునే కృపాణం, రామస్య గాత్ర మసి నిర్భర గర్భ ఖిన్న, సీతావివాసినపటోః కరుణా కుత స్తే ?"- (ఉత్తర రామచరిత నాట కము- 2-9) అను భవభూతి శ్లోక భావమును గ్రహించి, శ్రీరాముడు శంబూకుని వధించుటలో వెనుక ముందాడినట్లు కనుపించును.

నిర్వచనోత్తర రామాయణ దశమాశ్వాసమున 128, 129, 130 పద్యముల వలన వాల్మీకి శ్రీరామునియందు ఆగ్రహమును ప్రకటించి నట్లు ఊహింప వీలగును. ఉత్తర కాండమున ఇట్లు లేదు. కుంద మాల షష్ఠాంకమున ప్రవేశించు వాల్మీకి వాక్యములు కోపాభినయ పూర్వకములని దిఙ్నాగుడు వ్రాసెను. బహుశః తిక్కన ఆ భావమును స్వీకరించి తన కావ్యమున "అంతనుండియు సీతోడ నలిగియున్నవార మేము"- అని వాల్మీకిచే పల్కించి యుండనోపును.

## కాచభూపతి-విఠలరాజు:-

తిక్కన తర్వాత తెలుగున ముగ్గురు కవులు ఉత్తరకాండ కథను రామాయణముగా రూపొందించిరి. కాచభూపతి, విఠలరాజు అందు ప్రథములు.

రంగనాథ రామాయణ కర్తగా పేర్కొనబడుచున్న గోన బుద్ధా రెడ్డి కుమారులగు కాచభూపతి, విఠలరాజులు ఉత్తరకాండమును ద్విపద కావ్యముగ రచియించిరి. సుమారు ఆరువేల ద్విపదలున్న ఈ గ్రంథము శ్రీరామావతార సమాప్తి పర్యంత కథను తెల్పును. మూల గ్రంథమున ప్రక్షిప్తములుగా భావింపబడుతున్న నృగు, నిమి మహా రాజుల కథలు మున్నగునవియన్నియు ఇందుకాంచదగును. రంగనాథ రామాయణమందు వలెనే ఇందు కూడ అమూలకములగు అంశములు కలవు. భద్రుడు సీతావిషయకాపవాదమును శ్రీరామున కెరింగించుటకు ముందుగా ఒక చిత్రమైన సన్నివేశము ఇందు కల్పింపబడెను. శ్రీరాముడు కామరూపత్రై అన్యులకు కానుపించని ఇరువురు స్త్రీలతో ఉండి నట్లుగ ఒక రక్కసి సీతకు బోధింపగా ఆమె అసూయాగ్రస్తయై శ్రీరాముని పృచ్ఛించెను. ఇట్టిదే సన్నివేశ మొకటి జానపద గేయ వాఙ్మయమున "సీతాదేవి యానవాలు" అను గేయమున కలదు.[1] ఇట్టివే ఈ గ్రంథమున ఇంకను కలవు.

---

1. వివరములు ఇందలి జానపదగేయ వాఙ్మయము-రామకథ ప్రకరణమున కలవు.

తమంతయు నొక కొన్ని గంటలలో చెప్పెను. (సంస్కృతమున సుమారు దినమంతయు చెప్పబడినట్లు కలదు.) ....రెండు లఘుకావ్యముల సంపుటిగా అంగీకరించి పూర్వోత్తర గ్రంథములను వ్యస్తముగా రావణ శ్రీరామ నాయకములుగా పరామర్శించుట యుచితము. అయినచో పూర్వభాగమునకు రావణుడు నాయకుడు, రసము రౌద్రము- లేక రౌద్ర రసస్ఫూర్తి కలిగిన యుద్ధవీరము-" అని డాక్టర్ కేతవరపు రామ కోటి శాస్త్రిగారు "తిక్కన కావ్య శిల్పము- తత్త్వదర్శనము-'' అను తమ పరిశోధన వ్యాసమున పేర్కొనిరి.

తిక్కనకంటె పూర్వము ఉత్తరకాండ కథను దిఙ్నాగుడు కుంద మాల నాటకముగను, భవభూతి ఉత్తర రామ చరిత నాటకముగను సంస్కృతమునరూపొందించిరి. (భవభూతి ఉత్తర రామ చరిత మున తన కావ్యముకంటె ముందు వెలసిన కుందమాలా నాటకమును అటనట అనుసరించెను. ముఖ్యముగ ఉత్తర రామ చరిత తృతీయాం కము, కుందమాల చతుర్థాంకముతో సరిపోల్చిన ఈ విషయము విశదమగును.) నిర్వచనోత్తర రామాయణమున ఎడనెడ ఈ నాటక ముల ప్రభావము నూహించుటకు అవకాశము కలదు.

వనమున సీతాదేవికి రామాజ్ఞను విన్నవించుతరి లక్ష్మణుడు పరిదేవనము కావించుచు సీతాపాదముల వ్రాలినట్లు తిక్కన రచిం చుట, కుందమాలా ప్రథమాంకమున లక్ష్మణుని అభినయ సూచనను అనుసరించి కానోపును.

శంబూక వధా సమయమున ఉత్తరకాండమున శ్రీరాముడు సం శయ రహితముగ సంహరించినట్లు కలదు. (స. 76-4) తిక్కన రామాయణమున "రేహస్త దక్షిణ మృతస్త శిశోర్ద్విజస్య, జీవాతలే విసృజ శూద్రమునే కృపాణం, రామస్య గాత్ర మసి నిర్భర గర్భ ఖిన్న, సీతావివాసినపటోః కరుణా కుత స్తే?"- (ఉత్తర రామచరిత నాట కము- 2-9) అను భవభూతి శ్లోక భావమును గ్రహించి, శ్రీరాముడు శంబూకుని వధించుటలో వెనుక ముందాడినట్లు కనుపించును.

నిర్వచనోత్తర రామాయణ దశమాశ్వాసమున 128, 129, 130 పద్యముల వలన వాల్మీకి శ్రీరామునియందు ఆగ్రహమును ప్రకటించి నట్లు ఊహింప వీలగును. ఉత్తర కాండమున ఇట్లు లేదు. కుంద మాల షష్ఠాంకమున ప్రవేశించు వాల్మీకి వాక్యములు కోపాభినయ పూర్వకములని దిఙ్నాగుడు వ్రాసెను. బహుశః తిక్కన ఆ భావమును స్వీకరించి తన కావ్యమున "అంతనుండియు నీతోడ నలిగియున్నవార మేము"– అని వాల్మీకిచే పల్కించి యుండనోపును.

## కాచభూపతి-విఠలరాజు:-

తిక్కన తర్వాత తెలుగున ముగ్గురు కవులు ఉత్తరకాండ కథను రామాయణముగా రూపొందించిరి. కాచభూపతి, విఠలరాజు అందు ప్రథములు.

రంగనాథ రామాయణ కర్తగా పేర్కొనబడుచున్న గోన బుద్దా రెడ్డి కుమారులగు కాచభూపతి, విఠలరాజులు ఉత్తరకాండమును ద్విపద కావ్యముగ రచియించిరి. సుమారు ఆరువేల ద్విపదలున్న ఈ గ్రంథము శ్రీరామావతార సమాప్తి పర్యంత కథను తెల్పును. మూల గ్రంథమున ప్రక్షిప్తములుగా భావింపబడుతున్న నృగు, నిమి మహా రాజుల కథలు మున్నగునవియన్నియు ఇందుకాంచదగును. రంగనాథ రామాయణమందు వలెనే ఇందు కూడ అమూలకములగు అంశములు కలవు. భద్రుడు సీతావిషయకాపవాదమును శ్రీరామున కెరింగించుటకు ముందుగా ఒక చిత్రమైన సన్నివేశము ఇందు కల్పింపబడెను. శ్రీరాముడు కామరూపశైలి అన్యులకు కానుపించని ఇరువురు స్త్రీలతో ఉండి నట్లుగ ఒక రక్కసి సీతకు బోధింపగా ఆమె అసూయాగ్రస్తయై శ్రీరాముని పృచ్ఛించెను. ఇట్టిదే సన్నివేశ మొకటి జానపద గేయ వాఙ్మయమున "సీతాదేవి యానవాలు" అను గేయమున కలదు.[1] ఇట్టివే ఈ గ్రంథమున ఇంకను కలవు.

---

1. వివరములు ఇందలి జానపదగేయ వాఙ్మయము_రామకథ ప్రకరణమున కలవు.

ఈ ద్విపద రామాయణము క్రీ. శ. 1920 సంవత్సరమున చెలికాని లచ్చారావుగారిచే అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వ మను ప్రచురణ వరుసలో అయిదవదిగా ప్రకటింపబడెను.

## కంకంటి పాపరాజు - ఉత్తర రామాయణము:-

క్రీ. శ. 1775-1832 ప్రాంతమందలి కంకంటి పాపరాజు ఉత్తర రామాయణ కావ్యమును రచించెను. ఉత్తర కాండను పద్యరూపమున సంపూర్ణముగ రచియించిన ప్రథమకవి కంకంటి పాపరాజు.

మ. "పరుసం దిక్కన యజ్వ నిర్వచనకావ్యంబై తగంజేసె ను
త్తర రామాయణ మందునన్ మఱిప్రబంధం బూని నిర్మించుటో
పరసత్వం బని ప్రాజ్ఞులార నిరసించంబోకుఁడీ రాఘవే
శ్వరు చారిత్రము నెంద జెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే"
(పీఠిక-14)

—అని తన కావ్యరచనకు హేతువును చెప్పెను. ఇది మూలమునకు సన్నిహితముగ సాగిన కావ్యము. బలి, సూర్య, చంద్రాదులను రావణుడు జయించుట, వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతము, నృగు, నిమి మహారాజుల కథలు, గృధ్రోలూక సంవాదము- వేదవతి వృత్తాంతము, నలకూబరుల శాపము- ఇత్యాదిగా గల ఉత్తరకాండ కథలన్నియు ఇందు కలవు. అమౌలికములైన కల్పనలు ఒండు రెండు కలవు.

శ్రీరామావతార పరిసమాప్తము తరువాత వైకుంఠమునకు అరిగి శ్రీమన్నారాయణుకు మహేశ్వరాదుల స్తోత్రములకు ప్రసన్నుడగును. తదుపరి అంతఃపురమున "భూనీళ లనురాగ మతిశయిల్ల...కొల్వ...." "గోవిందుఁ డొక లేనియలుకఁ బూని,"

"అవునవు మంచిదాన వతివా నిను నేమనవచ్చు నొంటిగా
నవని నమం ద్యజించి సభయుందవు డిద్దర ద్రోవ యియ్యఁగా
నవమతిఁ జేసి వచ్చితివ యా కఱకుందన మాత్మ నెంచి నన్
దివిరి కనుంగొనం దగునె నీమొగ మింకఁ దలోదరీమణీ"

(ఆ. 8-ప. 331)- అని ప్రణయకలహంబులతోను, సరససల్లాప ములతోను సుఖముండినట్లు కావ్యము సుఖాంతము కావింపబడెను.

తిక్కన రామాయణమునందు వలెనే యిందుకూడ అయోధ్యా నగర వర్ణన సందర్భమున పూర్వ రామాయణము సంగ్రహముగ కలదు. ఉత్తరకాండ కథలను ప్రబంధరీతిని అనుసరించి ఆయా భాగములకు సందర్భించునట్లు వర్ణనలను పెంచి వ్రాసెను.

సీతకు రామాజ్ఞను తెలుపు సందర్భమున "జననిందిత కృత్యముఁ బూని వచ్చితిన్-నను శపియించు మంచుఁ బరణంబులచెంగట వ్రాలి యేడ్వఁగన్'' (ఆ. 6- ప. 256) అని లక్ష్మణుడు సీతాచరణములపై వ్రాలి శోకించినట్లు, తిక్కన రామాయణమందు వలెనే కలదు.

తిక్కన రామాయణమునందు వలెనే ఇందుకూడ అశ్వమేధ యాగ నిర్వహణార్థము శ్రీరాముడు 'స్వర్ణ సీతా ప్రతిమతో పత్ని కృత్యముల కొన్నింటిని నిర్వహింప జేసెనని కలదు. అవాల్మీకమగు ఈ అంశము జైమినీ భారతమున ''జాతరూపంబుచే మహీజాతరూప మమర గావించి చేయుదు యాగ మనుచు"[1] అనియు, భవభూతి ఉత్తర రామ చరిత నాటకమున ''కాత్ర్హి యజ్ఞే సహధర్మచారిణీ ? హిరణ్మయీ సీతా ప్రతికృతిః-'' అనియు కలదు. పద్మపురాణమునకూడ స్వర్ణ సీత గలదు. సీతారాముల ఉద్యానవన విహారము విస్తరించి జల క్రీడ, పుష్పాపచయము మున్నగు వర్ణనలు కూడ అందు కావింప బడెను. (ఆ. 6- ప. 19-177)

సమీర కుమారవిజయ గ్రంథకర్తయగు పుష్పగిరి తిమ్మకవి అను నతడు సహస్రోతయనియు, అతని సాహాయ్యంబును పూని మున్ను శ్రీకృష్ణుని సాహాయ్యంబును అర్జునుడు గైకొనినట్లు గైకొని తానీ యుత్తరరామాయణమును రచియింపబూనినట్లు పీఠికయందలి "హనుమద్దివ్య పదార వింద" పద్యమునందును, "అని కిరీటికి శౌరి తోడైన యట్టు" లని గీత ములోను కంకంటి పాపరాజు పేర్కొనెను. ఈ పద్యము లాధారము చేసికొనియే కాబోలును ఉత్తర రామచరిత్ర కావ్యము పుష్పగిరి తిమ్మ కవి ప్రణీతమే అనియు, నెల్లూరు మండలమున లౌకికోద్యోగిగా ఉన్న

1. జైమిని భార. ఆ. 6- ప. 104.

కంకంటి పాపరాజునొద్ద తానంతకుమున్ను చేసిన ఋణమునకు చెల్లుగా కావ్యమును ఆతని కొసగెననియు ప్రవాద మొకటి జనించెను. కాని అది సత్యదూరమని పండితు లంగీకరించిరి.

## గోవింద రామాయణము :-

"భక్తిరసము పునాదిగా ప్రబల జేసి

కరుణరస కావ్య సౌధంబు గట్టువాడ" ననుచు ఆత్మకూరి గోవిందాచార్యులు వెలయించిన గోవింద రామాయణము మిగుల సంక్షిప్తము. ఇందు రావణ విజయపరంపరాభివర్ణనము వివరింపబడ లేదు. ఉత్తర రామాయణమున రావణవధానంతర శ్రీరామ జీవితము మాత్రము వర్ణింపబడవలయుననను భావముతో ఇందు కావ్యారంభమును సీతారాముల ఉద్యానవన విహార వర్ణనముతో ప్రారంభము కావింపబడెను.

ఇది అనువాద గ్రంథము కాదు. మూలమునుండి కథ గ్రహింపబడి స్వతంత్రముగ రూపొందింప ప్రయత్నము జరిగెను. పురాణేతిహాసములందలి పాత్రములను ఆధునికులు సంభావించు విధాన మిందు అచ్చటచ్చట కన్పట్టుచుండును. ఉదాహరణమునకు శంబూక వధ ఘట్టమును స్వీకరింపవచ్చును. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణ చరితమువలెనే యిందుకూడ వైకుంఠమున శ్రీమన్నారాయణుని ప్రణయకలహాది సన్నివేశములు కూర్పబడెను. మంగళాంతము కావింపబడిన ఈ గ్రంథాంతమందలి పద్యము మంగళ మహాశ్రీయే. గోవింద రామాయణమున కూడ పూర్వ రామాయణసంగ్రహము కలదు.

వావిలికొలను సుబ్బారావుగారు ఉత్తర కాండను యథాతథముగ పద్యములుగ అనువదించిరి. ఆ విధముగనే జనమంచి శేషాద్రిశర్మగారు కూడను. కట్టి వెంకట సుబ్బారావుగారు "శ్రీ రఘురామ చరిత్ర" మను పేర పూర్వోత్తర రామాయణమును సంపూర్ణముగ సంక్షిప్తీకరించి వ్రాసిరి.

## నిర్వచనోత్తర రామాయణ శేషము-ఏకాశ్వాసము :-

జయంతి రామభట్టు అను కవి ఉత్తరకాండ కథ యందు సీతా భూప్రవేశానంతరము శ్రీరామావతార సమాప్తి పర్యంత కథను-నిర్వచనోత్తర రామాయణమున తిక్కన వదలుటచే, తానాభాగమును-సంపూర్ణము కావింపవలెనను ఆశయముతో నిర్వచనోత్తర రామాయణ శేషమును ఏకాశ్వాసముగ రచించి, తిక్కన కావ్యమునకు అనుబంధముగ చేర్చెను. కాని ఇది నిర్వచనముగ వ్రాయబడకుండుట విశేషము. భద్రాచల రామున కంకితము కావింపబడిన ఈ ఏకాశ్వాసము

"తిక్కన సోమయాజి మును తెల్గున నుత్తరకాండ జెప్పి యం
దొక్కటి చెప్పడయ్యె కడుయొద్దిక నే రచియింప వేడ్కచే
నిక్కము సంస్కృతంబుకడు నెమ్మది భక్తిని నే రచించితిన్
చక్కని దేవళంబు తుద స్వర్ణ (నన్) ఘటంబిడు పోల్కెదోచె
గనూ(న్)"

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందున నున్న(D-3) వ్రాత ప్రతి యందలి పద్యము)

ఇందు ఉత్తరకాండయందలి చివరి పండ్రెండు సర్గలు గ్రహింపబడెను. తిక్కన స్వీకరింపక వదలిన నృగు, నిమి మహారాజు కథలు మున్నగు అంశముల నితడును స్వీకరింపలేదు.

"ఇది శ్రీమద్భద్రాద్రిధామ వర ప్రసాద లబ్ధ కవితా గార్గేయస గోత్ర పవిత్ర జయంతి కృష్ణభట్టారక సుభద్రాంబావరతనూజ రామభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణం బాదికావ్యంబునను నుత్తర కాండ తిక్కన సోమయాజి రచితంబై యున్న శేషంబునం గల్గు. మొదటి కథ యందుల శ్రీరాములు కుశలవులకువిద్యాభ్యాసంబును, అతిరాత్ర పౌండరీక వాజిపేయంబులాది గోశతక్రతువులు గావించుటయు, భరతతనూజులకు గంధర్వపురంబులు పట్టంబులు గట్టుటయు, భరతుని విజయంబును, రామసన్నిధికి తాపస వేషధారుండై శమనుం డేకాంతంబును, లక్ష్మణ వియోగంబును, రామచంద్రుడు మహాపథంబున కుపక్రమించుటయు, భరతాద్యయోధ్యా

వాసులైన వారితో చనుదెంచుటయు, లక్ష్మణుం డనంతుండై వైకుంఠ నగరంబునకుం జనుటయు, బ్రహ్మోపదేశంబున రాఘవేశ్వరుండు నారాయణాఖ్యుండౌటయు, భరతశత్రుఘ్నులు శంఖచక్రంబులై కొలచుటయు, పురజన ఋక్ష వానర తిర్యక్సమూహంబుల బ్రహ్మ లోక నివాసులం జేయుటయు, నారాయణాఖ్యం బ్రవర్తిల్లి పూర్వరీతిని వైకుంఠపుర ప్రవేశంబును నను సర్వము (౦) నేకాదశాశ్వాసము".

–అని వ్రాసిన గద్యవలన ఆతని కావ్యప్రణాళిక తెలియును. ఈ గద్యయందు కొన్ని వాక్యములు ముందు వెనుకలైయున్నవి.[1] కాని మధ్య నున్న దీర్ఘములైన వచనములకు కూడ ప్రతి నాల్గు పంక్తులకు ఒక సంఖ్య కాంచనగును. భరతుడు గంధర్వులను జయించుట మూలమున (స. 101) పది శ్లోకములందుమాత్ర ముండగా, ఇందు ఇంచు మించు ఏబది పద్యములందు వర్ణింపబడెను. మిగిలిన కథ యథా మూలము.

"శ్రీమద్రఘుకులజలనిధి
సోమా ! పరమాత్మనామ ! సుగుణస్తోమా !
భీమావహదైత్యకులవి
రామా ! భద్రాద్రిధామ ! రాఘవరామా !
శ్రీరాముడు చెలువంబుగ
ధారుణి పాలింపుచుండి ధర్మాన్వితుఁడై
సారెకు మైథిలిఁ దలపుచు
కారుణ్యము కలిమి చెలిమి గారవమొప్పన్"– అని కావ్యము ప్రారంభింపబడెను.

ప్రాచీనమైన నిర్వచనోత్తర రామాయణమునుండి అర్వాచీన మయిన గోవింద రామాయణము వరకు ఉత్తర రామేతివృత్త కావ్యములు పెక్కు వెలువడెను. కాని నాటక జానపద వాఙ్మయాది రంగముల వెల్వడిన ఉత్తర రామేతికృత్త కృతులతో సరిపోల్చిన కావ్యశాఖ యందలి కావ్యముల సంఖ్య స్వల్పముగా తోచును. ధర్మమూర్తియైన

1. ఇందు 276 గద్య పద్యములున్నవని తెలియును.

శ్రీరామునకు జనించిన సీతావియోగ మనఃక్లేశమునకు, రవి వంశమునే పునీతము తేజోవంతము కావించుటయేకాక రఘువంశ మణి దీపికలైన కుశలవులకు జనని అయికూడ చిరదుఃఖితగా మిగిలిపోయిన ధరణీతనయ సహనశీలమునకు, పతిభక్తికి, స్వాభిమానమునకు, ధర్మానురక్తికి హృదయములు ద్రవించి డగ్గుత్తికతో సీతా పరిత్యాగ కథను చెప్పుకొను జనబాహుళ్యమునకు అత్యంత సన్నిహితములైన నాటక జానపద వాఙ్మయాది ప్రక్రియలందు ఉత్తర రామకథ సర్వతోముఖముగ వ్యాప్తిని పొందెను.

---

# జానపద వాఙ్మయము—రామకథ

జానపద వాఙ్మయమున రామకథకు ప్రాధాన్యము లదకనుట కంటెను, జానపద వాఙ్మయ వికాసమునకు రామకథ దోహదకారియైన దనుట సమంజసము. కూచికొండ రామాయణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామకథా సుధార్ణవము, మోక్షగుండ రామాయణము, సూక్ష్మ రామాయణము, సంక్షేప రామాయణము, గుత్తెనదీవి రామాయణము, అధ్యాత్మ రామాయణము, చిట్టి రామాయణము, శ్రీరామదండములు, రామాయణ గొబ్బిపాట, శ్రీరామ జావిలి, అడవి, శాంత, పెండ్లి, సేతు గోవింద నామములు, మున్నగునవి జానపద వాఙ్మయ వనమున పుష్పించిన కొన్ని పూజా సుమములు. ఇంకను ! "విద్ది, కూచి రామాయణ మారున కాండములు చ్యుత జాగరవేళ జాడి''నట్టి వెన్ని అలభ్యములో ఎరుగరాదు. రామాయణమందలి కొన్ని ఘట్టములనే వర్ణించునవి—శాంతా కల్యాణము, పుత్ర కామేష్టి కౌసల్య బైకలు, కౌసల్య వేవిళ్ళు, శ్రీరాముల ఉగ్గుపాట, రాఘవ కల్యాణము, రాములవారి అలుక, సుందరకాండ పదము, ఋషుల ఆశ్రమము, సుగ్రీవ విజయము, కోవెల రాయబారము, లక్ష్మణమూర్ఛ, లంకా యాగము, గుహభరతుల అగ్ని ప్రవేశము, శ్రీరామ పట్టాభిషేకము, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలయాగము, కుశలవ కుచ్చల చరిత్ర, కుశలవ కుచ్చెలకథ, కుశలవ యుద్ధము, వేమూరి బ్రతుకమ్మ కుశలవ పాట, కుశలవ హోమము, శతకంఠ రామాయణము వంటివి లెక్కకు మిక్కిలి. ఆంధ్రుల ఆడపడుచుగా సీతాదేవి ఆంధ్రుల జీవితమునకు అంకితమైపోయెను. సీత ఆట, పాట, అరణ్యవాసము, చెర, అగ్ని ప్రవేశాదులు తమవిగా తెలుగు జానపదుల హృదయములు స్పందిం

---

1. త్రేతాభిరామము.

చెను. ఒక్క సీతాదేవిని గురించియే సీత పుట్టుక, కల్యాణము, అత్త వారింటికి పంపుట, సమర్త, శుభగోష్ఠి, గడియ, వామనగుంటలు, అలుక, వసంతము, దాగిలిమూతలు, సురటి, ముద్రికలు, ఆనవాలు, అగ్నిప్రవేశము, వేవిళ్ళు మున్నగు గేయము లెన్నియో జానపదుల హృదయములం దుద్భవించి ఆంధ్రప్రజలను రామకథామృతవాహిని యందు ఓలలాడించి, పునీతులను కావించెను.

ఈ గేయములం దున్న కొన్ని విశేషములు శిష్ట రామాయణము లందు కానరా దన అతిశయోక్తి కానేరదు. అవాల్మీకీయములగు సులోచన కథ, జంబుమాలి వృత్తాంతము, కాలనేమికథ, రావణునకు శుక్రు నుపదేశము, రావణ పాతాళ హోమము వంటి సన్నివేశములు రంగనాథ భాస్కర రామాయణాదులందు కలవు. జానపద వాఙ్మయమున రంగనాథ రామాయణాదులందలి సన్నివేశములకంటె అధికములగు కల్పనలు కన్పట్టును. కనుక, భాస్కరాదులు వాల్మీకి రామాయణమును ప్రమాణముగ గ్రహించినను, వాల్మీకి కాలమునకు ప్రచారమునందుండి, వాల్మీకి- స్వీకరింపక, అన్యులచే గ్రంథస్థము కావింపబడిన (ఈనాడు అలభ్యములయిన గ్రంథములు) అంశములను స్వీకరించి లేక తమ కాలమునాటిక ప్రజావ్యాప్తియం దున్న గాథలకు తమ గ్రంథములందు తావిచ్చినారో, కాదేని ఆనందవర్ధనులు ధ్వన్యాలోకమున పేర్కొనిన రీతి "ఉత్ప్రేక్ష్యాపి అంతరాభీష్ట రసోచిత కథోన్నయః" అను నా నుడికి దృష్టాంతముగ కల్పించిరో, లేదేని, జానపద వాఙ్మయ కవులే భాస్కరాదుల గ్రంథములనుండి స్వీకరించినారో ఇంకను సమగ్ర పరిశోధనము కావింపవలసిన విషయము. ఏది ఎటులున్నను శిష్టులకు పండితకృత రామాయణాంతర్గత విషయములపై ఎంత విశ్వాసము కలదో, జానపదులకు తమకు లభ్యమయిన గాథలపై అంతియ విశ్వాసమున్న దనుట నిస్సంశయము. తెలుగు జానపద గేయ సాహిత్య పరిశోధకులు డా॥ బి. రామరాజుగారు పేర్కొనిన రీతి జానపదులు తమ రామాయణములను ఇట్లు మలచుకొనుటకు బహుశః వారు జ్ఞాన ప్రవచనములను సహింపని పామరు లగుటయే కావచ్చును. జానపద కవులు సీతారాములతో తాదాత్మ్యము పొం

దిరి. వారికి కేవలము సీతారాముల కష్టసుఖములు వారివి మాత్రమే కావు, వారి సుఖదుఃఖములు సీతారాములవి కూడ. ఈ రీతిని పురాణదంపతులతో తాదాత్మ్య మనుభవించిన జానపద కవులు వర్ణించిన సీతారామ కథల యందలి జీవిత వృత్తములు తమవియు, సీతారాములవి కాకుండ, లోకసామాన్యములై "సాధారణీ కరణములు" గా అలంకారికుల ప్రశంసలను పొందెను.

రామాయణ కథను సంపూర్ణముగనో, అధిక భాగముగనో వివరించు పాటలు ప్రథమమున పరిశీలింపబడుచున్నవి.

## రామకథా సుధార్ణవము:-

శ్రీకాకుళ మండలాంతర్గత హీర మండలవాసి యగు లాడె సుందర నారాయణ, గేయ వచననోభయాత్మకముగ పట్టాభిషేక పర్యంతకథను రామకథా సుధార్ణవముగ రచించెను. రచయిత విద్యావంతుడుగ కన్పట్టును హృదయంగమ మగు రచన. రాక్షసులు రావణునితో "నీ తమ్ముం డగు కుంభకర్ణు డొక నిమిషములోప లను- అవనీనాథుల రక్తపూరవుల నాపోశనమెత్తు" నందురు. భాస్కర రామాయణమున ప్రహస్త రాక్షసుడు విభీషణునితో కుంభకర్ణుని గురించి,

"అవనీనాథుల రక్తపూరముల ము న్నాపోశనం బెత్తి!" [1] అనును. ఈ విధముగనే హితోపదేశ మొనరించు విభీషణునితో రావణుడు.

"నీటను బుట్టిన తామరాకులు నీటి కంటనట్లు, కలియవు నీ మా హృదయంబులు కడుపాపాత్ముడ వగుట"- అని నిందించుట భాస్కర రామాయణ మందలి.

కం. ''ఉదకము నలినీ పత్రము
గదిసియు నెరవైన యట్లు కలయవు నీ మా

1. భాస్కర రామాయణము-యుద్ధకాండ-120 వ.

హృదయములు గజస్నానము
తుది మఱి నీతోడి పొందు దుష్టచరిత్రా"-[1] అను పద్యభావము నకు సరిపడును.

## కుశలవ కుచ్చల చరిత్రము :-

ఈ సుదీర్ఘమగు కథాగీతమునందు బాలకాండనుండి ఉత్తర కాండమున సీతాదేవి భూగర్భ ప్రవేశము వరకు వర్ణితమయ్యెను. గేయాంతమున "ఇది వాల్మీకి రామాయణము తలపున వ్రాసెను ఆ సతి తాను''- అని యుండుటచే, రచించినది కవయిత్రిగా స్పష్టమగు చున్నది కాని, నామాది వివరములు తెలియవు. వాల్మీకి రామాయణ మును స్మరించి వ్రాసినట్లు పేర్కొన్నను ఇందు అవాల్మీకీయాంశ ములు పెక్కు కలవు. వ్యాసవిస్తర భీతిచే ఒండురెండు సన్నివేశ ములు మాత్రము ఇచ్చట వివరింపబడెను.

ఒకనాడు 'శాంతా రాఘువు లోకవైపై' 'సీతాలక్ష్మణు లోక వైపై, 'చక్కపగడాలు' (పాచికలు) ఆడిరట. అనంతరము మఱియొకనాడు సీతాదేవి శాంతతో శ్రీరాముడు కబురంపినను అంతఃపురమునకు వెడల లేదు. కుపితుడైన శ్రీరాముడు లక్ష్మణు డొసగిన విల్లంబులను పరి చారికలుగ చేసెను. ఆ స్త్రీలు "వేడుక వింజామర విసరుచును- ఆకుల మడుపులు అందిమ్చుచును కూడి ఉండిరా రామునితోను"- ఆ సం రంభము అలించి అరుదెంచిన జానకి "ఏకపత్నీవ్రతుడవు అనుచూ- ఇచ్చేగాక మా తండ్రి"- నీ నిష్ఠాగరిష్ఠము లన్నియు విశదమయ్యె నని కోపించెను. కుహనావనితలు కూడ "యెక్కడదానవె జానకి నీవు- యెప్పటికీ మేమే ఉన్నాము"- అని పరిహాస రూపమున తాము కేవలము శరములను విషయమును వెల్లడి కావించిరి. విషయము అలించిన శాంత ఏతెంచి సీతారాములను సమాధాన పరచెను. స్త్రీల మనస్తత్వము ప్రదర్శిత మగు ఈ ఘట్టమున పురుషుని నడవడిక ఇల్లాలి చాకచక్యముపై ఆధారపడు నను హెచ్చరిక ఈ సన్నివేశమున

1. భాస్కర రామాయణము-యుద్ధకాండ-1ి8 ప.

అంతర్లీనముగ ఉండి ఈ విచిత్రకల్పన కావించుటలో కవయిత్రి ఒసగ దలచిన సందేశము ఇదియే ననిపించును.

ఇటువంటిదే మరియొక విచిత్ర కల్పనము, జానపదుల చిత్తవృత్తిని విశద మొనరించునది ఇందు కలదు. సీతాపరిత్యాగమునకు శ్రీరాముడుకాని, సీతాదేవికాని, ప్రజలుకాని ప్రత్యుత్తర మొసగనేరని బలవత్తరకార్యము ఇందు చిత్రింపబడెను. రామరావణ యుద్ధమున మరణింపని శూర్పణఖ, తన మార్గమునకు ఆటంకమయిన సీతాదేవిని దుఃఖములపాలు కావించి సీతారాముల ఎడ పశుబలమున కాక బుద్ధి బలమున ప్రతీకారము కావింప సమకట్టెను. అది ''కావివస్త్రములు కట్టక మేనా- యతివేషము దప్పక తా దాల్చి''- అయోధ్య చేరి, ''పొడి గట్టి చుక్కల నేరగనేర్తు- వానత్రాడుగా పేనగనేర్తు'' ననుచు రామ లక్ష్మణుల సన్నిధిని విద్య ప్రదర్శించెను. లక్ష్మణుడు వారించినను సరకుగొన శ్రీరాముడు ఆ మాయావిని "సీతాకాంతల కడకు తోడుక పొమ్మ"నెను. ఇక్కడ గమనీయాంశము మాయాహరిణ ఘట్టము నందు వలెనే ఇచ్చట కూడ లక్ష్మణుడు సోదరుని వారించుట. కాంత కిష్టము లేకున్నను సీత దానికి "కట్నా లిచ్చినది". అది స్వీకరింపక ''రావణు పటమూ వ్రాసియిచ్చితే- బ్రతుకుదునే నీ లోకములోనూ'' అని అర్థించెను. ఈ విపరీతపు కోరిక యందలి అంతరార్థము ఎరుగ నేరని జానకి రాక్షసుని రూపురేఖలు తెలియవని పల్కగా అంతః పుర మున ఒత్తిడి జరిగెను. అప్పు డామె ''పదినెలలు చెరనుంటిగాని- పాపకర్ముని కన్నులజూడ-జనకునిగా భావిస్తి నేను—అంగుష్ఠ మొక్కటి యెరుగలదు''- అని "అంగుష్ఠముతో జానకి వ్రాసినది.'' అనంత రము, "ఆమీదట యతి అంతా తావ్రాసె"- పటము పూర్తి కావించి శూర్పణఖ చతుర్ముఖుని సమీపించి, అభ్యర్థించి పటమునకు ప్రాణ ప్రతిష్ఠ కావించి, అయోధ్యయందు వదలి వెడలెను. ఇక ''పట మొచ్చి ముందర నిలుచుండి- రావే పోదము లంకకు ననుచు- జానకి బట్టుక యీడ్వం దొడంగెను''. ''పాడు నూతిలో పటమటు వేసినా''- ఏమి కావించినను. ''రావే పోదము లంకకు ననుచు- జానకి బట్టుక నీడ్వ దొడంగిన", సీత చివరకు శ్రీరామునిపై ఆసలుంచి పటమును

తన శయ్యయందు గుప్తపరచెను. అంతఃపురమునకు అరుదెంచిన రామునకీ వృత్తాంత మెవరును ఎరిగింపలేదు. ఆరాత్రి సీతారాములు శయనించియున్న సమయమున "పడద్రోసెను రాముని యాపటము"-వెరగందిన శ్రీరాముని ముంగిట నిలచెను. ఫలితము సీతా పరిత్యాగము. అతిచిత్రమయిన యీ వృత్తాంతము మానవ మనస్తత్వమునకు దర్పణము వంటిది.

ఈ గేయమునందు ఇంకను రెండు మూడు విచిత్ర కల్పనలు కలవు.

## శారద రామాయణము :-

శారదకాండ్రచే పాడబడు ఈ కథయందు పదములు అంత్య నియమములతో నుండును. పట్టాభిషేక పర్యంత కథ వాల్మీకి రామాయణానుసారముగ చెప్పబడెనట "శ్రీరామచంద్రుని చరితంబు... రామభక్తకవి చెప్పు కథనంబు...వినవినగ వేడుకను మధురంబు" అని చివరన కలదు. రచయిత విద్యాసంస్కారము కలవాడుగ అక్కడక్కడ కావింపబడిన వర్ణనల వలన విశదమగును. అనౌచిత్య వర్ణనలు కూడ కొన్ని కలవు. శ్రీరాముడు. "తరమా- దాని సోయగం బెన్నగ తరమా- మరి వరరూపమైన సుందరమా.... ఇదేగద చూడ శోకసాగరమా" అని విలపించుట ప్రబంధ ధోరణిని తలపింపజేయును. లంకయందు హనుమంతుడు కావించిన లంకాపుర స్త్రీ వర్ణనా ఘట్టము అతి సుందరము.

## లంకా యాగము :-

రామాయణ కథా గేయములందీపాట బహుళ ప్రచారము పొందెను. ఇందు రామునివెంట అరణ్య గమనమునకు సంసిద్ధురాలైన కౌసల్య కంటెను, "శ్రీరాములు తండ్రిగా సీతమ్మ తల్లిగా భావింపు లక్ష్మన్నా" అనుచు పుత్రుని శ్రీరామ సేవకు అంకితము కావించిన సుమిత్ర ధీరశాంతమునకు ప్రాముఖ్య మొసగబడెను. "మాను పారిన తీగ మాను తప్పిన వెనుక మరి యెట్లు నిల్వగలదు ?"— అని

సీత శ్రీరాముని వెన్నంట, తన పతిని అనుసరింప ఊర్మిళ కూడ ఉత్సహించెను. కాని, "బావ నడచిన మార్గమున నడువరా దందురు ...బావ మాటధ్వని భూమిపయి వినరాదు యేలాగు వేగింతునూ'' అని లక్ష్మణు డామెను వారించెను. శిష్టవాఙ్మయమున కేవలము ఉపేక్షిత నాయికగా ఊర్మిళ చిత్రింపబడుటకు జానపదు లింతటి పవిత్ర ధర్మమును హేతువుగ పేర్కొనిరి.

రంగనాథ భాస్కర రామాయణములందలి శూర్పణఖా పుత్రుని వృత్తాంతము ఇందు కలదు. కాని జంబుమాలినామ మిందు చక్ర భూపాలునిగ పేర్కొనబడెను. సీతను అపహరింప చనుదెంచిన దశకంఠుడు మూర్ఛితయైన సీతను స్పృశింపక ''ఉదయ శూలము దెచ్చి గడ్డతో పెకిలించి రథముపైనా యుంచె"నట! ఆహా! ఏమి, పతివ్రత ఛాయనైనను పరపురుషుడు స్పృశింప నోపడను జానపదుల ఆర్షధర్మానురక్తి! ఇందు రణరంగమున మూర్ఛితుడయిన సోదరునికై ''వినవోయి లక్ష్మణా సీతవంటి స్త్రీని పడయంగవచ్చుగాని... యిటువంటి సోదరుడు తనకెట్లు గల్గునో యెన్ని జన్మలకైనా'' అని శ్రీరాముడు విలపించు ఘట్టము కరుణరస ప్లావితము. ఇది వాల్మీకి రామాయణమందలి శ్రీరామ దుఃఖమును స్ఫురింపజేయుచున్నది. రావణ పాతాళ హెూమము కూడ ఈ గేయమున కలదు.

## పెండ్లి గోవిందనామాలు :-

రామాయణ కథా భాగమును అధికముగ వివరించు మూడు పాటలలో గోవింద నామములు ఒకటి. ప్రతి చరణము చివరను 'గోవిందా' యను పద ముండుట వలన ఇవి గోవిందనామము లనబడెను. స్త్రీలు (ముఖ్యముగ వితంతువులు) గోవిందనామ స్మరణ మొనరించుచు ఈ పాటలను గానము చేయుట పరిపాటి. గోవింద నామములు మూడు రకములు. 1. పెండ్లి గోవింద నామాలు, 2. శాంత గోవింద నామాలు, 3. అడవి అనే చరగోవించనామాలు. సాంఘిక వ్యవహారము లీ పాటలయందు సూచింపబడుట గమనార్హము. పెండ్లి గోవింద నామాలయందు శ్రీరామ జనన మాదిగా సీతా కళ్యాణ పర్యంత వృత్తాంతము కలదు.

## శాంత గోవింద నామాలు :-

శాంత ప్రధానపాత్రగ సీతావివాహము వరకు కథ గలదు. ఇతి వృత్తము మిగుల ఆకర్షణీయమైనది; రావణవధకై వేడిన దేవతల కభయ మొసగి ఆదిలక్ష్మి, "భూమిమీదను పుడుదు- భూమిమీద పెరుగుదును- జనకు నింట బుట్టి- జాతకం వ్రాయుచు- మరి పన్నెం డేంఢ్లకు- మిమ్ముల కలియుదు" నని విష్ణువుకడ సెలవు గైకొని లంక యం దొక కొలనులో ప్రవేశించెను. శివపూజార్థము కమలములకై ఏ తెంచిన రావణుని సేవకులు కమలమునుండి శబ్ద మాలించి రావణున కెరింగించిరి. రావణు డరుదెంచి కమలము నుత్తరింప అందుండి "ఎక్కడి నరుడవుర- నా శిరసు ముట్టితివి- నిన్ను నీ బలగముతో- తెగటార్తు" నను ధ్వని వెలువడెను. రావణు డా కమలమును మండో దరి కొసగెను. ఆమె విచ్చి చూచెను. అంత అందు "కనీపెంచ నీబాల- కన్నులకు అగుపడెను." రావణు డా బాలను వివాహమాడ గోరి దైవజ్ఞు లామె జాతకము పరిశీలనము కావించి 'అష్టమి శని వారం- సీత పుట్టిన దినము' లంకకు వినాశము కలుగగల దని హెచ్చ రించిరి. భీతి చెందిన మండోదరి ఆ బాల నొక మందసమం దుంచి "వెత్తి రావణుడు సుమీ- సుతునిపలె జూడుమీ-లంక రక్షించుమీ"- అని ప్రార్థించి సముద్రమున వదలెను. సముద్రు డామెను మూడేండ్లు, ఆదిశేషుడు మూడు మాసములు పెంచి భూదేవికి ఒసగగా ఆమె ద్వాదశ వర్షములు పెంచెను. ఈ పాటలో దశరథుడు వేటయందు సంహరించిన అంధముని కుమారుని పేరు సుమంతునిగా కలదు. పైన పేర్కొనిన సీతావృత్తాంతము పద్మపురాణము నందలి పద్మ వృత్తాంతము పోలియున్నది. ఇంకను ఇందులో కౌసల్య అభ్యర్థ నపై దశరథుడు పత్నులతో కలిసి, ఉత్తర దక్షిణ దిశల యందలి మహర్షులను సందర్శించెను. ఈ సందర్భమున కైక దుష్టస్వభా వగా చిత్రింపబడెను. దశరథు డామెను- "నాకు వశముగాదు- నల్లరాయి" అనెను. ఋషి సందర్శనార్థము కౌసల్యా సుమిత్రలు మంథరతో కలసి- "మందరతో కూడ ముగ్గురూ బానిసల" మని భావించి కాలినడకను బయలుదేరగా కైకేయీదశరథులు మాత్రము

రథారూఢులైరి. మధ్యే మార్గమున తేరుచక్రము భగ్నము కాగా, కైక మంధర మాయోపాయము మేరకు- "భమిడి కలము దూర్చి- బంగారు పట్టమీద- శ్రీకారము పెట్టి- రాము వనవాసము- భరతు పట్టం కట్టు- పదునాలుగేండ్లని వ్రాసె," పిమ్మట "కాగితము పుచ్చుకొని చిటికెన వ్రేలితో" తేరునెత్తెను. అనంతరము వారు రాజర్షి దంపతుల దర్శనము కావింప వారు శాంతను ఒసగిరి. పిమ్మట తన యింట పెరిగిన శాంతాకన్యకు వివాహము కావించుటకై దశరథుడు అప్సరసల పనిచి, ఋష్యశృంగుని రావించెను. ఋష్యశృంగుడు అప్సరసల గాంచిన ఘట్టమున చక్కని హాస్యము పోషింపబడెను. తరువాత దశరథుడు ఋష్యశృంగుని ఆధ్వర్యమున పుత్రకామేష్టి ఒనరించెను. ఈ పాటలో పరశురామ గర్వభంగము కూడ కలదు.

## అడవి అనే చరణ గోవింద నామాలు :-

ఇది పై రెండు పాటల తరువాతి కథ. పట్టాభిషేక పర్యంతము చెప్పును. ఈ మూడుపాటల ఛంద మొకేతీరుగా నుండుట చూడ ఈ మూడును ప్రారంభమున నొకేపాటయై యుండవచ్చునని పించును. అడవి గోవింద నామాలులోని కైక వాల్మీకి రామాయణ మందలి కైకవలెనే కరుణామయి. కాని, మంధర మాటలచే దుష్టబుద్ధిగా మారెను. ఇందులో పంపా సరోవర ప్రాంతమున మడుగులో పుష్పముల్- మదన బాణంబు లయ్యె- నీలోత్పలములు నెలత కన్నుల బోలు- ఎది చూచినను నాకు- ఇంతిరూపం బయ్యె" అని శ్రీరామ శోకము ప్రబంధ ఫక్కిని పర్ణింపబడెను. సీతారామ లక్ష్మణులు అయోధ్యకు వెడలునపుడు వానరకాంతలను కాంచిన సీత మనస్తత్వము స్త్రీ స్వభావమునకు నిదర్శనము.

ఇంతవరకు పేర్కొన్న గేయములలో రామాయణ కథ సంపూర్ణముగనో, అధిక భాగముగనో చిత్రింపబడెను. ఇక రెండవ వర్గమునకు చెందిన గేయములు రామాయణమందలి ఏదేని ఒక ఘట్టమును ప్రధానముగ చిత్రించునట్టివి.ఇట్టివానిలో ప్రథమముగ పేర్కొనవలసినది,

## ఊర్మిళాదేవి నిద్ర :-

ఆదికవి వాల్మీకినుండి దేశభాషలందు రామాయణములు వ్రాసిన కవులు ఇంచుమించు అందరును ఉపేక్షిత నాయికగా విస్మరించిన ఊర్మిళా సాధ్విని సీతారామాలక్ష్మణులతో తాదాత్మ్యమందిన తెనుగు జానపదులు మరువలేదు. ఆంధ్ర జానపదులు సీతమ్మకు అగ్రతాంబూల మిచ్చినను ఊర్మిళాసాధ్వి కన్నీటిగాథ వారి మనసులలో సుడులు తిరిగి కన్నులలో గోదావరులు సృష్టించెను. వనవాసము పరిసమాప్తమై, పతి గృహోన్ముఖుడగువరకు "ఒక మానునై" మిగిలిపోయిన ఊర్మిళ ఆంధ్రుల ఆడపడుచుగా ఎటువంటి సానుభూతిని బడసినదో "ఊర్మిళాదేవి నిద్ర" పాటలో విశదమగును. అంతఃపురముననే నిలువ ఆజ్ఞాపించి లక్ష్మణుడు వనవాసమున కరిగెను. "నాడు మొదలుగ శయ్యపై నాతి కనుమూసి పవళించుచున్నది." తిరిగి వచ్చిన లక్ష్మణునకు శ్రీరామ పట్టాభిషేక సంరంభమున ఊర్మిళస్ఫురణయే లేదు. చివరకు ఒకనాడు సీతయే లక్ష్మణుని ఊర్మిళా మందిరమునకు పనిచెను. అటు లరుదెంచి పాన్పుపై కూర్చుండి మేల్కొల్పిన లక్ష్మణుని చతుర్దశవర్షముల అనంతరము కనుల విచ్చి కాంచిన ఊర్మిళ గురుతింపకయే లేకపోయెను. పరపురుషునిగ భావించి,

"అయ్య మీ రెవరయ్యా........................
ఎవరూ లేనివేళ మీరిపు డేకాంతమున కొస్తిరి
............................................
మా యక్క బావ విన్న మీ కిపుడు ప్రాణమునకు హానివచ్చు
మాయక్క మరిది విన్న మి మ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో
హెచ్చైన వంశానికి అపకీర్తి వచ్చె నే నేమి సేతు
కీర్తిగల యింటబుట్టి యపకీర్తివచ్చె నేనేమిసేతు...." అని వాపోయెను. ఊర్మిళ సౌశీల్యమునకు ఈ పాట చక్కని నిదర్శనము. ఈ సందర్భమున కవిసార్వభౌముడైన శ్రీనాథుని పల్నాటి వీర చరిత్రమందలి మాంచాల రణోత్సాహియై మిత్ర సమేతముగా

వచ్చిన బాలచంద్రుని గుర్తించు ఘట్టము స్ఫురణకు వచ్చును. లక్ష్మణుడు తన్నుతా నెరుకపరచుకొన్నప్పుడు వారికి జరిగిన సంభాషణము మధురాతిమధురము. పతిపాదములపై కరిగిపోయిన ఊర్మిళ హృదయోద్వేగ మణంపజాలక,

"మా తండ్రి జనకరాజు మిము నమ్మి మరచి పెండ్లిచేసెను

చిత్త మొకదిక్కు నుంచి సమయమున చిన్నపుత్తురు పురుషులు"–

అని స్వీయదుఃఖమును వెల్లడించెను.

తరువాతి పాటలో ఊర్మిళను కేంద్రముచేసి శాంతాసీతల పరిహాసములు మున్నగునవి వర్ణింపబడెను. ఊర్మిళ కరుణరస భరితాంతఃకరణమునకు మరియొక్క ఉదాహరణము మాత్రము పేర్కొందును. పదునాలుగు సంవత్సరముల తరువాత ఏకాంతమున పతి తన కురులయందు బొండుమల్లెలు సవరించువేళ ఆమె హృదయమును శృంగారము కంటెను సోదరివిషాదగాథయే ఆక్రమించెను.

''సింహవిక్రములు మీరు వుండగా సీతెట్లు చెరబోయెను

రాజ్యాధిపతులు మీరు వుండగా రమణెట్లు చెరబోయెనూ''–అని చతుర్దశవర్షముల స్వీయదుఃఖమును విరహమును విస్మరించి సోదరి కష్టములకై దురపిల్లిన కరుణామయి తెలుగు జానపదులు మక్కువతో తీర్చిదిద్దుకొన్న ఊర్మిళ. ఆదికావ్యములో సంపూర్ణ రూపమును సంతరించుకొనలేక పోయిన ఊర్మిళ చరితము ఆధునిక విమర్శకుల నెందరినో ఆకర్షించెను. దానికి వారు అనేక విధములుగ సమాధానములు కూడ చెప్పిరి. హిందీ భాషలో "సాకేత్" మున్నగు కావ్యములకు బీజ మిదియే. ఇట్లే శ్రీ ఆచార్య 'మాండవి'ని కూడ నాయికగ చిత్రించి, ఆమె ప్రాముఖ్యమును వివరింప ప్రయత్నించిరి. ఊర్మిళ చరిత్రను తెలుగు జానపదు లతిమనోహరముగ తీర్చిదిద్దిరి. ఇది వారి ధార్మికసంప్రదాయమునకు కావ్యౌచిత్యదృష్టికి ఉదాత్తమగు ఉదాహరణము.

## లక్ష్మణదేవర నవ్వు :-

"ఊర్మిళాదేవి నిద్ర" పాటతో సన్నిహిత సంబంధము కల పాట ''లక్ష్మణదేవర నవ్వు''. అతీతవిషయములను నాగరికులు అర్థాంతర

న్యాసమున విశ్వసించినట్లు జానపదులకు విషయాంతరన్యాస మవసరము. కథయందు శిష్టులకు అర్థము, జానపదులకు విషయము ప్రధానము. పర్ణశాలలో సీతారాము లున్న సమయమున తన్నావరింప ప్రయత్నించిన నిద్రాదేవితో

''మాయన్న రఘుపతికి మా వదినకూనూ
ఈ పర్ణశాలకే తాను కాపనెనూ
పోపొ మ్మయోధ్యాపురి నగరునకు వేగ
ధవునిబాసీ నట్టి సతి యుండతగదూ
రాత్రియునూ పవలునూ లేవకుండగనూ
తను విడిచి పొందుమీ ధవళాక్షి నిద్ర"— అని వేరుకొనినట్లు

లక్ష్మణుని పదినాలుగేండ్ల, నిద్రాహారరహితమగు సోదరసేవకు, ఊర్మిళనిద్రకు జానపదు లొక విచిత్రకథాకల్పనమును కావించిరి. రంగనాథ రామాయణమున వనవాసము ముగియు పర్యంతము తనను సమీపింపవల దని లక్ష్మణుడు నిద్రాదేవిని వేడుకొనినట్లు మాత్రము కలదు. జానపదగేయమున ఈ కథకు చిలువలు పలువలు ఎదిగెను.

రామ పట్టాభిషేక సందర్భమున నిండుపేరోలగమున
"కలకల నవ్వె లక్ష్మణదేవ రపుడు—
కలతలు పుట్టెను కపులందరికినీ
కిలకిల నవ్వె లక్ష్మణదేవ రపుడు —
కిలకిల నవ్వగా ఖిన్ను డయ్యె రాజు."

"అస్త మేతిగభస్తిమాన్''— వాక్యము వలన వివిధ వ్యంగ్యార్థములుత్పన్న మయినట్లే ఒక్క లక్ష్మణుని దరహాసముచే సభయందలి ప్రముఖులందరు స్వీయలోపములను తలంచుకొని, కించపడిరి. శ్రీరాము డాగ్రహావేశమున సోదరుని శిరము ఖండింప నుద్యమింపగా లక్ష్మణు డపుడు తనకు నిద్రాదేవికి వనవాసమున జరిగిన ఒప్పందమును వివరించి,

''కడువేడ్క అయోధ్య కనకపట్నాన -
కాకుత్సతిలకుడూ గట్టిననాడు

సేనలూ మంత్రులూ కొలువైయుండగనూ –
అపుడు తను పొందు మని పలికితి ననెను
తప్పక యొక గడియ తడబడకుండ –
తను నిద్రపొందుతె నవ్వితి ననెను"- సోదరుని త్యాగనిరతికి అచ్చెరువందిన శ్రీరాముడు తన ఆవేశమునకు చింతిల్లి యెత్తిన ఖడ్గముతో తన కంఠమును ఉత్తరించుకొనబోగా, వశిష్ఠు నామదేవాదులు రక్షించిరి. ప్రాయశ్చిత్తముగా వశిష్ఠుని ఆదేశము మేరకు లక్ష్మణుడు నిద్రించు తరి,

"పాన్పుపై గూర్చుండి శ్రీ రాఘువులు –
తమ్ముని పాదములు తొడలపైనుంచి ఒయ్యపాదములు'' పట్టిరి. మేల్కాంచిన లక్ష్మణుడు భీతిల్లి శ్రీరాముని పాదములపై వ్రాలుట, మరదంద్రను సందర్శించవలెనను శ్రీరాముని అపేక్షను సీతాశాంతలు నెరవేర్చుట, "పాలును పంచదార కలిసియున్నట్లు'' నాలుగు జంటలు సుఖముండుట మున్నగు విశేషము లిం దింకను కలవు. ఈ గేయమునందే హనుమంతుని యెడల జానపదులకు గల భక్తి ప్రపత్తులు శ్రీరాముని విందుభోజన ఘట్టమున ప్రదర్శిత మయ్యెను.

## పుత్రకామేష్టి :-

ఈ పాటను శ్రీమతి. పి. పి. బి. గోదానాయకమ్మ రచించెను. "ధరతో దీనిని యెవ్వారు- బ్రతుకమ్మ పండుగలో చదువూచు కోలలు వేసిన- సంతానము గలుగున్" అని ఫలశ్రుతి కలదు. కథ శ్రీరామ కళ్యాణ పర్యంతము, కుమార సంభవ కావ్యమున పరమేశ్వరుడు కపట వటువై పార్వతితో సంభాషించినటులే యిందు విశ్వామిత్రునితో మిథిల కరుదెంచిన శ్రీరాముడు శివధనుర్భంగమునకు పూర్వమే యుద్యాన వనమున సీతతో సంభాషించెను. ఇందింకను బాల్యమున సీత కందుకక్రీడావినోదమున తేలు సమయమున

"ఘోపాణము క్రింద పడిన-ధనుస్సు నెత్తి" బంతిని తెచ్చెను. అది కాంచిన జనకుడు "షాజ శివధనుస్సూ - ఎత్తి బాణము చేర్చువానికి – సీత" నొసంగుదు నని ప్రకటించెను. 'రాములవారి ఎఱుక'

యక్షగానమున శ్రీరాముడు ఎఱుకతయై సీతకు యెఱుక చెప్పెను. వేంకటేశ్వర కల్యాణమున కూడ వేంకటేశ్వరుడు యెఱుకతయై పద్మావతికి యెఱుక చెప్పినట్లు కలదు కదా! క్రీ. శ. 17-18 శతాబ్దముల మధ్యకాలమున అగస్త్యరాజు రామన కవి రచించినట్లుగా భావింపబడుచున్న "సీతా కల్యాణము" యక్షగానమున కూడ రాముడు ఎఱుకతగా సీతకు యెఱుకచెప్పెను. మోక్షగుండము సుబ్బయ్య కవి రచించిన సీతాకల్యాణ యక్షగానమందు కూడ శ్రీరాముడు ఎఱుక చెప్పుట గలదు.

## పాతాళ హోమము :-

రంగనాథ రామాయణమందలి రావణుని పాతాళ హోమమును వివరించు ఈ గేయమును మంథా రాయుడుశాస్త్రి రచించెను. ఇందు విశ్వకర్మ తనపుత్రిక యగు మండోదరిని వజ్రభవనమున నుంచి, భవనమును భేదించినవారి కామె నొసగుదు నని ప్రకటించెను. ప్రథమ ఫలము ఒసగు వాగ్దానము రావణునిచే పొందిన వాలి ఆ కార్యమును సాధించి, వాగ్దానము మేరకు మండోదరియందు అంగదుని పడసెను. అనంతరము రావణు డామెను వివాహ మాడినట్లు కల ఒక ఐతిహ్యమును ఆధారముగా కొని కవి యిందు అంగదుని మండోదరీ కుమారునిగ పేర్కొనెను. ఇక లక్ష్మణ మూర్ఛ వాల్మీకీయమే అయినను ఇందుగల కాలనేమి వృత్తాంతము మున్నగునవి అవాల్మీకీయములు.

"గుహ భరతుల అగ్ని ప్రవేశము" అను పాట ఉత్తమ గేయము. ఇందు రామాదులు అయోధ్య చేరిన పిమ్మట హనుమంతుడు "నా తొక్కడూ రఘురాము డుండగను, పొమ్మని పంపగా పోయె సుమి తల్లి - నే డిందరము గలము నెలతరో వినవే, క్రొత్తగలిగిన పనులు మరచితివేమొ పను లానతిచ్చె మము పంపవే తల్లి" అని కైకేయితో నర్మగర్భముగ మాటలాడెను.

"శ్రీరామ పట్టాభిషేకము" చిన్న ఘట్టమే అయినను పాట మిక్కిలి నిడివి కలది. ఇందు హనుమంతునకు లక్ష్మణుని కాపాడి

నందులకు కృతజ్ఞతగా కానుక "సంజీవి పర్వతం బెత్తిన హస్తముల సుమిత్రకడియా"లు ధరింప జేసెను.

ఉత్తరకాండ కథకు సంబంధించిన పాటలు కుశలవ కుచ్చల చరిత్రము, వేపూరి బ్రతుకమ్మ కుశలవ పాట, కుశలాయకము మున్నగునవి.

## కుశలవ యుద్ధము :-

"వరుసగ ఇది వాల్మీకి రామాయణము— తరపున వ్రాసెను ఈ కవి తాను" అని చివర కలదు. అవాల్మీకీయములగు సన్నివేశములు కలవు. కుశలవ కుచ్చల చరిత్రకును దీనికిని పోలికలు ఉన్నవి. ఇందు లక్ష్మణుడు మాత్రము కుశలవులు శ్రీరామపుత్రులను విషయమును ఎరుంగును. అందువలన అతడు ముందుగా వారివద్దకు "ఒంటరిగా పోయి రహస్య సంభాషణము చేసి" తదుపరి రణమును కొనసాగించెను. కుశలవులు హనుమంతుని బంధించి, 'ఆ కోతిని' తల్లికి కాన్క చేసిరి. ఇట్లు హనుమంతుని బంధించి సీతకడకు గొనిపోవుట పద్మపురాణమున కలదు. రాముడు అంగదవిభీషణాదులను వారికడకు రాయబారము పంపి, తనకు వాహనముగ గరుత్మంతుని ఆహ్వానింప, బాలురకు భీతిల్లిన గరుడుడు నిరాకరించెను. కథ సుఖాంతము. కుశలవులు జననీజనకుల నామధేయములు ఎరుగుదురు. రామ కుశలవుల సంభాషణ మిందు ఆసక్తిదాయకముగ చిత్రింపబడెను. రాముడు వారితో "పట్టర బాలురం బాణల తొడిగితి— తలచుకోర నీ దైవములను" అనగా వారు "తల్లినైన తలచి మ్రొక్కుటకు— తగినటువంటి తల్లులె కారు— అడవుల కంపిన అమ్మలు లేరు" అనియు, శ్రీరాముడు వారి శౌర్యమునకు అలరి "ఎన్ని తపంబులు చేసి కందురో — ఎన్నగ మీవంటి తనయులు కల్గ" ననగా "తపములు జపములు చెయ్యగలేదు — పుత్రకామేష్టులు జెయ్యగలేదు" అని అవహేళనము కావించి, చివరకు రాముడు అస్త్రము ప్రయోగింపగనే "అదురుతు బెదురుతు — మ్రొక్కె బాలలు బాణంబునకు —

మేమే రవికులమున పుట్టితిమా - రాకే మాపైకి రామబాణమా - రక్షించి కృపజూడు" మనిరి. "తనుజులమీద వేసిన పిమ్మట - మళ్లేను శరము మహిమలకొలది - తన శరము తనకు తిరిగినను - ధరణిపై నొరగిరి శ్రీ రాఘవులు - జనములు అల్లతల్లాడి బొడి"చెను. అనంతరము రాముడు బ్రహ్మ, ఇంద్ర, శంకరులను సాహాయ్యముగ ఆహ్వానింప సరస్వతి, శచి, ఉమలు వారిని అభ్యంతరపెట్టి బాలుర రక్షణార్థము తాము ఏతెంచిరి. వారే రాయబారములు నిర్వహించిరి. రాముడులు తమకు మ్రొక్కిన యుద్ధ విరమణ కావింతుమని పల్క, మార్గాంతరము కానరాకున్నందున శ్రీరాముడు హృదయమున గురువుల స్మరించి, వారికి నమస్కరించెను. ఇది విజయనగర రాజులు తమ సింహాసనముపై ఖురాను గ్రంథము నునిచి తురుష్కులచే వందనముల స్వీకరించినరీతిని ఉన్నది - అని డా॥ బి. రామరాజుగా రభిప్రాయపడిరి. సీతారాముల సమాగమము తదుపరి మరికొన్ని చిత్రములు వర్ణింపబడెను. కాని అవి అనౌచితీదోషదూషితములుగా నుండును. కాని ఇందు సీతాదేవిఎడ కుశలవ కుమారులకు గల మాతృభక్తి, తమ్ముతపులపాల్జేసిన శ్రీరాముని కృత్యమునకు క్రుంగిపోయిన వారి ఆత్మాభిమానము, సమాజమున సీతాదేవికి పునః ప్రతిష్ఠార్థము వారు ఒనర్చిన కృషి గమనీయాంశములు. వీరి అద్భుత కరుణ శృంగార రసముల మేళవించి ఉత్తరకాండ గాథను కుశలవ యుద్ధముగా జానపదులు రూపొందించిరి.

## కుశలాయకము :—

రామాయణ, విచిత్ర రామాయణములను ఆధారముగ స్వీకరించి ఈ గేయమును రచించినట్లు కవి రామచంద్రరాజు పేర్కొనెను. పద గుంభనముచేయ సమర్థుడయ్యును "కంఠినము లుంచితె కాపులకు తెలియదని, మరుగులుంచుటే మాని మాటలుంచె"నట! శ్రీరామ జననము నుండి రావణ సంహారమువరకు గల కథను సంక్షిప్తముగ వర్ణించి, పట్టాభిషేక మాది స్వర్గారోహణ పర్యంతము సుదీర్ఘముగా కవి వర్ణించెను. చిత్ర రామాయణాధారముగ వ్రాయుటచే ఇందు పెక్కు విచిత్ర

కల్పనలు కన్పట్టును. శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి నాటకమందు కూడ యిట్టి విచిత్ర సన్నివేశములు కలవు. దేవతల ఆదేశము ననుస రించి సరస్వతి చాకితయై అపవాదమును సృష్టించెను. వాల్మీకి జాన కిని జనకుని గృహమునకు కొనిపోవుచుంత మధ్యేమార్గముననే కుశ లవులు జన్మించిరి. సీతాకుశలవులు వాల్మీకి ద్వితీయముగా జనకు నింటనే నిలిచిపోయిరి. ఇందు సీతాభూప్రవేశ మున్నది. గేయమున వర్ణనలు అచ్చటచ్చట ప్రబంధరీతిని కావింపబడెను.

"కుశలవ కుచ్చల చరిత్రము అనుగేయముపై రెండు పాటల కలయికగా పేర్కొన వచ్చును. ఇందు విలక్షణములగు అంశ ములు మరికొన్ని కలవు. సీతను పరిత్యజించవలదని ఊర్మిళాదులు శ్రీరాముని వేడుకొందురు. ఈ సందర్భమున పరస్పరావహేళనాత్మక మున సంభాషణము అత్యద్భుతముగ వ్రాయబడెను.

ఉత్తరకాండ కథను వివరించు గేయములందు పైన పేర్కొని నవి కొన్ని మాత్రమే. ప్రజాదరణము పొందిన గేయములు ఇంకను అనేకములు కలవు.

ఇక కేవలము సీతాదేవిని ఆధారముగాగొని రచింపబడిన పాటలు పరిశీలించిన అం దధికభాగము, ప్రతి గృహమునందు నిత్యము జరుగు సంఘటనలే సీత పరముగా వర్ణింపబడినట్లు విశదమగును. వీటియందు "సీతాదేవి యానవాలు పాట" అత్యంత మనోహరమయి నది. సీతాన్వేషణ సమయముగ శ్రీరాముడు హనుమంతునకు సీతా దేవి గుర్తులు వివరించుట, మరలివచ్చిన పవనాత్మజుడు సీతా శిరో రత్నము స్వామికి సమర్పించుట ఇందలి యితివృత్తము. ఇందు శ్రీరాముడు సీతాసౌందర్యము వర్ణించిన ఘట్టము జానపద వాఙ్మయ మందే కాకుండ సకల ప్రపంచ శిష్టవాఙ్మయమునకే తలమానికమై అలరారుచుండును. సీత "తలఅంటు ఆడకే ఆడినట్లుండు – పచ్చి పసు పలదకే అలదిన ట్లుండు–పెట్టక కాటుక పెట్టినట్లుండు – దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు – అలదక పరిమళ మలదినట్లుండు – మసి పాతగట్టిన మాణిక్యంబు వలెను – సీతాకాలమునాటి ఉదకము

వలె ఉండునట! ఒకనాడు సీత అలంకృతయై ''అద్దములోపల అతివ తనరూపు'' చూచి, ''ఇంత చక్కనిదేవి యిది యెవ్వరనుచు" భ్రమసి ''ఏకపత్నీవ్రతుడవని ఇచ్చె మా తండ్రి - ఇట్టి మాయల సతిని పిలిపింప దగునా''- అని శ్రీరాముని ప్రశ్నించెను. ఆమె మౌగ్ధ్యమునకు ముగ్ధుడైన శ్రీరాముడు ''పతిలేని సతి జూచి అట్లనుకొంటివే గాని ఆమె పతిని కూడ పిలిపించె''ద నని తాను సీత ప్రక్కగా నిలువబడి ఆమె సంశయ నివారణము కావించెను. మరియొకతరి, చిత్రకూట సమీపమున స్నానార్థము"పచ్చి పసు పలదుకొని పద్మాయతాక్షి, కొలని దగ్గర కెళ్ళె గోవిందుదేవి" కాని సరోవరమున తన ముఖబింబమును కాంచి "మింట చంద్రుడు వచ్చి ధరణి నున్నాడు-కొలనిలో తుమ్మెదలు ఆడుచున్నవి"-అని వెనుతిరిగి వెళ్ళి, చంద్రుని,తుమ్మెదలను పారద్రోల శ్రీరాముని తోడ్తెచ్చెను.సరోవరమందలి చంద్రుడు, తుమ్మెదలు ఆమె ముఖబింబము, ముంగురులే అని రాముడు సంశయ నివారణము కావించెను. అతిశయోక్తులె అయినను భ్రాంతిమదలంకారమునకు శిష్టవాఙ్మయమున నైనను ఇటువంటి మనోహరమగు ఉదాహరణము కానరాదుకదా! ఇది అలంకారముగా కానరాక మాయాశబలితమగు చిచ్ఛక్తిని స్ఫురణకు తెచ్చును. శ్రోతలను భావాంబరవీధిని విహరింపజేయు ఇట్టి మనోహరవర్ణనలు ఇం దింకను కలవు

'సీతాకల్యాణ' గేయమున సీత శివధనుస్సు నెక్కిడుట విశేషము. బాల్యమున సీత శివచాపముతో ఆడుకొనుచుండగా పరశురాముడుతిలకించి ఆమెను శక్తిస్వరూపిణిగా గుర్తించినట్లు కలదు. భాష, భావము, నడక కల్పనలలో జానపదత్వము వెలార్చు 'మాయలేడి కోలాటము' పాట నిక్కమయిన జానపదగేయము. పెండ్లి పాటలు సీతారామ పరముగా పెక్కు కలవు. నిత్యజీవితమందలి సంఘటనములే వారి పేరున అవతరించెను. సీత నత్తవారింటికి పంపుట, సీతగడియ, అలుక, సీతాదేవి వేవిళ్ళు, సీత వసంతము— ఇత్యాదులు ఇట్టివే, 'సీతాదేవి వామనగుంట లాడు' పాటయందు వినయశీలము కలిగిన కులవధువు చిత్రితమయ్యెను. 'సీతమ్మవారి అలుక' గేయమున అలిగిన సీతకడకు శ్రీరాముడు చిలుక రాయబారము పంపును. భాస్కర రామాయణమందలి సుందరకాండ ఆధారముగా శాపగోపా

లుడు రచించిన "సుందరకాండ పదమున" విప్రలంభశృంగారము వర్ణింపబడెను. 'కోవెల రాయబారము' పాటలో కూడ సీత తన హృదయావేదనను కోయిలకు వివరించి చెప్పి, శ్రీరాముని తోడ్కొని రాగోరెను. ఇచ్చట కాళిదాసాదుల మేఘ, పవన, హంస, కీరాది దూత కావ్యముల ఛాయలతో నివి సొబగు గొల్పుచుండును.

పనగాడ సన్యాసి అనునతడు రావణునికన్న అధికబలశాలి యగు రాక్షసుని కల్పించి "శతకంఠ రామాయణము" రచించెను. శతకంఠ రామాయణము అను ప్రబంధము, యక్షగానముకూడ కలవు. దశగ్రీవుని సంహరించిన శ్రీరామునిపై ప్రతీకారమునకై సముకట్టి ప్రతాపలంకా పట్టణాధీశుడగు శతకంఠుడు ఘోరతపమొనర్చి, బ్రహ్మచే వరములను పొందెను. కాని కణ్వుని పెంపుడు కుమార్తెను చెరపట్టి 'స్త్రీచే మృతుఁడగుదువు' అను కణ్వముని శాపముచే, "నిస్సారబుద్ధిచే నెలతచే చావు. తను బొందకుండంగ తా నడుగడాయె!"– మహర్షులచే శతకంఠుని ఘాతుకకృత్యములను, మరణ రహస్యమును గ్రహించిన శ్రీరాముడు 'ఆదిశక్తి సీతాద్వితీయుడై దాడివెడలెను. విభీషణుని రాక్షసబలము, సుగ్రీవుని వానరబలము వారికి తోడైనవి- ఆంజనేయుడు విశ్వరూపము దాల్చి శ్రీరాముని సైన్యమును ప్రతాపలంక చేర్చెను. రణరంగమున సీత శతకంఠరావణుని హతమార్చెను. ఇందు సీతయుద్ధము సత్యభామా నరకాసురుల యుద్ధమును స్ఫురింపచేయును. అది మానవుని పామరత్వము, అనంతమయిన ప్రకృతి ఎడ అతడికి గల మనోభిప్రాయములను ఈ అభూత కల్పనలు సూచించును. సౌందర్యలహరియందు శంకరుడు శక్తికే సర్వశక్తిత్వ మొసగిరి. "శివః శక్త్యాయుక్తో యదభవతి శక్తః ప్రభవితుమ్" అని కదా! 'శక్తి' సంపర్కము లేనిపురుషునకు పురుషత్వము వినా కార్యసామర్థ్యముండదు. పరతత్త్వమును స్త్రీగా సంభావించుట భారతీయ సంప్రదాయము. శతకంఠ రామాయణమువంటివి ఇంకను కలవు.

ఈ విధముగ ఆంధ్రుల జీవన వ్యవహారములకు, మనోభిప్రాయములకు ప్రతిబింబములుగా వెలసిన జానపద వాఙ్మయమందలి రామాయణ కథలు, పాటలు అత్యధికము అవాల్మీకములే. ఇవి అను

శ్రుత రామాయణములకు రూపములుగా వెలసిన వనుట సాహసము కానేరదు. ఓఢ్రభాషయందు విచిత్ర రామాయణము ఒకటి కలదు. అది తెలుగులోనికి మూడు విధములుగ అనువదింపబడెను. పై రామాయణ గాథలు అటువంటి వివిధ రామాయణములనుండి ఉత్పన్నమై ఉండవచ్చును. కాని రంగనాథ రామాయణాదులు వెల సిన కాలమునకు ఓఢ్రమునుండి గాని మరి ఏ అన్యభాషలనుండి కాని అనువాదములు ప్రారంభమయినట్లు కానరాదు కనుక ఈ గాథలు, విచిత్రకల్పనలు తెలుగుసీమలం దుద్భవించినవియే అనతగును. రంగనాథ రామాయణకర్త లీగాథలను జనశ్రుతినుండి కాని, చిన్న విగా ఉండిన 'సకల పురాతన చారుగీతముల'నుంచి కాని స్వీకరించి యుండవచ్చును. ఈ గేయములందు పేర్కొనబడిన ఆటల పేరులు, అలంకారములు, వరవిశేషములు మున్నగునవి నేటికిని అములులో కలవు. శ్రీరామ పట్టాభిషేకములోని "నిండ గంగాజలము నిలిపి యాగూన అమర్చిన కుందనపు భమిడి కుండకముతో నుంచి అమర్చిన ఘడియారము" ఆంధ్రదేశమున జైమిని భారతమునాటికి అములులో కలదు. అయినను వీటికాలమును నిర్ణయించుటకు అభ్యంతర సాక్ష్యము అధికముగా కానరాదు. త్యాగరాజస్వామి ప్రతాపవరాళి కీర్తనయందు "సీతా రమణితో ఓమనగుంటలాడి గెలుచుటచేత... నిజమగు ప్రేమతో బిల్చుకొన్న ముచ్చట వాతాత్మజ భరతులు విన్నటుల విన నాస గొని యున్నానురా" అనెను. ఇది సీతాదేవి వామనగుంటలాట ప్రసక్తిగా భావింపవచ్చును. తంజావూరు, సరస్వతీ మహల్‌లో కాని, దాక్షిణా త్యాంధ్రుల వ్యవహారములలో కాని కథల పాటలు కానరాకుండుట వలన ఈ 'వామనగుంటలాటపాట' ఆంధ్రులు దక్షిణాదికి వలస వెళ్ళిన పదునారవ శతాబ్దమునాటికే రచింపబడి, వారితో దక్షిణాదికి తరలి నట్లు భావింపవచ్చును. ఈ వాదము సత్యమే అయిన రామాయణ కథా గేయములు కొన్ని పదునారవ శతాబ్దమునకే ప్రచారమున ఉన్న టులు స్వీకరింపవచ్చును.

ఈ పాటలన్నియు "సద్యఃపర నిర్వృతయే, శివేతర క్షతయే, కాంతా సమ్మితతయా ఉపదేశయుజె"- అను మూడు ప్రధాన ప్రయోజనము

లతో జానపద వాఙ్మయమున ప్రభవించినట్లు భావింపవచ్చును. ఏ కథ యందును శిష్ట వాఙ్మయమందు వలె వర్ణనల వలన సన్నివేశము పొడిగింపబడుట కానరాదు. సన్నివేశ బలముచే ఈ గేయములు పఠిత మనసును ఆకర్షించును కాని కవి, లేక రచయిత వలన కాదు. దండి కావ్యాదర్శమున "దేశ కాల కలా లోక న్యాయ విరోధినః" అని కావ్యదోషములను పేర్కొనెను. తమను మేల్కొలిపిన లక్ష్మణునితో ఊర్మిళ "పరసతిని కోరిగాదా రావణుడు మూలముతో హతమాయెను" అనెను. గాఢసుషుప్తియందున్న ఆమెకీ విషయ మెట్లు పరిచితమో అనూహ్యము. పద్మమున లభించిన సీతను కాంచి మండోదరి "అది విష్ణుని సతి! అవతార మెత్తింది, రామసతి పుట్టింది!"– అనెను. శ్రీరామునకు జోలపాడు ముత్తైదువలు॥ "బాలుడై వెలసెను బాలకృష్ణమ్మ" అనిరి. నాగరకుల కావ్యములలో ఈ 'దోషములు' సమాధేయము లగునట్లే జానపద కావ్యములందుకూడ కల్పనా మూలకములగుటచే వీటికి సంపూర్ణముగ దోషత్వముకూడ సందేహాస్పదమే. అస్పృష్టమగు ప్రబంధ మింతవరకు వెలువడలే దనుట అతిశయోక్తి కానేరదు. జానపద సాహిత్యమున ఇటువంటి 'విరోధములకు' ఒక విశిష్ట స్థానము కలదేమో!

ఈ గేయములందు వ్యావహారిక భాషకే ప్రాధాన్య మొసగబడెను. దేశిసారస్వతమున కన్నట్టు అన్నెకారి, పణతి, చదురు. తబుకు, అసురుసురు, శలగ– వంటి పదములు, ఉనకతోక, రత్నమేడలు, కనకపీటలవంటి వైరిసమాసములు, తోకవాలము, దండనమస్కారాలు, సింహాసన గద్దె– వంటి ఆమ్రేడితములు, రాము, వశిష్టు, శత్రుఘ్ను, అనెట్టి, చెప్పండి, తలుపేసి, వెండియకాగులు, చిన్నీయ పోన్నీయ వెండయ్యా చాకలా భమిడయ్యా లేడివంటి పదములు– ఈ గేయములకు వింతసొబగును సమకూర్చెను. ప్రౌఢులకు సాక్ష్య మగు గణవృత్తములలో ఈ 'కావ్యములు' అవిర్భవించలేదు. సారళ్యము, వేగము, లయలను మేళవించుకొను ఛందమున ఈ జానపద వాఙ్మయము పర్వెత్తుచు సహృదయులను ఆనంద పరవశులను కావించును. యతి ప్రాసనియమములు ఈ గేయములందు

ఛాందసముగా పాటింపబడలేదు. సాహిత్యదృష్టితో జానపద సాహిత్య సీమ నాగరక సాహిత్య పరిధులను మీరియుండును.

ఇంతవరకు చర్చించిన గేయములు జానపద రామాయణ మహార్ణవ మందలి కొన్ని అణిముత్యములు మాత్రమే. స్థలాభావము వలన విస్తరింపబడుట లేదు. జానపద గేయ సాహిత్యమందే చేర్పతగిన రామదాస కీర్తనలు మున్నగునవి 'సంకీర్తనములందు రామకథ' ప్రకరణమున, యక్షగానము, బుర్రకథ మొదలగు ప్రక్రియ లాయాప్రకణములందును వివరింపబడును.

# సంకీర్తనము–రామకథ

"శిశు ర్వేత్తి
పశు ర్వేత్తి
వేత్తి గానరసం ఫణిః"

సృష్టి స్థితి లయాత్మకమైన ఓంకారనామమే పరబ్రహ్మ స్వరూపము. యుగములు మారినను, మానవుని సజీవచైతన్యమునకు ప్రతీక అనదగిన గానము పాతక్రొత్తల మేలుకలయికతో అంతర్వాహినిగ సాగే సంగీతము జాతి నాగరకతకు, సంస్కృతికి దర్పణమువంటిది. ఆధ్యాత్మిక భావలయాన్వితముగ ప్రపంచ సంగీతముననే విశిష్టస్థానము భారతీయ సంగీతమునకు కలదు. ఆదికావ్యమగు శ్రీమద్రామాయణము

"పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్
జాతిభిస్సప్తభిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్
..........................................
తౌతుగాంధర్వ తత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థానకోవిదౌ
భ్రాతరౌ స్వరసంపన్నౌ గంధర్వా వివ రూపిణౌ
బింబాదివోద్ధృతౌ బింబౌ రామదేహా త్తథా పరౌ"–

(బాల. స. 4. శ్లో-8-10)

ఆంధ్ర సంగీత ప్రపంచమున ప్రథమముగ రామదాసును పేర్కొన వలెను. రామదాసుకు పూర్వము సంగీతజ్ఞులు కలరు. కాని రామకథకు సంబంధించి ప్రఖ్యాతి వహించినవారిలో రామదాసును పేర్కొనవలెను. కబీర్ మున్నగు ఆంధ్రేతర రామభక్తుల ప్రభావము తెలుగువారి పైనను ప్రసరించెను. శ్రీరామభక్తాగ్రేసరుడుగ మాననీయుడయిన కంచెర్ల గోపన్నకు 'రామ తారక' ముపదేశించి

నది కబీరు మహాశయులే. సంగీతములో రామకథా పరిశీలనమును రామదాసు కీర్తనలతో ప్రారంభించుట యుక్తము. సంగీత ప్రపంచమునకు మూలవిరాట్టు లనదగిన నారాయణతీర్థ, సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్య, కబీరులకు రామదాసు సమకాలికుడు. ఇట్లు క్రీ. శ. 16 వ శతాబ్దియందే పలువురు వాగ్గేయకారు లుద్భవించుటయే కాకుండ, యక్షగాన ప్రక్రియకూడ వికసింప నారంభించెను. క్షేత్రయ్య పదములు మున్నగు శృంగారాత్మక రచనలు కూడ మధుర భక్తిశాఖకు చెందినట్లుగ పరిగణింపబడినందున, ఆంధ్రుల సంగీతము ముఖ్యముగ భక్తిప్రధానము అని చెప్పతగును. త్యాగరాజాది వాగ్గేయకారులు భక్త్యాత్మకముగ కీర్తనలు రచించినను, భక్తిశాఖలుగ వివిధ రసములను ఆయా పట్టుల స్వీకరించిరి. సంగీత ప్రపంచమున రామకథకు అత్యధిక స్థానము కలదు. భక్త రామదాసు మొదలుకొని అత్యాధునికకవివరకు రామకథాలహరిలో తెలుగు ప్రజలను ఓలలాడించిరి. ప్రథమ సంకీర్తనాచార్యుడైన తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనలలో "బ్రహ్మ కడిగిన పాదము" అను కీర్తనయందు అహల్యాశాపవిమోచన సూచనము కలదు.

## రామదాసు కీర్తనలు :-

ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్రమున పేర్కొనబడినట్లు "శ్రీరామ నవమి నవరాత్రులలో రామదాసుభజన కీర్తనలను గానంచెయ్యని భజన కూటమిగాని, భజనకూటమి లేని రామ మందిరముగాని, రామ మందిరము లేని గ్రామముకాని, నగరముకాని ఆంధ్రదేశంలో కానరాదు." [1] జనపదములందు రామగేయము లున్నను రామదాసు కీర్తనలు పండిత పామరజనైకవేద్యములై ఆంధ్రులకు శ్రీరాముని "తమ యింటి" దైవమును గావించెను.

భద్రాచల రామదాసు కీర్తనలను మూడు విధములుగ వింగడింపతగును.

1. చెరసాల జీవితమునకు పూర్వము రచించినవి.

---

1. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము–'రజని'

ఇవి శ్రీరామ మహిమాత్మకములు.

"శ్రీరాముల దివ్యనామము" —(సావేరి రాగం)

"రామా రారా సీతా" (ఆనందభైరవి రాగం)

—మున్నగునవి.

2. చెరసాలయందు రచించిన కీర్తనలు : ఇవి కరుణరసోన్మీలనములు-

''ఏడనున్నాడో'' -(నాటకురంజిరాగ కీర్తన).

''ఇక్ష్వాకుకుల తిలక !"– (కాంభోజిరాగ కీర్తన) -మున్నగునవి.

3. విముక్తుడయిన పిమ్మట రచించినవి. వీటియందు శ్రీరాముని యెడల ఒక స్థిరమయిన నమ్మకము, ఇనుమడించిన ఉత్సాహము కనిపించును.

"ఓరామ నీనామ మేమిరుచిరా !''- పూర్వి కళ్యాణి రాగము.

"అంతా రామమయం బీజగమంతా రామమయం"!- శ్రీ రాగ కీర్తన.

—ఇత్యాదులు.

రామదాసు కీర్తనలందు ఆనుపూర్విగ కథాక్రమము కానరాదు. స్తోత్రములందువలె కథాంశము లెడనెడ సూచితమగుచుండును. కవి నిష్కపట మానసమును, సత్యమును వ్రాకుచ్చు స్వభావము వీటియందుగోచరమగు చుండును. భద్రాచల ఆలయ నిర్మాణ ఫలితముగ చెరసాల జీవితము అనుభవించు పట్టున రామదాసు వాణి శ్రీరామ నామ కీర్తన మొనరించు నెడ నిష్ఠురత్వమును కూడ ప్రదర్శించెను. తాను ''సీతమ్మకు చేయించిన చింతాకు పతకము'' మున్నగునవి స్వీకరించిన శ్రీరాముడు ''కలికి తురాయి'' ధరించి "కులుకుచు తిరుగు''టయేకాని, ఆర్తరక్షణ పరాయణత్వమును విస్మరించె నని "ఎన్నగ శబరి యెంగిలి భక్షణము జేసినట్టి వ్యభిచారివి నీవు నిన్ను నమ్మగరాదు –

నిన్ను దైవ మనగరాదు నిజము నామాట" అని నిష్ఠురోక్తు లాడెను. సంగీతప్రపంచమున మధురభక్తి ప్రధానస్థానము నాక్రమించినను, పదకవితకు ప్రసిద్ధి నొందిన క్షేత్రయ్యకు సమకాలీను డైనను రామదాసు కీర్తనలందు మధురభక్తి భావములు కానరావు. హనుమంతుని వలె రామదాసుది దాస్యభక్తి. అచంచలభక్తి అనర్గళకవితాధార కల రామదాసునకు సంగీతాభినివేశము అజన్మసిద్ధ మయ్యెను. కీర్తనలు భక్తిసాధనకు ఉపయుక్తములు కాని పాండిత్య ప్రకర్షనోద్దిష్టములు కావని చెప్పవచ్చును. ఇందలి సంగీతము స్పష్టలయాన్వితమై సూటియగు భావస్ఫురణముతో సామాన్య ప్రజానీకమునకు గూడ అందుబాటులో ఉండును. సంస్కృతసమానప్రయోగ మున్నను కీర్తనలు ద్రాక్షాపాక శైలిలో సర్వజన సుబోధకములు. సంస్కృత సమాసముల ప్రక్కను తెలుగు నుడికారపు చరణములు కూడ వ్రాయబడుట విశేషము. 'రామదాస', 'భద్రాచలవాస' 'భద్రాచల', 'భద్రగిరి', 'భద్రాది', 'భద్రశైల' -ఇత్యాది ముద్రలు ప్రయోగింపబడెను. 'అడియెక', 'తిరువడిగళే'- వంటి తమిళ పదములు 'అనచెట్టినవి', 'రాతి నాతిగ' వంటి కీర్తనలందు కన్పట్టును.

"ఎంతో మహానుభావుడవు – నీవు యెంతో చక్కని దేవుడవు
వింతలు చేసితి వీలోకమందున – సంతత భద్రాద్రిస్వామి
రామచంద్ర
తొలివేల్పు జాంబవంతుని జేసినావు
మలివేల్పు పవనజుగా జేసినావు
వెలయ సూర్యు సుగ్రీవుగ చేసినావు
అల సర్వసురల కోతుల జేసినావు ॥ఎంతో॥
—కీర్తనయందు కథాంశము సూచితము.

"ఇక్ష్వాకుకులతిలక యికనయిన పలుకవే రామచంద్రా ॥
నన్ను రక్షింపకున్నను రక్షకు లెవరింక శ్రీరామచంద్రా" ॥
—కీర్తన బహుజన వ్యాప్తి నొందెను.

"శశిధరపూజిత – రామ" అని పరమేశ్వరుడు శ్రీరాముని పూజించుటను అధ్యాత్మరామాయణ భావము రామదాసు కీర్తనలందచ్చటచ్చట కన్పట్టును.

## త్యాగరాజ కీర్తనలు :—

''వ్యాసోనైగమ చర్చయా - మృదుగిరా వల్మీకజన్మామునిః
వైరాగ్యే శుక ఏవ భక్తి విషయే ప్రహ్లాద ఏవ స్వయం
బ్రహ్మా నారద ఏవచా అప్రతిమయోః సంగీత సాహిత్యయోః
రామామృతపాన నిర్జిత పా నిర్జితః శివః [1]

అని సంగీత శాస్త్రజ్ఞుల మనన్న లందిన శ్రీ త్యాగరాజు కీర్తనలు రామాత్మకములగు కీర్తనలందు ప్రథమ స్థానమును ఆక్రమించును. ''నాదసుధారసం బిలను నరాకృతి ఆయెను'' కాన ఆత్మ అనదగిన కోదండమునకు గల ఆరు ఒక గంటలే సప్తస్వరములుగాను, అనగా రాగము కోదండముగాను, దుర (నయ) దేశ్యములనెడి రాగ భేదముల శైలియే త్రిగుణములు లేక కోదండపు ముప్పేట గల నారిగాను నిరత గతి లేక యయగతి (చతురస్రము) శరములుగా, సరసములైన సంగతులే శ్రీరాముని సందర్భోచిత ప్రసంగములుగా "శోభిల్లు సప్త స్వరముల" శ్రీరామ కథాగానము గావించుటే మోక్షమని భావించి కర్ణాటక సంగీత ప్రపంచమునే రామమయము కావించిన మహనీయుడు త్యాగరాజస్వామి. మత సంప్రదాయ భేదములను విస్మరించి, శ్రీరాముని "నిగమ శిరోర్థము గల్గిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో, సొగసుగా మృదంగ తాళము జతగూర్చి చొక్కజేయు ధీరు''డే ఇలలో ధన్యుడని త్యాగరాజు భావించెను. "శంకర నారాయణ విధులు, వేదోద్ధరులు, వేదాతీతులు, మంత్రాత్ములు, యంత్రతంత్రాత్ములు, గానవిలోలురు, స్వతంత్రులై నాదోపాసన చేసి వెలసిరి." కావున ఇష్టదైవమగు శ్రీరాముడు నాయకుడుగ అట్టి నాదోపాసనమునకు ఆయన ప్రయత్నించెను.

వాల్మీకి ఇరువది నాలుగు వేలశ్లోకపర్యంత రామాయణమును త్యాగరాజు ఇరువది నాలుగు వేల కీర్తనలుగా రచించెనను ప్రతీతి కలదు కాని నేడందు కొన్ని వందలు మాత్రము లభ్యమగుచున్నది.

---

1. వాలాజీపేట వేంకటరమణయ్యర్ భాగవతార్ శ్లోకము.

శ్రీరామునిపై భక్తిభావ ముప్పొంగినప్పుడు కలిగిన అనుభూత్యావేశములలో వివిధ రీతుల కీర్తనలను త్యాగరాజు అధికముగా వ్రాసినట్లు విశదమగును. వీటి నన్నింటిని కలిపి మొత్తముగా "మహాకావ్య" మనుట సమంజసము. సకల దేవతలు శ్రీరాముని మూర్తులుగనే ఏకోపాసన మొనర్చిన త్యాగరాజు కీర్తనలయందు దాయా సందర్భములలో రామాయణ ఘట్టములతోపాటు, భారత భాగవతాది పురాణేతిహాసములలోని సన్నివేశములను కూడ వర్ణించెను. త్యాగరాజు కీర్తనలం దధిక భాగము రామకథాత్మకములు, ఇతర కృతులు శ్రీరామ స్తోత్రాత్మకములు. విష్ణువునకు పర్యాయపదముగ శ్రీరామనామమే స్వీకరింపబడెను. వ్యంగ్యము, నిందాస్తుతి రూపమున కూడ శ్రీరామ వైభవము వర్ణించి రామాయణపాత్రలను మానవహృదయభావములతో సారూప్యము నేర్పరుప ప్రయత్నించెను. చంద్రజ్యోతి రాగమున,

"శశివదన భక్తజనావన
పసితనమునందే ముని యాగమున నీ బాహు పరాక్రమము
నెరుగవా
దినదిన మౌపోసన జపతప ధ్యాన మను యాగమువేళ
మనసున బుట్టిన ఘనదంబుని తోడను మారీచుని" -అని

వర్ణించుపట్ల శ్రీరామకృత విశ్వామిత్ర యాగ రక్షణము మానవుని అంతఃశత్రువులతో పోరాట మనెడి హృద్యంగమ మగు సాదృశ్యమును చేకూర్చి, రామాయణము మానవుని ఆత్మరామాయణముగా నిరూపింప యత్నించెను.

సుగ్రీవునకు, లంకేశుని సోదరుడగు విభీషణునకు అభయ మొసంగిన శ్రీరామ కారుణ్యము పెక్కు కీర్తనలందు వర్ణింపబడెను. ఈ రీతిగనే అహల్య, శబరి, గుహుడు, భరద్వాజాది మహర్షులు శ్రీరామ దయా పాత్రులగుట వర్ణించు పట్టుల త్యాగరాజు వాక్కు సుధను వర్షించెను. అతిసామాన్యులగు వానరుల యెడ రాముని సౌహార్దమును కరుణారసోద్వేలముగ వర్ణింపబడెను. "పేరపేర బిల్చి హారములు మీ రొసంగలేదా - అలనాడు అన్న మారగించువేళ బలువానరుల బంక్తి నుంచలేదా?" అనుటలో రంగనాథ, జానపద వాఙ్మయము లం

దలి సన్నివేశములు స్ఫురించును. ఈ రీతిని శ్రీరామ జననము నుండి పట్టాభిషేకము వరకును గల కథయందలి సుందరములగు సన్నివేశములు ఎడనెడ పేర్కొన బడుటయే కాక భారత భాగవతాది గాథల యందలి ఘట్టము లెన్నియో శ్రీరామ కథతో అభిన్నముగా వర్ణింపబడుట ఈ కీర్తనలయందలి మరియొక విశేషము.

"రసో వైసః" అను శ్రుత్యనుసారముగ త్యాగరాజు నవరసము లను శ్రీరామ తారకబ్రహ్మమందు పర్యవసింపజేసి రససిద్ధుడైన మహానుభావుడు. ఈ కీర్తనలందు కథావృత్తము క్రమముగ లేనం దున రస నిరూపణము కష్టతరము. అయినను పరిశీలనమున శృం గార హాస్య కరుణాదులు అంగములుగా పరమ శాంతమగు భక్తితో పరిపూర్ణత్వమును కాంచినట్లు తెలియును.

అనురూపుడైన పతికై వేచియుండు కన్యకా ధర్మమును తన యందారోపించుకొని త్యాగరాజు "చెట్టబట్టని నాభీతి బొట్టు కట్టని కన్య రీతి" అని మిక్కిలి సరసముగా రామ సాహచర్యము నర్థించెను. "మేరు సమానధీర"లో కొంచెము ప్రౌఢత్వము, "రామరామ రామరామ రారా సీతా – సతతంబు పదముల నర్చింతు – తొడరి మేనొసగి తపల ననుతు"– కీర్తనలో ఉత్తమ గృహిణీత్వమును ప్రదర్శించెను. ఈ రీతి ఒక్కొక్క తరి తనయందు నాయికాభావము, మరియొక తరి ఖండిత నాయికా భావము, మరియొక తరి విప్రలంభమును కూడ త్యాగయ్య తనయం దారోపించుకొని శ్రీరాముని సేవించెను.

"కనికరము కాంతపై గలిగి ముద్దిడువేళ
జనకజ నామాట సమయ మని బల్కితే"– కీర్తనలు అన్నమా చార్యులవారి కీర్తనను స్ఫురింపజేయును.

"బంగారు మేటి పాన్పుపై భామామణి
జానకి శృంగారించుకొని చెలువొంద
నిన్ను కని పొంగుచు మల్లె విరుల
పూజించువేళ శ్రీహరి సంగీతము పాడుమను
సామి త్యాగరాజునితో"– సీతారాముల శృంగారము ఇత్యాది

కీర్తనలందు లలితముగ చిత్రింపబడెను "కనికరము కాంతపై గలిగి...." కీర్తన నను బ్రోవమని చెప్పవే.... ప్రక్కను చేరుక చెక్కిలి నొక్కుచు చక్కగ మరుకేళి బొక్కియుండేవేళ ...'' అను రామదాసు కీర్తనను కూడ పోలియుండును.

''రామా యని చపలాక్షులకు పేరు

రామా యని బ్రహ్మమునకు పేరు కనుక" తెలిసి రామచింతన చేయుమని హెచ్చరించి "నాన్యఃపంథా అయనాయ విద్యతే" అను రీతి జ్ఞానపురస్కృతమయిన భక్తి అత్యవసర మనిరి.

త్యాగరాజు కీర్తనలందు ముక్తపద గ్రస్తములు ఉత్ప్రేక్షాది అర్థాలంకారములు, యమకాది శబ్దాలంకారాదులు మున్నగునవి పెక్కు కలవు. ఏ ప్రబంధ కవులు కూడ ప్రయోగింపని జాతీయములు, సామెతలు త్యాగరాజు కీర్తనలందు అధికముగ కన్పట్టు చుండును. "రూకలు పదివే లున్న చేరెడు నూకలు గతిగాని ఓ మనసా!" ''కోకలు వెయ్యున్న కట్టుకొనుట ఒకటేగాని"— ఇత్యాదులు.

త్యాగరాజు వేషభాషలు దాసకూటమికి చెందిన పురందర దాసుల వారిని పోలినట్లే కీర్తనలందు కూడ వారి నీతి వైరాగ్య భక్తి భావములు గోచరించును. "అలక లల్ల లాడగ గని", "ముద్దు మోము ఏలాగు చెలంగెనో'' మున్నగు కీర్తనలందు పురందరదాసులవారి "అశోమా న్యోతకొరంగా దృష్టితాకితేని నగే" మున్నగు కీర్తనలతో సాదృశ్యము కన్పట్టును.

త్యాగరాజస్వామి 'సీతారామ విజయ' నాటకమును కూడ రచించెను. కాని ఇది ప్రహ్లాద భక్త విజయ, నౌకా చరిత్రాదుల వలె ప్రఖ్యాతిని పొందలేదు. ఉత్తరరామాయణేతివృత్తము గల ఈ నాటకములోనిదే బహువ్యాప్తిని పొందిన "మా జానకి చెట్టబట్టగ మహారాజవైతివి" అను కీర్తన. నాటకమునందు ఒక పాత్ర శ్రీరాముని ఉద్దేశించి ఈ కీర్తనను పాడును. అశ్వమేధ యాగమునకు ముందు యాగాశ్వముతో బయలుదేరనున్న శత్రుఘ్నునకు శ్రీరాముడు యుద్ధ ధర్మములను బోధించును. అప్పుడు లక్ష్మీనిధి అను పాత్ర వాలి వధ,

తాటక సంహారములందలి ధర్మమును గూర్చి పృచ్ఛించగా శ్రీరాముడు ప్రత్యుత్తర మొసగుట ఇందలి విశేషము.

సంస్కృతాంధ్ర సాహిత్యములకు స్వరరాగ సుధారసమును మేళవించి "మృదుగిరా వల్మీకి జన్మాముని:" అను దివ్యయశము నార్జించి, సంగీత ప్రపంచమునే 'రామాయణము' కావించిన వాగ్గేయ కారుడు త్యాగరాజస్వామి, అందువలననే "గాన సుధారస పాననిరతం - గానం కరోమి సతతం-సాయ శ్రీ నారదాంశగం భారతీయ గాన లక్ష్య లక్షణ సంప్రదాయ సంస్కర్తారం — కృతికర్తారం-గాయకజన భుక్తి ముక్తిప్రదం - ధ్యాయా మధీన బాంధవం - సరిగమ పదని సప్తస్వర స్వరూపం - త్యాగబ్రహ్మ" -అని సంగీత శాస్త్రజ్ఞుల, వాగ్గేయ కారుల పుష్పాంజలు లందెను.[1]

## అధ్యాత్మ రామాయణ కీర్తనలు :-

తెలుగుదేశమున అత్యంత వ్యాప్తిని పొందిన కీర్తనలలో మునిపల్లె సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మ రామాయణ కీర్తనలను కూడ ప్రధానముగ పేర్కొనవలెను. సుబ్రహ్మణ్య కవి కాలము క్రీ. శ. 1730 ప్రాంతముగా నిర్ణయింపబడెను. రామాయణ కథ సంకీర్తన రూపమున లభించుచున్న వాటియందు ఇవి ముఖ్యమైనవి. గుడిపాటి ఇందుమతి మున్నగువారు కూడ రామకథను కీర్తనలుగ రచించిరి. అధ్యాత్మ రామాయణ కీర్తనలకు అధ్యాత్మ రామాయణము మూలము.

సంస్కృతాంధ్రములందును, సంగీత, నాట్యాలంకార శాస్త్రము లందును, వేదాంత శాస్త్రమందును కూడ అపార వైదుష్యము కలిగిన సుబ్రహ్మణ్య కవి తెలుగు అధ్యాత్మ రామాయణ కీర్తనలను కథా కథన పద్ధతికి అనువైన రచనా విన్యాసములో స్వతంత్రత నవలంబించి సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దెను. భక్తివేదాంత తత్త్వ ప్రధానమైన వీనియందు పోతనాదుల ననుసరించి అనువైన పట్టుల శృంగార రసాత్మకములగు లలిత పదములను ప్రయోగించెను. ఇవి నూట

1. శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ కీర్తన.

నాలుగు కీర్తనలు. ఇంచుమించు అన్ని కీర్తనలు శృంగార రసాత్మక మైన పదములతో ఈశ్వరుడు ఉమాదేవిని సంబోధించి రామకథ వివరించు పల్లవి అనుపల్లవులతో కథాకథనము ప్రారంభించును. "విను హైమవతీ ఘనాఘన సుందరాకృతీ, వినుతధృతీ, కరుణామతీ !"; "వినవే పల్లవ మృదు చరణా, కరుణా, వితరణ గుణాభరణా !" ఇత్యాదులు. వేదాంత బోధనము, కథా కథనముతో కొన్ని కీర్తనలు సుదీర్ఘములుగ నుండును. ధాతుమాతువులు రెండింటికి సమాన ప్రతిపత్తి కల యీ కీర్తనలందు వేదాంత బోధనము ప్రాముఖ్యము వహించుటంజేసి సంగీత రచన కంటెను సాహిత్యమే అధికముగ, ఉండును. ఇవి ఏబది ఎనిమిది రాగములందు కలవు.

ఆంధ్ర వాగ్గేయ చరిత్ర కారులు శ్రీ బాలాంత్రపు రజనిగారు పేర్కొనినట్లు అన్నమాచార్యులవారి గేయములు సంకీర్తనాత్మకములు- క్షేత్రయ్య పదములు అభినయాత్మకములు, సుబ్రహ్మణ్యకవి కీర్తనలు అఖ్యానాత్మకములు. ఫలితముగ కీర్తనలు భజన బృందములందు కంటె సంగీత కళానిధులైన విద్వాంసుల అభిమానము నధికముగ చూరగొనెను.

## తూము నరసింహదాసు భజన కీర్తనలు :-

త్యాగరాజునకు సమకాలికుడైన తూము నరసింహదాసు ఉత్సవ సంప్రదాయ కీర్తన లనదగిన మేలుకొలుపులు, హెచ్చరికలు, లాలి పాటలు,మంగళహారతులు మున్నగునవి శ్రీరామకథాత్మకములుగ రచించెను. సంప్రదాయ కీర్తనలుగా ఇవి భజన కూటములందు ప్రచారము పొందెను. నరసింహదాసుకు సన్నిహితుడగు వరద రామదాసు కూడ రామాంకితముగ కీర్తనలు రచించెను.

## పరాంకుశదాసు కీర్తనలు :-

త్యాగరాజునకు ఏబది సంవత్సరముల తర్వాత వాడుగ నిర్ణయింపబడిన పరాంకుశ దాసు శ్రీరామాంకితముగ రచించిన కీర్తనలు భజన సంప్రదాయమునకు చెందు కీర్తనలు ముఖ్యములుగనే పేర్కొన

వలెను. తెలుగునందే కాక సంస్కృత, హిందీ, తమిళ భాషల యందు కూడ రచించెను. రామాయణ సంగ్రహ సీసమాలిక, పట్టాభి రామ స్తోత్రముల సీస పద్యము, రఘునాయక స్తోత్ర చూర్ణికలను రచించిన వీరు "రాముని మినహా భూమిలో వేరొక స్వామియు లేడు సుమా" అను షడ్భాషా కీర్తన కూడ రచించిరి.

## ప్రయాగ రంగశర్మ :-

(1859–1927) "శ్రీరామనామ పఠన సేయవే మనసా" వంటి కీర్తనలు రచించిరి.

అద్యతన వాగ్గేయ కారులలో శొంఠి సీతారామయ్యగారు రామాయణ ఘట్టములను వందలకొలది కీర్తనలుగా రచించిరి. బాలాయోధ్యా కాండలను నూటనలుబదిఆరు కీర్తనలు కావించిరి- మైసూర్ వాసుదేవాచారి, పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ మున్నగు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు రామపరముగ కీర్తనలు రచించిరి. కాని ఇవి కథాత్మకము లనుట కంటె సంకీర్తనాత్మకము లనదగును. "రాము డుద్భవించినాడు రఘుకులమ్మున" వంటి కీర్తనలు - సంగ్రహముగ రామాయణమును చెప్పునవి కూడ కలవు.

ఆధునిక యుగమున గేయము ప్రముఖ స్థానమును పొందెను. అభ్యుదయ కవిత్వములో పేరెన్నిక గన్న వారందరు సంప్రదాయమును క్షుణ్ణముగ గ్రహించినవారే అయిన కారణమున రామపరములగు గేయములు కూడ రచించిరి. "సొగసుగా మృదంగ తాళము జత గూర్చి" శ్రీరాముని కీర్తించుటయే పరమలక్ష్యముగా భౌతిక బంధముల కతీతముగ త్యాగరాజాదులు జీవించిరి. శ్రీరామార్చనమునకు భవబంధములు ఆటంకముగ నిల్చినప్పుడు వారు చింతిల్లిరి. ఇహ పరములకు వారధి నిర్మింప ప్రయత్నించు ఆధునిక గేయకర్త భవ బంధములకు అతీతుడు కాడు. "ద్వేషాలూ రోషాలూ రగిలించేదే మతమైతే - కలహాలూ కక్షలు సాధించేదే మతమైతే - మతం వద్దు గితం వద్దు మారణ హోమం వద్దు.... అందరమూ మానవులం -

అందరమూ సోదరులం''! అని సర్వమానవ సౌభ్రాతృత్వము సాధనలో నిమగ్నమై ఉన్న ఆధునిక గేయకర్త

"కోవెలలోనికి రాలేను – నీ కోరిన కానుక తేలేను" కనుక స్వయముగ వెడలి అహల్యా శాపమోచనము కావించిన రామా ఆ నీ పదధూళులు నిటు ప్రసరింప చేయుము అని సాంఘిక బాధ్యతల నడుమ శిలాకృతిని నిలచి శ్రీరాముని వేడుకొనును :

'పదములె చాలు రామా – నీ
పదధూళులె పదివేలు
నీ పద మంటిన పాదుకలు
మమ్మాదుకొని యీ జనమేలు॥
కోవెలలోనికి రాలేను
నీ కోరిన కానుక తేలేను – నిను గానక నిముషం మనలేను
నువు కనపడితే నిను కనలేను॥
నీదయ గౌతమిగంగా రాముయ
నీదాసులు మునుగంగా
ఈ బ్రతుకు కొక నావ
దానికి నడిపే తండ్రివి నీవ॥ [2]

రామకథను వివరించు గేయములు కథాత్మకములు, సంకీర్తనాత్మకములు చలనచిత్రములవలన కూడ ఆధునిక యుగమున బహుళ వ్యాప్తిని పొందెను. ఇట్టి గీతములందలి కథ ప్రధానముగ యథా వాల్మీకముగనే యుండును. సంగ్రహ రామాయణమును వర్ణించు కథాత్మక గీతములందు ముఖ్య ఘట్టములు మాత్రము వర్ణింపబడుచుండును. "రాముని అవతారం - రవికుల సోముని అవతారం!", [3] "శ్రీరాముని చరితమును తెలిపెదమమ్మా – ఘన శీలవతి సీతకథ

1. 2. శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి గేయము.
3. భూకైలాస్ చిత్రములోనిది.

వినుమోయమ్మా !",[1] "అహో రామకథా !",[2] "రామకథ — శ్రీ రామకథ !"[3] వంటి కథాత్మక గేయములు విశేషవ్యాప్తిని పొందెను. చలనచిత్రములందలి స్తుత్యాత్మకములగు రామగీతములు ద్వివిధములు. కేవలము శ్రీరామ మహిమను కీర్తించునవి "జయజయ శ్రీరామా !"[4] వంటి గేయములు, చిత్రమునందలి సన్నివేశమునకు అన్వయించు రీతిని రామకథాంశములను సంఘటింపచేసి వ్రాసిన గీతములు—

"శ్రీరఘురాం - జయరఘురాం - సీతామనోభిరాం
అన్నదమ్ముల ఆదర్శమైన - ఆలుమగల అన్యోన్యమైన
తండ్రిమాటను నిలుపుటకైన - ధరలో మీరే దశరథరాం॥"[5]

—మున్నగునవి.

కథాత్మక గేయమునకు ఒక ఉదాహరణము :—

"అందాల రాముడు - ఇందీవర శ్యాముడు
ఇనకులాబ్ధి సోముడు - ఎందువలన దేవుడు ?

1. తండ్రిమాటకై పదవుల త్యాగమే చేసెను
తన తమ్మునిబాగుకై తాను బాధ పొందెను
అందాలా రాముడు అందువలన దేవుడు ॥

2. అనుభవించతగిన వయసు - అడవిపాలు చేసెను
అడుగుపెట్టినంత మేర ఆర్యభూమి చేసెను
అందాలా రాముడు అందువలన దేవుడు ॥

3. ధర్మపత్ని కాపాడుటకై దనుజుని దునుమాడెను
ధర్మము కాపాడుట కా సతినె విడనాడెను
అందాల రాముడు అందువలన దేవుడు ॥"

---

1. లవకుశ చిత్రమునుండి.
2. వీరాంజనేయ చిత్రమునుండి.
3. శ్రీరామకథ చిత్రమునుండి.
4. జయసింహ చిత్రమునుండి.
5. శాంతినివాసం చిత్రమునుండి.

ఈ గీతము రాముని ఆదర్శ మానవత్వమునకు రూపకల్పన చేయుచుండగా ఈ క్రింది గీతము[1] రాముని దైవముగ నిరూపించుచు కథను సమగ్రముగ చెప్పెను.

"ద్వారపాలుర మరల దరిచేయు కృపయొ -
ధరలోన ధర్మము మరల నెలకొల్పు నెపమొ
రాముని అవతారం - రవికుల సోముని అవతారం
సుజన జనావన సర్వాధారం - దుర్జన హృదయ విదారం" ||
దాశరథిగ శ్రీకాంతుడు వెలయు
కౌసల్యాసతి తపము ఫలించు
జన్మింతురు సహజాతులు మువ్వురు
లక్ష్మణు భరత శత్రుఘ్నులు ||
చదువులు నేరుచు మిషచేత
చాపము దాలిచి చేత
విశ్వామిత్రుని వెనువెంట
యాగము కావగ చనునంత
అంతము చేయు నహల్యకు శాపం
ఒసగును సుందరరూపం ||
.... .... .... .... .... .... .... ......
... .... .... .... ....... .... ......
కపటనాటకుని పట్టాభిషేకం
కలుగును తాత్కాలికశోకం
భీకరకాననవాసారంభం
లోకోద్ధరణకు ప్రారంభం
భరతుని కోరికతీరుచుకోనం
పాదుక లిచ్చే ప్రేమావేశం

1. మూగైలాన్ చిత్రమునుండి.

నరజాతికి నవనవ సంతోషం
గురుజనసేవకు ఆదేశం॥"

—ఈ విధముగా రామకథలోని ముఖ్యాంశములను సూచించుచు గీతము సాగిపోవును.

ఇట్టిరీతిని సంకీర్తనమందు రామకథ విశేషముగ కలదు కాని (అధ్యాత్మ రామాయణాదులందు మినహాయించి) ఒక క్రమమున లభించుట కష్టతరము.

---

# యక్షగానము-రామకథ

'యక్ష' 'గాన'ము రెండును సంస్కృత పదములే అయ్యును, యక్షగానము మాత్రము సంస్కృత సాహిత్యము నుండి భిన్నమైన కేవల దేశి సంగీత ప్రక్రియగా నిర్ణయింపబడినది.

ఏ జాతికైనను జాతీయతా ముద్రను శాశ్వత మొనర్చు సజీవ చైతన్య స్రవంతి వంటి మధుర కవితా శాఖకు చెందిన గీత ప్రబంధములతో పరిఢవిల్లునది దేశిసారస్వతము. అట్టి దేశి సారస్వత ప్రక్రియ లందు తలమానికముగా పేర్కొనదగినది యక్షగానము. యక్షగాన ప్రక్రియా రూపమును వివరించు పట్టున డా॥ ఎస్. వి. జోగారావు గారు "గీత ప్రబంధముల కెన్నింటికో యక్షగాన మాకరమగుటచేత యక్షగానమును దేశివాఙ్మయ కోశమంతటికిని ప్రతినిధి యన జెల్లును. కాని యక్షగాన మనగా ఈనాడు గానప్రక్రియగా గాక రూపక ప్రక్రియగా బరిగణింపబడుచున్నది. కాని, యక్షగానమునకు ముందే దేశమున వీధినాటకములు ప్రచారమునం దుండినను, అది యా వీధి నాటకములతో ఏకమై, నాటక ప్రక్రియగా రూపొంది, నాటక శబ్ద వాచ్యమునై, మధ్యలో మార్గ నాటక ప్రభావము సోకినను దన వ్యక్తిత్వము గోల్పోక కలాపము, కొరవంజి మొదలగునవి దేశీయదృశ్య రచనలుగా రూపొందుటకై తన ప్రక్రియాసత్త్వమును దానముచేసి బొమ్మలాటకును వాటమైన పంతపాటగా బరిఢవిల్లి యుండుటంజేసి, దానిని దేశి సరణికిఁ జెందిన నాట్యకళా ప్రపంచమునకు గూడ దగిన ప్రతినిధి యనుటలో విప్రతిపత్తి[1] యుండరాదు"– అని దేశి సారస్వతమున యక్షగానమునకు గల విశిష్టతను స్పష్టము గావించిరి.

---

1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర– డా॥ యస్. వి. జోగారావు.

గద్యపద్య గేయాత్మకముగా సాహిత్యమును విభజింపవచ్చును. ఈ మూడింటి ప్రత్యేక ప్రయోగము వలననూ, సంకలన ప్రయోగము వలననూ బహువిధ సాహిత్య ప్రక్రియలు రూపొందెను. క్రీ. శ. 16 వ శతాబ్దాంతము వరకును తెలుగునందు పద్య గద్యోభయాత్మకమైన చంపూ మార్గము శిష్ట వాఙ్మయమున సమాదరింపబడినది.[1] గేయ ప్రక్రియ ఆదినుండియు జనపదములందే పరిఢవిల్లినది. క్రమశః శిష్టకవులు కొందరు పద పద్యములకు మధ్య ప్రక్రియగా పేర్కొనదగిన ద్విపదను స్వీకరించిరి. ఆ విధముగనే 'ఉదాహరణము'[2] కూడ గ్రహింపబడెను. కాలక్రమమున ఇటువంటి ప్రక్రియలన్నిటిని ఏక సూత్రమున సంఘటింపజేయుచు యక్షగానము సారస్వతమున అర్హ స్థానమును ఆక్రమించినది. యక్షగానములో విస్పష్టములైన దశలు మూడు కన్పట్టును.

## గేయరూపమునమాత్ర ముండునవి :-

గానాత్మక మయిన ఈ దశకు చెందినవిగా[3] ఓద్దె కంచి (కూచి) రామాయణము మున్నగు వాటిని పేర్కొన వచ్చును. అజ్ఞాత కవుల రచన లిందు ప్రాధాన్యము వహించును.

## సంవాదాత్మకములు :-

పాత్ర సమారోపముతో, స్వల్ప భేదములతో నాటకమువలె ప్రదర్శనానుకూలమైనవి. బొమ్మలాట ప్రదర్శనములకు కూడ ఉపయుక్తములైనవి. కందుకూరి రుద్రయ్య సుగ్రీవ విజయము మున్నగు ప్రసిద్ధ

1. సంస్కృత మూలమునందు లేకపోయినను తెలుగులో 'యక్షగాన' మనెడి సమస్త పదము ప్రప్రథమముగా శ్రీనాథుడు వాడెను, "కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు– గాంధర్వమున యక్షగాన సరణి" భీమఖండము – తృతీయాశ్వాసము.
2. మార్గపద్ధతికి చెందినదగు కళికోత్కళికల రూపమున వెలసిన పద కవితా ప్రభేద మగు రగడ కలసి వచ్చిన ప్రక్రియ "ఉదాహరణము".
3. "కోయిల పంచమ స్వరమును క్రోల్చిన భంగిని ఓద్దెకంచి రా
   మాయణ మాటుకొండలు నచ్చోట జాగరవేళఁ బాడెనా
   రాయవితంతు పత్ని మనురాగముతోడ....'' – క్రీడాభిరామము – P. 55 – 56
   (ఈ రామాయణము అలభ్యము)

కథల యక్షగానము ఈ కోవకు చెందును- అర్వాచీనములైన బుర్ర కథలు, హరికథలు కూడ ఈ దశకు చెందవలసినవే.

## వీథినాటకముతో అభేదము :-

నాయక రాజుల కాలమున (17 వ శతాబ్ది) ఈ మార్పు వచ్చినది. 'యక్షగాన నాటకము' అనెడి సమస్త పదము వ్యవహారములోనికి వచ్చుటయే కాక, కృత్యాదిని, యక్షగానముగాను అంతమున వీథి నాటకము లేక నాటకము గాను పేర్కొనుట కూడ ప్రారంభమయ్యెను. ఇందు మరల యక్షగానము వీథి నాటక లక్షణములను గ్రహించుచు, యక్షగాన- వీథినాటకముల కభేదము- అను ద్వివిధములయిన వాలు గలవు (విజయ రాఘవ నాయకుని కాలమున యక్షగానమునకు నాటకమను పేరు స్థిరపడెను- [1] తెలుగు నాటక P. 188) ఇట్లు డా॥ యస్. వి. జోగారావు పేర్కొన్నట్లు యక్షగానము హరికథవలె నాఖ్యానింప బడుచు, ఇంటింట నాడువారిచే పారాయణము గావింపబడుచు, వీథి భాగవతులచే రూపకముగా ప్రదర్శింపబడుచు నిట్లు బహుముఖ ప్రయోజనములతో బహుముఖముగా వర్ధిల్లుచు వచ్చినది. [2]

"తుదనేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము;
లలికడపల నొక్క లఘువు మానిన జంపె
మనుద్విరదగతి సమపదయుగము
గురుతు రూపమునకు తురగవలనా
హ్వాయ మేకతాళి యా మధురగతికి;
హరికి నిర్వది నాలుగటు తాళమున మాత్ర
లోలి విశ్రాంతి పథ్యాలుగింటు
తెలియ నర్థంబు నర్ధచంద్రికలు వీటు

---

1. "యక్షగానము"- హరికథ - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -(డా॥ యస్. వి. జోగారావు.)
2. డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి "తెలుగు నాటక వికాసము" ననుసరించి గావించబడిన విభజనము.

యక్షగాన ప్రబంధంబు నతుకవచ్చు
రగడ భేదంబు లివి యంద్రు రస కవీంద్రు
లలిత నిజసేవక స్తోమ యద్రిధాము"— అని అప్పకవి యక్షగాన లక్షణమును నిర్వచించెను. ఇందింకను ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళాలు, చందమామ సుద్దులు, వెన్నెల పదములు, విరాలి పదములు, తుమ్మెద పదములు, గొబ్బి పదములు, చిలుక పదములు, కోవెల పదములు, కందాపదములు, సీసార్థాలు, త్రిభంగులు, ద్విపదలు, త్రిపదలు, చౌపదలు, షట్పదలు, మంజరులు, జక్కులరేకులు మొదలగు ఇతరములైన దేశి రచనలు కూడ కన్పట్టును. ఇంకను యక్షగాన ప్రదర్శనయందు ప్రతి పాత్రయు స్వీయ పరిచయముతో రంగ ప్రవేశము గావించును. కథకు సంబంధించిన పాత్రలతో పాటు ఎఱుకత వేషము కూడ కొన్ని యక్షగానములలో కాంచనగును. మోక్షగుండము సుబ్బకవి కృత "సీతాకల్యాణ యక్షగానము"నందు విరహోత్కంఠిత యగు సీత సన్నిధికి ఎఱుకతగా శ్రీరాముడు వెడలును. ఆయా మాండలిక పదజాలము కూడ యక్షగానములలో విరివిగ కన్పట్టును.

దేశి సారస్వతమున శాఖోపశాఖలై విస్తరించిన యక్షగాన ప్రక్రియలో వెలసిన రామకథ ఆంధ్రులకు రామాయణముఎడ గల భక్త్యనురాగములకు తార్కాణము. యక్షగాన వాఙ్మయమునందు రామకథకు విశిష్ట స్థానము కలదు. సంపూర్ణ రామాయణాత్మకములుగాను, కొన్ని ఘట్టములను మాత్రము స్వీకరించియు, యక్షగానము లనేకములు రూపొందింపబడెను. సంపూర్ణ రామాయణాత్మకములుగా మిగిలిన అన్ని ప్రక్రియలందు కంటెను దేశిసారస్వతమున రామాయణ మూలకాంశములను స్వీకరించిన ప్రక్రియ యక్షగాన మని చెప్పనగును. జానపద వాఙ్మయమందలి రామాయణ కథా గేయాదులందు కూడ ఆరుకాండల కథను గ్రహించిన గేయాదులున్నను, లభించిన వానిలో యక్షగానములందు సంఖ్య అధికముగా నున్నది. ఆరు కాండముల కథను గ్రహించిన యక్షగానములు ప్రప్రథమముగాను, ఘట్టములు ఉపాఖ్యానములు ద్వితీయముగాను, రామభక్తుల చరిత్రను వెల్లి

డించునవి చివరను దిఙ్మాత్రముగా వివరించుటకు నీ ప్రకరణమున ప్రయత్నము జరిగినది.

## రామలీలా యక్షగానము :-

క్రీ. శ. 1780–1853 ప్రాంతవాసిగా భావింపబడుచున్న వెల్లాల వెంకట కవి యీ యక్షగానకర్త. ఆపస్తంబసూత్రుడు, మౌద్గల్యస గోత్రుడు అయిన ఈ కవి బాపనామాత్యుని పుత్రుడు, గొంగాళ రామ శాస్త్రి శిష్యుడు, విశాఖమండలమందలి రావివలస గ్రామవాస్తవ్యుడు. విచిత్ర రామాయణ కావ్యము, రామలీల, గౌరీశంకర విలాస నాట్య ప్రబంధము, జానకీరామ శతకము'- యీ కవికృతులుగా పేర్కొనబడు చున్నవి. ఇందు గౌరీ శంకర లీలా విలాసము, రామలీలమాత్రము నేడు లభ్యములు. ఇవి విజయనగర సమీపమున గల రామతీర్థ క్షేత్ర స్వామికి అంకితములు.

రామలీలా యక్షగానమున రామాయణమునందలి షట్కాండలు సంక్షిప్తీకరింపబడెను. కాండాంతగద్యలు (కవి విషయాదికమును తెలుపునవి) తక్క యక్షగాన మంతయు నిర్వచనముగా పేర్కొన నగును. ఆఖ్యాన శైలిలో సాగిన యీ యక్షగాన రచన కడు చక్కనిది. అటనట ద్విపదలు, ప్రసిద్ధ రాగతాళములందు దరువులు, పద్యములు అధికముగా కలవు.

## గీత రఘునందనము :-

హరిహరాద్వైతియైన ముమ్మిడిదేవుల తిరుమల కవి గీతరఘు నందన కర్త. పరాశరస గోత్రుడైన ఇతడు రామచంద్రయతి శిష్యుడు, లక్ష్మమ్మా తిరుమలార్యుల పుత్రుడు, చిత్తూరు నివాసి. "గురువారేఽ క్షయ బాహుల బహుళాష్టమ్యాంస సచ్చిదానందః, గీత రఘునందనం నిజ పితృతిర్మల రచిత మలిఖదితమ్"- అను శ్లోకము వలన కవి కాలము క్రీ. శ. 19 వ శ॥ పూర్వార్ధముగా నిర్ణయింపబడినది.

వాల్మీకి రామాయణమును పారాయణ మొనర్చిన ఈ కవి యథా వాల్మీకముగా, దానివలెనే "పాఠ్యే గేయే చ మధుర" మన నర్హమైన

రీతిని నీ యక్షగానమును రచించెను. ఇయ్యది వాల్మీకి మాతృకమయినను, భోజచంపువు కూడ ఎడనెడ గ్రహింపబడెను. భావప్రధానమైన గీతగోవిందమును స్ఫురణకు దెచ్చు ఈ గీతరఘునందనము వస్తుప్రధానము. సుదీర్ఘసంవాదశైలి, నాటకీయ సన్నివేశశిల్పమును ప్రదర్శించినను, ఇందు గేయము అధికమను విషయమును "గీత రఘునందనము"ను నామమే స్పష్ట మొనరించుచున్నది. రసప్రసన్న మగు శైలీమాధుర్యము గల యీ యక్షగానము దరువులు, తాళలయాన్వితము లైన ద్విపదలతో, పద పద్యములతో, ఏలలు, అర్ధచంద్రికలు, జాలిపాటలు, శోభనములు మున్నగు గేయ విశేషములతో విశిష్ట రచనగా రూపొందుటయే కాక, ప్రబంధమని పేర్కొనబడినందున హృదయంగమములైన వర్ణనములతో కూడ అలరారుచున్నది.

## రామాయణము :-

శీర్నాడు వేంకటరాయ కవి కృతమైన ఈ రామాయణ యక్షగానము బాలాయోధ్యాకాండలు "మొదటి రాత్రి కథ" గను, అరణ్య కిష్కింధ సుందరకాండలు "రెండవరాత్రి కథ" గను, యుద్ధకాండ "మూడవరాత్రి కథ" గను మూడు రాత్రుల ప్రదర్శనానుగుణముగా రచింపబడెను. యక్షగాన ప్రక్రియయందు ఇట్లు భారత, రామాయణ, భాగవతాదులు "రాత్రుల కథలు" గా వింగడింపబడుచుండుట ఒక విశేషము. దేశి సారస్వతమున ప్రత్యేక శాఖగా రూపొందిన ప్రక్రియలలో యిటువంటి విభజన యక్షగానమం దధికమని చెప్పనగును. సంపూర్ణ రామాయణము షట్కాండములు రెండు మూడు రాత్రుల కథలుగా ప్రదర్శనానుగుణముగ విభజించి పెక్కురు కవులు వ్రాసి యుండుట గమనార్హము

శీర్నాడు వేంకటరాయ కవి కృతమైన ఈ రామాయణము లేపాక్షి హరిహరాంకితము. క్రీ. శ. 1840 ప్రాంతము వాడగు ఈ కవి సింగవరము నివాసియగు నరహరి జోస్యుల శిష్యుడు.

మూడుకృతులుగా వింగడింపబడిన ఈ రామాయణమున ప్రసిద్ధ రాగ తాళములందు దరువులు, ద్విపదలు, పద్యములు, సంధి

వచనములు, అటనట పాత్రసంభాషణోద్దిష్టములైన వచనములు కలిగి నాటకీయముగ ఉండును. రచన సాధారణము. వ్యావహారిక భాషా ప్రయోగము కొంతకలదు.

## శ్రీమద్రామపర రామాయణము :-

సుప్రసిద్ధ హరికథకులుగా ఆంధ్రప్రాంతమున వాసికెక్కిన నల్లమిల్లి బసివిరెడ్డి బహు గ్రంథకర్తలు. 30-9-1897 న ప్రథమించిన వీరు భారత భాగవత రామాయణముల మూడింటిని హరికథలుగా రూపొందించిరి. శ్రీమద్రామపర రామాయణమున (షట్కాండలు మూడు భాగములు) యక్షగాన ప్రబంధముగా గ్రంథకర్త పేర్కొనెను. ప్రసిద్ధ రాగతాళములందు తొహరాలు, భజన కీర్తనలు ఉన్నను ఇం దచ్చటచ్చట సూక్ష్మ వచనము లుండును. యక్షగానము సంవాదాత్మకముగ సాగుచు నాటకీయతతో నుండును.

వీరింకను కుశలవ చరిత్ర, మైరావణ చరిత్ర మున్నగు యక్షగాన ప్రాయ నాటకములను రచించిరి.

## రామ నాటకము :-

ఉప్పు వేలూరు పురవాసియగు ఓగిరాల పాపయ్య భాస్కర రామాయణానుసారంబుగా షట్కాండలను "నాటక యక్షగానంబు"గా 1882 సంవత్సరమున రచించెను. ఇందు ముద్రణభాగ్యము నంది బాలారణ్య కాండలు రెండును ప్రదర్శన ప్రతిష్ఠలు గాంచెను. బాల కాండలో విశ్వామిత్ర వేష ప్రవేశము, ఆస్థాన సంతోషి, మంత్రసాని మొదలగు పాత్రల ప్రసంగములు విశేషము. అరణ్య కాండము ఆశ్వాసములుగా విభాగింపబడెను. రామనాటక మందలి బాలకాండము అప్పటి మచిలీపట్టణము గార్నిస్ జె. పటాలము 42 వ రెజిమెంటు వారిచే పదునాలుగు వత్సరములు ప్రదర్శింపబడెను.

## సమగ్ర రామ నాటకము :-

రామాయణ షట్కాండలను సంగ్రహ యక్షగాన రూపముగా నెడాదూరు వెంకటాచార్య కవి సమగ్రరామనాటకమను పేర వెలయిం

చెను. వివిధ ప్రసిద్ధ రాగతాళములలో పల్లవి, అనుపల్లవులతో దరువులు, ప్రాసవచనములతో గ్రంథమంతయు సాగుట యిందలి విశేషము. పురాణ గోష్ఠికిగా స్వీకరింపదగిన యీ యక్షగానము నాటక మహాప్రబంధముగా పేర్కొనబడినది. సాధారణ రచన.

## ధర్మపురి రామాయణము :-

తెలంగాణా ప్రాంతమునందు వెలసిన రామాయణములలో ప్రజా బాహుళ్యముచే సమాదరింపబడి ఆంధ్రదేశమందంతటను విశేష ప్రాచుర్యము నందిన దేశి సారస్వతము నందలి రామాయణములలో ధర్మపురి రామాయణము ప్రథమ స్థానము నాక్రమించును. ధర్మపురి వాసియగు శేషాచలకవి క్రీ. శ. 1780 ప్రాంతమున ఈ రామాయణమును రచించెను. షట్కాండలను కలిగిన యక్షగానముగా ధర్మపురి రామాయణము వ్యాప్తినందెను. సరళము, సుందరముగా సాగిన ఈ రామాయణము శ్రవ్యప్రధానమయినను ఆయా ప్రాంతముల దరువులు, (ప్రధానముగ ఆంధ్రదేశ రామాయణ వీధి నాటక ప్రదర్శనములందలివి) – దీనికి మిళితముచేసి ప్రదర్శించుచుండుట కాంచనగును. పాత్రల సంవాదములు కొన్ని నాటకీయత వెల్లివిరియుచు మనోజ్ఞముగ నుండును.

## అధ్యాత్మ రామాయణము :-

(ఈ యక్షగాన వివరణ ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక వలన తెలియుచున్నది.) క్రీ. శ. 1780 ప్రాంతమున పరకాలయందు వసించిన రాపాక శ్రీరామకవి అధ్యాత్మ రామాయణ యక్షగానమును రచించెను. ఉనాతిదీర్ఘమయిన ఈ యక్షగానమును రాపాక లింగన పుత్రుడగు శ్రీ రామకవి మాచర్ల రామామాత్యుని యభీష్టము మేరకు ఇల్లిందకుంట దేవుని కంకితముగా రచించెను.

## (మిట్టపురి) రామాయణము :-

మిట్టపురమున వెలసిన కోదండ రామాంకితముగ బోడిచర్ల సుబ్బకవి యీ యక్షగానము వ్రాసెను. నాలుగు రాత్రుల ప్రదర్శ

నకై ఈ రామాయణమును కవి రచింపగా, అందు 'మొదటి రాత్రి కథ' అయిన బాలకాండ మాత్రము ప్రచురణభాగ్యము నందినట్లు ముద్రితప్రతివెనుక ప్రకాశకులు సూచించిరి.

వాల్మీకి రామాయణ శ్రవణానంద పరవశుడై కవి "పామరు లానందమంద, సంగీత సాహిత్య సరసప్రసంగ సంగతినే సల్పు సరస నాటక"మని పేర్కొనెను. గణపతి సరస్వతులు స్తుత్యంతమున రంగస్థలమున ప్రవేశించి "రామనాటక నటనాభిరాము" లగు నటుల నాశీర్వదించుట యను చిత్రమైన ఎత్తుగడ యక్షగాన ప్రారంభమున నుండును. తదుపరి నారద పాత్రము ప్రవేశించి స్వీయపరిచయము గావించుకొని, బాలకాండ ఇతివృత్తమును సంక్షిప్తీకరించి చెప్పి, భాగవతుల కాశీస్సులను పలుకును. తదుపరి "తలారిగురికాడు" (కటికవాని పాత్రవంటిది) దశరథాగమనమును హెచ్చరించును. ఇందు పాత్రప్రవేశ, కథానుసంధాన సూచనలు కూడ కలవు. ఒక్కొక్కచో కొన్నిపట్టుల సూత్రధారుడు పాత్రను సంబోధించును. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, నలుగుపాటలు, శోభనములు ఉండును. నాటకోచితముగ రచన సాగెను.

ఇంకను నందివాడ జగన్నాథకవి షట్కాండలలో "శ్రీమద్రామాయణము", ఎల్లసూరు నరసింహకవి "సూక్ష్మ రామాయణము" (బాలకాండ తక్క తక్కిన అయిదు కాండల 'నొక్క రాత్రి కథ' గొనర్చినాడు), మంథెనకవి రామాయణము (1884 ప్రాంతము) — మున్నగు సమగ్ర రామాయణ యక్షగానములు ఇంకను పెక్కు కలవు.

రామాయణ ఘట్టమందు ఏదేని ఒకటి ఇతివృత్తముగా గ్రహింపబడిన యక్షగానములు కూడ పెక్కు వెలసినవి.

## సుగ్రీవ విజయము :-

రామాయణ సుందరకాండమునందలి ఒక ఘట్టము ఇందలి కథ. ఆంజనేయకృత రామ సుగ్రీవ సఖ్యము, పరస్పర దుఃఖ కథనము, వాలి వధార్థమై రామ ప్రతిజ్ఞ, వాలి వధ, తారావిలాపము, సుగ్రీవ పట్టాభిషేకము — ఇందలి కథాంశములు. నూతన కల్పన

లిందు లేకపోయినను పాత్ర స్వభావోన్మీలనము మాత్ర మత్యంత సుందరముగ నిర్వహింపబడెను. శ్రీరాముని సీతా విరహదుఃఖము, శ్రీరామునితో మరణోన్ముఖుడయిన వాలి యొనర్చిన సంవాదము, తారావిలాపము, అంగదుని అప్పగింత మున్నగు ఘట్టము లిందు కవి పేర్కొనినట్లు కరుణరసోన్మీలనములై ఇందులకు నిదర్శనములగును. తాత్కాలికమైన శ్రీరాముని విరహదుఃఖములో అనగా కథాప్రారంభము జరిగి, పతాకస్థాయిగా శాశ్వతమగు భర్తృవియోగ వేదనతో కుములు తారావిలాపము వర్ణింపబడినది. ఇట్లు అంగిరసమగు కరుణము పతాకస్థాయిని చేరుకొనెను. అంగముగా వీరరసము వాలి సుగ్రీవుల యుద్ధఘట్టమున పోషింపబడెను.

## సుగ్రీవ విజయము :-

ఆంధ్ర యక్షగాన వాఙ్మయముననే శ్రేష్ఠమయినదిగా ప్రఖ్యాతి పొందిన ఈ సుగ్రీవ విజయము చారిత్రకముగ ప్రథమ యక్షగానముగ స్వీకరింపబడెను. క్రీ.శ. 16వ శ॥నకు చెందిన కందుకూరి రుద్రయకవి ఈ యక్షగాన కర్త. సుగ్రీవ విజయమునకు పూర్వము సుమారు అర్ధ శతాబ్దివరకు యక్షగానమునకు సాహిత్యలోకమున సమాదరణ లభించినట్లు చారిత్రకాధారములు కన్పట్టవు. అంతియకాక, ప్రప్రథమమున ముద్రణభాగ్యమునందిన యక్షగానముకూడ ఇయ్యదియే అగుచున్నది. సుగ్రీవ విజయము తరువాత వెలసిన యక్షగానములలో విరివిగ కన్పట్టు జక్కుల ఆట, భాగవతపు పాత్రల సంప్రదాయములు, కొరవంజి సంప్రదాయము మున్నగునవి కానరాకపోవుటకు ఇది వీరరసప్రధానమగు కృతి యగుట హేతువు కానోపు. సుగ్రీవ విజయము దృశ్యశ్రవ్యోభయాత్మకమైనదిగా తోచును. పాత్రల సంభాషణలు వచనమున గాక దరువు లేక ద్విపదలలో సాగి అందే కథాకథన ముండుట ఇత్యాదులవలన నిది శ్రవ్యరూపక కథాఖ్యానమునకు ఉద్దేశింపబడినదివోలె తోచును. కాని ప్రదర్శనానుకూలమైన రచన మిగిలిన యక్షగానములందు దృగ్గోచరమగు "వెడలె సుగ్రీవుడు" – పద్ధతి ప్రావేశిక దరువులు ఇందు లేవు. ప్రవేశ నిష్క్రమణోపక్రమణము లన్నియు కథాకథన పద్యములు ద్విపదలలో సూచితములయ్యెను. "రుద్రకవి సుగ్రీవ విజయమున గూడ స్త్రీ పాత్రాదులు పలుకుచు

పాడుచుందురు. ఆయా పాత్రముల పాటలు తత్తద్వేషధారులు వచ్చి పాడునట్లును తక్కిన సంధివచనాదులు ఒక్కరిద్దరు సూత్రధార ప్రాయులు పఠించునట్లును ఈ సుగ్రీవ విజయము వీధియాటగా నాడ బడుచుండెడిది" — అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పేర్కొనిరి. యక్షగాన రచనలలో ఇది స్వతంత్రముగు ప్రత్యేక ఫక్కితో రచింప బడినదని పేర్కొనుట ఉచితము.

## సుగ్రీవ విజయము :-

ఆదిలాబాద్ జిల్లావాసి యగు ఆకెళ్ల నారాయణదాసుకవి కృతి అత్యాధునికము. కృత్యారంభమున గణపతి సరస్వతులు రంగప్రవేశ మొనర్చి స్వీయపరిచయము గావించుకొందురు. వేములవాడ రాజ రాజేశ్వరాంకితముగ రచింపబడిన యీ కృతియందు ద్విపదలు, దరు వులు, పద్యములు, సంధి—సంభాషణాత్మక వచనములు కలవు.

## కొమ్మలపాటి రామాయణము :-

జాలకల్లు నివాసి యగు నారాయణకవి సుందరకాండమును "శ్రీమద్గుమ్మడవల్లి రణభూపాలలలామ సతతపూజితు" డగు కొమ్మల పాటి సీతారామస్వామి కంకితముగా కొమ్మలపాటి రామాయణ యక్ష గానమును క్రీ. శ. 1775 ప్రాంతమున రచించెను.

ఇందలి కథ ప్రసిద్ధము—మనోజ్ఞమగు రచన. ప్రఖ్యాతములైన రాగతాళములందు దరువులు, ద్విపదలు, పద్యములు. సంధివచ నములవంటి వచనములతో నాటకీయముగ సాగును.

## సుందరకాండము :-

ఆర్వేలనియోగి, కౌండిన్యసగోత్రుడు, బ్రహ్మన్నపుత్రుడు అయిన పెమ్మరాజు వెంకటరాజు సుందరకాండ యక్షగాన కర్త. కవి కాలనిర్ణయము సంశయాస్పదము. ఇందలి కథ ప్రసిద్ధము—మార్పులు లేవు. నిర్దుష్టమైన భాష ప్రయోగింపబడినను రచన సాధారణము. ఏకతాళ నటాదితాళములలో దరువులు, కీర్తనలు, ఒక్కచో పాటలు ప్రయోగింపబడినను ఇందు అధిక భాగము ద్విపదయందే కలదు.

## సుందర కాండము :—

పట్టాభిరామయ్య కవిచే గేయ ప్రబంధముగ రచింపబడిన ఈ యక్షగానమున అవతారికయందు తంజావూరు రఘునాథరాయ రామాయణములోని "శ్రీ సీతాలలితాంగి" త్యాది పద్యములుండుట గమనార్హము.

ఇంకను కూచకొండ రామాయణము (కర్త—గుజ్జరి ఎల్లదాసు) మున్నగు సుందరకాండేతివృత్త యక్షగానములు పెక్కు గలవు. ఇందు రాగములు లేవు.

## సీతా స్వయంవరము :-

గోపాలదాస కవికృతముగ పేర్కొనబడుచున్న ఈ యక్షగానమున "పుణ్య సీమంతినీ బాలికా ప్రముఖులు చదువుకొనుట కుపయుక్తముగ ఘంటామారుత పేర బిరుదాంకిత శ్రీ రామరం వేంకటసుబ్రమణ్య శృంగార కవీంద్రునిచే నవీనముగాఁ గొన్ని విషయము" స్వీకరింపబడినట్లు ముఖపత్రమున గలదు. ప్రసిద్ధమైన కథాంశము గల ఈ యక్షగానము ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, పద్యములతో ఒప్పారుచుండును. '[1]లావణి దౌహారాదరువు' అనబడు ఒక వింత దరువు, గౌరీకళ్యాణము ఇందలి విశేషములు. ద్విపద ప్రయోగము కానరాదు.

దౌహారాదరువున కుదాహరణము :—

నామనాదక్రియరాగం — ఆదితాళం.

"జగతిలోన మిథిలాపురమునను
జనకు న్నృపాలుం డనఁగా

---

1. లావణి కుదాహరణము:—"కొంకణ దేశాధీశుని విలు చే
కొమ్మని జనకుం డనఁగా
కొంకక కడుపున సంకట మనుచు
జొంకి యతడు పొమ్మనెనే."

సొగసుమీఱ రాజ్యంబేలుచునూ
సుఖముండును వినఁగా॥"

వివేకరంజనీ ముద్రాశాలయందు ముద్రింపబడినది.

## సీతా కల్యాణము :-

కర్నూలుజిల్లా కంభము తాలుకాలోని మోక్షగుండాగ్రహార వాస్తవ్యుడయిన మోక్షగుండము సుబ్బకవి యీ గ్రంథకర్త. భారద్వాజ గోత్రుడు, గొప్ప శాస్త్రపండితుడు. సుబ్బమాచలమయ్యల పుత్రుడు_సుబ్బమాంబా జయరామయ్యల పౌత్రుడు.

నాటకముగా పేర్కొనబడిన యీ గ్రంథము రెండు రాత్రుల కథగా సరిపడును. బాలకాండ వృత్తాంతమంతయు నిందు కలదు. ముఖ్య పాత్రలనుబట్టి కథలోని ఆ యా ఘట్టములకు "దశరథ వేషము కథ, బాలింతవేషము కథ, విశ్వామిత్ర వేషము కథ" – ఇత్యాదిగా ప్రత్యేక శీర్షికలు కలవు. విరహోత్కంఠిత అయిన సీత సన్నిధికి శ్రీరాముడు ఎఱుకతగా ఏగుట యిందలి విశేషము. జానపద గేయ సాహిత్యమందు "రాములవారి యెఱుక" అను యక్షగానమున శ్రీరాముడు ఇటులనే ఎఱుకత వేషధారియై సీతకు యెఱుక చెప్పినట్లు కలదని డా. బి. రామరాజుగారు పేర్కొనినారు.[1] ఈవిధముగనే శ్రీ వేంకటేశ్వర కల్యాణమునందు శ్రీనివాసుడు ఎఱుకత వేషధారియై పద్మావతికి యెఱుక చెప్పినాడు. సీతాకల్యాణమునందు కొన్నియెడల పాత్ర ప్రావేశికధ్రువలు గలవు. కొన్నియెడల హాస్యగాడు తెరలో నున్న పాత్రలను పృచ్ఛించి, తద్వృత్తాంతము చెప్పించుటయు కలదు. ఇందు ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, ద్విపదలు, కంద సీసార్ధములు, పద్యములు, ఆఖ్యాన, సంవాదోభయప్రయోజనాత్మకములు అగు వచనములు కలవు. దరువులలో మోక్షగుండము ముక్తేశ్వరుని ముద్ర

1. తెలుగు జానపదగేయ సాహిత్యము – డా. బి. రామరాజు_పుట. 50.

కలదు. రచన చప్పుచప్పగా ఉన్నది. తప్పులు కలవు. (ప్రచురణ–చిత్తూరు గురుస్వామి మొలారివారి కవిరంజని ము. శా.–6-7-1886)–(P. 169).

## సీతా కల్యాణము :-

రచనారీతియందు సుగ్రీవ విజయ యక్షగానమును స్ఫురణకు దెచ్చు సీతాకల్యాణము క్రీ. శ. 17–18 శతాబ్దముల నడిమికాలమున అగస్త్యరాజు రామునకవిచే రచింపబడినట్లుగా డా. యస్. వి. జోగా రావుగారు నిర్ధారించిరి. ప్రసిద్ధేతివృత్తముగల ఈ యక్షగాన రచనము మనోజ్ఞముగా సాగెను. ఈ యక్షగానమున కూడ రౌఱుకతగా శ్రీరాముడు సీతాదేవితో ప్రసంగించుట విశేషము. తాళప్రధానములగు దరువులు, ద్విపదలు, అర్ధచంద్రికలు, ధవళశోభనములు, సువ్వి పాటలు – మున్నగునవి ఇందు కన్పట్టును. పి. పి. బి. గోదానాయకమ్మ రచించిన "పుత్రకామేష్టి" జానపద గేయమందు కూడ రాముడు ఎఱుకతగా సీతకు ఎఱుకచెప్పుట కలదు.

## రామాయణము (బాల కాండము) :-

అన్నదానము వేంకటాంబ అను కవయిత్రి స్త్రీలు గానము చేయుటకు అనుగుణముగా ఈ యక్షగానమును వెలయించెను. ఇందు కథ ఆఖ్యాన శైలిలో ఎడనెడ వర్ణనములతో సాగిపోవును. శ్రీరాము బాల్య, సీతాకల్యాణ ఘట్టములు తెలుగుతనముతో అలరారు చుండును.

ఇంకను టేకుమళ్ళ రంగశాయికవికృత 'జానకీ పరిణయ యక్షగానము', నందివాడ జగన్నాథకవి 'సీతాకల్యాణ యక్షగానము', తంజాపురాంధ్రనాయక రాజగు రఘునాథనాయకుని 'జానకీ కల్యాణ చాటుకావ్యము'–మున్నగు అలభ్యములగు యక్షగానములు, తంజాపుర మహారాష్ట్ర రాజగు షహాజీ 'సీతా కల్యాము', యాగళ్ళ జానకీరామయ్య 'సీతా కల్యాణము'–మున్నగు ముద్రిత యక్షగానములు రామకల్యాణేతి వృత్తము గలవి పెక్కున్నవి.

## శ్రీరామ నాటకము :-

మరింగంటి భట్టరు రామానుజాచార్యులు "శ్రీరామ నాటక"మను పేర రామాయణమంతటిని రచించియుండెనో లేదో ప్రస్తుతము సంశయాత్మకము. కాని లభించుచున్న ప్రతులలో లక్ష్మణ మూర్ఛ నుండి పట్టాభిషేక పర్యంతము గల కథ కన్పట్టుచుండును. వచనములందు వ్యావహారిక భాషాప్రయోగము ఎక్కువగ గావింపబడినను, వీరరస ప్రధానమగు ఈ కావ్యమున రచన ప్రౌఢము. అమరమునందలి శ్లోకము లనేకములు ఉదాహృతములయ్యెను. వాటికి తెలుగున అర్థ వివరణము గూడ కావింపబడెను. కథ కొంత అధికముగా భాస్కర రామాయణమూలకముగ పెంచబడుటయే గాక నూతన సన్నివేశ కల్పనలు గూడ అటనట కానవచ్చును. సూత్రధారి పాత్ర కల ఈ యక్షగానము తోలుబొమ్మలాటలకు ఉపయుక్తమగుచుండినట్లు తెలియును. బొమ్మలాటల పరిపాటియగు అమరశ్లోకప్రసక్తి యందులకు చక్కని తార్కాణము.

## రామ పట్టాభిషేకము :-

తంజావూరు మహారాష్ట్ర రాజగు షహాజీయే యీ యక్షగానమును గూడ రచించెను. ప్రసిద్ధేతివృత్తముగల యిందు తలవరులు హస్తములందు తుపాకులు ధరించి భరతునితో తమిళమున ప్రసంగింతురు. రచన సాధారణము. ఇంకను పట్టాభి రామాయణము, శ్రీరామ విజయము (కర్త-పెనుతురుబల్లి విశ్వనాథకవి – అలభ్యము) మున్నగునవి రామ పట్టాభిషేక ఇతివృత్తములతో అనేకములు గలవు. ఇక పద్మపురాణాంతర్గత కౌసల్యా పరిణయము, శాంతా కల్యాణము, అహల్యా సంక్రందనము, మైరావణ చరిత్రము, శతకంఠ రామాయణము మున్నగు వాల్మీకి రామాయణమునకు అధికపాఠము లనదగు ఘట్టములు అనేకములు నాటక ఖండకావ్యాది సాహిత్య ప్రక్రియలందు వలెనే యక్షగానములందు గూడ సముచిత స్థానమునే ఆక్రమించినవని పేర్కొనవచ్చును. స్థలాధిక్య భీతింజేసి స్థాలీపులాకన్యాయమున అందు కొన్నింటిని మాత్రము విహంగదృష్టి పరిశీలన గావించుటయైనది.

### శాంతా కల్యాణము :-

తంజావూరు మహారాజు షహాజీ కవికృతమగు ఈ యక్షగానమున ఋష్యశృంగ వేశ్యాసమావేశము రసమిళితము. కాని శాంతా పాత్రమున ఉదాత్తత నన్నగిల్లి అటనట పణ్యాంగనా లక్షణముల కనబరచెను. ఆ విధముగనే మహర్షుల శీలచిత్రణము గూడ ఔచితీ దూరముగ నున్నది. ద్విపదలు, దరువులు, వచనములు, శ్లోకములు ఇందు కలవు.

### అహల్యా సంక్రందన నాటకము :-

నాదెళ్ళ పురుషోత్తమకవి తన (1863-27-11-1938) ఈ యక్షగానమున వేత్రధార పాత్ర ప్రవేశముతో కథారంభము గావించెను. "వాటీజ్ దట్! కీప్ క్వయిట్", "కామోష్!" మున్నగు ఆంగ్ల హిందీ భాషా ప్రయోగము కావించెను. హాస్యపు పాత్ర నటులను పలుకరించి, పరిహాసోక్తులు పలుకుట యిందు కలదు.

### శ్రీరామ విజయము :-

మహాభారతము ననుసరించి కృష్ణార్జున యుద్ధము మున్నగు వర్ణనాత్మక వివరణాత్మక ఉపాఖ్యానములు వెలసిన రీతినే, రామాయణమున కూడ ఉపాఖ్యానములు కాననగును. అందు శ్రీరామ విజయము ఒకటి.

విశ్వామిత్రుడు తనకు అభివాదము సేయక, ప్రణామము చేయని యయాతి మహారాజు పొరపాటును క్షమింపక ఆగ్రహావేశ పరవశుడై యయాతిని సంహరింప శ్రీరాముని ప్రేరేపించును. విషయము తెలియక శపథము గావించిన శ్రీరాముడు, తరువాత తన భక్తుని, ధర్మాత్ముని సంహరింపవలసివచ్చినందుకు చింతిల్లును. నారదమునీంద్రుని ప్రేరణపై యయాతి హనుమంతుని శరణుజొచ్చును. శరణాగతవత్సలుడైన పవనాత్మజుడు కూడ యయాతికి అభయప్రదానము చేసిన తరువాత పొరపాటుకు చింతిల్లును. ఫలితముగ హనుమ ద్రామ సంగ్రామము జగద్విలయ హేతువగుచు ప్రారంభమగును.

విశ్వామిత్రుడు పశ్చాత్తప్తుడుకాగా, కౌసల్యాంజనాదేవులు సంగ్రామమును నివారించి దేశ కల్యాణము గావింతురు. ఆర్ష సంస్కృతి, ధర్మములందలి సూక్ష్మాంశములను జనాకర్షణరీతిని వివరించుటకై యిట్టి సన్నివేశములు ధర్మావతారులైన మహాత్ముల కాపాదింపబడి నట్లుగా భావింపనగును. ఈ శ్రీరామ విజయ యక్షగానము పంఢరి విఠలరాయకవి (1874-1914) రామపూరి కవి కంకితముగ రచించెను. నిర్దుష్టము కాకున్నను ప్రదర్శనోచితముగ నున్న యీ యక్షగానారంభమున రంభోర్వశులు రంగమున ప్రవేశింతురు. పాత్రల తెరదరువులు కలవు. దరువులు, పద్యములు, సంధివచనములు కలవు. ద్విపదలు సంకీర్ణరీతిని ప్రయోగింపబడెను.

శ్రీరామవిజయ యక్షగానేతివృత్తముతో పెక్కు యక్షగానములు వెలసినవి. హనుమద్రామసంగ్రామమను పేరు మహ్మద్ అబ్దుల్లా (లేకుల సోమవరగ్రామ వాస్తవ్యుడు.)—అను మహమ్మదీయుడు రచించిన యక్షగానము పేర్కొనదగినది.

హనుమద్రామ సంగ్రామము యక్షగాన ప్రక్రియయందే కాక, నాటకాదులయందు కూడ స్వీకరింపబడి విశేష జనాదరణము బడసిన ఇతివృత్తములలో నొకటి.

హనుమంతుని పరాక్రమమునకు ప్రతీకగా నిలచు మైరావణ కథ కూడ యక్షగాన, నాటక కావ్యప్రక్రియలందు విశేష స్థానమునే ఆక్రమించినది. (మైరావణ కథకు నాటక ప్రకరణమును చూచునది.) మైరావణ చరిత్ర యక్షగానమును బాదుపల్లె కొండయ్యకవి (19వ శ॥ ప్రాంతము) ప్రసిద్ధ రాగతాళములలో, దరువులలో, పద్య ద్విపదలలో రచించెను. ఇందు దండకము కూడ కలదు. రచనయం దెన్నెన్నో దోషములున్నను ప్రదర్శనోద్దిష్టమైన రచన. పురాణము పిచ్చయ్య (1871–1951) కవి విరచిత మైరావణ చరిత్ర యక్షగానము ప్రశస్తి వాటిలో నొకటిగా భావింపనగును.

ధర్మాత్ములు, భక్తులు అయిన వారి హృదయములు కాలవశమున అహంకారపూరితము లయినప్పుడు భగవంతుడు వారికి గుణ

పాఠము నేర్చునను విషయమును రామాయణోత్తరకాండమందలి నారద శాపవృత్తాంతాదులు నిరూపించును. రామాయణమున ధర్మస్వరూపునిగ మహోన్నతస్థానము నలంకరించిన హనుమంతుడు చిరంజీవియై ద్వాపరయుగమున శ్రీకృష్ణావతార సమయమున బలరామ, గరుత్మంతుల గర్వభంగము కావించినట్లు గల యక్షగాన ఇతివృత్తమును స్వీకరించి కొందరు యక్షగాన, నాటకాదుల వెలయించిరి. ననుకంటి హరీశాంకితముగ పరాంకుశదాసు అను కవి "హనుమద్విజయ యక్షగానము"ను రచించెను.

ఇంకను రంగరాజు కేశవరావు (1858–1904) హనుమద్విజయము[1], మద్దాల కాశీపతి మైరావణ లేక హనుమద్విజయము[2] (యక్షగానప్రాయ నాటకముగా నిది సంభావింపబడెను.), కొల్లూరి పురుషోత్తమకవి మైరావణ చరిత్ర, పోతుకూరు సుబ్బయ్య మైరావణ నాటకము మున్నగునవి పెక్కు కలవు. ఈ విధముగనే త్వరకవి రామకృష్ణయ్య సహస్రకంఠ రామాయణ యక్షగానము (19 శ॥ ఉత్తరభాగము ఈ శతాబ్ది ప్రథమ భాగము – అలభ్యము), మద్దాల కాశీపతి శతకంఠ రామాయణము (కథాసంగ్రహమునకు – జానపద వాఙ్మయమున రామకథ ప్రకరణము చూచుకొనవలెను), కప్పినపల్లి వేంకటేశ్వరాంకితముగ అణ్ణాచార్యుల మండోదరీ పరిణయము, పండరి విఠలరాయకవి కౌసల్యా పరిణయము మున్నగు యక్షగానములు కలవు.

నాటకాదులయందువలెనే యక్షగాన కర్తలను కూడ రామభక్తుల చరిత్రము లాకట్టుకొనెను. అందును రామదాసు చరిత్రము యక్షగాన కవులచే ఇతివృత్తముగా స్వీకరింపబడి పెక్కు కృతులుగా వెలసెను.

### రామదాసు నాటకము :-

కేశరాజు వెంకటసుబ్బరాయకవి (1886–1899–రాజమహేంద్రవరమున కనతిదూరమునగల మలికపల్లి నివాసి) పద పద్యాత్మకముగా

1. అముద్రితము—ఒక్క ప్రతి డా. వి. రామరాజుగారి కడ మాత్రము కలదు.
2. బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీయందు లభ్యమగును.

దీనిని వెలయించెను. (రామదాసుకథ సర్వజన విదితము కనుక స్థలాభావముచే ఇచ్చట పేర్కొనబడుటలేదు). ఈ యక్షగానమును ఆధునిక నాటకమురీతి రూపొందించు ఉద్దేశముతో కవి ప్రాచీన నాటకములనుండి కొన్ని భాగములు స్వీకరించి, కొంతవఱకు రచి యించునప్పటికి వ్యాధిగ్రస్తులై దివంగతులయిన హేతువున ఆ కొలది భాగము అనుబంధముగా స్వీకరింపబడెను. ఆ అనుబంధమునందు నాందీ, సూత్రధార, వైతాళికులు, చోపుదారులు పాల్గొన్న ప్రస్తావనయు కలవు. చోపుదారు పాత్ర "ఖామోష్, సైలెన్స్" వంటి పదప్రయోగ ముల గావించెను. ఇది అయిదంకములుగా విభజింపబడెను. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, కందార్థముల పద్యములు, ఆధునిక నాటకమందలి వాక్యపద్ధతియు కాంచనగును. అంకము లనేక రంగ ములుగ విభజింపబడినవి అయినను "ఈ గ్రంథమూలమగు చిత్తు ప్రతియందు అంకరంగ విభజనము గాని, ప్రవేశ నిష్క్రమణములు గాని లే"వని పీఠికాకారులు పేర్కొనుటచే నియ్యది యక్షగానముగ రచింపబడి, క్రమశః నాటకీకరణ గావించుటకై యత్నమొనరించినట్లు భావింపనగును. ఇయ్యది ఆ కాలముననే తెనుగుగడ్డపై కాలూనిన ధార్వాడ నాటక సమాజ ప్రభావమని అనవొప్పును.

మాడ అప్పలస్వామి (ఈ శతాబ్ది పూర్వార్థము) రామదాసు నాటకమనెడి యక్షగానము మున్నగు యక్షగానములు కలవు. ఇంకను అహల్యా సంక్రందన విలాసము (చెళ్ళపిళ్ళ నరసకవి, క్రీ. శ. 1795-1840) అలభ్యము.

నల్లపాటి శేషాచలదాసుకవి అవనిజా చరిత్ర, కంభంపాటి ఉదయాచలము అహల్యా సంక్రందనము (అలభ్యము), చెరివిరాల భాగయ్య సుగ్రీవ విజయము, అందు వెంకటనరసయ్య కిష్కింధా కాండ నాటకము, పనుస హనుమద్దాసు హనుమద్రామ సంగ్రామము, నింబగిరిదాసు కౌసల్యా నాటకము, వి. బ్రహ్మచారి రంభా రావణ సంవాదము, నాగినేని వెంకటప్ప రామ జనన నాటకము, యాగళ్ళ జానకీరామయ్య సీతాకల్యాణము – మున్నగు యక్షగానము లనేక

ములు లభ్యములు, అలభ్యములు యక్షగాన ప్రక్రియకు ఆంధ్రదేశ సారస్వతమున శాశ్వతత్వమును అగ్రాసనాధిపత్యమును చేకూర్చుచు విరాజిల్లుచున్నవి.

## వీధి భాగవతములు

మన ప్రాచీన నృత్య సంప్రదాయము ద్వివిధములుగా విభజింపబడెను. నట్టువ మేళ సంప్రదాయము, ఆరాధనా నృత్యములు. కేళికా నృత్యములు మున్నగునవి నట్టువ మేళ సంప్రదాయమునకు వర్తించును. ఇందు సాహిత్యము కథాప్రధానము కాకుండ రసప్రధానమై యుండును. ఇక నాట్యమేళమన భారత, భాగవత, రామాయణాదుల గాథలు గ్రహించి సంగీత నృత్యముల జోడించి ప్రదర్శింపబడునది. ఇవియే నృత్యనాటకములు. ఈ నాట్యమేళములను డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు,




— అని విభజన గావించిరి.[1]

1. తెలుగు నాటక వికాసము — దృశ్యకళారూపక అధ్యాయము — P. 139.

భక్త్యాత్మకములైన ప్రదర్శనలు నాలుగు వీధుల కూడలియందు ప్రదర్శించుచుండుటచే వారు భాగవతులు, వారి ప్రదర్శనలు వీధి భాగవతములు అయ్యెను. "ఇవి [1] పూర్వ కథాయుతము లగుటచేతను బహు నర్తకులు, వేషధారణము కలవగుటచేతను నాటకశాఖకు చెందుచున్నవి" - అని అప్పారావుగారు వీటిని నాటకములుగా స్వీకరించినను, నృత్య గానాత్మకములుగా నున్న ఈ ప్రక్రియలు యక్షగాన ప్రకరణముననే పొందుపరుపబడినవి. నాట్యమేళములందు కూచిపూడి భాగవతులను ప్రప్రథమమున పేర్కొనవలెను. కూచిపూడి నాట్యకళకు మూలపురుషుడు సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రుని భామాకలాపము కూచిపూడి నాట్యమున ఎనలేని కీర్తిని గడించినను రామనాటకము, లవకుశ (ఉత్తర రామచరిత) మున్నగు రామాయణ కథాత్మకములు కూడ వెలసెను.

కూచిపూడి భాగవతుల ప్రదర్శనలచే ప్రభావితులైన ఇతర జాతులవారు కూడ భామాకలాపాదుల నభ్యసించి ప్రదర్శింపసాగిరి. అట్టి ప్రదర్శన లాయా జాతులవారి పేరిట వ్యవహరింపబడినవి. ఏనాది భాగవతులు, గొల్ల భాగవతులు, మాల భాగవతులు ఇట్టివారే. మాల భాగవతుల ప్రదర్శనలలో రామాయణాత్మకములు చుక్కలవారి రామనాటకము, చుర్రిగుంట రామాయణము మున్నగునవి కలవు.

## జేగంట భాగవతులు :-

ఒకచేత పెద్ద జేగంట, రెండవచేత సీతారామలక్ష్మణుల విగ్రహములు గల ఒక దీపస్తంభము ధరించి, నందిటి నెమలి పింఛము, పాదములకు గజ్జెలు ధరించి ప్రతి గృహము ముందు దీపపు సెమ్మెను నిలిపి, చుట్టూ ప్రదక్షిణాత్మకముగా నృత్యము గావించుచు యాచక వృత్తిని జీవించు తెగకు జేగంట భాగవతజాతిగా అన్వర్థనామము కలదు. వీరు "ఎందుకయ్యా ఉంచినావు - బందిఖానాలో రామయ్యతండ్రీ - ఎందుకయ్యా ఉంచినావు" - అను రామదాసు బందిఖానా ఘట్టమును గానము చేయుచు ఉంఛవృత్తిని జీవించెదరు.

1. తెలుగు నాటక వికాసము - దృశ్యకళారూపక అధ్యాయము - P. 140.

## హరిహరీ పదములు :-

"హరిహరీ నారాయణ - ఆదినారాయణ
కరుణించి మమ్మేలు - కమలలోచనుడ ॥కరు॥

—పల్లవితో సాగే హరిహరీ పదములు విశాఖపట్నం మండలమున వ్యాప్తినందున్నవి. వీటికి "జంపె"లను పర్యాయపదము కలదు. కేవలము జానపద గేయములవలె కాక, ఒక కళారూపముగా ప్రత్యేకతను సంతరించుకొనిన వీనిలో పాతాళహోమము, శతకంఠ రామాయణము, కుశలాయకము మున్నగు రామాయణ కథాత్మక పదములు కలవు. కుశలాయకము క్రి. శ. 1862 ప్రాంతమున పూరి రామచంద్రరాజు రచించెను.

## బొమ్మలాటలు :-

"భారతాది కథలఁ జెరి మెఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు
కథ నద్భుతంబుగఁ గంబసూత్రంబు
లుపరంగ బొమ్మల నాడించువారు"— అనుచు పండితారాధ్య చరిత్ర (ప్ర. ప్ర.-పు. 435) మున్నగు కావ్యములందు పేర్కొనఁబడిన ప్రాచీన దేశప్రక్రియయైన బొమ్మలాట ఆంధ్రులకు అత్యంత అభిమాన పాత్రమైన వినోదము. పండితారాధ్య చరిత్రకు పూర్వమే అనగా క్రి. శ. 12 వ శతాబ్దినాటికే బొమ్మలాట లాంధ్రమున వ్యాప్తినందుండెను. డా॥ యస్వీ జోగారావుగారు పేర్కొనినట్లు బొమ్మలాట ప్రాక్తన మానవునికి రూపకకళాసంకల్పమునకు ప్రస్తావనవంటిదైన కావచ్చును. ఇది కఱ్ఱబొమ్మలాట, తోలుబొమ్మలాటగా ద్వివిధము. ఈ విభజనమే పై పద్యమున కాంచనగును. యావద్భారత ప్రసిద్ధి గాంచిన కఱ్ఱబొమ్మలాట లేక పాంచాలికలుగా భాసుని నాటకములు ప్రదర్శింపబడెనట - దక్షిణదేశమున మాత్రము వ్యాప్తినొందిన తోలుబొమ్మలాటలందు భవభూతి నాటకములు, రాజశేఖరుని బాలరామాయణము కూడ ప్రదర్శింపబడెనట. ఆంధ్ర సారస్వతమున పలు

కావ్యములందు బొమ్మలాటల ప్రసక్తి కాంచనగును. (కృష్ణరాయ విజయములోని వర్ణన-IV. 119; చంద్రభాను చరిత్రలోని పద్యము - 11-99; పాంచాలీ పరిణయము, చంద్రాంగద చరిత్ర - IV,-207; అనిరుద్ధ చరిత్రము-1-12 మున్నగునవి), రాజశేఖరుని బాలరామాయణమున కూడ (5వ అంకము) బొమ్మలాట వర్ణనము కలదు. ఈ విధముగ జనపదములందుద్భవించి సాహిత్య గౌరవమును బడసిన బొమ్మలాట మేళమున[1]కు సాహిత్యమధికముగ వీధినాటకము, యక్షగానాదులనుండి స్వీకరింపబడినట్లు తెలియును. ఆంధ్రులకు ఆరాధ్యదైవమగు శ్రీరాముని చరిత్రము బొమ్మలాటలందు కూడ విశిష్ట స్థానమునే ఆక్రమించుకొనెను. క్రీ. శ. 1850 ప్రాంతపువాడగు మరింగంటి భట్టరు రామానుజార్య (గంజాం జిల్లా గుజ్జువాడ గ్రామ నివాసి) విరచితమగు[2] "శ్రీరామ నాటకము" తోలుబొమ్మలాటకుపయుక్తమై "బొమ్మలాట రామాయణము"గా ప్రసిద్ధిగాంచెను.

## సంతవేలూరు కుశలవ నాటకము :-

పీసె సుబ్బరాజు, గాజులపెండ్లూరి శేషగిరిరాజు అను ఇరువురు కవులు సంతవేలూరు కుశలవ నాటకమును అచు రాత్రుల కథగా ప్రదర్శించుటకై రచించిరి. ఇది వీధినాటకము, యక్షగానముగ కూడ ప్రదర్శింపబడెడిది. ఇంకను ద్విపద వాఙ్మయాలంకారమగు రంగనాథ రామాయణము కూడ తోలుబొమ్మలాట సాహిత్యమున అటనట స్వీకరింపబడెను.[3]

---

1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర.
2. వివరములకు యక్షగాన ప్రకరణమును చూచుకొనునది.
3. ఆంధ్రుల సాంఘిక చరిత్ర — సురవరం ప్రతాపరెడ్డి.

# హరికథ–రామాయణము

ఆంధ్రుల కత్యంతాభిమానపాత్ర మగు హరికథా విస్తరణకు రామాయణము దోహదకారియైన దనుట సత్యదూరము కాజాలదు. సీతా కల్యాణమును ప్రేక్షకుల సమక్షమున పరమ హర్షముతో వర్ణింపని, సీతా వనవాసమును స్వీయదుఃఖముగ సామాజికులతో కలసి స్వీకరింపని కథకుడు కానరాడనుట సాహసము కానేరదు. భారతమును గైకొనినను, శ్రీకృష్ణావతార తత్త్వమును విశదీకరించినను ప్రతి హరికథయు "నీనామ రూపములకు నిత్యజయ మంగళమని" శ్రీరామ పరముగ ముగియవలసినదే కదా !

తెలుగు దేశమున రామాయణేతి వృత్తముతో హరికథలు అసంఖ్యాకముగ వెలసెను. సుప్రసిద్ధమైన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మ రామాయణ కీర్తనలను కీర్తనాత్మకముగా సాగిన ఆంధ్రమున ప్రప్రథమముగ వెలువడిన హరికథగా సంభావింప తగును. ఇందలి సంగీత శైలి కూడ ఏకవ్యక్తి ప్రదర్శనానుకూలత కల్గియుండును. కాని, ఇందు అంతర్గతమై యున్న ఆధ్యాత్మిక బోధ హరికథా లక్షణమును సులభగతిని పై స్థాయి యందుండిన కారణమున ఇది హరికథా భాగవతుల నిత్య ప్రదర్శనకు అలంబనీయము కాజాలక పోయెను.[1]

## మోక్షగుండ రామాయణము :-

శాస్త్రి నారాయణకవి కృతమగు మోక్షగుండ రామాయణము ఆ కొరతను తీర్చెను, మోక్షగుండ శ్రీరామునకు అంకితముగ,

"మొదటి కావ్యమ్ము వాల్మీకి ముని కృతమ్ము
రామచరితమ్ము భక్తలోకామృతమ్ము

---

1. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర – రజని.

హరికథఁగ గూర్చె రక్తి నారాణ్ణయదాసు
వసుధ వెలయుత మాళశి భాస్కరముగ''

కవిచే హరికథగ పేర్కొనబడిన మోక్షగుండ రామయణము అరు హరికథలుగ విభజింపబడెను.

## సీతా కల్యాణము :-

''హరి'' కథ గావున కథా కాలక్షేపములందు మహిమాది వర్ణనలు అధికముగ నుండును. రామాయణ హరికథ అందు వాల్మీకి రామాయణమే ప్రధానముగా స్వీకరింప బడినను, అన్యరామాయణాంశములు అధికముగా కానవచ్చును.

మోక్షగుండ రామాయణము అధ్యాత్మ రామాయణమువలె దాక్షాయణిచే ప్రార్థితుడై మహేశ్వరుడు శ్రీరామ చరిత్రము వివరించు నటుల ప్రారంభమయ్యెను. సీతా కల్యాణమునందు సీతా జనన వృత్తాంతము శతానందుడు రాఘవులకు వివరించు పట్టున పేర్కొనబడిన సీతా పూర్వజన్మ వృత్తాంతము వాల్మీకి రామాయణము నుండి భేదించుచున్నది.

పద్మాక్షుడను జనపాలుడు శ్రీలక్ష్మిని పుత్రికగా బడయగోరి మోక్షగుండ శ్రీనాథుని గూర్చి తపము కావించెను. విష్ణువు ఒసగిన మాతులుంగ ఫలమునుండి వెల్వడిన పద్మయను కన్యారత్నమును పుత్రికగ నాతఁడు స్వీకరించెను. ఆమెను పద్మాక్షుడు ''ఆకాశ నీలవర్ణంబు రీతి'' తను కాంతి గల వరునకు ఒసగెదనని ప్రకటింప మహీపాలుడు కినిసి ఆహవమందు పద్మాక్షుని సంహరించిరి. కన్య అగ్నియందు తిరోహిత అయ్యెను. తదుపరి, ఒకనాడు బాహ్యప్రదేశమున విహరించు పద్మను విమానమున ఆసీనుడై ఆకాశయానము కావించుచున్న రావణుడు తిలకించి, మోహితుడై, బంధింప నుంకించిగా ఆమె, అగ్ని కుండంబున పంచరత్న రూపయై దాగెను. రావణుడా పేటిని గైకొని మండోదరికి ఒసగెను. అందుండి వెలువడిన కన్యను అదిశక్తిగా గుర్తించిన మండోదరి ప్రమాదమును శంకింపగా, రావణుడు

భీతిల్లి మందస సహితముగా కన్యను రావణుడు భూమియందు నిక్షిప్తము కావింప దలచెను. అంత పద్మ

"ఈసారి లంకకు నేతెంచి రావణుఁ
బుత్రమిత్రులతోడ బొలియఁ గూల్తు
మూడవసారి నేర్పున వచ్చి పౌండ్రకు
శతకంఠు రావణు సంహరింతు
నాల్గవసారి మానక వచ్చి మూలకా
సురుఁ డను ఘటకర్ణ సుతుని గూల్తు" - నని

భీకరముగ పల్కెను. కుపితుడైన రావణుడు ఆమెను సంహరింప ఉద్యుక్తుడు కాగా మండోదరి వారించెను. అంత ఆ పేటిక మిథిలాపురమున నిక్షిప్తము కావింపబడగా, జనకుడు ఆ భూమిని ఒక విప్రునకు దాన మొసగెను. విప్రు డా భూముని దున్నింపుచుండ పేటిక లభించెను. దాని నాతడు జనకునకు సమర్పింప అందుండి పద్మ వెలువడెను. జనకు డామెను దుహితగ స్వీకరించెను. ఆమె ''మాతులుంగ ఫలసముద్భూత గావున మాతులుంగి యనియు, నగ్ని కుండంబున వసియించినది గావున నగ్నిగర్భ యనియు, రత్నాంతరవాసి యగుట వలన రత్నావతి యనియు, ధరణినుండి వచ్చుటచే ధరణిజ యనియు, జనకునిచేఁ బెంపబడుటచే జానకి యనియు, సీతాగ్రమునకు దవులుకొని వెడలుటచే సీతయనియు, బద్మాక్ష నృపాల కుల జాత యగుటచేఁ బద్మయనియు, ననంత సార్థకనామంబులచే పిలువబడినది.

అవాల్మీకీయమయిన ఈ పద్మ వృత్తాంతము ఆనంద రామాయణమున కలదు. ఈ విధముగనే నారాయణదాసుగారు ఇందు దశరథునకు ముద్గలముని రామావతార రహస్యమును, దశరథ పూర్వ జన్మమును ఎరిగించు వృత్తాంతమును కూడ వివరించుటచే, ఆయా ఘట్టములకు ఆనంద రామాయణమును మాతృకగ స్వీకరించెననదగును.

ఇందు శ్రీరాముడు బహుపత్నీకుడు. సీతానుమతిని బడసి రాముడు "తన మేనమామ లెనమండుగురి కుమార్తెలను' "నూట యిరువది యెనిమిది మంది కన్యకలను నొక్క లగ్నంబు"న స్వీకరించి,

సీతతో నూటయిరువది తొమ్మిది పత్నులతో ఏకపత్నీ వ్రతుండట్లు ప్రతీతితో వెలసెనని చెప్పబడెను.

దీపావళి పండుగకై మిథిలకు చనుదెంచిన సోదరులు నల్వురు, "హరు ధనుర్భంగం బొనరించి సీతను గైకొనిన వైరంబు కారణంబుగ" జనకునిపై దాడి వెడలిన రాజులను పలాయితుల కావించిరి. ఆ సంఘర్షమున మూర్ఛిల్లిన భరతుని జాగృతుని కావించుటకై లక్ష్మణుడు శ్రీరామ ప్రేరణంబున ముద్గలముని శిష్యుల నెదిర్చి సంజీవిని గైకొనెను. అనంతరము దశరథుడు పుత్రయుక్తుడై ముని సందర్శనార్థ మరిగెను. రామావతార తత్త్వ మెరిగిన ముద్గలుడు సంతసించి, ఏకాంతమున దశరథునకు సీతారాముల మహిమను వెల్లడి కావించెను. ఇప్పట్టున జలంధర రాక్షస సంహారమునకై శ్రీ విష్ణువు వృందాదేవి పాతివ్రత్య భంగ మొనర్చి, లక్ష్మీ వియోగము సంభవించు శాపమును బడసిన వృత్తాంతము కూడ ముద్గలుడు దశరథున కెరింగించినట్లు ఇందు వివరింపబడెను. ఈ కథ ఆనంద రామాయణమున కలదు. అందు రామాదులు దీపావళి అయోధ్యయందే జరుపుకొనినటుల కలదు. భరత శత్రుఘ్ను లిద్దరును యుద్ధమున మరణించగా లక్ష్మణుడు సంజీవిని గొనివచ్చెను.

అహల్యా శాప వృత్తాంతమున ఇంద్రుడు కుక్కుట రూపమున గౌతముని కికురించినట్లు కలదు.

## అయోధ్యా కాండము:-

చిత్రకూటమున రామాదులు వాల్మీకి మహర్షి ఆశ్రమమునకు చనగా, మహర్షి శ్రీరాముని విష్ణ్వవతారమని స్తుతించి, స్వీయ వృత్తాంతము తెల్పెను.

"జనక సుత కాలిప్రేలు ముక్కునను బీకి రక్తమును బీల్చ" అని కాకాసురుని వృత్తాంతము కూడ వివరింపబడెను. కాని రంగనాథ రామాయణాదులందు కాకము సీతాస్తనములు చీరినట్లుకలదు. ఆనంద రామాయణాదులందు అంగుష్టమును చీరినట్లే కలదు.

రావణవధార్థమై కానలకు చనుమను నారదునితో శ్రీరాముడు చతుర్దశ వర్ష పర్యంతము కానలందు వసించెద నని చెప్పుటతో ప్రారంభమయి, పాదుకాపట్టాభిషేకముతో ముగింపబడెను.

## అరణ్య కాండము :-

జంబుకాసుర వృత్తాంతము వివరింపబడెను.

శూర్పణఖచే సీతారాముల వృత్తాంతమును ఎఱింగిన రావణుడు,

తోహరా॥ "రాము డెవ్వరో రాఁ గారణంబేమి నాతమీఁదరికి ?
ఆ మానవు డీ యసురుల జంపుట కేమి కార్య మాతనికి ?
మానవులకు నీమహిమ గలుగ సామాన్యమె యోజింపఁగను
దానవకులవిధ్వంసుడు హరి యవతార మెత్తె నేమోను ॥

కం॥ కావున నాతని చేతను
జావిఁక సిద్ధంబు నాకు; సరి యెటులయినన్
ఆ వైకుంఠం బలవడు;
నే వెఱవన నైన దీని నెఱుగంగఁ దగున్.

—అని దృఢనిశ్చయు డైనట్లు పేర్కొన బడెను. ఈ భావము అధ్యాత్మ రామాయణ ప్రభావమని పేర్కొనవచ్చును.

## కిష్కింధా కాండము :-

ఇది యథా వాల్మీక మన దగును.

## సుందర కాండము :-

సీతాన్వేషణమున లంకయందు పవనాత్మజుడు మండోదరిని సీతగా ముహూర్త కాలము భ్రమించుటకు హేతువు ఇందు వివరింప బడెను.

పార్వతీదేవి ఈ సందేహమును
"సిరి రూపమువలె హరిచే
మండోదరిని నిర్మించగఁ బడియెన్

సిరి యంశంబున, సీత యవ
తరించినది కావున సరిపడిరౌనన్"— అని విశదీకరించి మహేశుడు పిమ్మట మండోదరీ జన్మవృత్తాంతము కూడ వివరించెను. రావణ మాతయగు కైకసి నిత్యార్చన మొనర్చు శివలింగము శేషోచ్ఛ్వాసము చే రసాతలమున కృంగెను. మాతృదేవికి మహేశ్వరుని ఆత్మలింగము పూజార్థమై సమర్పింప సముకట్టిన దశకంఠుడు కైలాసమునకు చని, మహేశుని ఆత్మలింగము, పత్నిగ గిరిసుతను అనుగ్రహింప వేడెను. వరప్రదానము కావించిన ఈశ్వరుడు ఆత్మలింగము క్షితిపై నిడరాదను ఆంక్ష విధించెను. గౌరీప్రార్థితుడైన శ్రీ విష్ణువు లక్ష్మిని పోలిన వనితను సృష్టించి, పాతాళమున మయునకు ఒసగి, తాను బ్రాహ్మణ వేషధారియై రావణుని సమీపించి, మహేశ్వరుడు ఒసగినది కుహనా పార్వతిని మాత్రమే యనియు, ఈశ్వరపత్ని పాతాళమున మయుని కడ కలదనియు ఎరింగించెను. పిమ్మట రావణుడు ఆత్మలింగమును తన కొసగి లఘుశంకకై వెడలగా, లింగమును ధరపై నునిచి, అంతర్ధానము నొందెను. ధరపై శాశ్వతముగ తాపడమైన లింగమును కాంచి చింతిల్లి రావణుడు పాతాళమునకేగి, మండోదరిని పత్నిగ కైకొని లంక కేతెంచెను. తదుపరి శివలింగము స్థాపితమైన గోకర్ణక్షేత్రము కడ కేగి చతుర్ముఖుని గూర్చి తప మొనరించి, చిర కాలము లంకాపట్టణము నేలు వరము పొందెను.

—ఈ వృత్తాంత మంతయు అవాల్మీకీయము. ఆనంద రామాయణము న ఈ విషయములు కలవు.

శింశుపా వృక్షమున హనుమంతుడు సూక్ష్మరూపమున నున్నతరి, వనచరు డొక్కడు సీతాన్వేషియై లంక కేతెంచి, సూక్ష్మధారియై వృక్షాగ్రమున దాగియున్నట్లు స్వప్నము కాంచిన రావణుడు వికల మనస్కుడై అశోకవనమున కేతెంచినట్లు చెప్పబడెను.

లంకాదహనమునకు పిమ్మట హనుమంతునకు లంక స్వర్ణమయముగ కన్పట్టెననియు, అందులకు హేతువు విష్ణువరమున గరుత్మంతుడు భక్షించిన కరి మకరుల అస్థికలు స్వర్ణమయము కావింప

ఇవి లంకయందు విసర్జితము లయ్యెననియు, ఆ స్వర్ణమంతయు లంకా దహన సందర్భమున ద్రవించి లంక స్వర్ణమయముగ హనుమంతునికి కన్పట్టె ననియు ఈశ్వరుడు పార్వతికి వివరించినట్లు చెప్పబడినది.

—ఇదియు ఆనందరామాయణమున కలదు.

ఇంకను ఆనందరామాయణమునందున్నట్లు - లంకాదహనము తరువాత కిష్కింధాభిముఖుడైన పవనాత్మజునకు చతుర్ముఖుడు లంక యందలి దహన వృత్తాంతాదులను సంక్షిప్త పరచిన లేఖను రామునికై ఒసగిన వృత్తాంతము కూడ ఇందు కలదు. వాల్మీకి రామాయణమున సీతా సందర్శన వృత్తాంతము, శిరోరత్నము గ్రహించుట యందు పరవశించిన శ్రీరామునికి లంకాదహనము, రావణ పరాభవాది విశేషములు హనుమంతుడు నివేదించినట్లు పేర్కొనకుండుటంజేసి, బ్రహ్మ లిఖిత లేఖ ప్రవేశపెట్టబడి యుండును. ఇందు మూలమున రామచంద్రుని మ్రోల పావని లంకాదహనాది వృత్తాంతములను స్వీయముగా వివరించు అగత్యము లేకుండ కవి ఆశయము నెరవేరినది.

ఇట్లే యింకను రెండుమూడు ఆకర్షణీయాంశములు కలవు.

## యుద్ధ కాండము :-

సేతు నిర్మాణమునకు ముందు రామేశ్వర తీర్థకథ- అనగా రామ స్థాపిత శివలింగ వృత్తాంతము వివరింపబడెను. రంగనాథ రామాయణ మందలి ఉద్ధృత భక్తి కూడ నిందు కలదు. లంకయందు విడిసిన శ్రీరాముని సేనా వివరములను తెల్పి శుకచారణుడు శాప ముక్తుడయ్యెనని చెప్పి, శాపకారణమును కూడ కవి వివరించెను. శుకుడను తపోనిష్ఠా గరిష్ఠుడయిన ద్విజుని కడకు అగస్త్య మహర్షి అతిథియై చనుదెంచి, స్నానార్థము నదీ తటమునకు అరుగగా, వజ్రదంష్ట్రుడను రాక్షసుడు కుహనాగస్త్యుడై శుకునికడ కరుదెంచి, "మేక మాంసము బెట్టు నాకును మేదినీ సుర"- అని కోరెను. దనుజమాయ తెలియని శుకు డట్లే కావించి అగస్త్యునకు భోజన మిడెను- మహర్షి కోపించి అసురుడవు కమ్మని శాపమొసగి, పిమ్మట శుకుని నిర్దోషిత్వమును ఎరింగి, రామసేనా వర్ణనమునచే శాప విముక్తత లభించునని అనుగ్రహిం

చెను. అతిథులయెడ గృహమేధి కర్తవ్యమును తెలియజేయు కోర్కెతో కవి అధ్యాత్మ రామాయణమున గల ఈ వృత్తాంతమును ఇందు చేర్చియుండును.

సులోచనా సహగమనము, మైరావణుని యుద్ధము, హనుమంతుడు సంజీవి పర్వతమును కొనివచ్చు తరి రంగనాథ రామాయణమున గల కాలనేమి వృత్తాంతము, ఆనంద రామాయణమందలి మైరావణ చరిత్రము, రంగనాథ రామాయణమందలి రావణ పాతాళ హోమము కూడ ఇందు వివరింపబడెను.

ఇందలి కీర్తనల శైలి సరళమగు ద్రాక్షాపాకమున సాగెను. సంప్రదాయ సిద్ధములగు తోహరాలు, ముండరులు, దరువులు, పంచచామరాది వృత్తములతో మూడు నాలుగు చరణములను మించక అంత్యానుప్రాస, యమకాది నియమములతో పండిత పామర జనరంజకముగా ఈ హరికథ వెలువరించబడెను. ఇందలి "మునీంద్ర వీరెవరో తెలుపుము - మనోజ సుందర మంగళ రూపులు మేరుసమాన ధీరులు నతి సుకుమారులు-నెవరి కుమారులో వీరలు రాగల కారణమేమొ॥"- వంటి కీర్తనలు బహుళ వ్యాప్తిని పొందెను.

నారాయణ కవి తరువాత సింగరిదాసు, కృష్ణదాసు భక్త రామదాసు చరిత్రమును హరికథగా వెలయించిరి.

హరికథా ప్రకరణమున ముఖ్యముగ పేర్కొనవలసినవి హరికథా పితామహులగు శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసు కృత హరికథలు. పెక్కు హరికథలను రచించిన వీరు యథార్థ రామాయణము పేర పట్టాభిషేక పర్యంత కథను ఆరు హరికథలుగను జానకీ శపథము పేర శతకంఠ రావణ వధను వ్రాసిరి.

## యథార్థ రామాయణము :-

సంతాన హీనుడైన "దశరథు డొకనాడు వేటకై తరలి నట్టడవి లోన శాపగ్రస్తుడయిన విధము ప్రారంభమనే పేర్కొనబడెను. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయ ప్రబంధమందు కూడ ఈ

విధముగ ఆరంభముననే శాపవృత్తాంతము చెప్పబడెను– అందు శాప సమయమునకు దశరథుడు అవివాహితుడు.

అట్లు శాపగ్రస్తుడయిన అతడు "....వారి శాపమునఁగల్గు తనను కొడుకులకు మోదముం బొంది" నగరికి అరుదెంచెనట! కాళిదాసు రఘువంశ మహాకావ్యమందు కూడ ఈ విధముగనే శాపము వలన దశరథుడు పుత్రసంతానము కలుగ నున్నదని సంతసించినట్లు కలదు.

పిమ్మట "కాలము మళ్ళిన యీలుమగలేము–కలిగెదరెటు మాకు సుతులిపుడు"– అని దురపిల్లు దశరథునితో వసిష్ఠుడు "వనజాక్షుని వొల్లి నొక భవమునన్– ప్రార్థించితివి నీకుఁ గొడుకగుటకు"– కాన "శ్రీపతి నీ కొమారుఁడై రావణు– శిరములందునిమి కాపాడు జగము"– అని మొదలిడి జయవిజయుల శాపవృత్తాంతాదులతో భవిష్యత్తున సంభవించనున్న లక్ష్మీనారాయణుల వియోగమునకు హేతువు కూడ వివరించెను.

"తొలి నారదుఁడు చేసె దుస్తర తపము

ఆ తపమునకు భీతిల్లిన ఇంద్రుడు" పంపిన రంభాదుల వలన అక్షుబ్ధుడు కాని నారదుడు స్వమనోనిగ్రహమునకు అహంకార పూరితుడగుట గ్రహించి శ్రీవిష్ణువు మాయా పురంబొక్క దానిని నిర్మించి అందు జగన్మోహిని యను ఒక రాకుమార్తెకు స్వయంవరము జరుగు నట్లు ఏర్పరచెను. రాజకుమార్తె సౌందర్యము గాంచి మోహవశుడైన నారదుడు స్వయంవర సమయమునకు సుందరరూపము తనకు కల్గు నట్లు శ్రీహరి వలన వరము పొందెను. కాని తత్సమయమున శ్రీహరి ప్రభావమున నారదునకు కపిరూపము ఏర్పడి, కన్య శ్రీవిష్ణుని పతిగ వరించెనను– అనంతరము సర్వము విష్ణుమాయగా ఎరిగిన నారదుడు కుపితుడై,

"ఈ రాజరూపమున నీ
పరమణిన్ బాసి మిగుల నిడుమలఁ బడి బల్
కారడవిఁ గోఁతిసాయము
గోరి వరించెదవుగాక కోల్పడి ప్రజ్ఞన్"– అని శపియించెను. ఈ

సందర్భమున స్ఫురించునట్లు మండపమున నారదుని సంరంభము హాస్యరసోద్దీపముగ వర్ణింపబడెను.

చ॥ "అని తలపోయుచు చాపెడెన నమ్ముని యెంతయుఁ దేఱిచూచు,వీ
న నెగయిడుచున్, చిఱునగవుసారెగవచ్చెడు, బోరవచ్చు కొం
చు నిగిడి ప్రక్కవారిఁ గనుఁ జుల్కఁదనంబుగ నిలఁబాడు మం
తున సకిలించు, నిల్వఁబడుఁ బొట్టిలు మాటికిఁ
గూడుచుండెడున్."

ఈ కథ యనంతరము ఋష్యశృంగ వృత్తాంతము కలదు. ఈ హరికథయందు గమనింపదగిన అంశము దశరథ యజ్ఞారంభమునుండి రామజనన పర్యంతముగల కథ సమగ్రముగాను జయవిజయ, నారదాదుల శాపములు, ఋష్యశృంగ వృత్తాంతము దీర్ఘముగ నుండుట.

## సీతా కల్యాణము :-

దశరథుని కొల్వుకూటమునకు వచ్చిన విశ్వామిత్రుని వర్ణనగల
"ముడిపడి గడ్డము మోఁకాళ్ళ నొరయుఁగ
మునమలకుం బల్లజడలు తగుల
మొలచుట్టు పులితోలు ముంజేత జపమాల
యడుగులఁ బావకోళ్ళ మెరుచుండ''- అను పద్యము నంది తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధ మందలి ద్వితీయాశ్వాసమున నారద వర్ణనము స్ఫురింపజేయును.

రాముని పంపజాలనను దశరథుని పాత్ర జంపు, ధర్మపరము, పానుగంటివారి పాదుకా పట్టాభిషేక నాటకములందు మూర్తీభవించిన వత్సల రసముగా చిత్రింపబడిన దశరథపాత్రతో సరిపోలుచుండును.

తాటక ఆకృతి,

సీ॥ "పదఘట్టనమునకు బెదరి జంతులు పోఁక
బెను హుంకృతికి దెస ల్వ్రీలఁ దేఱ
వ్రేలాడు కొప్పున వెడలు తొంకలు చిక్కు
పడి నేల నూడ్చు చప్పుడు నొనర్పఁ

గాళ్ళకుఁ బగులు వృక్షంబు లిన్నియు గడ్డి
కొంపలవలెఁ జూప కొట్టుగొనఁగ
అడుగడుగునకు మధ్య నాపాటి యీపాటి
రేకులుం గుట్టలు నిముడుచుండ

లోనికిం బైటి కూర్పు పల్గులను లాఁగ
నరకపాలముక్తాభరణంబు లొసఁగ
నగ్ని కుండము లట్టు రక్తాక్షు లలర
వచ్చి తాటక పిడుగులు వడఁగ బల్కె"

—అని కన్నులకు కట్టునట్లు కాపింప బడెను.

సీతాకల్యాణమునందు ప్రధానముగ పేర్కొనవలసినది అహల్యా శాపవృత్తాంతము.

రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిల కరుగుచుండగా "ఒక రాయి, రాము పదముఁ దాకి భామిని యయి" రాముని పూజించి, గౌతముని చేర జనగా, గాధిసుతుడు తప్పుడు అహల్యా శాప వృత్తాంతము వారికి వివరించెను. ఇట్లు విమోచనము తదుపరి శాపవృత్తాంతము చెప్పబడుట ప్రేక్షకులందు ఉత్కంఠను రేకెత్తించు కోరికతో కానోపును,

మరియు, "గౌతముండు ఘోరతపముఁ — గావింప నోర్వ — కింద్రుం డా తపసి వేసమునఁ జని" — అహల్యను ప్రలోభ పెట్టుటకు యత్నించగా,

"ఆ యింద్రుఁడు తన్నంటకముందె య
హల్య యనియె శంకించి
నాయిలుఁ జొచ్చితి వెవడవురా నీవు
నా పతి రూపు ధరించి''

అనుచు దివ్వె వెలిగించి పోల్చె నా
యక్షపాదు నిల్లాలు
వెనువెంటనె యింద్రుఁ డని గుర్తించె
వేకనుల యూసవాలు ॥

ఇంతదుర్బుద్ధి యేల పుట్టె నీ
కిప్పుడో వేల్పుకోఁడ
సుంతయైన నొప్పుకొందువా నీ
సుదతిం బరుండు గూడ ॥

స్వర్గం బేలెడు వాఁడవు నీకున్
జన దీపోగాలంబు
మార్గంబుఁ దప్పి మర్యాదఁ బొలఁగి
మరగెదొ తుచ్ఛసుఖంబు ॥

సీ॥ స్వార్థపరులు రాజు లక్కట తమ కార్య
సిద్ధికై యితరులఁ జెఱచు చుందు
రక్షపాదున కెట్టులైనఁ గోపంబుఁ దె
ప్పించి యాతం డొనరించు తపము
పాడుచేయుట కిట్లు పన్నితి వావట్టి
దట్టు నాపై నింక బుట్టుఁ గనుక
స్వయముగా ధర్మదేవత వచ్చి నన్నంటు
పఱకుఁ బాషాణ రూపమున నుందు

నను చుఁ దన సతీత్వమహిమమున నహల్య
రాయి యౌటకు మిగుల సంబ్రంబు నంది
యేఁగుచుండిన యింద్రున కెదురువచ్చి
గౌతముఁడు—'' శాపంబిడగా, ఇంద్రుడు,

"మునివర్య నీ కల్కఁ బుట్టించి నీ తపోభంగ మొనరింపఁ బూనుకొన్నాఁడఁ గనుక నేనెట్లైనఁ గానిమ్ము దేవగణము నెమ్మది నుండఁ గల్గినంబాలుఁ దనవారికెల్ల హితంబగునట్లు తాఁ జరియించుట ధర్మముకాదె" ॥— అని పల్కెను.

వాల్మీకి, అధ్యాత్మ రామాయణాదుల కంటె భిన్నమయిన యీ కల్పనము అహల్యా సంక్రందన వృత్తాంతమునకు నూతనత్వము ఒసగుచు, వారి మహోదాత్తతను వ్యక్తపరచు చున్నది.

రామలక్ష్మణులు మిథిల కేతెంచిన పిమ్మట

"జనక జాత, చేత శ్రీరామచంద్రుని చిత్రమూని పరపురం బొక్కి.... వీని పటమే యింత వెఱ్ఱి జేసెనన్ను దానెరాగజప్పుదటమె నాడుతెన్ను"— అని విరహాతుర యగుచుండిన సమయమున,

"నటకు జనకుండు వచ్చి....
శివు విల్లెక్కిడు మిషపై రావించితి వీరల నీవెల్లి
....నీకు దగిన యతని వరించుము తల్లీ"— అని చెప్పినట్లు

కలదు. ఇప్పట్టున విశ్వామిత్రుడు రాముడు అవతార పురుషుడను రహస్యము రామున కెరింగించెను.

పిమ్మట ఉద్యానవన విహారము సల్పుచున్న రామలక్ష్మణులు సీతా కన్యను గాంచుట, సీతారాముల పరస్పరావలోకనము, అన్యాపదేశముగ అనురాగ ప్రకటనము, అనంతరము రాత్రి వర్ణనము, సీతారాముల విరహ వర్ణనము మున్నగు అంశములు వాల్మీకి రామాయణేతరము లైనవి కలవు. సీతారాముల వివాహపూర్వమే పరస్పరానురాగ బద్ధులైరను అంశము తమిళమున కంబరామాయణమున కలదు. అందు మిథిలా నగర దర్శనాభిలాషతో రాజవీథిని అరుదెంచిన రాముని సీత అంతఃపుర సౌధగవాక్షములనుండి వీక్షించినట్లు కలదు. రాత్రి విరహ వర్ణనలు కూడ అందు కలవు. సంస్కృతమున జయదేవుని ప్రసన్న రాఘవ నాటకమున కూడ సీతారాము లుద్యాన వనమున కలుసుకొనుట కలదు.

శివధనుర్భంగానంతరము వివాహాది పర్యంతము వారి అనురాగము వర్ణింపబడెను.

"ఆ వధూవరుల కన్యోన్య వార్తలు తెల్పి
జేమబారుగ నేగు చెలుల చాలు

వలపు జాబులఁ దమ గళములఁ గట్టంగఁ
బడి టపా లందించు పావురాలు"— వారి నడుమ తిరిగెనట!
సీతారాముల వివాహము ఆంధ్రుల వివాహపు టాచారములతో వర్ణింప బడెను.

## శ్రీరామ పాదుకా పట్టాభిషేకము :-

శ్రీరాముని వనవాస సంరంభము సంక్షిప్తీకరింప బడెను.
"అనుచు మూర్ఛ మున్గినటు లూరకుండిన
జనకుకాళ్ళ కెఱగి సవతితల్లి
కైక యిడిన నారకోకలు ధరియించి
భూమిజాత కనియె రాము డిట్లు"—

ఇప్పట్టున సీతామనోవేదన వర్ణింపబడిన సీసపద్యము భాగవతమునందలి "మందార మకరంద మాధుర్యమున"— పద్యమును స్ఫురింపజేయును. వనమునకు చను రాముని కాంచి అయోధ్యావాసుల దుఃఖము కూడ ఈ పద్యభాగముననే వర్ణింపబడెను.

మువ్వురు తాపసజనయుక్తమగు వేషధారణముతో కౌసల్య సన్నిధికి చనగా, ఆమె వెరగంది విషయము తెలిసి దుఃఖించెను.

శ్రీరాముని వెంబడించి కానల కేగ అయత్తపడిన అయోధ్యా పురవాసులకు వశిష్ఠుడు రామావతార హేతువు వివరించి వారిని శాంత పరచెను. అవాల్మీకీయమగు ఈ అంశము అధ్యాత్మ రామాయణమున కలదు. కాని అందు వామదేవమహర్షి ప్రజల నుద్బోధించెను. (అధ్యాత్మ రామాయణము — అయోధ్య — పంచమ సర్గ).

రంగనాథ రామాయణాదులవలె యిందు కూడ "తానీ రేడేండ్లు లక్ష్మణుఁడు నిద్రమానుటకు భీష్మించె".

అధ్యాత్మ రామాయణము వలె నిందు కైక పశ్చాత్తప్తయై రాజ్యమును స్వీకరింపవలె నని శ్రీరాముని వేడెను.

## శ్రీరామ సుగ్రీవ మైత్రి :-

విరాధ వధ సందర్భమున "సీతంబట్టుట కుంకించెడు — నా రాక్షసుని కరంబుఁ దునిమెఁ గోపమున లక్ష్మణుం డొక్క తూపుచే

దక్షిణంబు"— అని చెప్పబడెను. వాల్మీకి రామాయణాదులయందు విరాధుడు సీతను గొని మింటి కెగయ బ్రయత్నించెను.

రంగనాథ రామాయణాదు లందలి జంబుకాసుర వధ వృత్తాంతము శూర్పణఖచే సూచిత మయ్యెను.

రావణుడు మూర్ఛిల్లిన సీతను స్పృశింపక "ఆ పెన్నెలపున నిల పెల్లెత్తి యరదముఁ గొనిపోయె"నట. కంబరామాయణమున ఆశ్రమద్వితీయముగ రావణుడు కొనిపోయెను.

సీతాపహరణము తదుపరి రామసుగ్రీవ మైత్రి పర్యంత కథ సంగ్రహముగ చెప్పబడెను.

## హనుమత్సందేశము :-

"ఎట్టులైన నా భార్యను ననుఁ గలుపుమా తొల్లి'' అని కోరిన సుగ్రీవుని శ్రీరాముడు సానునయముగ వాలితో సంభాషింప పనిచెను. అట్లు తన సన్నిధి కేతెంచిన సోదరుని సరకుసేయక. ''రాముని చెంతకుఁ గావుమను బోయెడు సుగ్రీవుని వెంటఁ దఱుము వాలిన్, జను మఱ శరమేసి రామచంద్రుడు గూల్చెన్''— అట్లు "నిర్గిన వాలి యుం మండి మిగుల నరుదుగ నొక వెలుఁగంతట వెడలి కనువారలెల్లరు-స్గడు వెఱగందఁ గలిసె రామునిలోన"—వాల్మీకి రామాయణాదులందు వాలి సంహారమున శ్రీరాముని కాపాదింప బడిన దోషము తన కృతియందు నివారించుటకు కవి యిట్టి కల్పన కావించి యుండనోపును.

ఇందు తార వాలితో సహగమనము కావించినట్లు చెప్పబడెను. సుగ్రీవు డంగదునకు రాజ్య మప్పగించి,

తారాజ నామమాత్రము వహించి సీ
తను నిన్నుఁ గూర్చిన దాఁక బ్రహ్మ
చర్యవ్రతం బూని జానకి నరయ నల్
దెసల వానరులఁ బుత్తెంచి వచ్చె''— నని హనుమంతుడు రాము

నికి వివరించెను. ఇట్లు తారాసుగ్రీవుల శీలము ఉదాత్తముగ చిత్రిత మయ్యెను.

రావణుని కొలువున హనుమంతుడు "రావణు డుల్కిపడ దక్షిణంపాసనము కన్న నెత్తుగ(దన లాంగూలముం జుట్టలు చుట్టి దొంతర పెట్టి గద్దియనొనర్చి కూర్చుం"డెనట! ఇట్టి సన్నివేశము జానపద గేయ సాహిత్యమున కూడ కన్పట్టును.

ఇంకను ఇందు అలతి మార్పులు కలవు.

## సామ్రాజ్య సిద్ధి :-

విభీషణుడు రావణుని త్యజించిన విషయము జనని కైకసి, సోదరుడు కుంభకర్ణునికి కూడ ఎరింగించి రామశరణాగతు డయ్యెను. రంగనాథ రామాయణాదులందు కైకసికి మాత్రము తెల్పినట్లు కలదు.

అంగదుని రాయబార ఘట్టమున అంగదుడు రావణునితో "నిను( జంకలో( బెట్టి - నీయాలి( జేపట్టి - నను(గాంచె వాలి నా - నామ మంగదు"డని చెప్పెను. అంగదుడు తారావాలుల పుత్రుడను నైతిహ్యము ఇచ్చట మాతృకగ గ్రహింపబడెను. ఈ విషయమును అంగదుడు రావణ సభలో వెల్లడి కావించి, సీతా పాతివ్రత్య ఘనతను ప్రశంసించుటయే కాక, తద్ద్వారమున మండోదరీ విషయమై రావణుని సభాముఖమున పరిహసించెను.

"కుంభకర్ణు న్మేలుకొలిపించి"న రావణుడు
"తంబా మనము తరింప(గ( - దరుణ మిదె సుమ్మా
లెమ్మా పరమాత్మలోన - లీన మింక(గమ్మా"- అని హెచ్చరించుటచే రావణుడు సర్వజ్ఞుడుగ చిత్రింపబడెను. అధ్యాత్మరామాయణాదులందుకూడ రావణుడు సర్వజ్ఞునిగనే పేర్కొనబడెను. రంగనాథాదులందు వలె ఇందు కూడ కుంభకర్ణుడు సర్వజ్ఞుడు.

రావణుడు తనకడకు గొనివచ్చిన రామలక్ష్మణుల శిరములు సీతయే మాయాశిరములుగ గ్రహించి రావణుని దూషించి నట్లు ఇందు కలదు.

సులోచనా సహగమనము మందోదరిచే సూచితము కావింపబడెను.

రావణ సంహారానంతరము సీత అగ్ని ప్రవేశ ఘట్టము ఇందు లేదు. పల్లకియందు తన సముఖమ్మునకు వచ్చిన ధరణిజను శ్రీరాముడు ముదమున స్వీకరించెను. మహాభారతమందును ఈవిధముగనే సీతాగ్ని ప్రవేశము పరిహరింపబడెను. కాని అందు తనను శంకించిన శ్రీరామ సంశయము తీర్ప సీత దేవతలను ప్రార్థించెను.

విభీషణుడు విరక్తి బూని ఇంద్రజిత్తు కుమారుని లంకాధీశుని కావింప, మందోదరి సంతసించి, పిమ్మట సహగమనము కావించె నని కలదు.

ఈ విధముగ యథార్థ రామాయణమునందు వివిధ రామాయణముల నుండి చిత్రవిచిత్రాంశములు, ఆకర్షణీయములయిన సన్నివేశములు గ్రహింపబడి హరికథ పండిత పామర హృదయైకవేద్యమగు నట్లు రూపొందింప నారాయణదాసుగారు ప్రయత్నించిరి.

యథార్థరామాయణమందు గమనీయార్హమగు విషయము ఏమన రామాయణమున విమర్శనమునకు ఆస్కారమున్న ప్రత్యంశము దోషరహిత మగునట్లు వివరించుటకు కావింపబడిన ప్రయత్నము.

ఇందు నారాయణదాసుగారు సుదీర్ఘ వచనములను అచ్చటచ్చట వెలయించిరి. సమకాలీన సామాజిక పరిస్థితులు ప్రత్యక్షముగ, పరోక్షముగ కూడ వానియందు సూచింపబడెను. మోక్షగుండ రామాయణమున ఇట్టివి కానరావు. యదార్థరామాయణమున ప్రసిద్ధ రాగములలో కీర్తనలు, మరాఠీ బాణీ హరికథలలోని తోహరాలకు మారుగ మంజరి (మంజరీ ద్విపద కాదు), ద్విపద, దండకము మున్నగునవి కలవు.

నారాయణదాసు హరికథల తరువాత బాలాజీదాసు కుశలవ విజయము, సంపూర్ణ రామాయణము మున్నగు హరికథలు ప్రఖ్యాతి పొందెను. తిరునగరి శేషయ్య శ్రీరామ పాదుకా పట్టాభిషేకము, సీతాకల్యాణము, సీతాపహరణము, శ్రీమదుత్తరరామచరిత్ర, కొమ్మూరి

బాల బ్రహ్మానందదాసు శ్రీరామకథాలహరి, ఉయ్యాలవాడ రామచంద్ర రాయకవి శ్రీరామ చరిత్ర, మారిశెట్టి సత్యనారాయణ శబరి చరిత్ర, దీక్షితదాసు భక్త రామదాసు, అయ్యగారి వీరభద్రరావు కుశలవ, రామదాసు చరిత్ర, కోనూరి భోగలింగదాసు శ్రీమత్సంగీతానంద రామాయణము, బాల, అయోధ్య, సుందర, యుద్ధకాండములు, బాబు పి. యస్. నౌషర్వాన్‌జీ కవి శ్రీరామ జననము, సీతాకల్యాణము, పరిమి సుబ్రహ్మణ్యదాసు (రఘువంశము ననుసరించి) రఘుకుల చరిత్ర, పెంటపాటి సర్వేశ్వరరావు భాగవతార్ భక్త రామదాసు, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భక్త త్యాగరాజు (సవ్యత్వము కలిగి ప్రచారములో గల హరికథ), ముత్తయ్య భాగవతార్ కౌసల్యా పరిణయము, హరినాగభూషణము గారి త్యాగరాజస్వామి చరిత్ర (మూడు భాగములు), విభీషణ శరణాగతి, పాదుకా పట్టాభిషేకము - ఇత్యాది హరికథలు అసంఖ్యాకములుగ వెలువడెను. స్థలవిస్తరణ భీతిచే హరికథా ప్రక్రియ యందు రామకథా సంవిధానము వివరించుటకై కొన్ని హరికథలు మాత్రమే సవిస్తరముగ పేర్కొనబడినవి.

# బుఱ్ఱకథ—రామాయణము

ఆంధ్రదేశమున విశేషజనాదరమును బడసిన దేశప్రక్రియ లందు బుఱ్ఱకథ ఒకటి. యక్షగానాది ప్రదర్శనముల తిలకించని ఆంధ్రు లుందురు కాని బుఱ్ఱకథ విననివారు తెలుగుదేశమున మృగ్యమనిన అతిశయోక్తి కాజాలదు. నిశ్చితాభిప్రాయము లేక ఎదుటివ్యక్తి భావములతో ఏకీభవించువానిని 'వంతపాటగాడు' అందురు. పండిత పామరహృదయాహ్లాదకారి యగు బుఱ్ఱకథను పద్యములు, తోహరలు, వచనములు, రాగతాళయుక్తములగు కీర్తనలతో నవరసములు మేళవించుటచే ఉత్తేజకరమగు ప్రబోధాత్మక ప్రక్రియగా పేర్కొన తగును. దేశభక్తి పూరితములగు కథలు బుఱ్ఱకథలుగా అధికముగ స్వీకరింపబడినను, భారత రామాయణేతివృత్తము గల బుఱ్ఱకథలు కూడ లెక్కింపదగిన సంఖ్యయందే కలవు. ఈ ప్రక్రియయందు రామాయణము స్వీకరింపబడిన విధానమును ఎరుంగుటకై నదీరా వ్రాసిన రామాయణ బుఱ్ఱకథ ఈ ప్రకరణమున వివరింపబడుచున్నది.

నదీరా సంపూర్ణ రామాయణమును శ్రీరామ జననము, సీతా కల్యాణము, పాదుకా పట్టాభిషేకము, సుగ్రీవ విజయము, లంకా దహనము, రావణ సంహారము, లవకుశ — అను బుఱ్ఱకథలుగా రచించెను.

## శ్రీరామ జననము :-

దేశమాత ప్రార్థనముతో ప్రారంభమయిన ఈ బుఱ్ఱకథ యిందు:

"శ్రీకరముగ శ్రీరామచంద్రుని
స్థిరముగ మది నెంచి
శ్రవణానందం బొప్ప తంబురా

ప్రతులను పలికించి
జోడు గుమ్మెటలు అంజెలు గజ్జెలు
జోడుగ మ్రోగంగ
జోడుగ వంతలు కూడి ఆడుచును
జోడుగ పాడంగ
రామకథను విన్పించెద..."

—అనుచు తొహరాయందు బుఱ్ఱకథా లక్షణము వివరింప బడెను. ఇందు "సిరి సంపదలకు పెన్నిధి వరనది-సరయూనది..." అనుచు అయోధ్యానగరము సరయూ తటమున ఉండినట్లు పేర్కొన బడెను. కాళిదాసు రఘువంశ కావ్యమున కూడ 'సరయూనది' అనియే ఉల్లేఖింపబడుట గమనార్హము.

ఋశ్యశృంగుని వృత్తాంతము ఇందు లేదు. "ఋష్యశృంగుడు మాత్రమే సమర్థుడని వసిష్ఠుడు చెప్పగా, దశరథుడు ధన్యోస్మి అనుకున్నాడు. అనంతరం ఋష్యశృంగుని రావించి దశరథుడు అపరిమితమైన శ్రద్ధాభక్తులతో ఆ పుత్రకామేష్టిని చేయసాగాడు"-అని యజ్ఞ వర్ణన కావింపబడెను.

శ్రీరామాదుల బాల్య వర్ణనా ఘట్టము "చిన్నరాముని విశ్వరూపమును — కన్నతల్లి కౌసల్య జూచెరా"— అని అధ్యాత్మ రామాయణ పరముగ పేర్కొనబడెను. ఇందు శ్రీరామాదులకై మాతృమూర్తుల లాలిపాటలు మున్నగునవి కలవు. దశరథుని ఆనందము, శ్రీరాముని పితృభక్తి మున్నగునవి విపులముగ వర్ణింపబడెను.

## సీతా కల్యాణము :-

సీతారాముల ప్రార్థనతో ప్రారంభమయిన ఈ బుఱ్ఱకథ యందు

"తందాని తందాని తందన
ముప్పురు సతులతో నల్గురు సుతులతో
మూడు పువ్వులుగ ఆరు కాయలుగ
అయోధ్యానగరము రాజధానిగా

అందచందముల కోసల నేలి
ధరపై దైవంబే నడిపించెను
దశరథుండు నాడు ॥తందాన॥

.... .... ........ ... .... .... .... ....

కష్టజీవి అదృష్టమాయెను
కష్టించేసేది కొలది కనకం

.... .... ........ ... .... .... ....

రాజు పేదల భేదము లేదని
ప్రజల సౌఖ్యము పెంచినాడు

........................

మనుష్యుకు లేదు లోటు లవము
మానవులంతా శ్రామికులవలె
ఒళ్ళు వంచిరి సిరులు పెంచిరి"— అను గేయమున సమకాలీన సమాజ స్వరూప, స్వభావములు ధ్వనించెను.

విశ్వామిత్రుని వెనువెంట రామలక్ష్మణులను పనుచుటకు సంకోయించు దశరథునితో వశిష్ఠుడు "రాజా! మీరు భీతి చెందవలదు. శ్రీరాముడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే! దనుజ సంహారానికై ధరపై మీ యింట వెలిశాడు" —అని వివరించుట అధ్యాత్మ రామాయణాను సారముగా జరిగినట్లు భావింప నగును.

అహల్యా శాప విమోచన ఘట్టమున

"అందచందముల ఐరవి అహల్యను
ఇంద్రుడు మోహించె
ఆమె భర్త లేనట్టి సమయమున
అతడు మోసగించె
శీల మపహరించాడు ఆమెకు
శరిమే తెగపోయె
తాళము చెడిన గీతమ్ము పోలె
తల్లడిల్లె నామె"— అనుచు అహల్యా నిర్దోషత్వమును

నకై ప్రయత్నము జరిగినది. ఆధునిక సారస్వతము నందలి నాటకాదులు పెక్కింటియందును అహల్యాసౌశీల్యనిరూపణయత్నము కావింపబడుట గమనార్హము. హరికథా పితామహ శ్రీమదజ్జాడాది భట్ల నారాయణదాసు తమ హరికథ యందు ఇంద్రుని దుర్నయమును ఎరింగిన అహల్య స్వీయ సౌందర్యమునకు రోసి, శిలాకృతిని ధరించి నట్లు వర్ణింపబడుట ఇప్పట్టున గమనింపతగిన అంశము.

సీతాస్వయంవరమునకై మిథిలకు ఏతెంచిన రామలక్ష్మణులును "పూజకొరకు, గురుపూజ కొరకని... శ్రీ మహేశ్వరిని కొల్చుట కొర" కని సీతాదేవియు ఉద్యానవనమున ప్రవేశింప, అచ్చట 'సీతారాముల చూపులు కల'సినట్లుగా నిందు పేర్కొనబడెను. అవాల్మీకీయమయినం వివాహత్పూర్వ సీతారాముల పరస్పర వీక్షణానురాగములు కంబ రామాయణాదులందును కూడ వర్ణితమయ్యెను. కంబరామాయణమున మిథిలాపుర వైభవము తిలకించుచు రాజవీధియందు చరియించు శ్రీరాముని అంతఃపురసౌధగవాక్షమునుండి సీతాకన్య దర్శించినట్లు పేర్కొన బడెను. జయదేవుని ప్రసన్న రాఘవనాటకమున (సంస్కృతము) సీతారాము లుద్యాన వనమున కలుసుకొనినట్లు కలదు.

శివధనుర్భంగమునకై నిర్దేశింపబడిన సభాస్థలికి హస్తములలో వరమాలనుధరించి సీతాకన్య కూడ ఏతెంచినట్లు ఇందు వర్ణింపబడెను. శ్రీరాము విజయమునకై "మదిలోమాత్రం కులదేవులకు — మ్రొక్కు కున్నదామె" అనుచు సీతాందోళనము వివరముగ వర్ణింపబడెను.

''తందాన తందాని తందన
శ్రీరామునివై పోకపరి చూచును
శివధనుస్సువై పోకపరి చూచును
అతని జూచి పొంగిపోవును
-ఆ వింటిని జూచి క్రుంగిపోవును."

## పాదుకా పట్టాభిషేకము:-

ఇందు కథ యథావాల్మీకము — అయా సన్నివేశములందు సందర్భోచితములగు రసములతో కీర్తనాదుల మేళవించుటచే కథకు పటు

త్వము, హెచ్చి జీవము ఇనుమడించెను. వర ప్రదానము కావించుటకు దుఃఖించు పతిని గని నయమున కార్యానుకూలతకై వేచి యుండిన కైక ఒక్కుమ్మడిగ నేయిపోసిన హుతాశనకీలవోలె భగ్గుమని,

"భళానోయి భాయి తమ్ముడా
మేల్ భలానోయి దాదానా
కైక కన్నులను చూడరా
కణకణ మండుచు నుండెర
క్రోధముతోడ లేచెర
క్రోడె త్రాచువలె చూచెర ॥తధిగిణతోం॥ — ఈ విధముగా

రూక్షణత్వమును వాల్చినదట! ఈ విధముగనే అరణ్యమున భరతుని సేనల గాంచిన లక్ష్మణుడు

ధనుర్బాణములు తీసెర
దండధరునివలె తోచెర
అమ్ము వింట సంధించెర
ఆకర్ణాంతము లాగెర" — అనుచు రోషావేశ పరవశుడైన వీరునిగ వర్ణింపబడెను.

## సుగ్రీవ విజయము :-

యథావాల్మీకముగ సాగిన ఈ బుఱ్ఱకథ యందు అలతి మార్పులు కానవగును. ఇందు జటాయువు 'జనకుని ప్రాణమిత్రుని'గా పేర్కొనబడెను. వాలి సుగ్రీవుల కలహ కారణము పరిత్యక్తమయి కేవలము "వాలి అగ్రజుడయ్యు నీతి నియమం మాలి - వెకిలి వేసాల్ వేయసాగాడయా సుగ్రీవు నాలిని చెరబట్టి కొండలకు - సుగ్రీవుని తరిమివేశాడయా" — అని మాత్రము చెప్పబడెను. ఈ బుఱ్ఱకథయందు

పంచవటిని జేరారుర
పర్ణశాల వేశారుర
ముచ్చట గొలిపే స్థలమంటి
ముచ్చరి పూజాఫలమంటి ॥

అందచందముల నిలయమురా
ఆనందలక్ష్మికి నిలయమురా ॥
నిగనిగలాడే లేళ్ళుర
ఎగసి దూకు కుందేళ్ళుర
ఎటు జూచిన సెలయేళ్ళుర
ఎంతో తియ్యని నీళ్ళుర ॥

నట్టనడుమ సీతమ్మను వుంచి
నాట్యంచేసే నెమిళ్ళురా ॥

మిలమిలమంటూ జింకలు
బిలబిలమని గోరింకలు
జంటజంటలుగ గువ్వలు
మింగి కెగిరెడి జువ్వలు ॥

చూచిన కన్నుల పండుగరా !
చూడని కన్నులు దండుగరా ॥

జలజలపారే నదులుర
కలకల నాదపు రొదలుర
ఝుంఝుంమను తుమ్మెదలుర ॥

విరామ మెరుగని ప్రణయాలు
విశ్వసృష్టి కాభరణాలు ॥

ముచ్చటైన రామచిలుకలు
ముద్దులొలుకు చిలుక పలుకులు
.... .... .... .... .... .... .... .... .... ....

వనము కాదు కుందన మదిరా !
వారికి తరుగని ధన మదిరా ॥

సీతాఫల వృక్షముల పై
చిన్నచిన్న వానరులుర !

కలికి సీతనే చూచిరి
కళ్ళు రెండు చికిలించిరి ॥

పళ్ళికిలిస్తూ లేచారు
పళ్ళుకోసి క్రిందేశారు ॥

వనచరులౌ వానరులుర
వైదేహికి అనుచరులుర
సీతను చూచి జడువరు
శ్రీరాముని క్షణము విడువరు ॥ – వంటి మనోజ్ఞములైన వర్ణనాత్మక కీర్తనలు ఇందు కలవు. భావ్యార్థసూచనగ వానరుల తోడి సీతారాముల చెలిమి ఎంతయేని మనోహరమగు భావము.

## లంకాదహనము :-

ఇందు జాంబవంతుడు "భూమ్యాకాశాలు రెండింటిని రెండు తాళాలుగా చేసి వాయించిన మహాబలశాలి"గా వర్ణింపబడెను. ఆంజనేయుడు లంకయందు లంకిణిని సంహరించినట్లు కలదు.

విస్మృతి –

"విభీషణుని తా కలిసెర
వివరము లన్నియు తెలిసెర" — అని అవాల్మీకీయాంశము చెప్పబడెను.

అశోక వనమున సీతాదేవితో సంభాషించిన రావణుడు ఆమెకు ముప్పది రోజుల గడువు మాత్రమే ఒసగెను. వాల్మీకి రామాయణమున రెండుమాసముల గడువొసగినట్లు కలదు.

## రావణ సంహారము :-

ఇందు అవాల్మీకీయాంశములు కలవు. "మీరు నీటపడవేయు వస్తువులు - మునుగకుండుగాక - జలధిపైన అవి బెండులవోలె - తేలిపోవుగాక!" అను శాపము నల, నీలురనే సోదరులకు మును -

లిడినట్లు సముద్రుడు శ్రీరామునకు తెలియపరచెను. వాల్మీకి రామాయణమున నీలునకు మాత్రము ఇట్టి శాపము కలదు.

శ్రీరాముడు లంకలో విడిసిన విషయము అనుచరులవలన ఆకర్ణించిన రావణుని దశకంఠము లొక్కమారుగ పలికెనట! "అదియే అతడికి అంత్య కాలమని - అతడు గ్రహించెనట!'' అట్లు దశకంఠములతో అప్రయత్నముగ పలికిన మరణ మాసన్న మగునని రావణునకు శాపమున్నట్లు ఇందు చెప్పబడెను.

రాయబారానంతరము తన్నెదుర్కొన సంసిద్ధులైన రక్కసిమూకలతో, ''తన పాదం భూమ్మీదపెట్టి... నా ఈ కాలు కదపండి చాలు'' -అని 'సవాలు' కావించెను. ఇదియు అవాల్మీకము.

ఇంద్రజిత్తు నికుంభిళా హోమము మున్నగు అంశములు పరిత్యక్తములై కేవలము "లక్ష్మణుడు ఒక్క బాణంతో ఇంద్రజిత్తును కూల్చివేశాడు'' అని సంక్షిప్తీకరింప బడెను.

లక్ష్మణమూర్ఛ సన్నివేశమున సంజీవినీ పర్వతమును అయోధ్యామార్గమున కొనివచ్చు ఆంజనేయుని భరతుడు గాంచి ''అదేదో రక్కసిగా భావించి" శరమున నొప్పించెను. భువిపై కావించిన రామస్మరణమున పశ్చాత్తప్తుడై భరతుడు శ్రీరామ స్మరణమున వాయుసూనుని సంతృప్తుని కావించి, విషయమును గ్రహించెను. అవాల్మీకీయమగు ఈ ఘట్టము రంగనాథ రామాయణమునను, పెక్కు జానపద గేయములందును కాంచనగును.

కుంభకర్ణుని మేల్కొల్పుటకై విఫల ప్రయత్నములు కావించిన రక్కసులు ''మేకపోతును తెచ్చి - ముక్కులోకే తోల" కుంభకర్ణుడు మేల్కొంచెనట. ఇప్పట్టున హాస్యరసము పోషించిన విధానము గమనింపతగినది.

రణరంగమున "రావణుని పొట్టలో అమృతభాండం వుంది-అదే అతని ఆయువుపట్టనీ విభీషణుని వల్ల విన్న శ్రీరాముడు" -శరప్రయోగమున అమృతభాండ విచ్ఛేదము కావించినట్లు చెప్పబడెను.

అవాల్మీకీయమగు ఈ అంశము తెలుగు రామాయణ కథ లందు కాంచ నగును.

పతి మరణమున దుఃఖితయగు మండోదరికి శ్రీరాముడు "రావణుని కాష్ఠం చల్లారునందాక నీకు వైధవ్యం లేదు" అని వరమొసగినట్లును – తత్కారణముననే ఆంధ్రులు మకర సంక్రాంతి దినము లందు భోగి పండుగ జరుపుకొందురనియు విశేషాంశము ఒకటి ఇందు కలదు.

## లవకుశ :-

ఇందు కుశుడు మాత్రం సీతారాముల కుమారుడనియు లవుడు వాల్మీకి తపః ప్రభావమున 'లవలు' నుండి జనించెనను ఐతిహ్యము స్వీకరింపబడెను. ఒకనాడు నదీతీరమునకు చనుచుండిన సీతాదేవి ఒక మర్కటము తన అయిదు శిశువులను ఉదరమునకు బంధించి కొనిపోవుచుండుటగాంచి, మరలి వచ్చి ఆశ్రమమునుండి కుశుని కొనిపోయెను. ఈ విషయము నెరుగని వాల్మీకి మహర్షి తత్తరపడి సీతమ్మ దుఃఖింపకుండుటకై 'లవలు'చే లవుని సృష్టించెను– పదంపడి విషయమును సవిస్తరముగ తెలుసుకొనిన సీతాదేవి, వాల్మీకాదేశానుసారము లవుని కూడ పుత్రునిగ స్వీకరించెను.

'మా కన్న తల్లి జానకీదేవి మహాపతివ్రతే అయితే ఈ రెండు బాణాలు రాముని మూర్ఛిల్ల చేయుగాక"– అను కుశలవుల వాక్యమున సత్యము గ్రహించిన శ్రీరాముడు మూర్ఛాపరవశుడు కాగా వాల్మీకి మంత్రోదకమున సేదదీర్చెనని నాటకీయముగ చెప్పబడెను. పాతివ్రత్య నిరూపణమునకైగాక– సీతాదేవి ఇందు "అవమానం పొందిన చోట ఇక అడుగు పెట్టలేను – నేను నా తల్లి భూదేవివద్దకు వెళ్ళిపోతాను" అని పలుకగా, భూదేవి ఏతెంచి ఆమెను స్వీకరించినట్లు పేర్కొనబడెను.

బుఱ్ఱకథలందు రామాయణము యథా వాల్మీకముగనే స్వీకరింపబడినను, బుఱ్ఱకథ కథకుడు రంగస్థలమున ప్రేక్షకులకు చెప్పెడి

ప్రక్రియ కావున సామాజికులయందు ఉత్కంఠోత్సాహములు ఆద్యంతము కలిగి, వీటియందు సన్నివేశోచిత మగు రసావేశము కథకుని యందు ఉద్దిష్టమగుట అత్యావశ్యకము. తత్కారణమున తదనుగుణమగు రాగములందు కీర్తనాదులు బుఱ్ఱకథ లందు కూర్చబడెను. సందర్భానుగుణ మగు ప్రసంగములు, పిట్టకథలు కూడ వంతలు చెప్పుచుందురు. ఇటువంటి సందర్భోచిత సంభాషణము లీ బుఱ్ఱకథ లందు పెక్కు కలవు. ఇవి సాధారణముగ హాస్యరసోద్దీపకములుగ నుండును.

రామాయణేతివృత్తముతో పెక్కు బుఱ్ఱకథలు కలవు. రామదాసాది రామభక్తుల జీవిత వృత్తాంతములతో కూడ బుఱ్ఱకథలు తెలుగు దేశమున ప్రచారమున నున్నవి.

---

# తెలుగునాటకము–రామకథ

భరతముని నాట్యశాస్త్రము (సంస్కృతమున) సాహితీకారులకు ప్రమాణ గ్రంథమై, 'కావ్యేషు నాటకం రమ్య' మ్మని – కవి పండిత ప్రకాండులు అంగీకరించినను, శకుంతల నాటకము రమ్యతరముగ ప్రశంసల నందినను, వ్యాసభారత, వాల్మీకి రామాయణాది కావ్యములు ఆంధ్రీకరింపబడినవి కాని అభిజ్ఞాన శాకుంతలాది నాటకములు ఆంధ్రీకరణ భాగ్యమును పొందలేదు. నాటక లక్షణములు (సంభాషణ పాత్ర ప్రవేశ సూచన ఇత్యాదులు) మాత్రము కావ్యములందు ఆయా పట్టుల పాటింపబడెను. తంజావూరు మధుర నాయక రాజుల కాలమున దక్షిణ దేశమున అధిక సంఖ్యలో వెలువడిన యక్షగానములు తర్వాతి కాలమున నాటకములుగ కొందరిచే సంభావింపబడినను అవి సంస్కృత లక్షణ భిన్నములు అగుటచే దేశీయ నాటకములుగ మాత్రము గుర్తింపబడెను. ఈ విధముగ, డా॥ దివాకర్ల వేంకటావధానిగారు నుడివినట్లు "ఆంధ్ర దేశమున క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధము వరకును మన మిప్పుడు చూచుచున్న నాటకమువంటి నాటకములు బయలుదేరలే దని చెప్పవచ్చును".

ఆంధ్ర నాటకరంగ వికాసముతోపాటు తత్ప్రక్రియందు రామకథ బహుముఖ వ్యాప్తిని పొందెను. నాటకమున ప్రదర్శనానుకూల్యత, జనాకర్షణీయత్వము మున్నగు అంశములు ప్రాధాన్యము వహించుటం జేసి రామకథాంశములు జానపద వాఙ్మయాదులందు వలెనే పెక్కు మార్పులను పొందెను. అందు ప్రధానముగ పేర్కొనవలసినది కైకేయి

1. ఆంధ్ర నాటకకర్తలు అను పుస్తకమున డా॥ దివాకర్ల వేంకటావధానిగారి "ఆంధ్ర నాటక పితామహుడు" వ్యాసమునుండి.

4. క్రీ. శ. 1924 నుండి 1944
5. క్రీ. శ. 1944 నుండి అయిదవదశ.[1]

## క్రీ. శ. 1860 - 1886 :-

ఉత్తర హిందూస్థానమునుండి అరుదెంచి ధార్వాడనాటక సమాజము వారు ఒసగిన హిందీ నాటక ప్రదర్శనములకు ఆంధ్ర ప్రజలు తన్మయులగుట తిలకించిన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి, శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు, శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులు ఉత్తేజితులై సంస్కృత నాటకములను తెలుగులోనికి అనువదించిరి. అందు కోరాడ రామచంద్ర శాస్త్రిగారు (ప్రథమాంధ్ర నాటకము మధుకర మంజరీయము కర్త) ఉత్తర రామచరితము, ఉన్మత్త రాఘవములను సరళ రీతిని అనువదించిరి. శాపవశమున హరిణమయిన సీతాదేవికై శ్రీరాముడు ఉన్మత్తునివలె ప్రలాపించుట ఉన్మత్త రాఘవ నాటకేతివృత్తము. ఇది ప్రేక్షణమను ఉప రూపక విశేషణ మయ్యును లక్షణ సమన్వితము కాదు. ఉన్మత్త రాఘవ నాటకమును (1856–1936) తాడూరి లక్ష్మీనరసింహరావు కూడ అనువదించెను.

కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు ఆంధ్రీకరించిన నాటకములందు జయదేవుని (గీతగోవింద కర్త కాదు) ప్రసన్న రాఘవ నాటకము ఒకటి. ఈ ఆంధ్ర ప్రసన్న రాఘవ నాటకమువలె సాహిత్య రంగమున నిశిత విమర్శనమునకు గురియైన గ్రంథము మరియొకటి కానరాదు. “బాగుగనున్న చోటులను బన్నుగ మూలకృతీశు నెన్నుడే! బాగుగ లేనిచో నను( దవం దెగడుండు” అని వేంకటరత్నము పంతులుగారు నాటకారంభమున పేర్కొన్నను, వేదము వేంకట రాయ శాస్త్రిగారు “ఆంధ్ర ప్రసన్న రాఘవ విమర్శన'' మను సుదీర్ఘ గ్రంథమును వెలువరించి, అం దీ నాటకమందలివిగ 2568 దోషములను చూపిరి.

శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి శిష్యుడగు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రి క్రీ. శ. 1875 లో ఉత్తర రామచరితమును అనువదించెను.

1. తెలుగు నాటక వికాసము - Dr. P. S. R. అప్పారావుగారు.

చైతన్యోషః కాంతులు మెలమెల్లగ నలుదెసల విరియ నారంభించెను. సంఘ సంస్కర్తలు, దేశభక్తులలో ఒక్కుమ్మడిగ జాతి అంతయు నవ సమాజ నిర్మాణ సంరంభమున నిమగ్నమైపోయెను. దేశమున సంభవించిన ఈ క్రమ పరిణామమను సాహిత్యముపై కూడ తన ప్రభావము నెరపెను. సుఖదుఃఖములు రాగద్వేషములు తరతమ భేదములు లేకుండ, స్త్రీ పురుషులకు, ప్రభువునుండి దాసుని వరకు సమానమే యనెడి సర్వమానవ సౌభ్రాతృత్వవాంఛ దేశనాయకులు సంఘ సంస్కర్తలయందేకాక, కవులు రచయితలందు కూడ ప్రబలి వారి రచనలయందు తన ప్రభావమును చూపెను. రామాత్మకములగు నాటకములందు సహితము ఈ భావవిప్లవము కన్పట్టును. రామాయణ పాత్రలందు కైకాదుల నిర్మలత్వ చిత్రీకరణమునకు భాసుని ప్రతిమా నాటకాదులు కూడ తోడ్పడి యుండును.

ఏ నాటక విమర్శనమున కైనను ఆధారమగు 1. మూలగ్రంథములందు ఆయా పాత్రముల చరిత్రములు చిత్రించుటకు సన్నివేశ కల్పనము చేసికొన్న విధము,

2. తనకు వ్యక్తిగతముగా ఆయాపాత్రముల ఎడ గల అభిప్రాయములు,

3. తన కాలము వారిలో ప్రచారమందున్న భిన్నభావములు [1]

–అను అంశములతో పాటు పైన పేర్కొనిన అంశములను కూడ నాటకమున రామకథను పరిశీలించు పట్టున గమనింపవలెను.

'తెలుగు నాటక వికాసము'న నాటకము అయిదు దశలుగ విభజింపబడెను. ఆ విభజన ప్రకారము నాటకమున రామకథారీతి ఈ ప్రకరణమున వివరింపబడుచున్నవి.

1. క్రీ. శ. 1860 నుండి 1886
2. క్రీ శ. 1886 నుండి 1900
3 క్రీ. శ. 1900 నుండి 1924

---

1. భాసుని రామనాటకములు –శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి.

4. క్రీ. శ. 1924 నుండి 1944
5. క్రీ. శ. 1944 నుండి అయిదవదశ.[1]

## క్రీ. శ. 1860 - 1886 :-

ఉత్తర హిందూస్థానమునుండి అరుదెంచి ధార్వాడనాటక సమాజము వారు ఒసగిన హిందీ నాటక ప్రదర్శనములకు ఆంధ్ర ప్రజలు తన్మయులగుట తిలకించిన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి, శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు, శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులు ఉత్తేజితులై సంస్కృత నాటకములను తెలుగులోనికి అనువదించిరి. అందు కోరాడ రామచంద్ర శాస్త్రిగారు (ప్రథమాంధ్ర నాటకము మధుకర మంజరీయము కర్త) ఉత్తర రామచరితము, ఉన్మత్త రాఘవములను సరళ రీతిని అనువదించిరి. శాపవశమున హరిణమయిన సీతాదేవికై శ్రీరాముడు ఉన్మత్తునివలె ప్రలాపించుట ఉన్మత్త రాఘవ నాటకేతివృత్తము. ఇది ప్రేక్షణమను ఉప రూపక విశేషణ మయ్యును లక్షణ సమన్వితము కాదు. ఉన్మత్త రాఘవ నాటకమును (1856-1936) తాడూరి లక్ష్మీనరసింహరావు కూడ అనువదించెను.

కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు ఆంధ్రీకరించిన నాటకములందు జయదేవుని (గీతగోవింద కర్త కాదు) ప్రసన్న రాఘవ నాటకము ఒకటి. ఈ ఆంధ్ర ప్రసన్న రాఘవ నాటకమువలె సాహిత్య రంగమున నిశిత విమర్శనమునకు గురియైన గ్రంథము మరియొకటి కానరాదు. "బాగుగనున్న చోటులను బన్నుగ మూలకృతీశు నెన్నుడే! బాగుగ లేనిచో నను( దవం దెగడుండు" అని వేంకటరత్నము పంతులుగారు నాటకారంభమున పేర్కొన్నను, వేదము వేంకట రాయ శాస్త్రిగారు "ఆంధ్ర ప్రసన్న రాఘవ విమర్శన'' మను సుదీర్ఘ గ్రంథమును వెలువరించి, అందీ నాటకమందలివిగ 2568 దోషములను చూపిరి.

శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి శిష్యుడగు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రి క్రీ. శ. 1875 లో ఉత్తర రామచరితమును అనువదించెను.

---

1. తెలుగు నాటక వికాసము - Dr. P. S. R. అప్పారావుగారు.

తొలి రోజులలో వెలువడిన ఉత్తరరామచరిత నాటకానువాదములందు ఇయ్యది ప్రశస్తమైనదిగ మన్నన లందెను. యథామాతృకముగ కాకుండ, స్పష్టత కొరకు శాస్త్రిగారు స్వతంత్రమైన పోకడలతో దీనిని వెలయించిరి. నాటకాంతమున విక్టోరియా రాజ్ఞిప్రశంస కాననగును. ఈ నాటకములు రంగస్థలమున ప్రదర్శింపబడలేదు. ప్రథమాంధ్ర నాటకముగ రామకథయందు ఉత్తర రామచరిత వెల్వడుటచే అయ్యదియే ఇచ్చట వివరింపబడెను.

## క్రీ. శ. 1886 - 1900 :-

నాటక సాహిత్య చరిత్ర వికాస దశ అనదగిన ఈ కాలమున ఆంగ్లభాషాప్రభావము కూడ సంఘమున ప్రబలుటంజేసి ప్రాచ్య పాశ్చాత్య రీతుల భావముల సమ్మేళనముతో స్వతంత్ర నాటక నిర్మాణ యత్నములు త్వరితముగ సాగెను. అయినను రామనాటకములు కూడ అనువదింపబడుచునే యుండెను. ఈ కాలముననే కందుకూరి వీరేశలింగముగారు భవభూతి ఉత్తర రామచరితమును ప్రయోగార్థమై అనువదించి, తమ పదునారు నాటకములలో చేర్చిరి.

[1] శ్రీ కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీరామ జననము, సీతా కల్యాణము, సీతాపహరణము సుగ్రీవపట్టాభిషేకము, సీతాన్వేషణము-అనగా, ఇంచుమించు పట్టాభిషేకపర్యంత రామాయణము అంతయు నాటకములుగ రూపొందించి, ఇట్టి పద్ధతికి మార్గదర్శకులైరని చెప్ప వచ్చును.

శ్రీ వడ్డాది సుబ్బారాయుడు, మనోజ్ఞములైన కల్పనలతో ఉత్తర కాండ కథను సుఖాంతముగ సంస్కృతమున ప్రథమముగ రచింపబడిన కుందమాలా నాటకమును [2] అనువదించిరి. ప్రథమాంధ్ర కుంద మాలా నాటకము ఇదియే.

ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణములకు సమన్వయము కల్గించి, ఉత్తమములైన నాటకములను సుమారు ముప్పదికి పైగా వ్రాసినవారు

---

1. గుంటూరు హిందూనాటక సమాజ స్థాపకులు.
2. కర్త:- దిఙ్నాగుడు.

"ఆంధ్ర నాటక పితామహులు" శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులవారు నాటకాద్యంతము రసపోషణమును నైపుణ్యముతో పోషించుటయందు వీరు సిద్ధహస్తులు. శృంగార, కరుణ, హాస్య రసము లాయన నాటకములలో సముచితముగ పోషింపబడెను. పాదుకా పట్టాభిషేక నాటకమున వీరు కరుణమును అనన్యాదృశ మగునట్లు పోషించుటయే కాక, నాటకారంభములకు నిపుణముగ కావించిరి. పాదుకా పట్టాభిషేక నాటకమున ఇతివృత్తము ప్రదర్శనానుగుణములగు మార్పులను పొందెను. కైకేయీ నిర్దోషిత్వ ప్రకటనమునకు ఇందు యత్నములు జరిగెను. వరప్రదాన మాదిగ నాటకాంతమువరకు కైక పశ్చాత్తప్త హృదయము, నిష్కల్మషత్వమును ధర్మవరమువారు కరుణరసోద్వేలముగ చిత్రించిరి.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు (26-2-1867-17-6-1946) శ్రీరామజనన, సీతాకల్యాణములను రచించుటతోపాటు భాసనాటకచక్ర మందలి అభిషేక నాటకమును కూడ అనువదించిరి.

వేదము వేంకటరాయ శాస్త్రిగారు సుదీర్ఘమగు [1] ఉపోద్ఘాతముతో ఉత్తరరామ చరితమును అనువదించిరి. ఉత్తర రామచరితమును వీరు "అతిశాకుంతలము"గా భావించిరి. ఇది యథా మూలకము.

అచంట వేంకట సాంఖ్యాయన శర్మగారు (ఆంధ్ర భీష్మ బిరుదాంకితులు) ఉత్తరరామ చరితమును వచన నాటకముగ అనువదించిరి

కోలాచలము శ్రీనివాసరావుగారు శ్రీరామ జననము, సీతాకల్యాణము, పాదుకా పట్టాభిషేకము, లంకాదహనము, కుశలవ నాటకమును (అనగా సంపూర్ణ రామాయణము) రచించిరి. కుశలవ నాటకము పట్టాభిరామాయణ కథానుసారి యని వారే పీఠికయందు పేర్కొనిరి. వీ రింకను ఇరువది రెండు ఇతర నాటకములు వ్రాసిరి.

---

1. ఉత్తరరామ చరితమునకు ప్రథమమున వెలువడిన సుదీర్ఘమగు ఉపోద్ఘాత మిదియే. 70 పుటల పర్యంతము కలదు.

పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు కల్యాణ రాఘవము, పాదుకా పట్టాభిషేకము, వనవాస రాఘవము, విజయరాఘవము అను పేర్లతో రామ పట్టాభిషేక పర్యంత కథను నాటకీకరించిరి.

ఈ ద్వితీయ దశయందు రామాయణ గాథను పలువురు నాటకములుగ వెలయించిరి. మూల సంస్కృత నాటకములకు అనువాదములు కూడ అధికముగనే కన్పట్టును. ఉత్తర రామ చరితకు సుమారు పది అనువాదముల వరకును వచ్చెను. సామాజికాభిలాషానుగుణ్యముగ పాదుకా పట్టాభిషేకాది నాటకములందు పాటలు, పద్యములు కూడ సమకూర్చబడెను.

## క్రీ. శ. 1900 - 1924 :-

రాష్ట్రప్రభుత్వ అస్థాన కవులగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పెక్కురు కవులు శతాధిక వర్షములలో వెలయింపగలిగిన సాహిత్య సృష్టిని తా మొక్కరు కావించిరి. వీరి రామాయణ నాటకములు యథా మూలకములు. సుప్రసిద్ధ జంటకవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు వీరి శిష్యులే.

సెట్టి లక్ష్మీనరసింహముగారు 'అహల్య' వచన నాటకమును వ్రాసిరి. నాటక యక్షగానాది ప్రక్రియలందు అహల్యా చరిత్రము సముచిత స్థాన మాక్రమించుట విశేషము. దక్షిణాంధ్ర యుగమున అహల్యా సంక్రందనము వంటి కావ్యములు కూడ వెలువడెను. అహల్యా చరితము దక్షిణాంధ్ర యుగ మాదిగ ఆంధ్ర కవులను, రచయితలను ఆకర్షించి రామపాద స్పర్శనముననే శాపవిమోచనము పేర్కొనబడినను కావ్య, నాటక యక్షగానాది ప్రక్రియ లన్నింటను శృంగార రసాత్మకముగ అహల్యా చరితము వర్ణింపబడుట విశేషము. ఎడనెడ అహల్యా నిర్దోషత్వమునకై కూడ ప్రయత్నములు జరిగెను. నవ్యాంధ్ర కవిత్వ యుగ నిర్మాతలలో ప్రముఖులగు రాయప్రోలు సుబ్బారావుగారు అహల్యా వృత్తాంతము అమలిన శృంగారమునకు ప్రధానమగు నిదర్శనముగ నిరూపింప ప్రయత్నించిరి. కొన్ని నాట

కములందు విచిత్ర కల్పనలతో అహల్యా పాతివ్రత్య పరిరక్షణమును రచయితలు చిత్రించిరి. అట్టివానిలో సెట్టి లక్ష్మీనరసింహముగారి అహల్య నాటక మొకటి.

ఈ నాటకమున గౌతముని పత్ని బ్రహ్మపుత్రియగు 'హల్య'. ఈమె సోదరుడగు ఋక్షవిరజుడు అజ్ఞానమున అంబికాసరసున జలక మాడి స్త్రీగ పరివర్తనము చెందెను. సంతాన ప్రాప్తివలననే శాపవిమోచనముగాన, చతుర్ముఖుడు గర్భవతి యగు హల్యను దీర్ఘనిద్రలో నునిచి, స్త్రీరూపమున హల్యనే పోలిన ఋక్ష విరజుని గౌతముని కడ నుంచెను. ఆ దేవరహస్యము గౌతమునకు కూడ తెలియదు. హల్య కాని ఈమె అహల్య అనబడి దేవేంద్ర, సహస్రకిరణులకు ఉపభోగ అయ్యెను. గౌతమునిచే పరాభూత అయిన హల్య శోకవశయై లోకమును కాంచనొల్లక శిలాకృతి నొందెను. నాటకాంతమున చతుర్ముఖుని పేరోలగంబున దేవరహస్యము సర్వజనులకు విదితమయ్యెను. హల్యాగౌతముల పుత్రిక అంజన జాత్యంధత నాటకమున కొక ఉపకథ. నాటక సూత్రధారి నారద మహర్షి. విషాదాంతమగు యీ నాటకమున షేక్స్పియర్ ఒథెల్లో నాటకముతో కొన్ని సామ్యములు కాంచనగును. ఋక్ష విరజుని వృత్తాంతము హరివంశాంతర్గత మగు ఇళాబుధుల చరితమును స్ఫురింపజేయును.

శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవి ఉత్తర రాఘవమను పేర ఉత్తర రామచరితమును అనువదించెను. ఇది స్వతంత్రానువాదము.

యక్షగానాదుల కర్తలవలెనే నాటకకర్తలను కూడ రామభక్తాగ్రేసరుల వృత్తాంతము లాకట్టుకొనెను. అందు ముఖ్యమైనది రామదాసు కథ. రామదాసు కథను నాటకముగ రచించినవారిలో ముఖ్యముగ ధర్మవరం గోపాలాచార్యులుగారిని పేర్కొనవలెను. వీరి రామదాసు నాటకము బహుప్రశస్తమై విశేషవ్యాప్తిని పొందెను. రామదాసుగా వీరి సోదరులగు బళ్ళారి రాఘవాచార్యులుగారి నటన కూడ ఈ నాటక పరిపూర్ణత్వమునకు దోహద మొనర్చెను. గురజాడవారి కన్యాశుల్కము నందు వలెనే ఇందు కూడ పాత్రోచితభాషాప్రయోగము

జరిగెను. (కబీరు, తానీషా మున్నగువారికి ఉర్దూభాష- ప్రక్కను తెలుగు అనువాదము వ్రాయబడెను.) ఇందులకుగాను ధర్మవరము వారు హైదరాబాద్‌లో నివసించి, రామదాసు వృత్తాంతమును సేకరించిరట. "భద్రాద్రిరఘురాము భజనకు చనుచుండ బంధుమిత్రుల యాజ్ఞ పడయనేల ?" -మున్నగు వ్యాప్తినొందిన పాటలు, పద్యములు, ఈ నాటక మండలివే. ఇందు పాటలు పద్యములకన్న అధిక సంఖ్య యందుండును. రామదాసు భక్తి అతి ఉదాత్తముగ పోషింప బడిన ఈ నాటకమందు రామదాసు చెరసాల అంకము "రామదాసు జైలు సీను"గా ఏకపాత్రాభినయమునకు ప్రఖ్యాతికాంచెను.[1] అత్యుత్తమముగా నిర్వహింపబడిన నాటకములలో ఇది రెండవదిగా మన్నన లందెను.[2]

శ్రీ ద్వివేది బ్రహ్మానందశాస్త్రి ఉత్తర రామచరితానువాదము కావించిరి. ఉత్తరరామ చరితానువాదములందు ఇదియే మేల్తరమని జయంతి రామయ్య పంతులుగా రభిప్రాయపడిరి.

శ్రీ సీతారామారావు శ్రీరామ జననము, శ్రీరామ ప్రవాసము (1914), శ్రీ రామోద్యోగము, శ్రీరామ విజయము, శ్రీరామాశ్వమేధము అను నాటకములు రచించిరి.

1920 ప్రాంతము నుండియు నాటకములందు కీర్తన లధికముగా కన్పట్టును. చంద్రశేఖరుని "ఆంధ్ర నాటక కృతులు" ద్వితీయ భాగమున కుశలవ నాటక కీర్తనాదులు కలవు.

శ్రీ దువ్వూరి రామిరెడ్డి భవభూతి ఉత్తర రామచరితమును "సీతా వనవాసము"గా అనువదించెను. సీతాపవాదమును సృష్టిం

---

1. శ్రీ బళ్ళారి రాఘవాచారి, శ్రీ యడవల్లి సూర్యనారాయణ, శ్రీ రామాయణం పర్వేశ్వరశాస్త్రి, శ్రీ పర్వతరెడ్డి రామచంద్రరెడ్డి గారలు ఈ అంకమున రామదాసు నటనకు ప్రఖ్యాతిని కాంచిరి. అందు బళ్ళారి రాఘవాచార్యులుగారు రామదాసుగా ఆ నాటకరంగమునకే విశేష ఖ్యాతిని ఆర్జించిరి.

2. మొదటిది పానుగంటి వారి రాధాకృష్ణనాటకము.

చిన శూర్పణఖను విభీషణుడు శిక్షించి, నిండు పేరోలగమున రాముని సన్నిధిని ఆమెచే మిధ్యాపవాద దోషమును అంగీకరింపచేయును. ప్రపంచపు పోకడలు తెలియని కుశలవుల వీరోక్తులు మనోజ్ఞముగా వ్రాయబడెను. భవభూతి శ్రీరామచిత్తసంక్షోభమునకు ప్రాధాన్య మొసగుచు ఉత్తర కాండను ''ఉత్తర రామ చరితము'' కావింపగా, శ్రీ రామిరెడ్డి సీతావ్యథను ప్రధానముగ వర్ణించి "సీతా వనవాసము" కావించెను.

అహల్యా చరిత్రమువలెనే ఆధునికుల నాకర్షించిన శబరీవృత్తాంతమును శ్రీ చింతా దీక్షితులు నాటకముగ రచించెను. రామాయణమున సుగ్రీవాదుల కడకు చనుటకు రామలక్ష్మణులకు మార్గము తెలిపి, సురలోకమునకు తరలిపోయిన రామభక్తురాలుగ మాత్రము శబరి పేర్కొనబడెను. ఆధునిక యుగమున ఖండకావ్య కవులు, నాటక కర్తలు కూడ శబరి వృత్తాంతమును అత్యంతాదరముతో స్వీకరించి ఖండకావ్యములు, నాటకములు రచించుట విశేషము. సరళపద ప్రయోగములకు సున్నిత భావ వ్యక్తీకరణకు ప్రశంశలందిన శ్రీ చింతాదీక్షితులు మధుర భక్తిభావము వెల్లడి యగునట్లు సుమారు 1925 ప్రాంతమున శబరి వచన నాటకము రచించెను. ఉపదేశము, సాధన, పరివర్తనము, నిరీక్షణము, సిద్ధి— అనెడి భక్తి సాధనా పరిణామములు అయిదు అంకములుగా విభజింపబడి శబరిభక్తి సాధనా క్రమ పరిణామము వర్ణింపబడెను. సర్వము శ్రీరామ మయముగ జీవించు శబరి శ్రీరాముని సుఖదుఃఖములే స్వీయములుగ భావించెడిది. అట్టి శబరి భక్తికి చరాచర ప్రకృతి కూడ సోహదము కావించినట్లు ఇందు మధురముగ వర్ణింపబడెను. ఆయా రంగము లందలి కథాంశములకును సూచనగ రంగారంభవర్ణనలు కావింపబడెను. సిద్ధ్యంకారంభమందలి రంగస్థల వర్ణన శబరీ మోక్షప్రదాయియై ఏతెంచనున్న శ్రీరామునకు సర్వ ప్రకృతి నీరాజన మొసగుచున్నట్లు వర్ణింపబడుట ఉత్తమోత్తమము. శిష్టవ్యావహారికమున అలతి యలతి మాటలలో నేయ ప్రాయమైన వచన మిందు ప్రయోగింపబడెను. భావానుగుణముగ సంభాషణము, తదనుసారిగ కథయు కొనసాగుట ఇందు

మరియొక విశిష్టత మోక్షగామియైన శబరి ప్రధాన పాత్రగను మిగిలినవి ఆమె భక్తిక్రమ పరిణామమునకు దోహదకారు లగుటచేతను, పశుపక్ష్యాదులు కూడ పాత్రలగుట చేతను దీనిని శ్రవ్యనాటికగా పేర్కొనుట ఉచితము. ఉత్తమ సాహిత్యము పూర్తిగా ఒకరూపమునకు కట్టువడదు. చింతా దీక్షితులుగారి శబరి ఆధునిక ప్రపంచ వాఙ్మయములో పుట్టిన Meter link యొక్క Blue bird వంటి నాటకరాజముల కోవకు చెందినది.

ప్రకరణారంభమున పేర్కొనిక విధమున సంఘ తిరస్కరణోద్యమాభిలాషుల నాటకములు 1900 ప్రాంతము నుండియే వెలసినవనుట యుక్తము. మత, రాజకీయ, సాంఘిక, సారస్వతములందు కవులలో, రచయితలలో మొలకనెత్తిన భావవిప్లవము మహావృక్షమై ప్రాచీన సిద్ధాంతములకు నవీన రూపములను క్రొత్తచిగుళ్ళు తొడిగెను. హిందూమత సిద్ధాంతములను నిరసించు పూనికతో తద్గ్రంథముల నుండియే కొన్ని హేతువులను గ్రహించి, తన్నిరూపణ, వ్యాఖ్యానముల చేసిరి. ఆర్ష ధర్మ ప్రతిబింబముగా అత్యధిక స్థానము నలంకరించిన రామాయణమందలి కొన్ని ఘట్టములు కూడ వీరి దృష్టిని ఆకట్టుకొనెను. హిందూ సంస్కృతీ ప్రతీకలైన ఇట్టి ఉద్గ్రంథములను స్వీకరించిన ఎడల తమ ఉద్యమము వ్యాప్తినొందు నని వీరు భావించియుండవచ్చును. భారత భాగవత రామాయణముల నిట్లు స్వీకరించిన వారలో త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని ప్రథమముగా పేర్కొనవలెను. వీరు తమ కురుక్షేత్ర సంగ్రామము నాటకమున కౌరవులే రాజ్యార్హులని నిరూపింప ప్రయత్నించిరి. ద్వితీయ కృతియగు "శంబూకవధ నాటకము"న రామాయణ కథను వ్యాఖ్యానించిరి. శంబూకుడను శూద్రమహర్షిని వధించుటకు వర్ణాశ్రమ ధర్మ పరిరక్షణమే హేతువుగ రామాయణమున పేర్కొనబడెను. త్రిపురనేనివారు శంబూకుడు శూద్రులకు నిషేధింపబడిన వేదాధ్యయన యజ్ఞ యాగాదులను నిర్వహింప ప్రయత్నించుట రాజ్యప్రజకు మార్గదర్శకమై రాజ్యమున విప్లవమునకు హేతువు కాగలదని భీతిల్లిన శ్రీరామునకు శంబూకుని వధించెనని వ్యాఖ్యానించిరి. ఆర్యరాజ్యమున అనార్యులకు గల

నిషిద్ధములను, ఆర్య అనార్య సంఘర్షణ ఫలితముగ వెలసిన రామాయణము శంబూకవధ సందర్భమున తెల్పెనని వారభిప్రాయపడిరి.

ఇట్టి దృష్టితో రామాయణమును వ్యాఖ్యానింప ప్రయత్నించిన వారిలో శ్రీ ముద్దుకృష్ణ ద్వితీయులు. శ్రీరాముని రాజనీతిని మాత్రము రామస్వామి చౌదరిగారు వ్యాఖ్యానింపగా శ్రీ ముద్దుకృష్ణ సీతారాముల దాంపత్యమునే విమర్శించిరి. డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు పేర్కొనినట్లు వీరు 'ఇరువదియవ శతాబ్దపు సెక్సు తత్త్వవేత్త' దృష్టితో సీతారామ-రావణుల ప్రణయమును చిత్రించుటకు పూనుకొనినారు".[1] వీరి 'అశోకము' నాటకమున (1934) ఆర్య అనార్య సంఘర్షణమున ఆర్య కృత్యములను బలపరచుచు ధర్మసూత్రములను బలపరచెడి కేవల కీర్తికాముడు. ప్రణయము, ఆరాధనా భావము నెరుగని పూర్వులు స్త్రీకి స్వయం వ్యక్తిత్వము, సుఖ దుఃఖములకు అవకాశ మొసగలేదు. ఆమె కేవలము 'పురుషపాలిత' మాత్రము. రావణుడు దుష్టరాక్షసుడనుటకంటెను లోకోత్తర ప్రణయమూర్తి, మహామనీషి అని కంఠోక్తిగ చెప్పుటకు ప్రయత్నము 'అశోకము' నందు జరిగెను.

ఇందు స్వయంవరమునకు మునుపే సీతకు రామరావణులతో పరిచయము కల్గును. అరణ్యవాస సమయమున రావణుడు సీతారాముల అతిథిసత్కారములు స్వీకరించి, వారిని లంకా పట్టణమున కాహ్వానించును. ఇత్యాది అవాల్మీకములు, నూతనములు అయిన కల్పనలను కావింపబడినను, ఇవి భాసుని ప్రతిమా నాటకము మున్నగు సంస్కృత నాటకములను స్ఫురింపజేయుచుండును. శ్రీ ముద్దుకృష్ణ వ్యాఖ్యానములో దీనికి శ్రీ ముద్దుకృష్ణ వ్రాసిన విపుల పీఠికలో పరస్పర విరుద్ధములయిన అభిప్రాయములు కలవు.

శ్రీ కాళ్ళకూరి నారాయణరావు ఆదికవి వాల్మీకి జీవితమును నాటకముగ 1935 లో వెలువరించిరి. జన్మతః ద్విజుడై కాలవశమున కులభ్రష్టుడై చివరకు పశ్చాత్తప్తుడై మహర్షిగా రూపొందినట్లుగా వాల్మీకి

1. తెలుగునాటక వికాసము - పుట - 367.

చరిత్రము వర్ణించు ఈ నాటకమున పాత్రోచితభాష ప్రయోగింప బడుటయేకాకుండ తదాదిగా ఆంధ్రనాటకములందు వెలసిన మనస్తత్త్వము చిత్రించు రూపకములకు మార్గదర్శక మైనది.

ఇంతవరకు తెలుగునాటక ప్రక్రియారంభమునుండి వెలువడిన రామనాటకములు దిఙ్మాత్రముగ పేర్కొనబడెను.

నాటక ప్రక్రియయందు గమనింపవలసిన ముఖ్యాంశ మొకటి కలదు. పెక్కుమంది నాటకకర్తలు సంపూర్ణరామాయణము మూడు నాలుగు నాటకములుగా లేక కాండ విభజనమును అనుసరించి శ్రీరామజనన. సీతాకల్యాణాది నామములతో ఆరు నాటకములుగా రచించుట కన్పట్టును. ప్రాచీన సాహిత్యమున భారత భాగవత రామాయణములు మూడింటిని రచించిన కవు లరుదు. దక్షిణాంధ్ర వాఙ్మయమున అట్టివారు అటనట కలరు. ఆధునిక యుగమున ఇట్టి కవులు అధికముగ కన్పట్టుదురు. నాటక ప్రక్రియయందు కూడ రామాయణ భారత భాగవతములు మూడింటిని రచించిన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రివంటి వారలు అధికసంఖ్యయందే కలరు. ఇట్టివారు ఈ మూడింటినే కాకుండ ఇతరములైన నాటకములను కూడ పెక్కింటిని రచించుట గమనార్హము.

అధికసంఖ్యయందు గల రామనాటకములు అన్నియు విపులముగ వివరించుటకు ఇచ్చట అవకాశము లేకుండుటం జేసి, నాటక ప్రక్రియయందు రామకథ ఎట్లు సంభావింపబడెనో దిఙ్మాత్రముగ ఎరుగుటకు పానుగంటివారి అయిదు నాటకములు మాత్రము స్వీకరింపబడెను.

## కల్యాణ రాఘవము :-

ఆరంకములు గల ఈ నాటకము పానుగంటివారి నాటకములలో చివరిది. బాలకాండేతివృత్తప్రధాన మగుటచే రామాయణ కథాత్మకముగ ప్రథమనాటక మగుచున్న ఇందు మిగిలిన నాలుగు నాటకములను గురించిన ప్రస్తావన నాటకారంభమున సూత్రధారునిచే

కావింపబడెను. పాదుక, వనవాస, విజయ రాఘవములను వ్రాసిన తదుపరి కల్యాణ రాఘవమునకు శ్రీకారమును చుట్టుటంజేసి, అత్యల్ప కథాంశము గల ఇందు పంతులుగారి నాటకీయత, రసోచిత వాక్య నిర్మాణము మున్నగునవి పరాకాష్ఠ నందెను. ఇందలి తృతీయాంకము నాటకీయతకు ప్రత్యేకముగ పేర్కొనవలెను.

భవిష్యదర్థ సూచకముగ, దశరథుడు విశ్వామిత్రునితో,

"శ్రీరఘూద్వహుఁ డిట వెలసినది మొదలు కనుల కఱవుదీర నతనిఁ గాంచుటందు వీను లలరఁగ,బలుకులు వినుటయందును బలక యూరఁ దొడఁబెట్టికొనుటయందు.........

తెరపిలేదు. తీరికలేదు, విరతిలేదు

......................................

సర్వరాజ్య తంత్రంబులు చప్పబడియె

......................................

ఇన్నియేల? రాముని గాంచి యింతగాఁగఁ బ్రాకులాడెడు నే నెట్లు రాము విడిచి దివికిఁ బోదునో యనుచు సందియము దోఁచు నెవరులేరు కావున నంటి నిట్లు మీకు"— అని మహర్షి సంసేవనార్థము రానేరని తన దోషమును సహేతుకముగ వివరించెను. బాలరాముని యాగ రక్షణార్థము తోడ్కొని పోవుటకై ఏతెంచిన విశ్వామిత్రుడు తత్కృత్యముచే ఏర్పడనున్న రామ దశరథ వియోగమును స్మరించి నివ్వెరపడెను. మౌని కోరిక విన్న దశరథుడు సంఘర్షణకు తావీయక,

"మీరే దశరథు డనుకొనుడు - నేనే విశ్వామిత్రుడను. -మీరు నాకు రాము నీయగలరా?"— అని ప్రశ్నించి, విశ్వామిత్రుని నిరుత్తరుని గావించెను.

ఈ నాటకమున భాసుని యజ్ఞఫల నాటకమునందు వలె రాముడు అరణ్యమున నాగరిక ఆటవిక జీవితముల తారతమ్యమును గురించి ప్రసంగించెను. ఇందు నాటకీయతను పెంపొందించు కల్పనలు పెక్కున్నవి.

## పట్టభంగ రాఘవము :-

సప్తాంకములు గల ఈ నాటకమున అయోధ్యాకాండ కథ సంక్షిప్తీకరింపబడెను. శ్రీరాముని ధీరోదాత్తత, విషయవాంఛాదూరత, దశరథుని పుత్రవాత్సల్యము మున్నగునవి ఉదాత్తముగ పోషింపబడిన ఈ నాటకము కథాక్రమమును బట్టి రెండవది యైనను పంతులుగారి నాటక రచనలలో ఐదవది. కౌసల్యా దశరథుల వాత్సల్యభక్తి, సీతాదేవి శృంగారభక్తి, లక్ష్మణుని దాస్యభక్తి మనోహరముగ చిత్రింపబడి పానుగంటివారికి సహజముగ రామునిపై గల భక్తి పారవశ్యము వెల్లివిరియుచుండును. ఈ నాటకమున దశరథునికి పుత్రప్రేమ ఉదాత్తముగ చిత్రితమై దశరథుడు వాత్సల్య రసమునకు ప్రతీక యగుచు రసోద్దీపనమును కలిగించును.

"ముద్దుబొట్టె మొగమునకు మొగము వాచి
వినఁదగిన పుణ్యకథలెల్ల వినుచు మఱియు
నది యనక గుంట యనక మునంగఁదగిన
నీటిపట్టుల నెల్లను మునిగి మునిగి
......................కడకు యజ్ఞ
దైవదత్త వరప్రసాదమున, లేక
లేక నిన్గాంచితిని పుండరీకనేత్ర"— అనుచు జీవిత పర్యంతము

రామైక లక్ష్యముగ కాలము గడిపిన దశరథుడు శ్రీరామ వియోగమున ప్రాణత్యాగము చేసెను. ఇందు కైకేయి కౌటిల్యము, మంథర ఆధిక్యము, దశరథునకు చిరపరిచితము లని పేర్కొనబడుట విశేషము. కైకేయి కర్కశత్వము దశరథునకు చిరపరిచితమని జానపద వాఙ్మయ మందలి శాంత గోవింద నామాలు మున్నగు గేయములందు కలదు. సంస్కృత జానకీ పరిణయ నాటకమున గూడ ఈ విధముగనే కలదు. సుప్రసిద్ధ ఆంగ్ల నాటకకర్త షేక్స్పియర్ ప్రభావము, ధర్మవరము వారిపై ఉండినట్లే ఇందు అటనట భావములందు షేక్స్పియర్ కనపట్టును. డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు తమ పానుగంటివారి "సాహిత్య సృష్టి-సవిమర్శ పరిశీలనము"నందు ఇందు కుదాహరణము కూడ ఒసగిరి — అది ఇది :

"సృష్టియంతయు నొక్క చిత్రనాటక మందు
గలుగు పాత్రల లోపలను భూపుఁ
డని ఘనతయు భృత్యుఁడని న్యూనతయునులేదు...." -అనుచు శ్రీరాముఁడు వనగమనము కావించు సందర్భమున అయోధ్యా ప్రజల నుద్దేశించి చేసిన విజ్ఞాపనము "As you like it" నాటకమున జాక్విస్ పాత్రచే

"All the world is a stage
And all men and women merely players
They have their exits and their entrances
And one man in his time plays many parts." -అని

షేక్స్పియర్ చెప్పించిన మాటలను స్ఫురణకు దెచ్చును. పట్టభంగ రాఘవకథను ఇంకను ధర్మవరమువారు, కోలాచలము శ్రీనివాసరావు గారు కూడ వ్రాసినను, మూఁడు నాటకముల యందు దృక్పథమునను, రచనా శిల్పమునను భేదములు కన్పట్టును. సంవాద కౌశలము, పాత్రమనస్తత్వ నిరూపణము ప్రధానముగ ఎంచిన పానుగంటివారు తక్కిన యిరువురివలె ప్రదర్శనానుగుణమగు అంగ విభాగమును రంగములందు కావించలేదు. పానుగంటివారి రామాయణ నాటకము లందు ఇయ్యదియే బహుళ ప్రజాదరణము నొందెను.

## వనవాస రాఘవము:-

అరణ్య, కిష్కింధ, సుందరకాండాంతర్గత కథ ఇందలి ఇతి వృత్తము హనుమంతుడు సీతను కాంచి లంకాదహనము కావించి వచ్చిన వృత్తాంతము రామాదులకు నివేదించుకొరకు ఇందు పంచ మాంకమున ఒక అంతర్నాటకము ఏర్పరుపబడినది. మూఁడు కాండ ముల కథను మిగుల చాకచక్యముతో అయిదు అంకములందే చెప్పిన పానుగంటివారు ఇందు పాత్రల సంఖ్యను కూడ నేపథ్య విష్కంభా దులవలన తగ్గించిరి. దీనికి పూర్వమే వ్రాయబడిన విజయ రాఘవ నాట కమునందు పాత్రల సంఖ్య అధికము. వాలివధ విషయమున శ్రీరామ నిర్ణయమును గూర్చిన ధర్మాధర్మ నిరూపణమునకు గూర్చిన చర్చకై

యిందు చతుర్థాంక విష్కంభములో శరభుని వృత్తాంత మొకటి కల్పింపబడెను. శరభుని నామము మాత్రను వాల్మీకి రామాయణ మున కలదు.

ఇందు అవాల్మీకీయములగు రంగనాథ రామాయణాంశములు కొన్ని స్వీకరింపబడినవి.

1. లక్ష్మణుడు పర్ణశాలముందు గిరిగీయుట.

2. శ్రీరామునియందు అధ్యాత్మరామాయణమందువలె భవిష్యత్ జ్ఞానము ఆరోపింపబడుట.

3. సీతావియోగమున సంభవించిన శ్రీరామదుఃఖముచే కోప వశుడై లక్ష్మణుడు దైవమును దూరుట - మున్నగునవి. శూర్పణఖా ప్రవేశమున రాముడు లక్ష్మణునితో—

"జరుగనున్న రామ వనవాసంపు నాట
కమున కో కాంత బీజమగు"— అనియు; రావణుని గురించి రాముడు—

"ఈతడు మహానుభావుఁడై యుండవచ్చును కాని, శాపవశమున భక్తిజ్ఞానములు నిలుకడలేక యున్నవి. పాపము! నా శిక్ష నను భవించి ముక్తుడే యగును లేకున్న శాపశేషమున కింకొక్క జన్మయెత్తి కడతేరి దైవసాన్నిధ్యమున నుండవలసినవాడుగాఁ గానుపించు చున్నాడు"- అని ప్రేక్షకులకు జయవిజయుల శాపవృత్తాంతము స్ఫుర ణకు తెచ్చును. గత భవిష్యద్వృత్తాంతమును లోపింపజేయు ప్రయ త్నమున అటనట కొన్ని దోషములు కన్పట్టును. తాపసవేషధారియైన రావణుడు సీతతో

"అతిథులగు తపశ్శాలురను నిర్లక్ష్యముగఁ జూచినను కాంతల
కెట్టి యవస్థల్ సిద్ధించెనో యెఱుఁగుదువా"

—యని ప్రశ్నించగా, సీత-

"ఎఱుగుదును. నా కట్టు భర్తృ విశ్లేషమును గటాక్షింపకుడు"- అనును. భవిష్యదర్థ సూచనమున్న ఈ సంభాషణము కాళిదాసుని

అభిజ్ఞాన శాకుంతల శాపవృత్తాంతమును సూచించును. కాని శాకుంతలము రామాయణమునకు తరువాతిది కదా! ఇందు అటనట వాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యాన ప్రాయమగు వర్ణనలు గూడ కన్పట్టును.

## విజయ రాఘవ నాటకము:-

ముప్పదిమూడునకు పైగా పాత్రలు గల ఈ నాటకము కథాత్మకముగ నాలుగవది అయినను, పానుగంటివారి రామాయణ నాటకములలో రెండవది. అవాల్మీకీయము లైన అంశములు కొన్ని యిందు కన్పట్టును.

1. నిండు పేరోలగమున విభీషణుని పరిత్యజించు తరి రావణుడు తాడన పాదప్రహారములచే పరాభవించినట్లుండ ఇందు పాదతాడనమునకు సంసిద్ధుడయ్యెను.

2. కాలనేమి వృత్తాంతము.

3. సులోచన భక్తి.

4. రావణ పాతాళ హోమము.

5. హోమ విఘ్నమునకై అంగదుడు మండోదరిని బలప్రయోగమున కొనివచ్చుట— మున్నగు రంగనాథ భాస్కర రామాయణాదులందలి సన్నివేశము లిందు కలవు

కంటిలో నలుసులవలె బాధించు కపులను కొనగోట తీసి పృష్ఠముపై తుడుచుకొను కుంభకర్ణుడు, వింశతి భుజముల దశగ్రీవుడు అందు వర్ణితులు. కుంభకర్ణదశగ్రీవుల మహాకాయములను, పరాక్రమములను ప్రదర్శించు సన్నివేశము లున్నందు వలన ఇది ప్రదర్శన క్లిష్టత కలిగి శ్రవ్యనాటకముగ సంభావింపదగు నని భావింపవచ్చును. అయినను ముద్రణకు పూర్వమే ఈ నాటకము ప్రదర్శనల నందెను. ఏకరాత్ర ప్రదర్శనమునకు బహుదీర్ఘ మగును కాన, ఇది ద్విసంధ్యా ప్రదర్శనము కావింపబడుట కూడ కలదు.

శ్రీరామ మహత్వ ప్రకాశనమే పరమార్థముగాగల ఈ నాటకమున రాముని ధీరోదాత్తత స్పష్టముగ చెప్పుటకు ప్రయత్నము జరిగెను.

తొమ్మిది శిరములను, పదునెనిమిది బాహువులను కోల్పోయిన రావణుని చూచి అంగదుడు అపహాస్యము చేయగా రాముడు నివారించెను. అప్పుడు

"కనుగొలుకు లైన నెఱ్ఱనగాకయుండ, నా
యని గట్టిగానైన నఱవకుండ
నొడలు చెమ్మట చేతఁ దడియైనఁ గాకుండ
సిగముడి యైనను జెదరకుండఁ
గోపచిహ్నము లేమి దీపింపకుండ, ర
ణోత్సాహ దశయైన నొదవకుండఁ
బల్లెత్తు పలుకైనఁ బగతుర నాడక
యుండ, మూలబలంబు రెండగడెల
లోన లీలగా గడతేర్చి దానవాధి
పతికి నిట్టులుచేసి, యెవ్వండు సేసె
నోయటంచు నుండుఁ దటస్థునోజ నహహ!

ఇట్టి యద్భుత చారిత్ర మెచట గలదు? —అనుచు అంగదునిచే కవి శ్రీరాముని శాంతవీరమూర్తిని వర్ణింపజేయును.

అటనట ఇందు రావణపాత్ర గాంభీర్యము సడలినట్లు తోచును. రంగనాథ రామాయణము వలె ఇందును రావణుడు ఆత్మజ్ఞానము కలవానిగా చిత్రింపబడెను. అతడు యుద్ధాంతమున రామునితో

"ఈవు లోకపిత వని, సీతావధూటి
లోకమాతయం చెఱుగుదు, నీకు నింత
చేసితిని గాన నిటకు వేంచేసినావు
కాకయుండినఁ బీఠంబుఁ గడలిచెదవె"—అనుటయేకాక. "బ్రహ్మహత్య యని సంకోచమేల? నేను ప్రవర్తించిన రీతి బ్రాహ్మణార్హమా?" యని తనను సంహరింప రాముని ప్రేరేపించెను.

పానుగంటివారి ఈ నాలుగు నాటకముల పరిశీలనము వలన ఒక్క విషయము విశదమగును. యథావాల్మీకముగ రామాయణమును నాటకీకరించుట నాటక కర్తల ప్రధానోద్దేశము కాదు. వాల్మీకి రామాయణమును ఆధారముగ గ్రహించినను ప్రదర్శనానుగుణము, సామాజిక హృదయాకర్షకము, నటునకు నటనావకాశము, రసోద్దీపనము కలుగునట్లుగ ఆయా సన్నివేశముల మార్చుటయే కాక, వాల్మీకేతరములగు రామాయణాదులనుండి కూడ కథాంశములను స్వీకరించిరి. ఇట్టి నాటక రచనము ఒకే ఇతివృత్తముతో పెక్కుర నాటక కర్తలు ఒక్కొక్క తరి ఒకే నామముతో (ఉదా॥ శ్రీ రామజననము, పాదుకాపట్టాభిషేకము మొ॥) వెలయించిరి. కావున స్వీయ ముద్ర నిమిత్తము, నూతనత్వ ప్రదర్శనార్థము రంగవిభజనములందును, పాత్ర చిత్రణమునందును, విచిత్ర సన్నివేశ కల్పనలందును నూతన ప్రయోగముల కావింప యత్నించిరి. అట్టిపగి, సమాజమున వ్యాప్తిలో నున్న ఆంగ్ల విద్యయొక్క ప్రభావముకూడ అప్రయత్నముగనో ప్రయత్న పూర్వకముగనో వారిపై కొంత ప్రసరించినది. ముఖ్యముగ ఆంగ్లనాటక కర్త షేక్స్పియర్ ప్రభావము వీరిపై అధికముగపడెను. అందునను పాత్ర స్వభావచిత్రీకరణము నందు (ఉదా॥ ధర్మవరమువారి పాదుకలో కైక, మంథరలు) కథను నాందీప్రస్తావనాదులకాటని, సుఖాంతము నాటకము కావలెనను సంప్రదాయమును భేదించి, దుఃఖాంత మొనర్చుట మున్నగు వాటియందు ఈ ప్రభావము కన్పట్టును. శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి కొద్దిమంది మాత్రము యథామాతృకముగ రామాయణ నాటకముల వెలయించిరి. ఇట్లు సామాజిక, రాజకీయ, మత, భావవిప్లవములు మూకుమ్మడిగా నాటి నాటక కర్తపై తమ ప్రభావమును నెరపి, రామ కథకు ఆధునికత్వమును ఆపాదింప ప్రయత్నించెను.

నాటకములుగ పెక్కుమందిచే స్వీకరింపబడిన రామాయణాంతర్గత వృత్తాంతములలో మైరావణ చరిత్రము ఒకటి. హనుమద్విజయమును, శ్రీరాముని ఏకపత్నీవ్రతమును ఉదాత్తముగ చిత్రించు కథ యగుటచే నాటకముగ సామాజికుల మనములను రంజింపచేయునని భావించి కాబోలు పెక్కుమంది మైరావణ నాటకము రచించిరి.

యుద్ధకాండమున సంజీవి మాహాత్మ్యముచే లక్ష్మణుడు పునర్జీవితుడగుట తెలిసి, భీతావహుడైన రావణుడు పాతాళలోక ప్రభువగు మైరావణుని ఐరావణ ద్వితీయముగ లంకకు ఆహ్వానించి, సహాయ మర్థించెను. రావణుని మంత్రాంగమంతయు పక్షిరూపధారులై ఆలకించిన విభీషణుని నల్వురు మంత్రులు సుగ్రీవాదులకు నివేదింపగా, వారు నిద్రించు రామలక్ష్మణుల చుట్టును సైన్యమును కాపుంచినను, రాక్షసులు కపటోపాయమున రామలక్ష్మణులను పాతాళమునకు కొనిపోయిరి వారిని అన్వేషించుచు నికుంభిలకు ఏతెంచిన హనుమంతుడు ఒక పావురము జంట యొక్క సంభాషణము వలన రామలక్ష్మణులు పాతాళమున బంధింపబడిన విషయము గ్రహించి పాతాళమున ప్రవేశింపబోగా, ద్వారరక్షకుడు ఎదుర్కొనెను. అంతట అతడు వచ్చినది రామదూతగా ఎరిగి, తాను పవనాత్మజుని పుత్రుడగు మకరధ్వజుడనియు,లంకా దహనము తదుపరి హనుమంతుడు సంద్రమున తోకను జల్లార్చుకొనుచు, కంఠమందలి శ్లేష్మము నుమియగా మకరి మింగి, తనను పుత్రునిగా బడసిన వృత్తాంతమును తెల్పెను. పిమ్మట మకరధ్వజుడు హనుమంతుని రాముని కడకు జేర్చెను. సూక్ష్మరూపమున హనుమంతుడు రామలక్ష్మణు లున్న ఆలయమున ప్రవేశించి ద్వారబంధాదుల బంధించి, మారుకంఠమున దేవివలె పలికి, మైరావణాదుల నమ్మించి, ఆయుధముల బడసెను. అంత రామలక్ష్మణులకును రాక్షసులకును భీకర సంగ్రామ మారంభమయ్యెను. రాక్షసు లిరువురు మరణించుమార్గమును శ్రీరాముని పతిగా ఒనర్చిన వెల్లడించెదనని హనుమంతునితో ఐరావణుని భోగిని యను కాంత పలుక, అత డందుల కియ్యకొనియు, శ్రీరాము డామె మంచమున ఆసీను డయినప్పు డది విరుగకుండినచో ఆమె కోరిక సఫలము కాగలదని పలికెను. అందుల కంగీకరించిన ఆమె వారి ప్రాణములను రక్షించు తుమ్మెదలను పవనాత్మజున కొసగెను. హనుమంతుడు వానిని సంహరించి, అందొక దానిని మాత్రము భోగినికి తెలియరాకుండునట్లు రహస్యముగ ఆమె మంచమును తొలచు ఒప్పందముపై విడిచి వచ్చెను. అది అట్లే కావించెను. రాక్షసులు మరణించిరి. పిమ్మట హనుమంతుడు కారణము నెరింగింపకుండ శ్రీరాముని భోగినిశయనాగారమునకు కొనివచ్చి,

మంచమున కూర్చుండజేయు అది ఫెళఫెళ విరిగెను. విషయము నెరిగి ఆశాభంగము నొందిన భోగినికి మరుజన్మమున ఆమె తనకు ప్రియకాంత కాగలుగు వరప్రదానము కావించి శ్రీరాముడు కపిసేనల జేరుకొనెను. సంస్కృత ఆనంద రామాయణమందు ఈ మైరావణ గాథ కలదు.అందు భోగినికి మారుగా నాగకన్య చంద్రసేన యని పేర్కొన బడెను.

ఈ మైరావణ వృత్తాంతమును తెలుగు నాటకకర్తలు గ్రహించి, ప్రదర్శనానుగుణ్యములగు మార్పుల గావించి నాటకముగా వెలయించిరి. అయ్యగారి విశ్వేశ్వరరావు "మైరావణ నాటకము"న విభీషణుని మంత్రులను పక్షులుగ రంగస్థలమున ప్రదర్శనము అసాధ్యము కావున, నారదుడు ప్రాధాన్యత వహించెను. కపిసైన్యమంతయు వ్యూహము పన్నుట కాక, హనుమంతుడు తన వాలమును రామలక్ష్మణుల చుట్టును ప్రాకారముగ కట్టెను. ఐరావణుని భోగినికి పర్యాయముగ మైరావణుని పత్నియే రామభక్తురాలుగను, రామకార్య సాఫల్యమునకై విభీషణుని భార్య యగు సరమ ఆమెకడ చెలిమికత్తెగా వ్యవహరించి నటులను చిత్రింపబడెను. తుమ్మెదలను ప్రదర్శించుట కష్టము కావున తుమ్మెదలరాజుపాత్ర కల్పింపబడెను.

భాసుని ప్రతిమ, అభిషేక నాటకములు మురారి అనర్ఘ రాఘవము మున్నగు సంస్కృత నాటకములన్నియు ఆంధ్రీకరింపబడెను. ఈ నాటకములకు మూలము లైన సంస్కృత రూపకకథలు 'సంస్కృత సాహిత్యములో రామకథ' ప్రకరణమున వివరింపబడెను.

---

# శతక వాఙ్మయము–రామకథ

ప్రథమాంధ్ర కావ్యమైన ఆంధ్ర మహాభారతము సంస్కృత మూలమై పరిపుష్టిని చేకూర్చుకొనినట్లే, తదాదిగా ఆధునిక యుగము వరకు క్రమ పరిణామ వికాసము నొందిన వివిధ కావ్య ప్రక్రియలలో కొన్ని సంస్కృత కావ్యములకు ప్రతిబింబములు. మరి కొన్ని స్వతంత్ర కావ్య స్వరూపమును పెంపొందించుకొనిన రమణీయ రూపాంతరములు. భక్తి ప్రాతిపదికగా వెలసిన సంస్కృత శతక ప్రక్రియ యీ రీతిగనే ఆంధ్రవాఙ్మయమున ప్రవేశించినను, వివిధ రూపములలో క్రమాభివృద్ధిని పొంది ఆంధ్ర వాఙ్మయముననే ఒక సంపూర్ణమైన విశిష్ట స్థానమును పొంది వాఙ్మయమునకే పుష్టిని చేకూర్చినది.

ఇట్టి శతకములను కావ్యములందు జేర్చిన ప్రప్రథమ సంస్కృతాలంకారికుడు అమృతానంద యోగి. ఈతని "అలంకార సార సంగ్రహము"న

"అథచాటు ప్రబంధానాం లక్షణం కథ్యతేఽధునా

.... .... .... .... .... .... ........ .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... ..............

శతేన శతకం ప్రోక్త మష్టోత్తర శతమ్ పరమ్."—అని శతకము పేర్కొనబడెను. అలంకార సార సంగ్రహము పదమూడవ శతాబ్ది నాటిదిగా నిర్ణయింపబడెను.[1] ప్రథమాంధ్ర లక్షణ గ్రంథముగ పీఠమలంకరించిన "కవి జనాశ్రయము" (రేచన ఛందోగ్రంథము) పదమూడవ శతాబ్దమునందే వ్రాయబడినను అం దెచ్చటను శతకము పేర్కొనబడలేదు. క్రీ. శ. 1400 తరువాత విన్నకోట పెద్దన "కావ్యాలంకార చూడామణి" యందు

1. అలంకార సారసంగ్రహము – పీఠిక – తిరుపతి T. V. U. ప్రచురణము.

"సప్త వింశతి యైన నక్షత్రమాల
తెలియ ముప్పది పద్యముల్ త్రింశదాఖ్య
నమరఁ బంచాశదాహ్వాయం బైదు పదులు
శతకమన నొప్ప మఱి పద్య శతముగూడ''
అనంతామాత్యుడు కూడ శతక లక్షణము పేర్కొనెను.[1]

ఆధునిక సాహిత్యకారులు, విమర్శకులు కూడ శతక నిర్వచనము చేసిరి కీ. శే. వంగూరి సుబ్బారావుగారు శతకములు భావగీతములుగా భావించిరి.[2] నిడదవోలు వేంకటరావుగారు ''ఇది ముక్తకములయ్యును, నేక సూత్రత గలిగి... కవి యాత్మానుభవము ప్రకటించుచుండు"ననిరి.[3] కాశీనాథుని నాగేశ్వరరావుగారు శతకములు భావగీతికలను వాదమును ఖండించి, ఆధ్యాత్మికానందమును కలిగించు శతకములు ప్రాపంచికానందమును మాత్రమే కలుగజేయు భావగీతికలను పోల వనిరి. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం. శ్రీ కోరాడ రామకృష్ణయ్య ప్రభృతులు కూడ శతకములను నిర్వచించిరి. కె. గోపాలకృష్ణారావుగారు శతమను పదమునకు 'క' ప్రత్యయమును చేర్చిన "శతక'' మను రూప మేర్పడును; ముక్తక స్వభావము, మకుట నియమము, ఆత్మ పరమగు కవితా ధర్మము, సంఖ్యా నియమము, ఛందోనియమము, వృత్తి నియమము గల అనిబద్ధ రచనలు శతకములు" అని పేర్కొనిరి.[4]

శతక వాఙ్మయమున రామాయణము విశిష్టస్థాన మాక్రమించెను. ఆత్మాశ్రయ (Subjective poetry)కవిత్వము శతకలక్షణములం దొకటి అగుటచే, భక్త్యావేశము కవు లొనరించిన రామనామ సంకీర్తనము శతకరూపమున భాషామతల్లికి ముక్తాహారమైనది. శ్రీరామచంద్రుని అవతారమూర్తిగను, క్షేత్రదైవముగను, ఆరాధించిన భక్తాగ్రేసరుల శతకములు భక్తిశతకములందు విశిష్టస్థానము నాక్రమించుకొనెను. శ్రీరామ పరముగ పదునేనవ శతాబ్దమునుండి శతకరచనము ప్రారం

1. అనంతుని ఛందస్సు.
2. 3. వంగూరి సుబ్బారావుగారి శతకపుల చరిత్ర _ పీఠిక.
4. ఆంధ్ర శతక వాఙ్మయోత్పత్తి వికాసములు _ సమకాలిక జీవితము వ్రాతప్రతి.

భమయినట్లు పేర్కొనవచ్చును. రామభక్తి ప్రధానములయిన శతకములను రెండు ముఖ్యమైన తరగతులుగ విభజింపనగును. అవి కథాత్మక శతకములు, సంకీర్తనాత్మక శతకములు. ముక్తక స్వభావము గల సంకీర్తనాత్మక శతకములే సాహిత్యమున ప్రథమముగ వెలసినవి. పందొమ్మిదవ శతాబ్దారంభము వరకు వస్తువైవిధ్యములేని సంకీర్తనాత్మక శతకములే వాఙ్మయమున చోటు చేసికొనినను, అర్వాచీనులైన కొందరు కవులు వస్తువైలక్షణ్యముగల శతక రచనా కుతూహలులై, నూత్న వస్తు శతకములను, కథాత్మకశతకములను వెలయించి నవ్యమార్గమును నెలకొల్పిరి. ఫలితముగ, అన్యభాషలందు కథాత్మక రచనలు స్వల్పమాత్రముగ నుండు ఆంధ్ర శతక వాఙ్మయము కథాత్మకరచనతో పరిపుష్టమయినది. ఇప్పటినుండి భారత, భాగవత, రామాయణేతిహాసములపై కొందరిదృష్టి ప్రసరించినది. వీనిలో రామాయణకథాత్మకములే అధికములు. కథాత్మక శతక రచనా ప్రక్రియ అర్వాచీనమయ్యును, శతకములలో రామకథావతరణము గ్రహించుట కవియే తోడ్పడుటంజేసి, సంకీర్తనాత్మక శతకముల కన్నను ప్రథమముగ రామాయణ కథాత్మక శతకములను పర్యాలోకించుటయే సముచితము.

## లవకుమార శతకము :-

"లవకుమార శతకము"గా ప్రసిద్ధిగాంచిన "చూతమెలవుండా!" శతకమును క్రీ. శ. 1900 సంవత్సర ప్రాంతమున శ్రీ వద్ది తాతయ్య కవి రచించెను. భగవంతుని లీలామానుష విగ్రహమును, అవతార విశేషములను "నాడుండినచో చూతమె" అనగా "దర్శించియుందుము గదా!"అను భావమున లవుని పేర్కొని కవి యుద్దానిని వెలయించెను.

దశరథ పుత్రకామేష్టితో కథ ప్రారంభము చేసినను, సోమకాసురుని సంహరించిన శ్రీమన్నారాయణుని లీలావిలాసములు రామావతార పర్యంతము ప్రథమముగా వర్ణింపబడినవి. శ్రీరాముడు లంకను ముట్టడించిన సందర్భమున రావణుడు తన గురువుతో కర్తవ్యమును గూర్చి మంత్రాలోచన మొనర్చుట సుషుప్తియందున్న కుంభకర్ణుని

జాగరూకుని గావించుటకై కరగించిన సీసమును కర్ణములందు ప్రవహింపజేయుట మున్నగు రంగనాథ రామాయణమునందలి సన్నివేశములను పోలిన సందర్భము లున్నను కథ ప్రధానముగ వాల్మీకి రామాయణమును అనుసరించియే సాగినట్లు భావింప నగును. హనుమంతుడు లంక కేగుట, విభీషణశరణాగతి మున్నగు సన్నివేశములు సంభాషణాత్మకముగ నున్నవి. రావణుని శిరములు రణరంగమున మొలచుట, సీతాదేవి అగ్నిప్రవేశము మున్నగు ఘట్టములు మనోహరముగ వర్ణింపబడినవి. కవి కథను మిక్కిలి వేగముగ చమత్కారముగ నడిపించెను.

"దురమున రాముని గెల్చుట
తరమా దశకంఠ యనఁగఁ దమ్మునిఁ దన్నెన్
శర ణనుచు రాముఁ గనెనట"

—విభీషణశరణాగతి ఘట్టమందలి యీ పద్యము కథాకథన పద్ధతిని స్పష్టీకరించును. రావణుడు మాయోపాయమున సీతాపహరణము గావించెనట!– రామసుగ్రీవులు మిత్రు లైరట! సేతునిర్మాణము జరిగెనట!- అను ధోరణిని కవి కథను వివరించెను. రణరంగమున రావణుని శిరములు మొలచుట గాంచి రాముడు,

"శిరములను ద్రుంచివేయ
న్మరల లవి గలిగుండు టేమి మాయయొ దశకం
ధర యనుజ దెల్పుమనెనట"-101.

వద్ది తాతయ్య కవి ఈ శతకమును "చూతమె లవుడా!" శతకముగ ప్రకటించెను. శతక మకుటము ఉర్దూభాష ననుసరించి అశ్లీలార్థకముగ కన్పట్టుచున్నదని రామమహేంద్రవరపు కవి పండితులు కొందరీ కవిపై 'కేసు' పెట్టిరి. వాద ప్రతివాదములు జరిగిన పిమ్మట "లవుడా" అను పదము అశ్లీలార్థమును స్ఫురింపజేయును గాని అశ్లీల పదము గాదని పండితు లంగీకరించిరి. శతకనామ మశ్లీలార్థక మని ఎంచి, శతకము శ్రీరాముని పుత్రుడగు లవుని పేర్కొని వ్రాయబడి నట్లుగా శతకారంభమున కవియే స్వయముగ నివేదించెను.

శతకముపై వాగ్వాదములు చెలరేగి, కేసు కోర్టు కెక్కినందువలన, శతకము పూర్వకవి కృతమనియు, వద్ది తాతయ్య కేవలము దానిని శతకాంతమున రెండు పద్యములందును, శతకాంత గద్యయందును వద్ది తాతయ్యకవి కృతముగ పేర్కొనబడినదని భావింపబడినది.

“....మార్కండేయగోత్ర ఆపస్తంబ సూత్ర వద్దికుల కలశ జల నిధి కుముద.... శ్రీ భూపతి వర్యపుత్ర.... తాతయ్య నామధేయ ప్రణీతంబైన చూతమెలనుడా” శతకమను ప్రబంధము నేకాశ్వాసము”- అని శతకాంత గద్య.

## ముక్కొల్లు సీతారామ శతకము :-

సీతారామభక్తుడైన శ్రీ ముత్య సూర్యనారాయణమూర్తి ఈ శతక కర్త. క్రీ. శ. 1913 న [1] కిర్లంపూడి గ్రామనివాసి అయిన ఈ కవిచే రచింపబడెను. ముక్కొల్లు సీతారాముల కంకితముగ రచింపబడిన ఈ శతకారంభమునందు భక్తులను సుకవులను కవి స్తుతించెను. తదుపరి అవతార లీలావర్ణన గావించెను. సంపూర్ణ రామాయణమును స్వీకరించి కవి పండ్రెండు- పదమూడు పద్యముల వరకు రామాయణ కథా సంగ్రహమును ముప్పది యారవ పద్యమునుండి ఉత్తర రామాయణ కథను వర్ణించెను. శ్రీరాముని బాల్యక్రీడా వర్ణనము, శూర్పణఖా పరాభవము, రామరావణ సంగ్రామము, పట్టాభిషేకానంతరము నిర్దయుడై శ్రీరాముడు అంతర్వత్ని యైన సీతాదేవిని పరిత్యజించుట, తతనంతరము శ్రీరామ వియోగ దుఃఖ క్లేశము- మున్నగు ఘట్టములు ఇందు ప్రత్యేకముగ గమనింపదగినవి. శతకాంతమున గల చిత్ర కవితా శాఖకు చెందిన పద్యముల వలన ఈ కవి గర్భకవిత్వమున సిద్ధహస్తుడని విశదమగును.

## పట్టాభిషేక మహోత్సవీయ శతకము :-

గురువారపు పేట యందలి బుధులు, రామభక్తులు శ్రీరామ పట్టాభిషేక మహోత్సవము వైభవోపేతముగ ఒనరించిన సందర్భ

1. గోదావరిజిల్లా, పెద్దాపురం తాలూకా.

మున వారిచే ప్రేరితుడై క్రీ. శ. 1914 సం॥ ప్రాంతమున శ్రీ గాదే పల్లి రాఘవశాస్త్రి పట్టాభిషేక మహాత్మ్యవీయ శతక రచనము గావించెను.

శ్రీరాముని శైశవము, తాటకా సంహారము, సీతారామ కల్యాణము మున్నగు అంశములను కేవలము ఆరు పద్యములందు మాత్రము వర్ణించెను. అనంతర కథను వర్ణించుపట్టున శ్రీరాముని వ్యక్తిత్వ చిత్రణమునకై కవి కొన్ని ప్రత్యేక ఘట్టములను విపులముగ వర్ణించుటకు ప్రయత్నించెనను సందియము కలుగును.

" చేతికి రాజ్య మిచ్చి యభిషిక్తునిఁ జేసెడు నట్టివేళ నీ
రీతిగ నంతరాయ మొనరించిన వేరొక సూరుడైన దో
శ్చాతురి చూపఁగాని యిటు సాత్త్విక వృత్తిని జూపియుండునే
నీతి యటన్న నీదె గణనీయము, సిక్కను రామభూపతీ !"–12

—ఇటువంటి సాత్త్విక వృత్తిని అవలంబించిన ఉదార స్వభావుడైన శ్రీరాముడు, అరణ్యవాసమున కరుగు తరి, తన ననుసరించు ప్రజాసందోహము కన్నొరగి వనములకై వెడలిపోవుటను కవి సమర్థించెను.

రావణ వధానంతరము సీతాద్వితీయుడై పట్టాభిషిక్తుడైన శ్రీరాముడు మిథ్యాపవాద హేతువున సీతాసాధ్విని పరిత్యజించిన ఉత్తర రామ కథయు పట్టాభిషేక మహాత్మ్యవీయ శతకమున కలదు. రామాయణ కథాత్మకములగు శతకములందు పట్టాభిషేక పర్యంతము మాత్రము స్వీకరింప బడుట సాధారణము. అయ్యును మహోదాత్తమగు శ్రీరాముని వ్యక్తిత్వము రామాయణాద్యంతము చిత్రించుట కోయన రాఘవ శాస్త్రి కవి తమ శతకమున ఉత్తరరామాయణ వృత్తాంతమును కూడ స్వీకరించిరి. భక్తి శతకములందు కన్పట్టు గుణనామ సంకీర్తనము, ఫలశ్రుతి పద్యములు ఈ శతకాంత పద్యములందు కానవగును.

## సంక్షేప రామాయణము :-

కౌశికసగోత్రు లైన శ్రీనివాస వేంకట లక్ష్మమ్మల గర్భసుక్తి ముక్తాఫల మయిన శ్రీ ఆవటపల్లె చిన శ్రీరాములు క్రీ. శ. 1915 ప్రాంతమున సంక్షేప రామాయణము రచించెను.

రామాయణము అశేష పుణ్యకరము, మోక్షదాయకమని విశ్వసించి కవి శ్రీరామ జన్మమునుండి పట్టాభిషేక పర్యంతముగల కథను, పుత్రకామేష్టి, సీతాకల్యాణము, శ్రీరామ వనవాసము, సీతాపహరణము, రామ రావణ యుద్ధము, పట్టాభిషేకము— అను ప్రధాన ఘట్టముల నాధారముగ శతక రచన కావించెను.

సంక్షేప రామాయణ మయ్యును, కొన్ని సూక్ష్మాంశములు కూడ పేర్కొనబడుట ఇందలి విశేషములలో ఒకటి. రామకథాత్మక శతకములందును వివాహఘట్టమునందునను ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తుల నామధేయములు కూడ కానరావు. కేవలము జనకుడు పుత్రికలను లక్ష్మణ భరత శత్రుఘ్నులకు ఒసగినట్లు మాత్రము చెప్పబడును. ఈ శతకమునందు అట్లుకాక లక్ష్మణునకు ఊర్మిళను, భరతునకు మాండవిని, శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని ఒసగి జనకుడు కల్యాణము గావించినట్లు గలదు. ఊర్మిళా నామము అచ్చటచ్చట కానవగును కాని మాండవీ శ్రుతకీర్తులు శతకముల నుండి సంపూర్ణముగ పరిహరింపబడిరి. సీతాన్వేషణమునకై సుగ్రీవుడు వానరులను నియోగించు ఘట్టమున తూర్పునకు మైందుని, పశ్చిమమునకు సుషేణుని, దక్షిణమునకు పవనసుతుని పనిచినట్లు ఈ శతకమున పేర్కొనబడినది. మైందసుషేణుల ప్రసక్తి మిగిలిన శతకములందు కానరాదు. రావణునిచే పరిత్యక్తుడై విభీషణుడు రామశరణార్థియై ఏగుటకు మున్ను జననికడ అనుజ్ఞ వడసినట్లు ఇందు కలదు. అవాల్మీకమయ్యు విభీషణుని శీలమునకు ఇతోధికమైన వన్నె గొనివచ్చు ఈ సన్నివేశము గల రామకథాత్మక శతకము నేను పరికించినంతవరకు ఇది ఒక్కటియే కానవగుచున్నది. అరణ్యవాసానంతరము అయోధ్యకు విచ్చేసిన శ్రీరాముడు నారచీరలను విసర్జించి మహారాజోచితములైన వస్త్రముల

ధరించి, బంధుమిత్ర సమేతుడై విందారగించినట్లు కవి వర్ణించెను. ఇట్టి మనోహర వర్ణనయే జానపద గేయ సాహిత్యమందలి "లక్ష్మణ దేవర నవ్వు" కథాగేయమునందు కలదు. మహోన్నతమైన శ్రీరాముని వ్యక్తిత్వము, పరాక్రమములను కవి ప్రత్యేకముగ చిత్రించినట్లు విశదమగును. ఇందలి తాటకవధ, విశ్వామిత్ర యాగసంరక్షణము మున్నగు అంశములు రసస్ఫోరకములు. రామలక్ష్మణులు "అంతకునైన గెలువంజాలు" శక్తిమంతులు. "నీలమేఘచ్ఛాయ నెనరొప్ప వెల్గువాడై"న శ్రీరాముడు సకల సుగుణాభిరాముడు. ఇందొకటి రెండుపట్టుల పునరుక్తి దోషములు కలవు. సీతాపహరణము తదుపరి రామలక్ష్మణులు జటాయువునకు అగ్ని సంస్కార మొనర్చిరి. ఈ అంశమే నలుబది ఒకటవ పద్యమున పునరుక్తమైనది. కథాకథనమునకు దోహ్పడని వర్ణనలు ఎడనెడ కలవు.

## శతక రామాయణము :-

చిన్నపిల్లలకు అర్థమగు రీతిలో "పతిత పావన రామా" యను మకుటములో శతక రామాయణమును కందపద్యములలో శ్రీ సోమయ కవి క్రీ. శ. 1933 సం॥న రచించెను. శ్రీరాముని జన్మము, శైశవము, పట్టాభిషేక భంగము, అరణ్యావాసము మున్నగు ఘట్టములు ఇందు వర్ణింపబడెను.

## రామాయణ సంగ్రహ శతకము :-

పండిత పామర జనరంజకమగు శైలితో రామాయణ సంగ్రహ శతకము క్రీ. శ. 1938 సం॥న వెన్నాడ గ్రామవాసియైన శ్రీ వీరయ్య సిద్ధాంతిచే రచింపబడెను. తద్గ్రామమున వెలసిన శ్రీరామునికి అంకితముగ శా. శ. 1815 లో శతక రచనము కావించినట్లు కవియే స్వయముగ పేర్కొనెను. సీతా కల్యాణము నుండి శ్రీరామ పట్టాభిషేక పర్యంతము కథ వరుసగ కలదు. రావణప్రేరితుడైన మారీచుడు హరిణరూపమున సీతాసాధ్విని ప్రలోభపరచుట, సీత కోరిక తీర్ప ఎక్కిడిన బాణముతో శ్రీరాముడు మృగమును వెన్నాడుట,

రావణకృత సీతాపహరణము, జటాయు దశగ్రీవుల సమరము—అదిగా గల ఘట్టము లిందు వివరముగ గలవు. (4–21).

ఇందు, అయోధ్యాపురమున పట్టాభిషిక్తుడైన శ్రీరాముని బంధువులు, విప్రోత్తములు ఆశీర్వదించిరి. పుణ్యాంగనలు మంగళహారతులు, శృంగార పదములు, బానకీలు గానము చేసిరి-91. సమకాలీన పరిస్థితుల ప్రభావ మిట్టి కవిని ప్రేరేపించినట్లు గ్రహింపనగును. ఈ శతకమందలి లంకావర్ణనము మిగుల మనోహరము.

" లంకను వర్ణించుట కా
వైకుంఠునకైనఁ దరమె వజ్రికినైనన్
పొంకముగా నుండెడి యా
లంకేశుని పురము జొచ్చె లాలితరామా !"—44.

## ముకుంద రాఘవ శతకము :-

" సార్ధశతద్వయ వృత్త సంఖ్యయందు " రామాయణ కథను శ్రీ జూలూరి లక్ష్మణకవి ముకుంద రాఘవ శతకమును వెలయించెను. శతకాంత పద్యముల వలన కవి సుబ్బనార్యా శేషమ్మల పుత్రుడని తెలియును. శతకము వారికే అంకితము.

" ముకుంద రాఘవా !" మకుటము గల ఈ శతకమున వాల్మీకి రామాయణమును అనుసరించి కవి బాలకాండాది విభాగములను ఒనర్చెను. అయినను శతకముపై భాస్కర రామాయణ ప్రభావము కూడ కన్పట్టును. శ్రీరాముడు సమర సన్నాహముతో ససైన్యముగ లంకకేగుట, రావణుడు పేరోలగమున మంత్రిపుంగవులతో మంత్రాలోచనము జరుపుట, విభీషణుని హితోపదేశము—మున్నగు సన్నివేశములందలి పద్యములకు (180-189) భాస్కర రామాయణపద్యములతో సామ్యము కలదు. "చనదు మహద్విరోధమని చక్కట చెప్పిన "– భాస్కర రామాయణ మందలి యీ పద్యమునకు అనుకరణము ముకుంద రాఘవ శతకమున " వలదు మహద్విరోధ " మను పద్యమున కన్పట్టును.

"అంగజకోటి విభ్రమపదాంగ నికృత్తవిచిత్రకూటసా
రంగపతంగపుంగవ తురంగ మతంగజపోషజాదరో
త్తుంగ కృపాంతరంగ పరితోషిత భక్తజనాంతరంగ జ
న్యాంగణ శత్రుభీషణ కరాత్త రథాంగ ముకుంద రాఘవా !"

—శతకములో అలంకార ప్రధానమయిన పద్యమున కుదాహృతిగా గ్రహింపవచ్చును. వృత్త్యనుప్రాసము, అంత్యప్రాసనియమము గల పద్యములు కూడ ఇందు కలవు. 'నిశాకాంతునిఁ బాయు రాత్రిగతి', 'మంటమీది మశకంబు పోల్కి', 'ద్విపి నెదిరించు లేళ్ళగతి'—ఇత్యాది ఉపమానములు భావ, రసోద్దీపితములైనవి ఎడనెడ గలవు. శతక లక్షణము లన్నియు పాటింపబడిన ఈ శతక రచనము రసవంతము, ప్రౌఢము అయినను వాల్మీకి రామాయణమువలె కరుణరస ప్రధానముగ సాగెను. వాల్మీకి రామాయణమే యథాతథముగ స్వీకరింపబడినందున ఇతివృత్తమును గురించి ప్రత్యేకాంశములు లేవు.

## ప్రసన్న రాఘవ శతకము :-

అసురవిజృంభణమునకు భయభ్రాంతులైన దేవతలు మహా విష్ణువును శరణుజొచ్చుటతో ప్రారంభముచేసి శ్రీరామ పట్టాభిషేక పర్యంతము కథను ప్రసన్న రాఘవ శతకమున వంగూరి ముద్దు నరస కవి వెలయించెను. ఇందు రెండువందలపద్యములు కలవు.

రాముని పుట్టుపూర్వమును రాముడు వచ్చుట సీత దెచ్చుటల్
రాముడు కాన కేగుటలు రాక్షసులందఱి సంహరించుటల్
రాము డయోధ్య నేలుటయు రాజ్యము చేసి సుఖాన
నుండుటల్"

— ఆదిగాగల కథాంశములను "ఇరుపదినాల్గువేల కథ నిమ్మారు పద్యము" లందు "పూర్వులు చెప్పగ విన్నయంత సూక్ష్మముగఁ దల్చెద" నని నరసకవి "ఛందము లక్షణంబెఱుగఁ జక్కఁగఁ జక్కగ ధైర్యము తోడఁ జెప్పితిన్ - తొందర లేదు తప్పులని తోచినగాని" అని భక్తిపారవశ్యమున మాత్రము రచన కావించినట్లు చెప్పెను. కాని

శైలి అంత ప్రశస్తమైనదిగ కన్పట్టదు. బాసికములు కట్టుట, మృదంగములు, బూరగలు, తాళము తప్పెటలు మ్రోగుట మున్నగు దేశీయాచారములు సీతారాముల వివాహసందర్భమున వర్ణింపబడెను.

## రాజకంఠీరవ శతకము:-

బృందావనము లక్ష్మణాచార్యులు సీతారామకల్యాణముతో ప్రారంభించి రాజకంఠీరవ శతకమును రచించెను. ఇతడు కర్లపుర వాస్తవ్యుడు. శ్రీరాముడు విల్లెక్కిడగ

"అవనీచక్రము దిర్దిర దిరిగినది. దిశలు భైరవనాదమున పెల్లగిల్లినవి''-

కినుక పూనిన కైకేయి,

"తురుమాడ న్విదలించి, పెన్నెరులు మైదూగాడ గావించి, పూసరులంద్రెంచి, ధరించినట్టి మణిభూషల్ పారజల్లించివే
కురుమా పొక్కటగా ధరించి, మదిలో కోపించి తా నొంటిమై
నరలో నేలను...'' శయనించినదట!

శ్రీరాముడు ఆమెతో,

"పిన్నీ తమ్ముడు రాజ్యమేల తగడా, బేలా మహాదండకారణ్యానం దిరుగంగ నే వెరతునా? బాబేల చింతిల్ల యీ సన్నంపుంపని సేయలేని పతితా సత్పుత్రుడై భూమిపయి నున్నాడన్నది యెట్లులంటివట..." అనెను. పాదుకలను గైకొని భరతుడు "నాకు కిరీట మిచ్చె మా యన్నయ్యగారంచు''బంగారు పాదుకలను మౌళినిడి యంగం బెల్ల పొంగార''భక్త్యావేశముతో నందిగ్రామమునకు తరలెను. రామపట్టాభిషేకము వరకు గల కథ యిందు కలదు.

## రామ ప్రతిపాదకధైర్య శతకము :-

కర్త: వేంకట కృష్ణారావు కవి – బాలకాండ 1-33, అయోధ్య 34-54, అరణ్య 56-69, కిష్కింధ – 70-83 సుందర 84-86,

యుద్ధ – 86-114, 144 – 150. తదుపరి కవి చరిత్రము, ఫలశ్రుతి ఇందు కలవు.

అవతార స్వీకారమునకై దేవతలు శ్రీ మహావిష్ణువును ప్రార్థించుటతో ప్రారంభమయిన రామ ప్రతిపాదక ధైర్య శతకమున అన్య శతకములందు కానుపింపని అంశములు కొన్ని కలవు. శ్రీరాముడు రావణాపహరణార్థము మాయాసీతను ఆశ్రమమున నిలిపెను, శ్రీరాముడు శివలింగమును స్థాపించెను. ఖడ్గరోమ, వృశ్చికరోమ, సర్పరోమ, అగ్నివర్ణుల వృత్తాంతము, మహేంద్రుడు పనిచిన దివ్యాహారమును సీత హనుమంతునకు వాత్సల్యపూర్వకముగ ఒసగుట– మున్నగునవి ఇందు మనోహరముగ వర్ణింపబడెను.

“రామమూర్తి మన చింతలబాపు విచారమేటికిన్”– “రామమూర్తి మన పోషణ చేయు విచారమేటికిన్”– “రామమూర్తి మన దాపున గలుండు విచారమేటికన్”– ఇత్యాది మకుటము లిందు కలవు.

## సీతాపతి :-

లక్ష్మీనృసింహ శర్మ కవి ఇందు పట్టాభిషేక పర్యంత కథ వర్ణించెను. భరతపాత్ర పట్ల ప్రత్యేకాసక్తి కనపరచిన ఇతడు పాదుకా ప్రదాన సన్నివేశము విపులముగ వర్ణించెను. దీనిని కవి శతకముగ పేర్కొనలేదు.

## బాల రామాయణ శతకము :-

(1956) ధూళిపాటి వేంకట సుబ్రహ్మణ్యము పిల్లలకై వ్రాసిన ఇందు అయోధ్యా నగర వర్ణనము, శ్రీరామ విద్యాభ్యాసము మున్నగు ఘట్టములు మనోహరముగా నున్నవి.

ఇంకను శ్రీరామ ప్రతిపాదకములగు గొల్లల మామిడాల కోదండ రామశతకము, యలవాక సూర్యనారాయణమూర్తి శ్రీరామచంద్ర శతకము, బాపట్ల హనుమంతరావు ఆపదుద్ధారక శతకము, సత్యవోలు రాధామాధవ కవి రామశతకము, కల్లూరి విశాలాక్షి రామశతకము మున్నగునవి కలవు.

## రామలక్ష్మణ ప్రశ్నోత్తర శతకము :-

రామకథ యందు కొన్ని సన్నివేశములు సూక్ష్మ పరిశీలనము కావింపనివారికి అనౌచిత్య పూర్వకముగ కన్పట్టును. పేపులపల్లి సీతారామశాస్త్రి కవి ఈ శతకమున శ్రీరామ చర్య లెట్లు ధర్మయుక్తములో సహేతుకముగ వివరించి, శ్రీరాముని మహోన్నత వ్యక్తిత్వమును విశదము కావించెను. వస్తు వైలక్షణ్యము గల శతకములందు ప్రధానముగ పేర్కొనతగిన ఈ శతకము పట్టాభిషిక్తు డైన శ్రీరాముడు లక్ష్మణుని సంశయములను నివారించుచున్నట్లుగా రచింపబడెను.

"బాల్య మాది తమ సల్పిన యా పనులెల్ల మంచివే యని యను కొందు గాని కలవందుల గొన్నిట సంశయంబు" లని లక్ష్మణుడు సభక్తికముగ ప్రశ్నింప సంశయ నివారణము కావించుటకు శ్రీరాము డంగీకరించెను. లక్ష్మణుని ఆ సందేహము లివి :-

1. స్త్రీ హత్య తగదని ధర్మశాస్త్రములు పేర్కొనుచున్న వని ఎరింగియు తాటకను వధించుట,
2. ఉత్సవములకు బంధుమిత్రులను కూడి ఆహ్వానించుట సంప్రదాయము. అట్టిచో భరత శత్రుఘ్నుల పిలిపింపకయే రాజ్య స్వీకారమున కంగీకరించుట,
3. కైక భరతునకై రాజ్యము నభ్యర్థించుట న్యాయమైనను, శ్రీరామ వనవాసమును కూడ కోరుటయు అద్దానికి రాము డంగీకరించుటయు ధర్మబద్ధమగునా.
4. పరస్త్రీలతో సంభాషించుట ఉచితము కాదని ఎరిగియు శ్రీరాముడు శూర్పణఖ నవహేళనము కావించుట,
5. మాయామృగమని లక్ష్మణుడు హెచ్చరించినను దానికై వెడలుట,
6. సీతాన్వేషణార్థము వెడలి ఆతిథ్యము స్వీకరించుట,

7. శత్రు పట్టణవాసికి బుద్ధిపూర్వకముగ ఆశ్రయ మొసగుట,

8. పక్షి జాతికి దహన సంస్కారము లేదని ఎరిగియు జటాయువు నకు ఒనర్చుట,

9. సీతా పాతివ్రత్యము నెఱింగియు అగ్నిపరీక్షకై నియోగించుట.

1. మునీంద్రు నాజ్ఞచే తాటకను వధించుట ధర్మమనియు, 2. దశరథుడు ఆత్మకాలగతితత్త్వ మెరిగి భరతు డింట లేకున్నను పట్టాభిషేక నిర్ణయము కావించెననియు, 3. పెద్దల సమక్షమున పిన్నలు రాజ్యపీఠ మధిష్టించుట అయుక్తీణ మనియు, 4. కామినియగు అంగనా పరాభవము బ్రహ్మచారి ధర్మ మనియు, 5. రమణి వాంఛితము నెరవేర్చుట రమణుని ధర్మమనియు, 6. తన సతికై ప్రాణత్యాగము కావించిన జటాయువు దశరథునివలె ఆదరణీయు డనియు, 7. భక్తి గౌరవములతో అర్పించిన ఆతిథ్యము స్వీకారయోగ్య మనియు, 8. శరణార్థిని రక్షించుట రాజధర్మమే కాకుండ, సజ్జనలక్షణ మనియు, 9. ప్రజాపవాద నివారణార్థము అగ్ని ప్రవేశ నియోగ మనియు, శ్రీరాముడు వాత్సల్య పూర్వకముగ సమాధానము లొసగెను.

రామాయణ మందలి సంశయములన్నింటికిని ఇందు సమాధానము లభించును. ఇట్టి శతకము వస్తువైలక్షణ్యముతో శతక వాఙ్మయమున ప్రత్యేక స్థాన మలంకరించుచున్నది. శతకము సరళరీతిని సాగినది.

"అర్హ కులీను లైన వసుధాధిపు లందఱు బాల్య మాదిగా
బరగ వయోవిశేషములఁ బట్టుచు నుండిరి యర్హకృత్యముల్
విరళ వయస్కులైన మునివృత్తిఁ జరించిరిగాని నీ వటెన్
తరుణిమ చేరుకాలమున; దాపసులై రఁటె రామ; రాఘవా" (25)

"మును తప మాచరించి వనమూలఫలాదులు నారగించె దే
వనదిని భూమికిం గొనుచువచ్చి భగీరథుఁ డాత్మరాజ్యమున్

వనయులతో నేలఁడొకో, తాపసవృత్తిని బూనవచ్చినన్
మనులు వయోవిశేషముల గాంతురె లోకములోన లక్ష్మణా!-
(25. 26)

—పద్యములు ఇందులకు ఉదాహరణములు.

భక్తి వ్యాజోక్తి ప్రధానములుగ రచింపబడిన శతకములందు కూడ శ్రీరామాత్మకములు కొన్ని కలవు. అట్టివానియందు ప్రధానముగ పేర్కొనవలసినది భద్రగిరి శతకము.

మహమ్మదీయులు ఆంధ్రదేశమునందలి దేవాలయాదులను ధ్వంసము కావించిన సందర్భమున కవులు కొందఱు ఆవేశపూరితులై మహమ్మదీయుల ఘాతుకములను తమ యిష్టదైవములకు వ్యాజోక్తి పూర్వక శతకముల ద్వారా నివేదించి, ఆంధ్రజనులను కాపాడుమని వేడుకొనిరి. అట్టి రామపరముగు శతకములలో భద్రగిరి శతకము ముఖ్యమైనది. భల్లా పేరయ్య కవి (క్రీ. శ. 1770 ప్రాంతము) భద్రాచలముపై తురుష్కులు దాడివెడలి విధ్వంసము కావించినప్పుడు శ్రీరాముడు భద్రాచలమునుండి తరలివెళ్ళి(సర్వధారి సంవత్సరమున) పోలవరమున వసించి, తిరిగి విజయ సంవత్సరమున వచ్చెననట. ఈ విధమైన శ్రీరాముని ప్రవర్తనకు అసంతృప్తుడై కవి శ్రీరాముని తూలనాడెను. ఈ శతక రచనకు గోగులపాటి కూర్మనాథ కవి సింహాద్రి నారసింహ శతకము మార్గదర్శకమైనట్లు కన్పట్టును. నారసింహ శతకమునందు వలెనే ఇందుకూడ కవి భగవంతుని మానవమాత్రునిగ చిత్రించి, ఆశ్రిత వత్సలులను ఇక్ష్వాకువంశ మర్యాదను అతిక్రమించి, "పరిత్రాణాయ సాధూనాం" అనుట అతిశయోక్తి మాత్రము అనెను. శ్రీరామావతార విశేషములను ప్రధానముగ పేర్కొని ఆయా తావులందు రాఘవుని శౌర్య బలహీనత్వములను అవహేళనము చేసెను. తురుష్క ముష్కరులను కూడ పరిమార్ప నేరని వాడు తాటకాదుల నెట్లు వధించె నని కవి సందేహించెను. వనమున చిత్రమృగము కనుక తరిమికొట్టితివి సుమా అని- గేలిచేసెను. దశకంఠుని తలలు త్రుంచినవాడవు "ఓడపై నెక్కి తురకల జాడ గాంచి యురక దగునయ్య

నీవంటి దొరలకు" అని మందలించెను. శ్రీరాముని యందు శౌర్య స్ఫూర్తి కలుగునట్లుగ సీతమ్మ విషయమును కరుణ రసోద్వేలముగ వర్ణించెను. తదుపరి, దేశకాలపరిస్థితులచే ఆవేశపూరితుడై నిందించి నందులకు కరుణింప స్వామిని వేడుకొనెను. చివరకు పోలవరము నుండి వేంచేసిన స్వామికి జరిగిన కళ్యాణమహోత్సవమును తెల కించి "తన్ను ధన్యునిజేయ నాచేత పద్యముల్ చెప్పింపఁ బూనుటకు" స్వామి భద్రగిరిని తాత్కాలికముగ విడచియుండు నని భావించెను.

చారిత్రకాంశములను తెల్పు ఈ శతకమున ఊర్దూ పదములు అధికముగ కలవు.

శ్రీరాముని అవతారమూర్తిగను, క్షేత్రస్వామిగను వర్ణించుచు రచి యింపబడిన శతకములు అధికముగ కలవు. వీటియందు కథ వివరింప బడక, నామసంకీర్తనమున అటనట సన్నివేశములు మాత్రము సూచి తము లగుచుండును. భద్రగిరి, ఇందుపురి మున్నగు క్షేత్రము లందు వెలసిన శ్రీరాముని క్షేత్రదైవముగ పేర్కొని, క్షేత్రమాహాత్మ్య మిళితముగ సంకీర్తనము కావించిరి. ఇటువంటి వాటిలో ప్రధాన మైనవి దాశరథి శతకము, (కర్త:- రామదాసుగా ప్రసిద్ధుడగు కంచెర్ల గోపన్న), రఘువీర శతకము (కర్తృత్వము వివాదాత్మకము). రామ చంద్ర శతకము (కర్త : వేంకట నృసింహకవి), చిట్టిరాయకవి రఘు తిలక శతకము, తేరపావన శతకము (కర్త : కన్నాటి తేరప కవి), పుష్పగిరి తిమ్మన సాధుమేధానిధి శతకము, కామేశ్వర కవి రామప్రభు శతకము, పల్లి పార్వతీశము శ్రీరామ రాఘవ శతకము, సాహెబు రాణా రామన్న సీతాపతి శతకము, రేమెల రామదాసు మహిజా మనో హర శతకము, ఈశ్వర సత్యనారాయణ శర్మ - జానకీ జాని శతకము (1909), వడ్డాది సుబ్బరాయకవి ఆర్తరక్షామణి శతకము (1933), వేంకట సుబ్బనామాత్యుని తారక శతకము, శ్రీనివాసుల శివకామ సుందరమ్మ శ్రీరామ శతకము (1922), కోదండరామ శతకము (లక్ష్మీ కాంతానందస్వామి), రామచంద్ర శతకము (సంజీవమ్మ రచన), జన మంచి సీతారామస్వామి రాఘవ శతకము, తాతలపాటి సుబ్బక

వీంద్రుని భద్రాద్రి రామచంద్ర శతకము, భాగవతుల వేంకట సుబ్బారావు భద్రగిరి శ్రీరామ శతకము (1942), రామచంద్ర ప్రభుశతకము (పోలూరి రామకృష్ణకవి), ముదిగొండ వేంకట రామలింగశాస్త్రి శ్రీరామశతకము, రామదాసు కవి రాఘవ శతకము, మైలవరపు సూర్యనారాయణమూర్తి శ్రీ జానకీ జాని శతకము, రామకృష్ణయ్య శ్రీరామ ప్రబోధశతకము, నరసయ్యకవి జీడికంటి రామశతకము (1924), వరప్రసాద రాయకవి కోదండ రామశతకము (1940), రామకవి శ్రీ జానకీవల్లభ శతకము (గురుమూర్తి కవి-1947), జమాల్సావ మేకప్రాస శతకము, అలానగరయ్య సీతారామ ప్రబోధ శతకము (1910) దేవరభొట్ల సుబ్బావధాని (1917) భక్తతోషణ శతకము, చెన్న కృష్ణదాసు తార్క్ష్యరధి శతకము (1913)- ఇట్లింకను ఎన్నియో కలవు.



# వచన వాఙ్మయము - రామకథ

ఏ భాషా వాఙ్మయమైనను ప్రథమమున గేయ పద్యాత్మకముగ సాహిత్యాభివృద్ధిని కాంచును కాని గద్యరూపాత్మక వికాసము కానరాదు. అనుప్రాసాద్యలంకార యుతముగ గద్యము వ్రాయుట కష్టసాధ్యమని కాబోలు "గద్యం కవీనాం నికషం వదంతి" అను నానుడి ప్రబలెను.

క్రీ. శ. 1670 ప్రాంతమున గోపినాథ కవి విరచిత వచన విచిత్ర రామాయణమును లభ్యమగు ప్రథమాంధ్ర వచన రామాయణముగ స్వీకరింపనగును. ఉత్తర భాషయందు సిద్ధేశ్వరకవి రచించిన విచిత్ర రామాయణమున కిది అనువాదము. "పరింపిత కథా విశేషంబైన వాల్మీకి రామాయణానుమతం బైనయోత్ర రామాయణంబును, తత్కథా విశేషంబుల సారం బంగీకరించి; సంక్షిప్తంబులుగా నెడనెడ సంస్కృత పదంబులు సంఘటించి, తెనుగు వచన ప్రకారంబున రచించితి"నని గోపీనాథ కవియే స్వయముగా పేర్కొనెను. అవాల్మీకీయములగు చిత్రవిచిత్రాంశము లిందు పెక్కు గలవు. ఈ తెనుగు వచనము మాతృకగ తరువాత నాలుగయిదు పద్యకావ్యములు వెలసెను. సీతారామాంజనేయ సంవాదమను వేదాంత వచన గ్రంథము క్రీ. శ. 1750 ప్రాంతమున రచింపబడెను.

మధుర నాయక రాజుల కాలమునుండి వచన రచన క్రమ వికాసము పొందెను. కాని మధురయందు ఆంధ్రము ప్రజాసామాన్య భాష కాకుండుట జేసి, శుద్ధ గ్రాంథికమున వచన వాఙ్మయాభివృద్ధి జరిగెను.

## దేవకి వేంకట సుబ్బకవి :-

కృతి రామాయణ వచనము. ఇతడు మధుర నాయకుల కాలమువాడు. ఈ రామాయణమునందలి అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండములు మాత్రమే లభించెను. ఇది యథామాతృకానువాద మని అధ్యాయ సూచికలన తెలియును. శైలికి కొన్ని పంక్తులు :-

"మహాత్మా! నీ కతంబున మదీయంబగు శాపంబు నిర్ముక్తం బయ్యె. నే నింద్రలోకంబునకు బోయెద- ఇంకొక్క వార్త నెఱింగించెద వినుము.- నిన్ను సరోవరమునకుం బొమ్మని యనిపిన తపసి వృత్తాంతము నీకు దెలిపెద. వాడొక్క రాక్షసుండు. ఛలంబున రాక్షస నాయకుండగు రావణుని నియోగంబున బలియుండై నిన్ను జంపుటకు బూని వచ్చె"- ఈ గ్రంథము అముద్రితము.

## ఉత్తర గోపుర కథ లేక పట్టు గొడుగుల వచనము :-

క్రీ. శ. 1700 ప్రాంతమునందలి యీ రచనమున రామాయణ మందలి యుద్ధకాండము ఇతివృత్తము. లంకేశుడైన దశకంఠుడు ఉత్తరగోపుర మధిరోహించి, సువేలాచలమున విడిసిన శ్రీరామ సైన్యము గాంచి, అనుతాపము పొందుట యిందు వర్ణింపబడెను. దీనికి 'గొడుగుల వచనము'గా నామాంతరము కలదు. ప్రాచ్య లిఖిత పుస్తక శాల గ్రంథవివరణములో "గొడుగుల వచనమునకు నర్థమేమో" అని వ్రాయబడెను. దానికి అర్థమును నిడుదవోలు వెంకటరావుగారు ఈ విధముగ పేర్కొనిరి.

"పావులూరి మల్లన గణితమున మాత్రవ్యవహారములో,

"ఉత్తర గోపురం బెగి రావణుం డెక్కి
పట్టిన గొడుగులు పాను గప్పె
అవి సహింపక రాము డమ్మొక్క టరి వోసి
గొడుగులన్నియు ద్రుంచె గుత్తికలకు
అందు మూడవపాలు అర్థమై గప్పెను
నాల్గవపాల్ వోయి నేలను గప్పె

నగచరావళి గప్పె నాఱవ భాగంబు
అష్టభాగము గప్పె నసురపతుఁ

నవమ భాగంబు గప్పె నంతఃపురంబు
మూలమును చెడి రెండును వ్రోలబడియె
తెగిన గొడుగు లెన్ని తెలియంగ జెప్పఁ డా
గణిత మెఱిగిరేని క్రమముగాను!

(తదుపరి పద్యమున సమన్వాయ వివరణము కలదు.)

పూర్వము ప్రజాసామాన్యమున మల్లన గణితమే వాడుకలో నుండుట చేతను, రామాయణ కథయం దీ భాగమును మల్లన ఉదాహరణగా నిచ్చి యుండుటచేతను ఉత్తర గోపుర కథ పట్టునకు గొడుగుల వచనము అని పేరు వచ్చినది."[1]

## తుపాకుల అనంత భూపాలుడు:-

ఇతడు సుందర కాండమును అయిదాశ్వాసములు వచన కావ్యముగా వ్రాసెను. ఇది అముద్రిత గ్రంథము.

## పైడిపాటి పాపయ్య:-

రంగనాథ రామాయణమును వచనముగ అంగీకరించెను. సులభగ్రాహ్యమగు వ్యావహారిక భాష యిం దుపయోగింపబడెను.

క్రీ. శ. 1840 కి కొలది కాలము ముందుగ భారతదేశమున ఆంగ్లేయ పరిపాలనము ప్రారంభమయి, ఆంగ్లేయులు తెలుగు భాష నేర్వవలసిన అగత్య మేర్పడుటచే. వచనగ్రంథ రచనలు యితోధికముగ ప్రారంభమయ్యెను. తదుపరి శ్రీ గిడుగురామమూర్తి పంతులు మున్నగు ప్రముఖుల వ్యావహారిక భాషావాదము తెలుగు దేశమున విజృంభించెను. ఫలితముగ తెలుగు వచనము వ్యావహారి కాంధ్రమున వెలువడు ప్రయత్నములు ప్రారంభమయ్యెను.

---

1. ఆంధ్రవచన వాఙ్మయము – నిడదవోలు వేంకటరావుగారు.

అట్లు ప్రభావితు లైన వారిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ముఖ్యులు అని పేర్కొన తగును. వాల్మీకి రామాయణము- ఏడు కాండలను వీరు వ్యావహారి కాంధ్రమున అనువదించిరి. ఉత్తరకాండ పీఠికయందు "ఆంధ్రజాతి మేలుకోరి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషా సిద్ధాంతం ప్రతిపాదించారు. అది నమ్మా న్నేను-అంచేత, వ్యావహారి కాంధ్రానికి పుష్టి కలిగించాల్సిన బాధ్యత చాలా వుంది నాకు. శిష్ట వ్యావహారానికి 'శిష్టత్వం' సాధించాలంటే, రామాయణం వంటి ఉద్గ్రంథాల అనువాదానికిన్నీ అది వినియోగించవలసిన అగత్యం చాలా వుంది" —అని శ్రీపాదవారు స్వయముగా పేర్కొనిరి. ఇది యథావాల్మీకము.

**శైలికి :** "రాముడు పట్టాభిషిక్తుడై రాజ్యపాలనం ప్రారంభించాక, రాక్షసులను సంహరించినందు కతణ్ణి అభినందించడానికి మహర్షు లయోధ్యకు వచ్చారు. వారిలో, కౌశికుడూ, యవక్రీతుడూ, రైభ్యుడూ, చ్యవనుడూ, మేధాతిథి కొడుకు కణ్వుడూ తూర్పునుంచి వచ్చారు స్వస్తి, ఆత్రేయుడూ, నముచీ ప్రముచీ, అగస్త్యుడూ దక్షిణంనుంచి వచ్చారు." —(ఉత్తర కాండము).

వచన రామాయణ కర్తలు పెక్కుమంది శిష్ట వ్యావహారి కాంధ్రమున తమ రచనలు వెలయించిరి. అట్టివారిలో శ్రీనివాస శిరోమణి (వాల్మీకి రామాయణము-యథా మాతృకము)మున్నగువారు ముఖ్యులు.

నేటి కాలములో వెలువడిన వచన రామాయణములలో వీరి రామాయణము అధిక ప్రచారమును పొందెను. ఇది ఆంధ్రపత్రిక యందు ధారావాహికముగ ప్రచురింపబడెను.

## దేవరాజ సుధి :-

"వాల్మీకి యలవరించిన రసభావములు కొఱవడకుండునట్లు తెనిగించితి'' అని అనువాద కర్తయే పీఠికయందు పేర్కొనెను. యథా మాతృకమగు ఈ రామాయణమున ఉత్తర కాండము కూడ కలదు. శైలి, భాషకు:

"అంత సముద్రము నశ్రమమున దాఁటుట మొదలగు మేటి కృత్యముల బ్రసిద్ధిగాంచిన మహాబుద్ధిమంతుడును, గపికుల తిలకుండును నగు నా హనుమంతుడు లంబ పర్వతమున వంగినదైయుండు టంజేసి వ్రేలుచున్న యొక మేఘంబులాగున జూపట్టుచున్న యొక శిఖరముపై నెలకొని, బుద్ధిమంతుండు గాన యప్పటి కార్యం బూహించుచు లంకాప్రాప్తికిం దగిన కొలఁది లాఘవం జేవయుఁ గైకొని, చెలువారు నడవులును జలములును గలదై రావణ పరిపాలితంబై యొప్పు లంకా పురమును రాత్రిసమయమునఁ బ్రవేశింప సాగెను.'' (సుందర కాండము)

పండిత పామర జనామోదమును పొందిన వచన రామాయణములలో దేవరాజు సుధి రామాయణము ఒకటి.

## సరస్వతుల సుబ్బారామశాస్త్రి :-

శ్రీ మదాంధ్ర వచన రామాయణము, "సంస్కృత రామాయణమునకు సరియైన తెలుగు అనువాదము" అని అనువాద కర్తయే పేర్కొనెను.

శైలికి :- "అప్పుడు కాంతిగలవాఁడయిన సుగ్రీవుఁ డత్తెఱఁగున దుఃఖములోఁ జిక్కియున్న దశరథ పుత్రుఁ డైన రామునిఁ గూర్చి, దుఃఖము తొలగించునట్టి మాటలఁ జెప్పెను."

## దీపాల పిచ్చయ్యశాస్త్రి :-

శ్రీరామ వనవాసము, శ్రీరామ వనవాసమునుండి పట్టాభిషేక పర్యంతము గల కథ వివరముగాను, తత్పూర్వకథ సంగ్రహముగాను చెప్పబడెను. వాలి మరణఘట్టమున దుఃఖిత యైన తార ''ఇట్లు చేసిన కారణమున నీవు సీతను దోకొని వచ్చినంతట యా లలనామణి పెద్దకాలంబు నీ యొద్ద నుండక నిన్ను శోకమునొందఁ బాల్పడఁజేసి భూమిలో జొచ్చునుగాక"యని శ్రీరామునికి శాపమిడెను. ఇం డిదొక్కటియే అవాల్మీకాంశము.

## మామిడిపూడి రామకృష్ణయ్య :-

శ్రీ మద్వాల్మీకి రామాయణ కథామృత మను పేర వచన రామాయణము రచించెను. ఇందు విశ్వామిత్రుని వృత్తాంతము, ఆతడు దశరథునికడ కేతెంచిన సందర్భముననే వివరింపబడెను. వచన కావ్యమైన ఇందు నాటకరీతిని గ్రంథాద్యంతము సంభాషణలు కలవు. ముఖ్య ఘట్టములందు వాల్మీకి రామాయణ శ్లోకములుకూడ స్వీకరింపబడెను.

## నూతలపాటి పేరరాజు:-

ఆనందరామాయణానువాదము కావించెను. ఇప్పట్టున కృష్ణమూర్తి 'శ్రీ కవితానంద వాల్మీకి రామాయము', జి. సుబ్బయ్యశాస్త్రి 'శ్రీమదానంద రామాయణము'తో డ్పడినట్లు అనువాద కర్తయే పేర్కొనెను.

సంస్కృతానంద రామాయణము వాల్మీకి కృత మనియు, కాదనియు కర్తృత్వవిషయమున భిన్నవాదములు కలవు. ఇది వాల్మీకి రామాయణమునుండి ఇతి వృత్తమున భేదించుచున్నది. పాయస విభాగము, ముఖ్యపాత్రల పూర్వజన్మ వృత్తాంతములందు వాల్మీకి, ఆనంద రామాయణములు భేదించుచున్నవి, ఇందు మైరావణైరావణుల కథ కలదు. సీత పూర్వజన్మమున పద్మా కన్యగా పేర్కొనబడి వేదవతి కథనుండి వేరగుచున్నది.

ఆనంద రామాయణ సారకాండమును ఇద్దరు ముగ్గురు కవులు పద్యకావ్యముగ అనువదించిరి.

ప్రసక్తానువాదమునకు చిన్నయసూరి నీతి చంద్రిక యొజ్జబంతియైనను సారళ్య సౌలభ్యము లింద దధిక మని డా॥ దివాకర్ల వేంకటావధానిగారు పేర్కొనిరి.[1]

1. ఆనంద రామాయణము – గ్రంథ పీఠిక.

## పాలపర్తి నాగేశ్వరరావు :-

వచన రామాయణము - ఉత్తర కాండము. సంస్కృతాంధ్ర భాషలయందుఁ గల పెక్కు రామాయణంబులలోని యుత్తర కాండములను, శ్రీ వేదవ్యాస విరచితంబగు పద్మ పురాణమందలి శ్రీ రామాశ్వమేధంబును అనుసరించి తా నీ రచన కావించినట్లు ఆ గ్రంథకర్త స్వయముగ పేర్కొనెను.

## నూతలపాటి పేరరాజు :-

ఆనంద రామాయణము అనువదించిన నూతలపాటి పేరరాజు తులసీ రామాయణము కూడ వచనము కావించెను. ఇందు విషయ గ్రాహ్యత కొరకు అటనట అధ్యాత్మ రామాయణమునుండి కొన్ని వాక్యము లుదాహరింపబడెను. వెలుగోడు అశ్వత్థ నారాయణరావు 'దండక రామాయణము' నుండి కూడ ఒకభాగ మిందు గ్రహింపబడెను. ముంగర శంకరరాజుచే కావింపబడిన 'రామచరిత మానస్' అనువాదము తనకు తోడ్పడినట్లు గ్రంథకర్త పేర్కొనెను.

## ముంగర శంకరరాజు :-

ఈయన రామచరిత మానస్‌కు ఆంధ్ర వచనానువాదము కావించెను అయోధ్యాకాండ పర్యంతము శైలి కొంచెము సరళముగను, తదుపరి ప్రౌఢముగను సాగెను. కథను వివరించుట యం దచ్చటచ్చట అధునాతన విధాన మవలంబింప బడెను. ఇందలి చిత్రకూట వృత్తాంతము మనోజ్ఞమైనది. ఇది ఆంధ్ర సచిత్ర వారపత్రికయందు ధారావాహికముగ ప్రచురింపబడెను.

వచన రామాయణములను గురించి చర్చించు సందర్భమున గమనీయాంశము ఒకటి కలదు. వచన రామాయణములుగ ప్రశస్తిని పొందిన కృతులలో యథావాల్మీకములే అధికము. అటనట తులసీ రామాయణాదులు వెలసి సముచిత స్థానమును పొందెను. యథావాల్మీకానువాదమునకే రచయితలు ప్రాధాన్య మొసగిన కారణమున, అట్టి కృతులే అధికసంఖ్యయం దున్నవి. గ్రాంథికము, శిష్ట వ్యావహారిక భాష రెంటియందు వచన రామాయణ సాహిత్యము పరిఢవిల్లెను.

దొడ్డ రామాయణము :- కర్త - దొడ్ల వేంకట రామరెడ్డి

ఉత్తర కాండమందలి రామావతార హేతువు ఈ వచన కావ్యమున ఆదియందే కలదు. "వాల్మీకి గ్రంథంబునకు నా రచన తర్జుమా గాదుగాని దానిని బ్రాయికముగా ననుసరించితి" నని రచయితయే పీఠికయందు నుడివెను. ప్రక్షిప్తములగా భావించినవాటిని వదలి, వాల్మీకి భావములను కొన్నింటిని వివరించి, సందర్భోచితముగ తాను కొంతచేరి, విషయ సౌలభ్యార్థము గ్రంథాంతరములనుండి కొన్ని పద్యములను గ్రహించి, మరికొన్ని స్వయముగ రచించి, ఈ వచన కావ్యమును నిర్వహించెను. ఇందెడనెడ పద్యములు, వాటి వివరణము కలవు. విప్రలంభ పరిణామం బగు కరుణ రసమును పాఠకులకు సన్నిహితము కావించు తలంపుతో భవభూతి ఉత్తర రామ చరిత్ర నాటకమునుండి కొంతభాగమును (వేదము వేంకటరాయ శాస్త్రిగారి అనువాదమునుండి) కూడ స్వీకరించెను. ఈ వచనకావ్యమున సంభాషణలు కూడ పొందుపరుపబడెను. జానకీ పరిణయము, తిక్కన భారతము - ఇత్యాదులనుండి పద్యములను గ్రహించుటచే పఠితకు ఏకాగ్రత కుంటువడు ప్రమాద మిందువలన ఏర్పడెను. ఉదాహరణమునకు, రావణుడు సీతా సౌందర్యము వర్ణించు సందర్భమున కీచకుడు ద్రౌపదిని వర్ణించు పద్యము తిక్కన భారతము ("గండుమీలకు బుట్టి") నుండి గ్రహింప బడెను.

కొన్ని సంస్కృత స్తవములు యథాతథముగ స్వీకరింపబడెను. రేణుకా చరిత్ర మున్నగు ఉపకథలు పెక్కు గలవు.

ఇంకను చిలుకూరి శ్రీరామశాస్త్రి మరాఠీనుండి అనువదించిన సమర్థ రామస్వామి ఆనంద రామాయణము, దీపాల పిచ్చయ్యశాస్త్రి, రఘువంశము, మైరావణ వచనము, పి. పోతరాజు శ్రీరామ వనవాసము, వెలగా రామకోటయ్య చౌదరి, శ్రీరామచందులు కావించిన హిందీ భాషయందలి బాలశౌరిరెడ్డి 'శబరి'కి అనువాదము, బరూరు త్యాగరాయశాస్త్రి వాల్మీకి రామాయణానువాదము, వ్యావహారికాంధ్ర రామాయణము మున్నగునవి వచన వాఙ్మయమున పెక్కు గలవు.



# తెలుగు సాహిత్యములో రామకథ - శ్రీమద్రామాయణ కల్పవృక్షము

ఆధునిక యుగమున వెలసిన రామకావ్యములలో ప్రథమముగ పేర్కొన వలసినది కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ విరచిత "శ్రీమద్రామాయణ కల్పవృక్షము"ను, ఇది వాల్మీకి రామాయణానుసారి అయ్యును, నూతన కల్పనములు, పాత్రపోషణము, వర్ణనా వైచిత్ర్యము మున్నగు అనేక హేతువులచే స్వతంత్ర కావ్యత్వమును సమకూర్చుకొనెను. కల్పవృక్షమున ప్రథమముగ పేర్కొన వలసిన విశేషము కాండల వింగడింపు. వాల్మీకి రామాయణాంతర్గత కాండలు సర్గలుగ విభజింపబడగా, ఇందలి సర్గలు సన్నివేశ ప్రాముఖ్యతను సూచించు నామములతో పేర్కొనబడినవి. బాలకాండము ఇష్టి, అవతార, అహల్య, ధనుస్సు, కల్యాణ ఖండములుగను, అయోధ్యాకాండము అభిషేక, ప్రస్థాన, మునిశాప, పాదుకా, అనసూయ ఖండములుగను, అరణ్యకాండము దశవర్ష, పంచవటీ, మారీచ, జటాయుః, శబరీ ఖండములుగను, కిష్కింధాకాండము నూపుర, గజ వృష్టి, నియమపాలన, సమీకరణ, అన్వేషణ ఖండములుగను, సుందరకాండము పరరాత్ర, పూర్వరాత్ర, ఉషః, దివా, సంధ్యా ఖండములుగను, యుద్ధకాండము సంశయ, కుంభకర్ణ, ఇంద్రజిత్, నిస్సంశయ, ఉపసంహరణ ఖండములుగను ఖండాంతర్గత విషయములను వివరించునట్లు విభజింప బడినవి.

కల్పవృక్షమున దశరథుని పత్నులు మూడువందల ఏబది. ఆనంద రామాయణాదులందు కూడ ఇట్లే పత్నుల సంఖ్య శతాధికముగ పేర్కొనబడినది. ఇందతి ప్రధానముగ పేర్కొనవలసిన అవా

ల్మీకాంశములలో అహల్యా శాపవిమోచన ఘట్ట మొకటి. మిథిల సమీపమున పరిభ్రష్టమైన యోగము వలె పాడువడియున్న ఆశ్రమమును గాంచి భాష్పాకులిత నేత్రుడై రాము డందు ప్రవేశింపగా విశ్వామిత్రుడు అహల్య వృత్తాంతము నెరింగించెను. గౌతమ వేషధారియై అరుదెంచినది మహేంద్రుడని గురుతించియు అహల్య ప్రథమమున, ఎఱుగనిదాని వలెనే సంభాషించి, తుదకు సంకేత మేర్పరచెను. తదనుసారముగ నిరీక్షించుచుండిన మహేంద్రున కారేయి దీర్ఘముగ దోచి ఆశ్రమము చెంతకు జని కుక్కుటము వలె కూసి గౌతముని కికురించెను. ఇందు గౌతముడు ఇంద్రునకు శాపమొసగి [1] "ఆ ఇల్లాలు పౌలోమి నీ — కై రాపిళ్ళుగ వేచియుండెడును గాదా? యామె నుంగూర్చియే—మారంభించిన మాటయే కలుషమౌ నాత్మీయల్ దారలుం—గారా! యొక్కటి యైన కోర్కెఁ బది సంకల్పింతు మిథ్యామతీ!" అనుచు అతికఠినముగ మందలించెను. శిలను కమ్మన్న పతిని తన నావేశించిన మోహము విచ్ఛిన్నమగు రీతిని అనుగ్రహింప అహల్య వేడుకొనగా, [2] "ఎప్పుడు నీదు మోహ మది యెల్లను విచ్చునొ రామచంద్రుఁడై — యప్పుడు వచ్చు స్వామి" యని నుడివినాడు. విశ్వామిత్రు డీ వృత్తాంతము నెరింగించునంతలో ఆశ్రమము ఎప్పటివోలె కలకలలాడ జొచ్చినది. అంత అహల్య చనుదెంచి, ఆశ్రమ సరస్సున మాధ్యాహ్నిక క్రియలాచరించిన విశ్వామిత్ర రామలక్ష్మణులకు పంచభక్ష్య పరమాన్నములతో విందుభోజన మిడినది. పిమ్మట నామె శ్రీరాముని ఔరసపుత్రునిగ సన్మానించి, రక్షపలికి, విజయ తిలక మిడుటయే గాక కల్యాణానంతరము అయోధ్యకు మరలునపుడు సీతాసమేతముగ రాముని తన ఆశ్రమమున కరుదెంచ గోరినది. వివాహానంతరము అయోధ్యకు ప్రయాణించుచున్న రాఘవుడు అహల్యా అభ్యర్థనమును దశరథున కెరింగింప సంకోచించి కౌసల్యకు తెలుపగా ఆమె "....అరుదుగ షష్టి సహస్ర, స్ఫురితాబ్దాంతముల యనంగా" [3]

1. బాల—అహల్యా—529.
2. బాల—అహల్యా—ప. 540.
3. బాల—కల్యాణ—ప. 124.

రథముల ఆశ్రమము దెస మరల్ప అనుజ్ఞనొసగినది. అట్లు చనుదెంచిన నూతన వధూవరులను గాంచి, సంతసించిన అహల్య వారికి హారతి పట్టి, నారచీర లొసగినది. మధుపర్కముల పైననే రాముడు వాటిని ధరింపగా, "పతిశాల్చినాడనుచు" సహోషమైన సీత కూడ ధరించినది. అంత రాముడు "...కుశిక సుతుతో, నిను గురువుగ స్వీకరింతు"నని ఆమెకు మ్రొక్కెను. ఇట్లు రాముడు గురువుగ స్వీకరించు సంపూర్ణత్వము అహల్యా పాత్రకు చేకూర్చిన విధము అన్యరామాయణములం దెచ్చటను కానరాదు. సంస్కృతమున భాసుని ప్రతిమా నాటకమున, పట్టభంగ ఘట్టమున సీతారాములకు అవదాతిక నారచీర లొసగుట ఇట స్ఫురించును.

ఇట్లే, వాల్మీకి రామాయణమునుండి భేదించుచు పాత్రల ప్రాముఖ్యమును ఇతోధికముగ బలపరచు సందర్భ మిం దింకొకటి కలదు. అది అశ్వమేధయాగము నిర్వర్తింపనున్న దశరథుడు ప్రియమిత్రులైన గుహ జటాయువులను యాగ సందర్శనార్థము అయోధ్యకు ఆహ్వానించుట! వాల్మీకి రామాయణము, మిగిలిన రామాయణములు ఆయా విషయములను అవసరమగున తావుల గ్రహించినవి కాని, వాటికి పూర్వరంగము, పూర్వస్మరణము వాటియందు కానుపించదు. ఉదాహరణమునకు గుహ, జటాయువులను గ్రహింపవచ్చును. వాల్మీకి రామాయణాదులందు ఈ పాత్రలు అయోధ్య అరణ్యకాండము లందు మాత్రము ప్రవేశించును. అట్లుగాక రామాదుల జన్మమునకు పూర్వము యాగ సందర్భమున దశరథుని యెడ గల మైత్రిని పురస్కరించుకొని గుహజటాయువులు అరుదెంచినట్లు చిత్రింపబడుటచే కల్పవృక్షము నందలి ఈ అంశము అవాల్మీకమయ్యును ఆయాపాత్రలను పరిపుష్టమొనర్చు చున్నది.

శివధనుర్భంగ ఘట్టమున ధనువును చేపబోయిన రామచంద్రునకు [1] "తత్సభాభవన నివిష్ట ప్రాగ్దిశా సౌధంబు పైయంతస్తున నంతఃపుర స్త్రీల కడలికి గుర్తుపట్టి తలయెత్తిన" సీతాకన్య వర్ణనమయ్యెనని

1. బాల. ధనుస్సు – 297.

అవాల్మీకాంశము ఇందు కలదు. రంగనాథ రామాయణాదులందు సీతా సమేతముగ అంతఃపుర వనితలు గవాక్షములనుండి రాముని గాంచిరని పేర్కొనబడగా, తమిళ భాషయందలి కంబరామాయణమున సీతారాములు పరస్పర దర్శనమున అనురాగబద్ధులయినట్లు పేర్కొన బడినది.

భరత శత్రుఘ్నులు లేని సమయమున దశరథుడు రాజ్యాభిషేకమునకు నిర్ణయించుటకు కింద బలీయమైన హేతువు చూపబడినది. రాజకుమారునిగ భోగభాగ్యము లనుభవింపవలసిన శ్రీరాముని హృదయమున వైరాగ్యభావ ముదయించి, అభివృద్ధి నొందుచున్న విషయము నెఱింగి, పుత్రుని బాధ్యతాయుతుని గావించుటకై దశరథుడు పట్టాభిషేకమునకు నిర్ణయించెను. పుత్ర విషయకముగ వ్యాకులత నొందిన దశరథుని పితృహృదయము, నిర్ణయము

1 "బ్రహ్మచారి సుతుండు విరాగియైన
జనకు( డూహించు సుతు గృహస్థుని( బొనర్ప(
దా గృహస్థుండె సుతు(డు విరాగి యైన(
దండ్రి వ్యవహార మతనిని( దాల్ప(జేయు"- నను లోక న్యాయ

ముతో సమర్థింపబడినది.

అభిషేకాత్పూర్వరాత్రమున 'సువ్రతు' నిగ నున్న రామునికి "....మొదలో" దేవతలు వచ్చి పిలచినట్లు కాగా, సమాధినిష్ఠయందు బ్రహ్మత్వమును పొందినట్లున్న ఆతనికి భావికాల నిర్వాహ్యా పంక్తి కంధరవధను గురించిన దేవతా ప్రబోధము జరిగినది. సమాధి విశ్లథమయి మరల మానవ స్థితికి వచ్చిన రామునకు తాము రాజ్యము స్వీకరించుట దేవతల కనిష్ట మని బోధపడినది. అంతనాత డా అర్ధ రాత్రమున కైకేయి కడ కరిగి, విషయము నెరింగించి ఆమెను కర్తవ్యము నుపదేశించుమని కోరెను. అవాల్మీకమయిన ఈ సన్నివేశము వలన రామునియందు దివ్యత్వారోపణము జరుపకుండ, సమాధి దశయందలి ప్రబోధము మాత్రము సూచ్యమయినది. కల్పవృక్షము

1. అయోధ్య - అభిషేక - ప. 5.

అద్వైత పరముగ రచింపబడినది కావున ఇప్పట్టున రామునియందు "సోహం" భావము నిక్షిప్తమయినది.

ఇట్లు చేర్పబడిన అవాల్మీకాంశములలో అరణ్య కాండమున మరియొకటి కలదు. అగస్త్యాశ్రమమున అతిథ్యము స్వీకరించిన రామ లక్ష్మణులు "సర్వత్ర హరిణ సంచారంబైన" అగ్ని గృహమును ప్రవేశించి, నానాగ్నిస్థానములందు బలులు సమర్పించి, "తన్ను గన్నులతోఁ జూచుచు నొకమూలఁ గదలక పరుండి యున్న దుప్పికి ....గృసరంబు తినిపించి సుఖాసీనుడై యున్న అగస్త్యునకు ప్రణామ మాచరించిరి. అంత అగస్త్యుడు,

చ. "కృసర మొసంగినట్టి రురు వియ్యది పెంటిని బాసి మిక్కలిన్
వ్యసనము నంది నా వెనకు నైనది దీనిని గూడ నగ్నితో
డ సరిగఁ జూచెదన్ మృదు కదారము వన్నె నెసంగుదాని దృ
క్కృసరము జాలిగొల్పు ప్రియభార్య వియోగము పక్కలింతలై.[1]

—అని హరిణముగూర్చి పల్కి, పిదప హితోక్తులాడి, నూతనఖడ్గధనుశ్శరములను రాముని కొసగెను. అచట విశ్రమించిన సీతకు ఆ రాత్రి స్వప్నమున "పసిడిమేను పొడలు మాఘవతమణులు, కనులు పచ్చలు మిన్నెగఁ గలుగు లేళ్ళు" రామునకు ప్రియాంగనా విరహమున కుందు పెంపుడుదుప్పి కానుపించగా వారు "భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెడు" నని సమాధాన పడిరి. అవాల్మీకమగు ఈ అంశము భావ్యర్థసూచక మగుచు అర్థవంతమగు కల్పన మగుచున్నది.

ఇందతిముఖ్యముగ పేర్కొనవలసిన అవాల్మీకాంశము సీతాపహరణ ఘట్టమున మారీచుడు తుదిని "గ్రజా" హాతని "లక్ష్మణాగ్రజా" అని కేకపెట్టుట! రాముని కాపద సంభవించె నని మురపిల్లు జానకితో లక్ష్మణుడు

"అది పూర్తికేక కాదది
తుది యక్షరములను నేనొ తోచకయుండెన్

1. అరణ్య - దశపర్ష - 333.
2. అరణ్య - మారీచ - ప. 363.

ప్రిదిలిన పిలుపుం జివరం
గుదించి లోగొంతుతోఁడ గూసిన యట్లై–" అని లక్ష్మణుడది మారీచుని కంఠధ్వని యని సంశయించెను. "అశ్వత్థామ హతః కుంజరః"–అను మహాభారతమునందలి యుధిష్ఠిరుని వాక్యమును స్ఫురింపజేయు ఈ ఇట్టి కల్పనలు అన్యరామాయణములందు కానరాదు.

యుద్ధకాండమున కూడ అవాల్మీకాంశములు అతి ముఖ్యములైనవి రెండు కలవు. వానరసైన్యము సాగరతీరమున విడిసియున్న తఱి శ్రీరాము డొక రాజహంసమును గాంచి, తన ఆగమనవార్తను సీతకు నివేదింపగోరెను. అట్లు రామాభ్యర్థనమున నింగిని అరుదెంచు హంసమును గాంచి రావణుడు సంశయాకులితాత్ము డయ్యెను. అంత నతడు రామలక్ష్మణుల మాయాశిరస్సులను నిర్మింపజేసి, వాటిని సీతా సాన్నిధ్యమునకు గొనిపోయి చూపి, రామలక్ష్మణులు ఇంద్రజిత్తుచే వధింపబడిరని తెల్పగా, ఆమె మూర్ఛాగ్రస్తయయ్యెను. తెలివొంది దుఃఖించునామె "అగ్రంబందున బంధువుల్ నిలిచినట్లై" తలయెత్తి శిలకించగా వృక్షాగ్రమున "మున్ను హనుమ కూర్చున్న చోటనే" కూర్చునియున్న హంసను గాంచి "హంస వచ్చెను శ్రీ రాఘువువద్ద నుండి యని తెచ్చెను వార్తయంచూహ"తో మనమున దోచునంతలో హంస శ్రీరాముని సందేశమును వినిపించెను. అంతలో "విద్యున్మాలి కృత మాయాశిరశ్శరాసనములు" నియతవేళ నతిక్రమించుటచే అంతర్ధానము నొందినవి. సుందరకాండమున రావణుడు జనకజతో భాషించు తఱి హనుమంతు డరుదెంచి ఆమెకు నివారించి, పతివార్తను దెల్పి దుఃఖోపశమనము కల్గించిన రీతి, రఘువీరుల మాయా శిరస్సులగాంచి వ్యాకులత నొందు క్ష్మాసుతకు యథార్థమెఱింగించి, స్వాస్థ్యము చేకూర్చుటకై అవాల్మీకమైన ఈ హంస సందేశఘట్టము ఇందు ప్రవేశపెట్టబడినట్లుగా భావించుటకు వీలున్నది. దీని ప్రయోజనము ఇట్టిదిగా కవియే స్వయముగ

గీ. "అపుడు కపిరాజ పరమేశుఁ డిపుడు హంస
ప్రాపణము గాంచఁగఁ బరస్పర ప్రవృత్తి

ఇంత శుభహేతు వుండుసటే లతాంగి
కపి నృపాలకు లిటు సటుఁ గాంచియుంటు"– అను పద్యమున వెల్లడించినాడు. (యుద్ధ - సంశయ. ప. ౪౧) ఇట్టి హంస సందేశము ముఖ్యములైన మరియే ఇతర రామాయణములందును కానరాదు.

ఇట్టిదే ఇందు మరియొక వినూత్న కల్పనము ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్రమున బందీకృతుల గావించిన సందర్భమున గలదు. స్వీయాత్ర మాహాత్మ్యమున రామలక్ష్మణులు ఉదయమగుసరికి మరణింపనున్నారను వార్త ఇంద్రజిత్తు రావణున కెరింగింపగా అతడు సంతసించి, అశోకవనమునకు జని రాముడు మరణించెనని సీతకు దెల్పి, దృష్టాంతమునకై త్రిజటను రణరంగమున కనిపి, "సుదతీ! యింక నతండె నీకుఁ బతియంచుం గూడుచుండెనింకా, నదియుండెం గద వానివంటి పతిచే నగ్నిప్రవేశంబు తప్పదు నీ కేటికిఁ జావఁగ వలయు"నని హెచ్చరించెను. రాముమరణమును విశ్వసింపజాలని సీత అది అసత్యమని ముక్తకంఠమున చెప్పినది. రావణు డామె ఆత్మవిశ్వాసమునకు, అసాధారణ వ్యక్తిత్వమునకు అచ్చెరు వొందుచు వెడలిపోయెను. అంత త్రిజట అరుదెంచి రామలక్ష్మణులు మూర్ఛగ్రస్తులు మాత్రమయిరని తెల్పగా సీత "ఇదియొక మ్రొక్కు మ్రొక్కెదన, మొక్కారు నెప్పుడుగాని మ్రొక్కనట్టిది"– అనుచు రాఘవు డాపద గడచిన తా నగ్ని ప్రవేశ మొనరింతునని మ్రొక్కుకొనెను. అంతియకాక ఆమె "నాకీ యూహ గలిగించిన రావణుని గురువుగా స్వీకరించి యాతనికి నమస్కరించెద"నని శత్రువును మన్నించినది. ఇట్లిందు త్రిజటా సమేతయై సీత పుష్పకమున రణరంగమున కరిగి మూర్ఛాగ్రస్తులయిన రామలక్ష్మణులను తిలకించుట పరిహరింపబడుటయేగాక, అన్యరామాయణము లెందును కానరాని మ్రొక్కును మ్రొక్కు కల్పనము కూర్చబడెను. సీతా మనోదార్ఢ్యమును, పాతివ్రత్యమును మహోజ్జ్వలముగ చిత్రించుచు ఈ సన్నివేశము సీతాపాత్రౌన్నత్యమును ద్విగుణీకృత మొనరించుటయేకాక, రావణసంహారానంతరము సీతా సౌశీల్యమును శంకించి, ఆమె అగ్నిజొచ్చునట్లొనరించిన శ్రీరాముని చర్యకు ఇది ఒక విధముగ హేతువగుచు, తద్విష

యమున శ్రీరాముని కాపాడింపబడిన దోషమును నివారించుటకు కూడ కవి దీనిని కల్పించేదేమో అనిపించుచున్నది. సీత ఇట్లు అసాధ్యము లైన మ్రొక్కులను మ్రొక్కుట ఒక ఆనందరామాయణమున మాత్రము గాంచగలము. అందామె శివధనుర్భంగ సమయమున సోరణగండ్ల నుండి శ్రీరాముని దివ్యసుందర విగ్రహమును గాంచి, పరవశించి, ఆతడు తన పతియైన పదునాలు గేడులు అరణ్యవాస మొనరించెద నని మ్రొక్కుకొనును.

కల్పవృక్షమునందలి మరియొక ప్రత్యేకత అయూ పట్టుల కథా క్రమము వాల్మీకి రామాయణాదులనుండి భేదించుట! కావ్యము ఎత్తు గడయే భిన్నముగ కావింపబడెను. వాల్మీకి రామాయణము అయోధ్యా పురవర్ణనతో ప్రారంభము కాగా, కల్పవృక్షమున ఇక్ష్వాకువంశస్థుడై అయోధ్య నేలు దశరథునిసంతానకాంక్షతో మొదలయ్యెను. సంతానము లేమికి చింతిల్లు దశరథుడు "అయోధ్యాతీర్థము సేసివత్తు"మని సుమం త్రునిచే ప్రోత్సహింపబడి వెడలిన సందర్భమును పురస్కరించుకొని అయోధ్య వర్ణింపబడెను. దశరథుని పుత్రకాంక్ష లక్ష్మణకవి చంపూ రామాయణమున కూడ సుదీర్ఘముగ వర్ణింపబడెను.

క్రమము మారిన ఘట్టములలో పరశురామ గర్వభంగ ఘట్ట మొకటి. వాల్మీకి రామాయణాదులలో పరశురామ ప్రవేశము వివాహా నంతరము అయోధ్యా ప్రయాణములో జరుగును. కల్పవృక్షమున వివాహానంతరము అయోధ్యాప్రయాణంలో జరుగుతుంది. కల్ప వృక్షమున వివాహత్పూర్వమే నిబంధించబడినది. ఇట్టి మార్పుకు మార్పుకు ప్రధాన హేతువులుగ రెండింటిని పేర్కొనవచ్చును. అయో నిజ అయిన సీత భూపుత్రిగా మైథిలేయులలో, తత్ప్రాంతీయులలో అమె యెడ దివ్యభావము ఉన్నది. హరధనుర్భంగమువలన అకుం ఠిత పరాక్రమము మాత్రమే యథామానవు డయిన రామునియందు వారికి ప్రస్ఫుటమయినది. అంత మాత్రమున తత్ప్రాంతీయులలో అతనియందు సంపూర్ణ దివ్యభావము నెలకొనుటకు వీలు కలుగదు. శాపాదుల విషయము పూర్వమే పూర్తియైనది. భగవదవతారమూర్తిగ పూజింపబడు పరశురామునిపై విజయము శ్రీరామునియెడ దివ్యభావన

కలుగజేయును. పరశురామ ఘట్టము మిథిలయందే కూర్చుటలో తన యీ భావమును కళ్యాణ ఖండమున వసిష్ఠుని ముఖతః కవి రాసె

క. "మిథిలా శృంగాటకములఁ
బృథులంబగు విషయమట్లు వినఁబడియెను శ్రీ
మధురాకృతి సీత ధరకు
మధుసూదను రాణి వచ్చి మన్నించినటుల్"

క. "మధురాకృతి మా రాముఁడు
మధుసూదనుఁడౌనొ కాదొ మధుసూదను నం
శధురాఖ్యాతుని భార్గవు
నధరీకృత తేజు జేయు ఉదియద్భుతమే."

మ. "మది నీ ధైర్యము చేత మా గృహములన్ మన్నించు లక్ష్మిన్ రమా
స్పదుఁడౌ మా పసివానికోసమియి యభ్యర్థింతు మిల్లాలుగన్
విదితంబైన ధనుర్వికర్షణపణా విస్మార గర్వంబుతో"- [1] వని

స్పష్టీకరించెను. అంతియకాకుండ అయోధ్యా ప్రయాణమున నవవధూ సమేతుడైన రాముడు అహల్యను దర్శింప వలసిన అవసరము కూడ కల్పవృక్షమున కున్నది. ఏక కాలమున రెండు సంఘటనముల కంటెను, వివాహమునకు ముందు వెనుకలుగ సంఘటిల్లుటయే ఉచితము.

ఇంకను వాలిసుగ్రీవుల కలహకథనము భాగ భాగములుగ చెప్పుట మున్నగు మార్పులు కావ్యమందు అనేకము గలవు.

కల్పవృక్షమున సన్నివేశ చిత్రణము గురించి కూడ ప్రత్యేకముగ పేర్కొనవలెను. ఇంచుమించు ముఖ్యములైన సన్నివేశములన్నియు ఉత్కంఠను రేపు రీతిని రూపొందింప బడినవి. అరణ్యకాండము మారీచ ఖండమున మాయాకురంగమునకై జానకి అభ్యర్థించు ఘట్టము అత్యంత ప్రతిభావంతముగా తీర్చిదిద్దబడిన ఘట్టములలో

---

1. బాల - కల్యాణ - ప. 5, 6, 7.

నొకటి. స్వర్ణమృగమునకై మైథిలి కుతూహల పడుచుండుట గాంచి లక్ష్మణుడు అది మాయామృగ మని హేతుపూర్వకముగ నిరూపించెను. అట్టి మాయాస్వరూపమును ఋషికాని, దైత్యుడు కాని ధరియించి యుండనోపుననియు, సర్వసంగ పరిత్యాగియగు మునీశ్వరున కంతటి శరీరమోహ ముండదు కనుక దైత్యుని కృత్యమే యనియు అందునా మారీచున కిట్టి వేషధారణమున మునుల నికుదించుట అభ్యాసమే కనుక కన్పట్టు కాంచన మృగము కూడ మారీచుడే యై యుండవలయు నని హేతుపూర్వకముగ తర్కించెను. అంతియకాక

ఉ. పచ్చికమేయబోద దొక పాటుగఁ దాఁ గొఱుకున్ దదారుచిన్
మెచ్చదు కన్నులన్ నమిలి ద్రుంగద యీపెన వెట్టు వీనుగా
నిచ్చటివార్తలన్ వినునొ యేమొ వచించుచునుండె నంతలో
నచ్చట మైజిగుల్ వెలతెలైనవి ముందరి కాంతు లొప్పనే.[1]

—అనుచు దాని మాయామృగ తత్త్వమును సహేతుకముగ నిరూపించెను. ఇట్టుపట్టున సీత సమాధానము కూడ స్త్రీగత సహజ కౌతుక భావ గర్భిత మయ్యును, సహేతుకముగ నుండును. "సీతా కౌతుక మెట్టిదయిన తీర్చుమ"ని పంచవటీ ప్రవేశమునకు ముందు రామున కగస్త్యుడు గావించిన హెచ్చరికను ఆమె జ్ఞప్తికి తెచ్చి, తన అభిలషితమును సమర్థించుకొనెను. శ్రీరాముడు సీతాపక్షమును వహించెను. ఈ మువ్వురి తర్కమున ఆగామి విషయము స్ఫూర్తమగుచుండును. ఈతర్కమునంతయు సమీపస్థుడై యున్న రావణుడు ఆలకించి, లక్ష్మణునిగూర్చి "ఈ పరిశీలనామతియు నిద్మశసూక్ష్మతమాభి దర్శన, వ్యాపృతబుద్ధి యిట్టి విషయాభిముఖీనము హేతుకల్పన" మపూర్వమని భావించుటయేకాక,

క. "ఈ మువ్వుర నీ మువ్వురె
రే మాటాడినను బదులెల్ల ధ్వనించున్
తామఖిలస్పష్టి విజ్ఞా
నామృతరసమూర్తు లైన యట్లుగఁ దోచున్"—[2] అని అచ్చెరు

1. అరణ్యా – మారీచ – ప. 31[illegible].
2. అరణ్యా – మారీచ – ప. 334.

పొందెను సీతారామలక్ష్మణుల గుణగణములను, తార్కికత్వమును, సూక్ష్మ పరిశీలనాసక్తిని ప్రస్ఫుటమొనర్చునట్టిదిగనే కాకుండ, వైరివీరులయిన లక్ష్మణాదుల మేధాసంపత్తిని గుర్తించి, ప్రశంసించు రావణుని శీలమునకు కూడ వన్నె పెట్టుచు నట్టి ఘట్టమంతయు అత్యంత ప్రతిభావంతముగ తీర్చిదిద్దబడినది. ఈ ఘట్టమునందు వలెనే తార్కిక, హేతుపూర్వక పద్ధతి కావ్యమందలి ప్రతి ఘట్టము నందును ప్రత్యక్షమగుచుండును.

రామకథయందలి ధార్మికవాదాంశములుగ లోకమున ప్రచారమున నున్న కొన్ని సంశయములను సహేతుకముగ సమాధానమొసగ వలెనను ఆశయమును-కల్పవృక్షమున కవి కొన్ని అవాల్మీకాంశములను ప్రవేశపెట్టుటకు గల హేతువులలో ప్రధానమయినదిగ స్వీకరింపవచ్చును. ఇందులకు నిదర్శనములు కావ్యమం దెల్లెడలను కన్పట్టుచుండును. కల్పవృక్షము కావ్యారంభమున రామసహాయార్థమవతరించిన వాలిసుగ్రీవుల కలహము, బలాబలములు, హనుమదాదుల శౌర్యము-ఇత్యాదులన్నింటిని విష్ణువును అవతారస్వీకారమునకై వేడుకొను సమయమున దేవతలు క్షుణ్ణముగ చర్చించి, వాలి కాని పక్షమున సుగ్రీవు డయినను రామసహాయకారి కాగల డని నిశ్చయించుకొందురు. సుదీర్ఘమైన ఈ చర్చ రామకార్యమున కవతరించిన వాలిసుగ్రీవులలో కలహ మేల ఉద్భవించవలెనను సంశయమును దీర్చునదిగ నుండును. ఇందు ఊర్మిళ పతి ననుగమింపకుండుటకు "సీత పోజె - నూర్మిళయు వత్తునన్న నే నొప్పకోను - పురము పురమెల్లఁ గదలి పోవుదుమె కుఱ్ఱ"- అని శ్రీరాముడు లక్ష్మణునకు గావించిన హెచ్చరిక కారణముగ సూచింపబడినది. ఇట్టి ఈ సమర్థనమునకు కారణము వాల్మీకి రామాయణమున ఉపేక్షిత నాయికగా మిగిలిపోయిన ఊర్మిళ పాత్రను ఆధునికులు 'సాకేత్' మున్నగు గ్రంథములయందు సముచితస్థాన మొసగి పరిపూర్ణత్వము నొసగ ప్రయత్నించిన భావముల ప్రభావమై యుండవచ్చును. జానపద సాహిత్యమున మాత్రము "బావనడచిన మార్గాన నడవరాదందు"రని లక్ష్మణుడే స్వయముగ ఊర్మిళ రాకకు అభ్యంతరపెట్టినట్లు గలదు. సుందర కాండమున

సముద్ర లంఘన మొనర్చు ఆంజనేయుని పరీక్షించుటకై దేవతలు సురసను పనుచుట అసందర్భమను అభిప్రాయము "మరుత్సుతుఁడు తానై లంకలోఁ జొచ్చుచో వేళాదుష్టముగాఁ గనంబడి మదిన్ వేల్పుల్ ముహూర్తంబు తా - మాలస్యంబు ఘటింపనెంచి" నాగమాత సురసను పనిచిరను హేతువును కల్పవృక్షము చూపినది. ఇందువలన ఆ సందర్భము తొలగి రామకార్యము దేవతల కార్యముకూడ గనుక, అప్పట్టున దేవతల కులవ్యగ్రతకూడ సూచ్యమగుచుండును.

ఇట్లు సన్నివేశములు, క్రమము మున్నగు విషయములయందు మాత్రమే కాక, అవసర మనిపించుకొన్న నూతనగుణములు కొన్ని పాత్రల కాపాదింపబడుటయేగాక, పాత్రచిత్రీకరణ మతిప్రతిభావంతముగ, కవి పీఠికయందు పేర్కొనిన 'జీవుల వేదన' ధ్వనించునట్టిదిగా జరిగెను. ఇందలి రాముడు అన్ని రామాయణములందు వలెనే శాంతుడు - ధీరగంభీరుడు. అయ్యును పరిహాసప్రియుడు. ఎట్టివేళలయందును తన హాస్య ప్రసంగముతో ఆత్మీయుల కాహ్లాదము చేకూర్చు హాస్యప్రియత్వము రాముని బాల్యమునుండియే అతని ప్రవర్తనమున ప్రకటితమై క్రమవికాసము నొంది బాల్యమున మంథరను భయపెట్టిన రాముని హాస్యప్రియత్వమును గురించి అరణ్యఖండమున మారీచుడు రావణునితో,

ఉ. "ఆ పరమోత్తమున కక్కట యున్నది లోపమొక్క టా
హా! పరిహాసశీలి యతఁ డద్దియ హేతువుగా నతండు వ
న్యాపథమట్లు రావలసియైనది యయ్యది యొక్కదాసి తా
నా పినతల్లి దాసి పగ యన్నది రూపముగొన్న దక్కటా!"–[1]

అని పల్కెను. రాజ్యత్యాగ మొనర్చు పట్టున గోదానవ్యాజమున త్రిజటుని పరీక్షించుట, శూర్పణఖా పరాభవ ఘట్టము మున్నగునవి సంభవించుటకు ఈ "హాస్యాద్భుత శీల"త్వము కూడ కొంత తోడ్పడిదనుటకు, అన్యములైన నిదర్శనములు అనేకము కావ్యమందంతట రూపొందింపబడెను. ఈ విధముగనే కైకేయి మంథరావశవర్తినిగ చరించుటకు

1. అరణ్యా - మారీచ - ప. 187.

బలీయమైన హేతువు సృజింపబడెను. "తల్లి నెఱుఁగని దోషమ్ము తగిలి కైక, కన్నతల్లిఁ జూడని మమకారమెల్ల - దన్నుఁ జేతులబెంచిన దాదిమీద నొలుకపోయు" చుండుట కారణమట! అట్లు అరణపు దాసి మాట లాలించుటకు, పట్టువీడని మంకుతనము అలవడుటకు "సరియైన పెంపకము లే"కుండుట హేతువుగా ప్రస్తావింపబడెను. మంధర కైకేయిని అనగా దాసి మహారాణిని "ఉత్తిష్ఠ మూఢే" అని నిందించిన పదము అధారముగ విశ్వనాథవారు కైకేయి ప్రవర్తనమున కింతటి ఉజ్జ్వలమైనపూర్వరంగమును కల్పించినారనవచ్చును. భరతుని కంటె రాముని ఎడల అధికముగ గల పుత్రప్రేమ కూడ ఆమె రామకార్య నిర్వహణకు తోడ్పడునట్లు చేసినదని భావించురీతిగ కూడ కైక ఇందు రూపొందించబడెను. పట్టాభిషేకాత్పూర్వరాత్రి రాము డామె కడకు జని సమాధి సమయమున జరిగిన "పట్టాభిషేకము వలద"ను దేవతా ప్రబోధమును గూర్చి తెలియజేసెను; ప్రథమమున ఆమె పరిహాసింపగా "నేత్రంబుల నొక్క తీవ్రకళయై మున్నీవు నవ్వేత్తునే - ర్వన కోదండకళావిచిత్రసమనశ్రీ యేమగుం జెప్పవే" అని రాముడు కొంత తీవ్రముగ చెప్పగా ఆమె "రామచంద్రుని తీక్ష్ణ నేత్రములు చూచి" లోని కరిగెను. పిమ్మట నామెకు మంథరాప్రబోధము జరిగెను. వరప్రదానము గూర్చి రామునికి తెల్పు తరి కైకేయీ రామచంద్రుల నడుమ జరిగిన సంభాషణమువలన పట్టాభిషేకము దేవతల కనిష్టము కనుక విఘ్నము సంభవింపవలె నను రాముని అభిలషితమునకు అనుగుణముగ మంథరబోధ కూడ జరుగుటచే అట్లు సంభవింపుటయే సరియైనదిగ నిర్ణయించి, కైక పుత్రాధికు డయిన రాముని కోరిక నెరవేరురీతిని వరద్వయ మభ్యర్థించినట్లు భావింపనగును. తాపసవేషమున రాముడు తనకు నమస్కరించు తఱి ఆమె "మూర్ఛంగని లిప్తంబేరి పోవోయి నీ, వనముల్ నా కొడుకింటు రాజగును..."

"నిరభిమానను నిర్లజ్జ నిర్భయాత్మఁ
జేసితివి నన్ను సర్వసన్యాసినిన్ వ
నిన్ జనుముర! సవతి తల్లినిన్ నమస్ శ

పించి నవరత్నంగనె చూపించినావు"— అని స్వీయదుఃఖమును నర్మగర్భముగ వెల్లడించుటయేకాక,

"నాయాశీస్సు లవేటికి
నోయీ! రఘురామ నీకు నున్నవి చాలున్
నాయాశీస్సులు భరతుని
కై యివి నినుఁబోలె నాతఁ డగుటకు రామా!— అని రామునివలె భరతుడుకూడ సన్మార్గగామి కావలయు నను తన ఆవేదన నా రామునికి మాత్రము అర్థమగునేతని పలుకగా "తల్లి చివరిదాఁక రక్షించుట''కు రాముడు సంతసించినాడు. ఇట్లు కళంకమును తలదాల్చి, పుత్రుని అభిలాషను నెరవేర్చిన త్యాగమూర్తిగ, మహోన్నత వ్యక్తిగ కైకేయి కల్పవృక్షమున ప్రత్యక్షమగును.

రామాయణమున ముఖ్యములైన దుష్టపాత్రలందు కూడ ప్రత్యేకత గోచరించుచుండును. భక్తిమార్గమునను, ద్వేషమార్గమునను భగవంతుని సాన్నిధ్యమును పొందవచ్చును గాన ఇందలి గుహ, శబరి మున్నగు పాత్రలు భక్తిని ఆధారము చేసికొనగా, సీతారాముల కపకారము చేయనుద్దేశముతో సర్వనాశనమును పొందిన రావణుడు, రావణునకు తోడ్పడి అసువుల గోల్పోయిన మారీచుడు అప్రయత్నముగ రెండవ మార్గమును అవలంబించినట్లు గోచరించును. అందువలననే సీతాపహరణమను నైచ్యమొనరించుట కరుదెంచిన రావణునిలో ఆత్మగత సంస్కారము అప్రయత్నముగ తలయెత్తి అతనికి తెలియకుండగానే సీతారామలక్ష్మణుల ఔన్నత్యమును క్షణికముగ నైనను గుర్తించునట్లు చేసినది. రావణకార్య నిర్వహణార్థము అసువులు గోల్పోవు తావునగూడ మారీచునిలో కూడ ఇట్టి అంతర్ముఖముగ నున్న సంస్కారమే, 'జీవుని వేదన'యే "లక్ష్మణాగ్రజా'' అని లక్ష్మణునికి పర్యాయముగ రాముని స్మరించునట్లు చేయగలిగినది. మంథరావశవర్తినిగ చరించుచున్నను కైకేయీ మానసము ఎల్లెడల "ప్రభావు శ్రీ రంగనాథు"ని స్మరించునే యుండినది.

కల్పవృక్షమున అత్యంత ప్రధానముగ పేర్కొనవలసిన అంశము అందలి తెలుగుదనము. తెలుగు నానుడులు, జాతీయములు సర్వత్ర

ప్రయోగింపబడుటయే కాక, తెలుగువారి ఆచార వ్యవహారములు కూడ ఆయా సన్నివేశములకు జోడింపబడినవి. రామాదుల బారసాల, సీతా కల్యాణఘట్టము మున్నగునవి అద్యంతము తెలుగుదనము తొణి కిసలాడు ఘట్టములు. అముక్తమాల్యదయందు శ్రీకృష్ణ దేవరాయల వలె, ఇందు విశ్వనాథవారి లోకజ్ఞత, సునిశిత పరిశీలనాశక్తి ఎల్లెడల వ్యక్తమగుచుండును. ఈ కావ్యము నందలి మరియొక ప్రత్యేకత ఆయా సన్నివేశములకు, పాత్రల మనోభావములకు అనుగుణమైన ఛందస్సు ప్రయోగింపబడుట! మరియొక విశేషాంశము కథాత్మకవర్ణన లిందెడనెడ అతి మనోహరముగ గావింపబడుట! ఒక్క చంద్రోదయ వర్ణననే పరిశీలించినచో అది మూడుతావుల మూడు రీతులుగా గావింప బడినది. బాలకాండమున అశ్వమేధయాగము జరుప వసిష్ఠాదుల యనుమతిని బడసిన సందర్భమున దశరథునికి "....యాగఫలంబైన యమృత కుంభము మింటఁ-దెరలి ప్రాగ్దిశ బయల్దేరెనొక్కొ" అనునట్లుగ కనుపించిన చంద్రబింబము, ఋశ్యశృంగుడు నిర్వహించు పుత్ర కామేష్టి వలన పుత్రులుదయింతురను దేవరహస్యమును సుమంత్రుని వలన ఆలించిన తదుపరి "వెల్లదుస్తులు కట్టించి వీథులన్ షి - కారు పంపిన రాజకుమారువోలె" గన్పట్టినది. ఇక, సుందకాండమున, హను మంతుడు సీతాదేవి నన్వేషించు తరిని గల చంద్రోదయ వర్ణనము

"మున్ను చూడనట్టి భూజాత గుర్తింపఁ
బోవఁడేమొ కపివిభుండ టంచుఁ
దల్లిమోము పోల్కిఁ దాఁ జూపుచున్నట్లు
చెలఁగె మింట గలువ చెలిమికాఁడు"— అనుచు సందర్భమునకు

అనువైన రీతిని గావింపబడినది.

కల్పవృక్షమునందు శాంతమును అంగిరసముగా నిర్ణయింప వచ్చును.

వాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యాన ప్రాయమైన కావ్యముగ కల్పవృక్షము రూపొందినది. విశ్వనాథ సత్యనారాయణగారు ఇరువది యవ శతాబ్దపు కవి - పరంపరాగత మయిన సాహిత్య ప్రక్రియ

లన్నింటియందును, వ్యాఖ్యానరూపమునను వెలసిన రామాయణపు విశ్వరూప సాక్షాత్కారము నాకలింపు చేసుకొనుటతోపాటు, ఈ కాలమున అనేక విషయములలో వచ్చిన విభిన్న దృక్పథములు, అభివృద్ధి – మున్నగునవి కూడా క్షుణ్ణముగ అర్థము చేసుకొని సహృదయుడయిన విమర్శకునిగా, విచారణశీలిగా రూపొందిన ప్రతిభావంతుడయిన కవి వెలయించిన కమనీయ కావ్యము కల్పవృక్షము. తత్కారణమున, వాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యాన ప్రాయమైన కావ్యమన దగిన కల్పవృక్షముపై అధ్యాత్మ రామాయణాదులగు అనేక రామాయణముల,వాఖ్యానముల ప్రభావము కూడ ఎల్లెడల కన్పట్టుచుండును. ఆధునిక యుగమున వెలసిన రామాయణ కావ్యములలో శ్రీమద్రామాయణ కల్పవృక్షమును శ్రేష్ఠమయినదిగా నేను భావించుటచే ఈ కావ్య పరిశీలనము ప్రత్యేక ప్రకరణముగా రూపొందించితిని. కల్పవృక్షము గురించిన సమగ్ర పరిశీలనము మరియొక బృహద్గ్రంథమగును. స్థలాభావమున ఇందు దిఙ్మాత్ర పరిశీలనము మాత్రము కావింపబడినది.[1]

1. అయోధ్య – ప్రస్తావన. ప. 273, 74, 75.

# తెలుగు రామాయణములందు ప్రధానముగ కానవచ్చు కొన్ని అవాల్మీకాంశములు

తెలుగుసాహిత్యమున శాఖోపశాఖలుగ విస్తరిల్లిన రామకథా వృక్షమునకు మూలాధారము వాల్మీకి రామాయణము. అయినను తెలుగున రామాయణము వెలయునాటికి సంస్కృత వాఙ్మయమున రామకథ పరిపూర్ణత్వమును బొందుటచే, తెలుగు కవులకు వాల్మీకి రామాయణముతోపాటు అన్య రామాయణములందలి అవాల్మీకములగు కల్పనలు కన్నులకు గట్టకుండ నుండజాలవు. అట్లు తెలుగు కవులు స్వీకరించిన ప్రధానములగు కొన్ని అవాల్మీకాంశములు ఈ ప్రకరణమున గుదిగ్రుచ్చబడుచున్నవి.

1. దశరథుని పత్నులసంఖ్య శతాధికముగ నుండుట- ఆనంద రామాయణాదులయందు వలెనే తెలుగున రంగనాథ కల్పవృక్షాది కావ్యములు దశరథుని పత్నులను అధికసంఖ్యలో పేర్కొన్నవి.

2. శ్రీరామాదుల బాల్యక్రీడలు రంగనాథ రామాయణాదులు వర్ణించినవి. ఇట్టి వర్ణనకు అధ్యాత్మరామాయణ మాధార మనదగును.

3. బాల్యచాపల్యమున రాముడు పాదప్రహారమున మంథర నవమానింపగా, మరికొన్నింటియందు కాలు విరచినాడు. జానపద వాఙ్మయమున కానవచ్చు ఈ అంశములు భాస్కర, రంగనాథ రామాయణములతోపాటు రామాభ్యుదయాది అన్యరామాయణములందు కూడ సముచిత స్థాన మాక్రమించినవి.

4. అహల్య శిలాకృతి నొందునట్లు శాపము బడయుట. ఇది అధ్యాత్మరామాయణానుసారమైన అంశము. అధిక సంఖ్యలో తెలుగు రామాయణములు ఈ విషయమున అధ్యాత్మరామాయణమును

అనుసరించుట విశేషము! అహల్యా నిర్దోషత్వ నిరూపణమునకై ఆధునికులు అధికముగ ప్రయత్నించినను-, పద్మపురాణము కూడ అహల్యను నిర్దోషిగనే పేర్కొన్నది.

5. గౌతమాశ్రమమును కుక్కుట వేషధారియై ప్రవేశించు దేవేంద్రుడు కోడివలె కూయుట.

6. సీతాజన్మము మేనకను గాంచిన జనకుని బీజముష్టి విక్షేపనమున జరిగినదను నూతన విషయము నొకదానిని భాస్కరరామాయణము పేర్కొనుచున్నది. ఇట్టి కల్పనము ప్రసిద్ధ రామాయణములం దెందును కానరాదు.

7. అధ్యాత్మ రామాయణమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట చను సందర్భమున భీతిల్లిన దశరథునకు వసిష్ఠుడు రాముడు దైవాంశసంభూతుడను దేవరహస్యము నెరింగించెను. రంగనాథరామాయణము, రామాభ్యుదయము- మున్నగువాని యందు ఇట్లు దేవరహస్యమును దశరథు డెరుంగుట పేర్కొనబడినను, విశ్వామిత్రుడే ఎరింగించినట్లు కలదు.

8. విశ్వామిత్రుడు సీతా సౌందర్యములు వర్ణించుట రామాభ్యుదయమువంటి వానియందు కలదు.

9. శివధనుర్భంగమునకు ఆగ్రహించి పరశురాము డరుదెంచెనని ముఖ్యరామాయణములు ఉద్ఘోషించుచుండగా, రామాభ్యుదయమున, వివాహమై చను రామాదుల పరివారముయొక్క కలకల మాలించి భార్గవరాము డరుదెంచినట్లు చెప్పబడెను.

10. సీతారాములు ధనుర్భంగమునకు ముందు పరస్పరము వీక్షించుకొనుట. అవాల్మీకమయిన ఇట్టి కల్పనము ఆనందరామాయణాదుల ప్రభావము వలన అని భావింపవచ్చును.

11. సీత శివధనుస్సుతో ఆడుకొనుట జానపదవాఙ్మయాదులందు గలదు. ఆనందరామాయణము కూడ శివచాపముతో ఆడుకొనిన శక్తిస్వరూపిణిగ జానకిని వర్ణించినది.

12. జానపద వాఙ్మయమునను, కల్పవృక్ష మనగా శాంత పాత్రకు ప్రాధాన్యము కల్పింపబడినది.

13. జానపద వాఙ్మయమున రాముడు ఎఱుకతయై సీతకు ఎఱుక చెప్పెను.

14. సీత పూర్వజన్మలు వివరింపబడుట.

15. అవాల్మీకమైన కాకాసుర వృత్తాంతము పెక్కు రామాయణములు స్వీకరించినవి. ఇది పద్మపురాణాదులనుండి గ్రహింపబడినది. ఇప్పట్టున కాకము ఫలకముల గొనివచ్చి సీతను బాధించినట్లుగా రామాభ్యుదయము నూతన కల్పము గావించుట విశేషము!

16. పదునాలుగు వర్షములు లక్ష్మణుడు నిద్రను త్యజించుట. తనకు మారుగ ఊర్మిళ నావేశించుమని నిద్రాదేవిని కోరుట- అత్యంతాకర్షణీయమైన అవాల్మీకాంశములలో నొకటి.

17. జంబుమాలి వృత్తాంతము.

18. సంగ్రహరామాయణములు కొన్నింటియందు మంథరాపాత్ర పరిహరింపబడి కైకేయియే స్వయముగ వరముల వేడుట. ఇట్టి విధానమునకు రఘువంశము, సంస్కృత భారతము మున్నగు వాటియందలి కథాంశము ప్రేరకమై యుండవచ్చును.

19. మారీచుడు "లక్ష్మణాగ్రజా !" యని కేక నిడుట!- ఇదియు అన్య రామాయణము లందు కానరాని నూతనాంశము.

20. లక్ష్మణుడు ఏడు బారులు గీయుట. అవాల్మీకమగు ఇట్టి అంశము బహుశః జానపద వాఙ్మయమునుండి గ్రహింపబడి యుండవచ్చును.

21. ముఖ్యరామాయణము లన్నియు సీతాన్వేషణమున విసిగి వేసారిన రాము డాగ్రహావేశపరవశుడై శరప్రయోగమున లోకముల భస్మ మొనర్ప తలంపగా, లక్ష్మణుడు సాహసించి సోదరుని శాంతపరచినట్లు పేర్కొనగా మొల్లరామాయణమున మాత్రము

అగ్నిప్రవేశ పరుడయిన లక్ష్మణుని రాముడే స్వాస్థ్యపరచినట్లు కలదు ఇట్లే మొల్లరామాయణమున శ్రీరాముడు సీతా శిరోరత్నము గొనిరమ్మని పావనికి చెప్పెను.

22. వాలి వధ సందర్భమున రావణసంహారానంతరము శాశ్వతముగ సీతావియోగము రామునకు సంభవించునట్లుగా తార రాముని శపించినది.

23. రావణుచే పరిత్యక్తుడై రామశరణార్థిగ నేగుటకు మున్ను విభీషణుడు జననియగు కైకసిని దర్శింపగా సర్వజ్ఞురాలయిన నామె భవిష్యద్వాణిని చెప్పుట. విభీషణుడు కుంభకర్ణుని కూడ దర్శించినట్లు కొన్ని రామాయణములందు కలదు.

24. ఊడత ప్రదర్శించిన భక్తి.

25. రావణ కుంభకర్ణులు ఆత్మజ్ఞాన పరాయణులు.

26. రావణ పాతాళ హెూమము.

27. గొడుగుల కథ.

28. సులోచనా వృత్తాంతము.

29. కాలనేమి కథ.

30. భారతమున కుంభకర్ణుని లక్ష్మణుడు సంహరించెను.

31. శ్రీరాముని హాస్యప్రియత్వము.

32. రావణుని నాభియందు అమృతభాండ ముండుట.

33. శ్రీరామలింగ ప్రతిష్ఠ.

34. స్వర్ణసీతా విగ్రహము.

35. అశ్వమేధమునకై శ్రీరామ కుశలవుల యుద్ధము.

36. సీతారాములు వాల్మీకి కోరికపై మరల కలుసుకొనుట.

37. సీత అగ్నిప్రవేశము లేకుండగనే శ్రీరాము డామెను పరిగ్రహించుట.

38. లంకయందు సీత రామక్షేమమునకై తా నగ్నిని ప్రవేశింతునని మ్రొక్కులిడుట !

తెలుగు రామాయణములందు ప్రధానముగ కానవచ్చు అవాల్మీకాంశములుగ వీనిని పేర్కొనవలెను. సంస్కృత రామాయణములు ఆధారముగా గ్రహింపబడినట్టివే ఇందధికముగ కన్పట్టును. అందును ముఖ్యముగ అధ్యాత్మ, ఆనందరామాయణములు, పద్మపురాణము ప్రాముఖ్యము వహించినట్లు నిర్ణయింపనగును. ఇందువలన తెలుగు రామాయణ కర్తలపై సంస్కృత రామాయణముల ప్రభావము ఎంత బలీయముగ నున్నదో విస్పష్టమగుచున్నది. ఇక తెలుగు కవుల స్వకపోల కల్పితములైన అవాల్మీకాంశములుగ ఉడుతభక్తి, అగ్నిప్రవేశ మొనరింతునను సీత ప్రేమోత్కర్ష, శాంతా ప్రాధాన్యము, శ్రీరామ హాస్య ప్రియత్వము మున్నగు అంశముల నుదాహరింపవచ్చును. సీతప్రేమోత్కర్ష మున్నగు నూతన కల్పనలను ప్రవేశపెట్టుటలో కల్పవృక్షము మున్నగు ఆధునిక రామాయణములు ప్రముఖస్థానమును వహించుచున్నవి. అందులకు సంస్కృతముతోబాటు తెలుగునందు కూడ సర్వతోముఖముగ విస్తరిల్లిన రామకథను దర్శించిన పిమ్మట రామాయణములను రచించుటయే కారణమనదగును.

రామకథ తెలుగున సర్వతోముఖముగ అభివృద్ధిని పొందినను, అది కథాంశములందు సంస్కృతవాఙ్మయమునే ప్రధానముగ అనుసరించిన దని నిరాటంకముగా పేర్కొనవచ్చును.



# ఉపసంహారము

తెలుగు జాతికి స్ఫూర్తి నొసగిన దేవుడు శ్రీరాముడు. చతుర్విధ పురుషార్థములు జీవితమున సాధింపవలయునను కొనువారికి శ్రీరాముడు ధ్రువతార. వాల్మీకి చెప్పిన ఆదర్శపురుషుడగు శ్రీరాముని చరిత్రము ధర్మార్థ కామములను మోక్షమునకై నిర్వహింపవలసిన విధానమును బోధించును. ఏ తత్కారణమువననే రామకథ సార్వజనీన మగుటయే కాక, జాతి సంస్కృతి చైతన్యములతో మిళితమయినది. ముఖ్యముగ ఆంధ్రుల సంస్కృతిసారస్వతములు శ్రీరామచరిత్రముతో నిండుదనమును సంతరించుకొనినవి. అందువలననే రామాయణేతర కావ్యములందును ఇతర రచనలందు కూడ రామప్రసక్తి అత్యధికముగ కన్పట్టును. ఆంధ్రలేఖిని 'శ్రీరామ' నుడికారముతో రచన కుపక్రమించును.

రామకథాత్మకములగు కావ్యప్రబంధాదులు అట్లుండ, ఆంధ్ర సాహిత్యమున శ్రీరామ ప్రశంస చేయని గ్రంథము లభ్యమన్న సాహసము కానేరదు. ప్రబంధములనుండి ఆధునికములగు నవలలవరకు ఏదియో పట్టున శ్రీరామ ప్రసక్తి వచ్చుచునే యుండును. ముఖ్యముగ ప్రబంధాదుల అవతారికలు కొన్ని ఆయా ప్రబంధేతివృత్తాంతమునకు జోడించి శ్రీరామకథను సంక్షిప్తీకరించి వర్ణించుచుండును. ఇట్టి గ్రంథములందు ప్రధానముగ పేర్కొనబడినది ప్రబంధరాజ మన దగిన వసుచరిత్రము.

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లారయ సత్కథల్
వావిరిపుట్టు రత్నము లవారిత సత్కవి కల్పనా విధా
సానహ పాక్యకృత్తములు సానలు తీరిన జాతిరత్నముల్"" — అని

వసుచరిత్రమునందలి కథాస్వరూపమును పూర్వపక్షముగ పేర్కొనగలిగిన రామరాజభూషణుడు మనస్సంతయు శ్రీరామచంద్ర చర

ణారవింద వందన తత్పరము కాగా రామకీర్తనము గ్రంథావతారికయందు ఇరువదియేడు పద్యములలో బహుచమత్కారములతో నిర్మించి తన భక్తిని వెల్లడించెను. కావ్యారంభమే "శ్రీభూపుత్రి వివాహవేళ...."[1] అని కావింపబడెను. తన హరిశ్చంద్రనలోపాఖ్యానమున ఇతర దేవతాస్తుతులు మాని రామపంచాయతనమునే స్తుతించెను.

ఇష్టదేవతా ప్రార్థనమున శ్రీరామనుతి కూడ అధికముగ కావ్యాదులయందు కావింపబడెను. ఉదాహరణముగ కనుపర్తి అబ్బయామాత్యుని "కవిజన మనోరంజనము" అనబడు "పుదూరవశ్చరితము" నందలి అవతారికలో

సీ. కృపఁజేసె భువనముల్ గీర్తింప ధ్రువునకుఁ
జెలఁగి యెన్నాళ్ళకుఁ జెడని పదవి....
యొసఁగె విభీషణాఖ్యునకు నాచంద్ర తా
రార్కంబుగాఁగ లంకాధి పత్య
మిచ్చెఁ గుచేలున కిష్టార్థసిద్ధి"- అను పద్యము స్వీకరింపదగును (పుట - 2).

ఇష్టదేవతా స్తుతియందు హనుమంతుని స్తుతి కూడ ప్రధానముగ కన్పట్టుచుండును.

కృతిపతి వంశ వర్ణనము కావించు పట్టులందు కృతిపతి జనకుడు దశరథుని తోడను, జనని కౌసల్యా తోడను సరిపోల్పబడుచుండురు. కాగా, కృతిపతి శ్రీ రఘురాముడే అనికదా కవి భావము! చెంగల్వ కాళకవి రఘునాథాభ్యుదయమునందు కృతిపతి వంశ వర్ణనము కావించుచు,

"కౌసల్యా దశరథ క్ష్మారమణులుండు
వాసి మీరాఁగ రఘూద్వహుఁ గన్నరీతి
అలమూర్తి మాంబయు నచ్యుతేంద్రుండు
నల నిభరఘునాథ నరనాథుఁ గనిరి"- (పు. 8) అనుటయే

1. ఆ. 1-ప. 1.

కాకుండ ఇం డీతడు "రామావతారుండు రఘునాథ ధీరుండు'' అని రఘునాథుని శ్రీరామత్వమును వాచ్యము చేసెను. (పు. 14)

ఈ విధముగనే కృతిపతి, లేక కావ్యనాయకుని రాజ్యము రామ రాజ్యము తోడను, పరాక్రమము శ్రీరామ శౌర్యముతోడను, కావ్య నాయిక ధరణిజతోడను ఉపమింపబడుట ఇంచుమించు అన్నికావ్యము లందును కానవచ్చుచుండు ననవగును. శివభక్తి ప్రతిపాదితములగు హరవిలాస, శ్రీ కాళహస్తి మాహాత్మ్యములవంటి గ్రంథములందు కూడ శ్రీరామ ప్రసక్తి కానుపించుట మతభేదములకు అతీతముగ, తెలుగు కవులు రామకథతో తాదాత్మ్యము పొందినవిధమును స్పష్టముచేయును. ధూర్జటి మహాకవి తన శ్రీ కాళహస్తి మహాత్మ్య కావ్యమున

"జలములు దీర్చిరి, నడిచిరి
బలవంతుడైన యుగ్రుపై నేచి. జలా
బలచింతలేక రాక్షస
జలములు రఘురాము మీదఁ బైకొను రీతిన్"–[1]

అని ఉపమించుటయే గాకుండ,

"సాయంకాల రఘుక్షితీశ్వరుఁడు కెంజాయ న్ముఖం బొప్పఁగా [2]
డాయన్వచ్చి, తమ ప్రతీప్రతరకాండధ్వస్త పాదంబుగాఁ
జేయం, జక్ర వధూధరాసుతకు విశ్లేషవ్యథాపాదియై,
మాయాహేమమృగంబునాఁ బడియె నమ్మార్తాండుఁ డస్తాద్రిపై''

—అని ఉత్ప్రేక్షించెను.

హరవిలాస పీఠికయందు శ్రీనాథ మహాకవికి "అయోధ్యా నగరస్వామియో" అని అతనింత వైభవముతో అవచి తిప్పయప్రభువు గోచరించెనట. (పు. 3)

పారిజాతాపహరణము తిమ్మనార్యునికి నారదుడు ''పారిజాతంపుఁ గ్రొన్నన మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకున బొదవి'' కొనివచ్చి,

1. ఆ. 2– ప. 38.
2. ఆ. 4– ప. 87.

రుక్మిణీ సన్నిధిని ఉన్న శ్రీకృష్ణుని పూర్వావతారములను "ప్రాఁకను కల వెంగఁ బాతాళకుహరంబు దూరఁజూచి చీఁకిన చోఱవీవ... కదలిఁ గోలకుఁ వెచ్చిన గబ్బివీవ"– అని స్తుతించెను.[1] ఆంధ్రమహాభాగవతమును మహాకవి పోతన తన ఇష్టదైవమైన శ్రీరామున కంకితమొనగుటయేకాక, "పలికించెడివాఁడు రామభద్రుండట". కనుక స్వయముగ రామభద్రుడే పలికింపఁబూనుకొనిన గాథను రామునకే అంకిత మొనగెదనని స్పష్టముగ చెప్పి, ధన్యతగాంచిన విధము ఆంధ్రులకు సుపరిచితముకదా !

శుక సప్తతి కావ్యమున కవి కదిరీపతి వైశ్యపత్నికి శుకము పతివ్రతా ధర్మముల తెలియజేయు పట్టున,

సీ. దశకంధరుని మోహదశ విచారించనే
సకల జగన్మాత జనకజాత....'' అని సీతా పాతివ్రత్యమును ప్రశంసించెను.[2]

శుకసప్తతియందే అధర్మాచరణుల ఇక్కట్టులు పేర్కొను సందర్భమున శుకము,

తే. "కాక తలవెఱ్ఱి గొని యల గౌతమాంగ
నామణి సురేంద్రు నొకనాడు నంటుచేసి
యాపదలఁ జెంది సకల లోకాపవాద
మొందు టెఱుఁగవె యట్లు గాకుండ వలయు''- నని హెచ్చరించెను [3]

గయోపాఖ్యానము లేక కృష్ణార్జున సంవాద మను ద్విపద కావ్యమున, శరణువేడిన గయునికి చతుర్ముఖుడు శ్రీకృష్ణావతార మహత్వమును వివరించుచు,

"వసుధ భారము మాన్పవలసి....
అడరి భార్గవ రాముఁడై జనియించె

1. పారిజాతాపహరణము — ఆ. 1- ప. 49.
2. శుకసప్తతి — ఆ. 1- ప. 155.
3. శుకసప్తతి — ఆ. 1- ప. 160.

మడియించె ముయ్యేడు మాఱులు నృపుల
దశరథ రాముడై తానుద్భవించి
దశకంఠు శిరములు ధరణిపైఁ గూల్చెఁ''– రామావతారమును
వివరించెను.[1]

అనంతయ్య తన భోజరాజీయ కావ్యమున శ్రీరంగ మాహాత్మ్యమును మహాడను కాంభోజరాజు దివ్యభవనంబుతోడి విష్ణువిగ్రహమును విష్ణువునుండి పడసెను. స్వయంవ్యక్తమగు ఆ మంటపము తదుపరి ''ఇక్ష్వాకు మహీనాథునకు దపోలబ్ధంబయి మధ్యమ లోకమండనంబగు నయోధ్యా పట్టణంబున సరయువు పొంత సకలజన సేవ్యంబై మెఱయుచుండె మఱికొంత కాలమునకు రఘుకులాబ్ధి చంద్రుండగు రామచంద్రుం డొసంగ దానవాన్వయ భూషణుండగు విభీషణుండు లంకానగరంబునకు గొనిపోవునప్పుడు ధర్మవర్మయను చోళభూపతిచేత సంప్రార్థితంబై యుభయ కావేరీ మధ్యంబునఁ జంద్ర పుష్కరిణీ తటంబున సుప్రతిష్ఠితంబయ్యె''[2] –అని శ్రీరంగస్వామిని గురించి వివరించెను.

ఈ కావ్యమున శ్రీరామ ప్రసక్తి అచ్చటచ్చట కలదు.

ఉదాహరణ వాఙ్మయమునకూడ ''హనుమోదాహరణము'' వంటి రచనలు కలవు. చాటువులందు కూడ రామప్రసక్తి కన్పట్టుచుండును.

రామకథేతర కావ్యాదులందు రామప్రసక్తి గల తీరుతెన్నులకీపై ఘట్టములు దిఙ్మాత్రోదాహరణములు మాత్రమే. ఆధునిక భావకవులకు కూడ [3] ''రామకథా మధువనమె రమ్యసుధాఫలమయము'' కాగా – ఆ మధువనమున సుఫలుగ్రోలి పరవశించిరి – పరవశించుచున్నారు – పరవశించుచునే యుందురు.

కాశీ మజిలీ కర్తలకు శ్రీరామకథ యందలి మహత్త్వములు అద్భుతమును కలిగించగా ఆధునిక నవలాకారులకు 'అతిసామాన్యస్త్రీ' శోక

1. కృష్ణార్జున సంవాదము—పుట- 11, 22.
2. భోజరాజీయము—ఆ. 1- ప. 130.
3. దాసరథి గేయము.

ములో అలనాటి సీతమ్మ కన్నీటిగాథ తళుక్కు మనుచునే యుం డును.[1] కనుకనే ఆధునిక కవి

సీ. పీఠిపురాణంపు వేదికపై నీవు
పారాయణపు బీటపైన నీవు
దృశ్య ప్రబంధంపు దెరలసందున నీవు
మృతివార్త శ్రుతిబద్ధయెడల నీవు
గొల్లసుద్దుల జేకు డొల్లలందున నీవు
యక్షగానపు చిందులందు నీవు
చండాలభుజముపై మొండితంబుర నీవు
తోలుబొమ్మల సంగగోలనీవు

పడక గదుల గోడలనీవు, భక్తహృదయ
రసనలను నీవు, యాయావరతను నీవు
సృష్టి నీమయమో, నీవు సృష్టిమయమొ !''—[2] అని ఆశ్చర్యా ద్భుతములు హృదయమును ఆవేశించి, ''అంతా రామమయం-ఈజగ మంతా రామమయ"[3] మ్మను ఆర్యోక్తి గుండెలలో ప్రతిధ్వనింపగా "ఎట్లయిననేమి, రామ రక్షింపుమయ్య !''[4] అని ముక్కోటి ఆంధ్రుల ప్రతినిధియై భక్త్యంజలి ఘటించెను

ఇట్లు తెలుగు సారస్వతమునందే కాక ఆంధ్రుల జీవనమున కూడ రామ ప్రభావమధిక మనుట కన్న, తెలుగువారి జీవన విధా నమే శ్రీరామచరిత్రముతో సమైక్యము పొందినదనుట సమంజసము. తెనుగుదేశ మంతటను సీతారామ నామములను తమ నామములుగ స్వీకరించినవారు అసంఖ్యాకముగ నుందురు. అసంగతములైన సందర్భములందు ఆంధ్రుని రసనము అప్రయత్నముగ 'రామ' శబ్దము నుచ్చరించును. శ్రీరామ భక్తాగ్రేసరుడైన అంజనేయుని స్తోత్రముచే (దండక రూపమున) ఆంధ్రుడు భూతప్రేత పిశాచాది గణముల దౌష్ట్య

1. మాయజలతాప – వవలి – రచన :– దాశరథి రంగాచార్య.
2,4. సాక్షి – పానుగంటివారి వ్యాసములు – vol-6.
3. రామదాసు కీర్తన.

మునుండి విముక్తుడగును. శ్రీరామాంజనేయ మందిరములు లేని గ్రామ మొక్కటి యైన ఆంధ్రదేశమున కానరాదన్న అతిశయోక్తి కానేరదు. "రాముని పదధూళులె పది వేలుగ" పొంగిపోవు ఆంధ్రులు 'రామ కోటి' ని వ్రాసి, రామపదధూళితో పవిత్రమయిన భద్రాచలమున సమ ర్పించి సార్థక జన్మలుగ తలపోతురు. తల్లులు, బాలబాలికలకు 'శ్రీరామ రక్ష' నిడెదరు. అన్నార్తులు 'అన్నమో రామచంద్రా' యని ఆక్రోశించి యాచింతురు. ఆంధ్రుల వివాహము సీతారాముల కల్యాణసమము,- కనుకనే రెండు జీవితములను ఏక సూత్రమున బంధించి, నూతన జీవి తమునకు నాందిపల్కు వివాహతంత్రము "సీతమ్మ పెళ్ళికూతురాయెనే" పాటతో ముగియును. వైవాహిక జీవితమున సీతారాములు ఎనలేని దుఃఖములను, వియోగములను భరించినను, అందంతర్లీనముగ నున్న ధార్మికత, ఆదర్శము, అన్యోన్యానురాగము నూతన దంపతులను "తమ సంసారము సీతారాములది వలె" నుండవలె నను ఆకాంక్షా పూరితుల నొనర్చును. ఇట్లు ఆంధ్రుల కవనము, జీవనము శ్రీరామమయము కనుకనే భక్త రామదాసు "అంతా రామమయం - బీ జగమంతా రామ మయ"మ్మని విశ్వసించినాడు. ఏజాతి కయినను దాని జీవన విధాన మునకు, సంస్కృతి చైతన్యములకు ప్రతీకలుగ నిల్చునవి సామెతలు, నుడికారములు. తెలుగు సామెతలను పరిశీలించిన అవి అధికముగ రామకథాత్మకములు. ఆంధ్రుల జీవితమున ప్రతిసంఘటన యందు నను శ్రీరామకథను స్ఫురింపజేయు సామెతలు తెలుగుప్రజల దైనం దిన వ్యవహారమున కాంచవచ్చును. (రామకథాత్మకమైన సామెతలు కొన్ని అనుబంధమున జేర్చబడినవి.)

సంగ్రహముగ ఏ విషయమునైన చెప్పుటకు ప్రయత్నించిన 'కట్టె కొట్టె తెచ్చె' నన్నట్లుగా ముగించె నందురు. అనగా ఇరువది నాలుగు వేల శ్లోకములు గల రామాయణమును శ్రీరాముడు వారధికట్టి, రావ ణుని కొట్టి, సీతను తెచ్చెనని సంగ్రహముగ చెప్పుట ఏదేని బృహ త్ప్రణాళికను నిర్వహించుట 'భగీరథ యత్నము'గా పేర్కొనబడును. అధిక శ్రమల కోర్వవలసి వచ్చినచో 'సీతమ్మవారి కష్టములు' జ్ఞప్తికి వచ్చును. నుడివినదాని కంటెను అధికముగ కార్యమును నిర్వహింప

ప్రయత్నించుట హనుమంతుని వలె 'చూచి రమ్మన్న కాల్చివచ్చుట' యగును. కొండెములు చెప్పువారు 'దుష్టనాతులు' కాగా, నిద్రా ప్రియులు 'కుంభకర్ణు' లనబడుదురు. మరల్పరాని కఠోరమగు ఆదేశము 'సుగ్రీవాజ్ఞ' కాగా, కోలాహలము చేయువారు 'రామదండు' అగుదురు.

ఆంధ్రదేశమున సీతారామలక్ష్మణులు పర్యటించినట్లు వాల్మీకి మునవే ఆధారము లున్నవి. అందుల కనుగుణముగా ఆంధ్రదేశమందంతటను ఆంధ్రుల యాచారముల కనువైన రీతిని ఇక్కడ శ్రీరాముడీ పని చేసెను, సీత ఈ పని చేసెను, లక్ష్మణు డిట్లు ప్రవర్తించెను అను కథలు గ్రామగ్రామమునను అల్లుకొనిపోయి యుండుట మనకు గోచరించును. అందువలన శ్రీరాముడు, రామాయణ మందలి ప్రధాన పాత్రములు ఆంధ్రుల జాతీయ జీవనముతో పెనవేసుకునిపోయి, ఆంధ్ర సారస్వతమున అనంత రీతుల బహుళవ్యాప్తిని పొంది, ఆంధ్ర సాంఘిక జీవనమును పవిత్రమును ఉదాత్తమును గావింపగలిగినవి. ఇట్లు ఇహపరతారకమగు రామకథతో తెలుగుప్రజలు తాదాత్మ్యము నొందగా, తెలుగు సీమలో రామకథ ఆంధ్రత్వమును రంగరించుకొనినది.



# అనుబంధము

1. వాల్మీకి రామాయణమునం దొసగబడిన ఇక్ష్వాకుల వంశ క్రమము:—

బ్రహ్మ
|
మరీచి
|
కాశ్యపుడు
|
వివస్వుడు
|
మనువు
|
ఇక్ష్వాకువు
|
కుక్షి
|
వికుక్షి
|
బాణుడు
|
అనరణ్యుడు
|
పృథుడు
|
త్రిశంకుడు
|

దుంధుమారుడు లేక యువనాశ్వుడు
|
మాంధాత
|
సుసంధి
|
ధృవసంధి　ప్రసేనజిత్తు
|
భరతుడు
|
అసితుడు
|
సగరుడు
|
అసమంజుడు
|
అంశుమంతుడు
|
దిలీపుడు
|
భగీరథుడు
|
కకుత్స్థుడు
|

రఘువు
|
కల్మాషపాదుడు లేక ప్రవృద్ధుడు లేక పురుషాదకుడు
|
శంఖణుడు
|
సుదర్శనుడు
|
అగ్నివర్ణుడు
|
శీఘ్రగుడు
|
మరువు
|
ప్రశుశ్రుకుడు
|
అంబరీషుడు
|
నహుషుడు
|
యయాతి
|
నాభాగుడు
|
అజుడు
|
దశరథుడు
|
రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు

—బాల. స 70. శ్లో. 17-40

2. వాల్మీకి రామాయణమున జనకుని వంశక్రమము :-

నిమి
|
మిథి (జనకుడు)
|
ఉదావసువు
|
నందివర్ధనుడు
|
సుకేతువు
|
దేవరాతుడు
|
బృహద్రథుడు
|
మహావీరుడు
|
సుధృతి
|
దృష్టకేతువు
|
హర్యశ్వుడు
|
మరువు
|
ప్రతింధకుడు
|
కీర్తిరథుడు
|

దేవమీఢుడు
|
విబుధుడు
|
మహీధ్రకుడు
|
కీర్తిరాతుడు
|
మహారోముడు
|

స్వర్ణరోముడు
|
హ్రస్వరోముడు
|
జనకుడు — కుశధ్వజుడు

—బాల. స 71 - శ్లో. 1-4148

3. భాస్కర రామాయణమున దశరథుని వంశక్రమము :-

బ్రహ్మ
|
మరీచి
|
కశ్యపుడు
|
వివస్వంతుడు
|
వివస్వంతుడు
|
ఇక్ష్వాకుడు
|
కుక్షి
|
వికుక్షి
|
అనరణ్యుడు
|
పృథుడు
|

త్రిశంకుడు
|
హరిశ్చంద్రుడు
|
లోహితాస్యుడు
|
దుందుమారుడు
|
యువనాశ్వుడు
|
మాంధాత
|
సుగంధి
|
ధ్రువసంధి
|
ప్రసేనజిత్తు
|
భరతుడు
|

ఆసితుడు (అంశుమంతుడుగా పాఠాంతరము)
|
సగరుడు
|
అసమంజసుడు
|
అంశుమంతుడు
|
దిలీపుడు
|
భగీరథుడు
|
కకుత్స్థుడు
|
రఘువు
|
కల్మాషపాదుడు
|
శంఖణుడు
|
సుదర్శనుడు
|
అగ్నివర్ణుడు
|
శీఘ్రగుడు
|
మరుడు
|
ప్రశుశ్రుకుడు (ప్రసికుడు అని పాఠాంతరము)
|
అంబరీషుడు
|
నహుషుడు
|
యయాతి
|
నాభాగుడు
|
అజుడు
|
దశరథుడు
|
రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు

—బాల. 724.

4. భాస్కరరామాయణమున జనకుని వంశక్రమము :-

నిమి
|
మిథి
|
జనకుడు
|
ఉదావసువు
|
నందివర్ధనుడు
|
సుకేతుడు
|
దేవరాతుడు
|
బృహద్రథుడు
|

మహావీరుడు
|
సుధృతి
|
దృష్టకేతుడు
|
హర్యశ్వుడు
|
మరువు
|
ప్రతిబంధకుడు
|
కీర్తిరథుడు
|
దేవమీఢుడు
|
సువీరుడు
|
మహీంధ్రకుడు
|
కీర్తిరాతుడు
|
మహారోముడు
|
స్వర్ణరోముడు
|
జనకుడు, కుశధ్వజుడు

—బాల. 726.

5. ఆంధ్రమహాభాగవతమునందలి దశరథ వంశ వృక్షము.

మనువు
|
ఇక్ష్వాకుడు
|
వికుక్షి (శశాదుడు), నిమి, దండకుడు
|
కకుత్స్థుడు — (పురంజయుడు) (ఇంద్రవాహనుడు)
|
అనేనసుడు
|
పృథుడు
|
విశ్వగంధుడు
|
చంద్రుడు
|
యవనాశ్వుడు
|
శవస్తుడు
|
బృహదశ్వుడు
|
కువలయాశ్వుడు (దుందుమారాడు)
|
దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు

హర్యశ్వుడు
|
నికుంభుడు
|
బర్హిణాశ్వుడు
|
కృతాశ్వుడు
|
సేనజిత్తు
|
యువనాశ్వుడు
|
మాంధాత
|
అంబరీషుడు — పురుకుత్సుడు — ముచికుందుడు

అంబరీషుడు
|
యౌవనాశ్వుడు
|
హారితుడు

పురుకుత్సుడు
|
త్రసదస్యుడు
|
అనరణ్యుడు
|
హర్యశ్వుడు
|
అరుణుడు
|
త్రిబంధనుడు
|
సత్యవ్రతుడు
(త్రిశంకుడు)
|






## రామకథాపరములైన కొన్ని సామెతలు :

1. అగస్త్యభ్రాత.
2. సీతమ్మ శోకము.
3. తాటకరా యిది !
4 రంభారావుళ్లు (రంభా రావణులు).
5. అలో లక్ష్మణాయని !
6. రామరావణయుద్ధము.
7. నేలకుఁ గోలకుఁ దెచ్చెను.
8. అంగద రాయబారము.
9. కాలనేమి జపము.
10. కబంధం నామరూపేణ వికృతం ఘోరదర్శనం (స్థూలశరీరుని గాంచినప్పుడు).

11. కలియుగ రావణాసురుడు
12. రావణాసురుని వల్లకాదు.
13. ఓసీ కైక !
14. (కలియుగ) లంకారాక్షసులు.
15. పుట్టినాడు - కట్టినాడు - కొట్టినాడు.
16. వనవాసము చేయుచున్నాను.
17. రాముని రాజ్యము భరతుని పట్టము.
18. ఇంటిగుట్టు లంకకు చేటు. (శ్రీరామున కుపకారము చేసినను విభీషణునకి అపవాదు పోలేదు).
19. కిష్కింధా పురాగ్రహారీకులు.
20. రామభూషణ, కైకదూషణ.
21. ఊర్మిళాభక్తి.
22. అగ్గికి చెదలంటునా ?
23. రామునివంటి రాజున్న హనుమంతునివంటి బంటుండును.
24. రామాయణమంతా విని రామునికి సీత ఏమవుతుం దన్నట్లు.
25. తాచెడ్డకోతి వనమెల్ల చెరిచెను.
26. రామాయణము రంకు భారతము బొంకు.
27. రామాయణము చదివి భారతమున కర్థము చెప్పెను.
28. సీత పుట్టుక లంకకు చేటు.
29. అంకెలేనికోతి లంకంతా చెరిచెను.
30. అందరూ ఒకఎత్తు - అగస్త్యుడు ఒకఎత్తు.
31. అచ్చివస్తే హనుమంతునిమోర లేకపోతే కోతిమోర.
32. ఆయుష్యం గట్టిగాఉంటే అడవిలోఉన్నా ఒకటే, అయోధ్యలో ఉన్నా ఒకటే.
33. అలిపంచాయితీ రామాయణము, పాలిపంచాయితీ భారతము.
34. అలుబిడ్డలు లేనివానికి అంజనేయుని గుడి.

35. బ్రతికుంటే బలుసాకు తినవచ్చు– (ఇది "జీవన్భద్రాణి పశ్యతి" అని రామాయణములోని మహర్షి వాల్మీకి వాక్యము - "బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు" అని దీనికి గ్రాంథికమగు రూపము కలదు.)

36. రాజుచేసిన కార్యాలకూ రాముడుచేసిన కార్యాలకూ యెన్నిక లేదు.

37. లంకలో పుట్టినవారెల్లా రాక్షసులే.

38. కాంతాకనకాలే కయ్యాలకు మూలం.

39. చదివేది రామాయణం పడగొట్టేది దేవాలయం.

40. చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష.

41. నమ్మితి రామన్నా అంటే నట్టేటిలో ముంచుతా అన్నట్లు.

42. నమ్మితి రామన్నా అంటే నాఅంతవాణ్ణి చేస్తా అన్నట్లు.

43. పిచ్చుకుంటుమీద బాణికక్షి వచ్చినట్లు.

44. ఱెక్కలు విరిగిన పక్షివలె.

45. రామాయణం అంటే సామాన్యం కాదు గాడిదమోతంత ఉంది.

46. రామాయణంలో పిడకలవేట.

47. రాముడినాడు లేదు, భరతుడినాడు లేదు, శత్రుఘ్నునినాడు చెవులవాడులు అన్నట్లు.

48. రాముడు లేని రాజ్యంలాగ.

49 రాముడి పాదాలు తగిలితే రాళ్ళు రమణులౌతవి.

50. రాముడివంటి దేవుడు, రావణునివంటి రాక్షసుడు లేరు.

51. లంక కాల్చినవాడు రాముడిలెంక.

52. వసిష్ఠుని వాక్కున విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అనిపించుకోవాలె.

53 అలో లక్ష్మణా!

54. రామబాణము.

55. రామరాజ్యము.

56. లోకాభిరామాయణము.

57. విశ్వామిత్ర సృష్టి.

58. శిరామరక్ష- (జలకమార్చిన పిమ్మట తల్లులు శిశువులను శ్రీరామ రక్షయని ఆశీర్వదించి చుట్టును నీళ్ళు చేతితో పోసెదరు. అదియే శ్రీరామరక్ష - దానికి రూపాంతరము శిరామరక్ష.)

59. శ్రీరామసేన.

60. సీతపుట్టి లంక చెఱచినట్లు.
("సీతపుట్టి లంక చెఱచిన చందానఁ
బుట్టఁదగని ముద్దుపట్టియైన
బాలికాగ్రగణ్య లీలావతీకన్య
యిల్లు చెఱప నేతమెనేమొ యనుచు" —శుకసప్తతి - ఆశ్వా 1 - ప. - 41.)

61. శ్రీరాముడు మనవాడయితే చీడపురుగు లేమి చేస్తాయి.

62. శ్రీరాములంకలో బోడకోతి.

63. సీతాపతి, రామాపతి, ప్రొద్దున్న లేస్తే పొట్టే గతి.

64. సీతారామాభ్యాంనమః అంటే మా యింటాయన ఎదురు కాలేదా అన్నదట !

65. హనుమంతునిముందు కుప్పిగంతులా ?

66. హనుమంతుని చేయబోతే కోతి అయింది.

67. దాసుని తప్పు దండముతో సరి - (ఇది రామదాసు చరిత్రము నుండి వచ్చియుండును.)

68. అసూయ ముందు ఆడది వెనుక.

69 రాఘవా ! స్వస్తి ! రావణా ! స్వస్తి !
ఇట్టింకను అనేకములు కలవు.



# ఉపయుక్త గ్రంథసూచి


1. శ్రీమద్రామాయణాంతర్గత బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండములు — ఆరుభాగములు - చదలువాడ సుందరరామశాస్త్రులుగారి ఆంధ్ర తాత్పర్య సహితము. చెన్నపురి - వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ వారిచే 1963 న ప్రకటితము.

2. శ్రీమద్రామాయణ ఉత్తరకాండము.

3. అధ్యాత్మ రామాయణము (పూర్వోత్తర కాండములు)– శ్రీ పురాణపండ రామమూర్తి వ్యాఖ్యా సహితము- దుర్ముఖి సంక్రాంతి ముద్రణము - శ్రీపతి ముద్రణాలయము -కాకినాడ.

4. తెలుగు సంస్కృతి - 1-విజ్ఞాన సర్వస్వము (vol-3) :- తెలుగు భాషాసమితి మద్రాసు.

5. శ్రీ రంగనాథ రామాయణము — చెన్నపురి-వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితము.

6. కట్టా వరదరాజు రామాయణము 4 vol. — నిడదవోలు వెంకటరావుగారిచే పరిష్కృతము Madras Government Oriental Ser-ies శ్రీ గోపాలన్‌గారిచే ప్రకటితము-మద్రాసు రత్నం ప్రెస్ నందు ముద్రితము.

7. మొల్లరామాయణము — శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ సంపాదకత్వము-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ-కళాభవనము-ముద్రణ మాతృశ్రీ ప్రింటర్స్, బాపట్ల.

8. అచ్చ తెలుగు రామాయణము — కూచిమంచి తిమ్మకవి ప్రణీతము పురాణం సూర్యనారాయణ తీర్థులవారిచే పరిష్కృతము. వావిళ్ళవారిచే ప్రకటితము. Audi Saraswati Nilayam Press, Madras.

9. సంస్కృత భారతము-అరణ్యపర్వము — శ్రీ పురాణపండ రామమూర్తి ఆంధ్రవ్యాఖ్యానము-ఎడిటర్: పి. ఎస్. ప్రకాశదీక్షితులు.

10. ఆంధ్రమహాభారతము — వావిళ్ళవారిచే ప్రకటితము 292, ఎస్ప్లనేడ్-చెన్నపురి.

11. శ్రీమదాంధ్ర చంపూరామాయణము — అల్లమరాజు రంగశాయి కవి- ద్వితీయముద్రణము. పిఠాపురము- శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షరశాల - 1929.

12. రామాయణము.

13. తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము — శ్రీ దేవులపల్లి రామానుజరావు.

14. మన తెలంగాణము — శ్రీ ఆదిరాజు వీరభద్రరావు.

15. మరుగు పడిన మాణిక్యాలు — డా॥ బి. రామరాజుగారు.

16. పద్మపురాణము-ద్వితీయ సంపుటము — శ్రీ పసుపాటి చిదంబరశాస్త్రి ప్రణీతము.

17. దక్షిణభారత సాహిత్యము — శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి -A.P. సాహిత్య ఎకాడమీ ప్రచురణము.

18. గాంధర్వవాణి — రమామోహిని - సాహితీసదనము - తిరుపతి ముద్రణము.

19. భాస్కరరామాయణము — వావిళ్ళవారి ప్రచురణ.

20. భాస్కర రామాయణము (రెండవసంపుటము) — A. P. సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

21. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము — శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావు (రజని) విశాలాంధ్ర ప్రచురణాలయము - విజయవాడ. Sept 1958.

22. రామాభ్యుదయము — అయ్యలరాజు రామభద్రకవి. వావిళ్ళ వారి ప్రచురణ - 1917.

23. త్రివేణి (ఆంధ్రదేశ జానపద గేయములు) — A. P. సంగీత నాటక ఎకాడమీ ప్రచురణ.

24. History & Culture of the Indian People (All Volumes)— Bharatiya Vidya Bhavan's Publication - Bombay

25. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము — శ్రీ నిడదవోలు వేంకటరావు. మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల - సం - 14. Madras University - 1954.

26. పారిజాతాపహరణము — A P. సాహిత్య ఎకాడమీ ప్రచురణ— 1966.

27. సారంగధర చరిత్రము — A. P సాహిత్య ఎకాడమీ ప్రచురణ. 1966.

28. శ్రీ జగన్నాథ రామాయణము — శ్రీ తంగిరాల జగన్నాథశాస్త్రి మోడరన్ ముద్రణాలయము, రాజమండ్రి - 1955.

29. బాలరామాయణము - నాటకము (రాజశేఖరుని నాటకమునకు అనువాదము.) — శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవి ప్రణీతము. కాకినాడ - బాలసరస్వతీ ముద్రణాలయము - 1903.

30. శ్రీ రఘునాథ రామాయణము మొదటిభాగము — రఘునాథ భూపాలుడు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రచురణ - 1937.

31. ఆనంద రామాయణము — చిలుకూరి శ్రీరామశాస్త్రిగారి అనువాదము.

32. సాక్షి — (Volumes.)

33. శ్రీ మదాంధ్ర వచన రామాయణము — శ్రీ సరస్వతుల సుబ్బ రామశాస్త్రి.

34. శ్రీ మదాంధ్ర వచన రామాయణము — శ్రీ దేవరాజు సుధి.

35. శ్రీ మద్రాంధ్ర వచన రామాయణము — శ్రీనివాస శిరోమణి.

36. శ్రీరామ వనవాసము — శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి.

37. ఉత్తర కాండము — శ్రీ పాలపర్తి నాగేశ్వరరావు.

38. రామచరిత మానస్ అనువాదము — శ్రీ ముంగర శంకరరావు.

39. ప్రజావాఙ్మయము — శ్రీ చింతా దీక్షితులు.

40. విజ్ఞాన సర్వస్వము (ఆరవసంపుటము) —

41. నిర్వచన భారత గర్భరామాయణము.

42. శబరి-నాటకము — శ్రీ చింతాదీక్షితులు.

43. దొడ్డ రామాయణము — దొడ్ల వెంకటరామరెడ్డి.

44. భద్రాచల రామదాసు చరిత్రము.

45. వచన వాఙ్మయము — శ్రీ నిడదవోలు వేంకటరావు.

46. శ్రీ గోవింద రామాయణము — శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు.

47. ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము — బొడ్డుచెర్ల చినతిమ్మయ్య ఆంధ్ర రచయితల సంఘము ప్రచురణ.

48. శ్రీ మద్యోగానందాంధ్ర రామాయణము — శ్రీ చిల్లరిగె యోగా నందయ్య - 1927.

49. శ్రీ యథార్థరామాయణము — శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణ దాసు.

50. తెలుగులో తిట్టుకవిత్వము—శ్రీ రావూరి దొరసామిశర్మ, ఎం. శేషా చలం కంపెనీ ప్రచురణ - 1968.

51. రామాయణ విశేషములు — శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.

52. తెలుగు సామెతలు — A. P. సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

53. తెలుగు సామెతలు – Translated and explained by Captain M. W. Carr. వావిళ్ళవారి ప్రచురణ.

54 తెలుగు జాతీయములు – శ్రీ నాళం కృష్ణారావు సేకరణ

55 భోజరాజీయము – అనంతయ్య ప్రణీతము

56. శశిరేఖా పరిణయము – అప్పన అను భట్టరాజు.

57. ధర్మఖండము – ఈదులపల్లి భవానీశకవి

58. రామకథా మంజరి (వచనము) – గుడిపూడి ఇందుమతీదేవి 1930

59. రాఘవ పాండవీయము – పింగళి సూరన్న - వావిళ్ళవారి ప్రచురణ.

60 హరవిలాసము–శ్రీనాథుడు – ఆం. ప్ర సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

61. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము – ధూర్జటి-ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

62. వసుచరిత్రము – రామరాజ భూషణుడు - ఆం. ప్ర సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

63. భాస్కర రామాయణము – వావిళ్ళవారి ప్రచురణ.

64. వాల్మీకి చరిత్రము – రఘునాథ నాయకుడు-ఆం ప్ర. సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

65. శ్రీరామచరిత మానసామృతము – తులసీదాస దాసి 1962.

66. ఆంధ్ర శతక వాఙ్మయోత్పత్తి వికాసములు–సమకాలిక జీవితము – డా॥ కె గోపాలకృష్ణారావుగారి పరిశోధనా వ్యాసము (అముద్రితము)

67. ఆంధ్ర వచన వాఙ్మయము ఉత్పత్తి వికాసము (సంపుటము-1) – డా॥ ఎం. కులశేఖరరావుగారి పరిశోధనా వ్యాసము (వ్రాతప్రతి)

68 పానుగంటివారి అయిదు నాటకములు.

69 భక్త రామదాసు నాటకము.

70. ఆంధ్ర నాటక కర్తలు — వ్యాససంపుటము ఆదర్శ సాహిత్య మాల - 1957.

71. అహల్య-నాటిక — శ్రీ మల్లాది అచ్యుత రామశాస్త్రి.

72. మైరావణ నాటకము — శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు - 1947.

73 పానుగంటివారి సాహిత్యసృష్టి - సమీమర్శ పరిశీలనము — డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి.

74. బాలరామాయణము (Part II) — తిరుపతి వేంకటేశ్వర కవులు - 1904.

75. Cultural Forum — Vol. IX - No. 4. July - 1967.

76. జానపద వాఙ్మయము — శ్రీహరి ఆదిశేషువు-నవ్యవిజ్ఞాన ప్రచురణలు - 1967 ద్వితీయ ముద్రణము.

77. ఆంధ్ర నాటకరంగ చరిత్ర — శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి- 1969 ముద్రణము.

78. మైరావణ చరిత్ర — మాదయ్యకవి.

79. భాసుని యజ్ఞఫలము నాటకము — బులుసు వేంకటేశ్వర్లుగారి ఆంధ్రానువాదము.

80. రామదాసు నాటకము — శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు.

81. వాల్మీకి - నాటకము — శ్రీ కాళ్ళకూరి గోపాలరావు — 1935.

82. శ్రీరామ జననము-నాటకము — శ్రీ పోలేటి భాస్కరమూర్తి.

83. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర — డా॥ ఎస్. వి. జోగారావు.

84. తెలుగు నాటక వికాసము — డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు

85. ఆంధ్రుల సాంఘికచరిత్ర — శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.

86. అధ్యాత్మ రామాయణ కీర్తనలు — మునిపల్లె సుబ్రహ్మణ్యకవి విరచితము. (ఆంధ్రగాన కళాపరిషత్తు - రాజమహేంద్రవరము మొదటికూర్పు - 1962.)

87. తూము నృసింహదాసు కీర్తనలు—ప్రచురణ : కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్ రాజమండ్రి - 1954.

88. రామరాజ్యము-కుశలవులు — రచయిత: కాళూరి వ్యాసమూర్తి, విజయనగరము ప్రచురణ: ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము, వల్లూరిసూర్యనారాయణరావు పంతులుగారి గ్రంథనిధి కొవ్వూరు, ప॥ గోదావరి - 1967.

89. వాల్మీకి రామాయణ విమర్శనము (పరిశోధక గ్రంథము) — చారిత్రక శిరోమణి శ్రీ డాకొలి లక్ష్మినారాయణ, బి. ఎ., 24-12-49.

90. విచిత్ర రామాయణము (వచనకావ్యము) – శ్రీ లక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాల ప్రచురణ - 9-4-12.

91. శ్రీ యథాశ్లోక తాత్పర్య రామాయణమను నాన్ధ్రప్రబంధము — పెద్దన సోమయాజి, రామచంద్రాచార్యులు, శేషాచార్యులు. ప్రచురణ: శ్రీ సాహిత్య విద్యాముకుర మను ముద్రాక్షరశాల - 1818 సం.

92 శ్రీ మద్రాంధ్ర వాల్మీకి రామాయణము(మందరము-అరణ్య కాండము) – శ్రీ వావిలికొలను సుబ్బారావు. శ్రీ కోదండరామ సేవక ధర్మ సమాజ ప్రచురణ, తెనాలి - 1954.

93. శ్రీమద్రామాయణ కల్పవృక్షము—శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, వరలక్ష్మి ముద్రాక్షరశాల ప్రచురణ, విజయవాడ -1956.

94. ఆంధ్రవాఙ్మయ సూచిక — శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు.

95. స్త్రీల రామాయణపు పాటలు — "కృష్ణశ్రీ" సంపాదితము ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు - 12-3-55.

96. తెలుగు జానపద గేయ సాహిత్యము — డా॥ బి రామరాజు, M. P, Ph. D., ఆంధ్ర రచయితలసంఘ ప్రచురణ, హైదరాబాదు. డిసెంబరు - 1958

97. ఉత్తర రామాయణము - కంకంటి పాపరాజ ప్రణీతము. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితము చెన్నపురి.

98. సమీరకుమార సందేశము - బక్షీ వాసుదేవరావు, మహోదయ ప్రెస్, శ్రీకాకుళం 1953.

99. భవభూతి ఉత్తర రామచరితమ్ రసాస్వాదినీవ్యాఖ్య (తెలుగు) - శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు. ప్రచురణ: ఆంధ్ర సాహిత్య అకాడమీ-హైద్రాబాదు. వ్యాఖ్యాత: 1970.

100 షోడశి-రామాయణ రహస్యములు - గుంటూరు శేషేంద్రశర్మ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ప్రచురణ.

101 ఆంధ్ర శ్రీమద్రామాయణము (అరణ్య, కిష్కింధా, సుందర కాండములు) - కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మ కృతము, చెన్నపురి: వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ ప్రచురణ 1924.

102. ఆంధ్ర నాటకదర్శిని (1860 - 1962) - సంకలనం: శ్రీనివాస చక్రవర్తి. జయంతి పబ్లికేషన్స్ ప్రచురణ - 1963.

103. శ్రీ తులసీ రామాయణము (ఆంధ్ర వచనానువాదము) - శ్రీమతి యేలూరుపాటి లక్ష్మీ సరస్వతి. సరస్వతి పవర్ ప్రెస్ ముద్రణ, రాజమహేంద్రవరము.

104. శ్రీరామాంజనేయయుద్ధం - తాండ్ర సుబ్రహ్మణ్యం. జయశ్రీ బుక్‌డిపో ప్రచురణ. విజయవాడ - 1962.

105. శ్రీ పట్టాభి రామాయణము - కోళ్ళప్పన్‌జేరి కనకరాయ మొదలారి. జీవరక్షామృత ముద్రాక్షరశాల ప్రచురణ, మద్రాస్-1907.

106. గద్య చింతామణి (మొదటి భాగము) వచనకావ్యము - శ్రీ గిడుగు వెంకటరామమూర్తిగారి సంకలనము, తెలికిచెర్ల వెంకటరత్నం, గుంటూరు. ప్రథమముద్రణ: 1933 - డిసెంబర్.

107, ఆధునికాంధ్ర కవిత్వము (సంప్రదాయములు-ప్రయోగములు) — డా॥ సి. నారాయణరెడ్డి.

108 సంస్కృత వాఙ్మయచరిత్ర (ద్వితీయ సంపుటము)— శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి. ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రచురణ, తిలక్ రోడ్డు, హైదరాబాదు.

109. శ్రీ త్యాగరాజస్వామి శతవార్షికోత్సవ సంచిక శాలివాహనశకం ౧౮౬౯ వ్యయ-పుష్య, బ. ౫.—సంపాదకుడు: శ్రీవిస్సా అప్పారావు. ఆంధ్రగాన కళా పరిషత్తు, రాజమహేంద్రవరము.

110. భాసుని రామనాటకములు—(శ్రీ)జీరెడ్డి చెన్నారెడ్డి. తిరుపతి-1962.

111. కంబరామాయణము — శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి.

112. శ్రీ ఆంధ్ర తులసీరామాయణము (బాలకాండము)—శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి.

113. సాక్షాత్కారము — శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.

114. నవ్యసాహితి (కవితాసంకలనం) — శ్రీ నిడదవోలు వేంకటరావు.

115. పసిడి పలుకులు — సంకలనం: శ్రీ నేదునూరి గంగాధరు.

116. శ్రీ మహాభాగవతము—పోతనామాత్యుడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ.

117. దాశరథీ విలాసము — కొత్తపల్లి అచ్యుతకవి.

118. శ్రీరామచంద్రోపాఖ్యానము — వారణాసి వేంకటేశ్వరకవి.

119. రామాయణ సంగ్రహం — ప్రత్తి విశ్వేశ్వరశాస్త్రి - 1934.

120. తిక్కన్న కావ్యశిల్పము-తత్త్వదర్శనము—డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి, (Ph. D. Thesis - 1960.) వ్రాతప్రతి.

121. ఆంధ్రకవి తరంగిణి.

122. రామోపాఖ్యానము - తద్విమర్శనము — శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. పిఠాపురము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల - 1938.

123. సమగ్ర ఆంధ్ర సాహిత్యము (ప్రకటింపబడిన అన్నిభాగములు) – 'ఆరుద్ర'.

124. లంకా విజయము – పిండిప్రోలు లక్ష్మణకవి.

125. చాటుపద్య మణిమంజరి (ప్రథమ, ద్వితీయ భాగములు) – వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపాదితము. మణిమంజరి-ముక్త్యాల కృష్ణాజిల్లా -1952.

126. ఆంధ్రకవి సప్తశతి – శ్రీ బులుసు వేంకటరమణయ్య.

127. జైమిని భారతము – పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి.

128. రామనాటక విమర్శనము – శ్రీ పి. బాలకృష్ణమూర్తి.
Pub: 1959 - Tirumala - Tirupati Devastanams Tirupati.

ఇంకను భారతి, సాహితివంటి సాహితీ పత్రికలు, గ్రంథమున ఆయాపట్టుల పేర్కొనబడిన శతకములు. బుర్రకథలు, యక్షగానాదులు పెక్కు గలవు.



# సవరణలు



| | తప్పు | | ఒప్పు | | పుట | | పంక్తి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | సమ్మిత | — | సమ్మత | — | 4 | — | 13 |
| 2. | కొనునది | — | కొనినది | — | 8 | — | 1 |
| 3. | వాల్మీకీ | — | వాల్మీకి | — | 9 | — | 27 |
| 4. | ప్రవర్తిల్తి | — | ప్రవర్తిల్లి | — | 11 | — | 18 |
| 5. | సుతీక్ష | — | సుతీక్ష్ణ | — | 16 | — | 19 |
| 6. | యాజ్ఞవాటిని | — | యజ్ఞవాటిని | — | 23 | — | 24 |
| 7. | దృషుల | — | దృష్టుల | — | 25 | — | 5 |
| 8. | అభీషమును | — | అభీష్టమును | — | 26 | — | 15 |
| 9. | అగస్త్యుని | — | అగస్త్యుని | — | 29 | — | 8 |
| 10. | లీరమణులకు | — | వీరమణులకు | — | 30 | — | 4 |
| 11. | వానినిబట్టి | — | వాటినిబట్టి | — | 31 | — | 2 |
| 12. | లంకయరిదు | — | లంకయందు | — | 35 | — | 15 |
| 13. | విష్ణత్వవతారములను | — | విష్ణ్వవతారములను | | 38 | — | 2 |
| 14. | దుఃఖించుచు | — | దుఃఖించు | — | 43 | — | 18 |
| 15. | గీత | — | సీత | — | 49 | — | 18 |
| 16. | వాల్మీకీ | — | వాల్మీకి | — | 53 | — | 18 |
| 17. | ఆది | — | అది | — | 54 | — | 4 |
| 18. | వారికి | — | వారిని | — | 54 | — | 28 |
| 19. | సాకేతపురికీ | — | సాకేతపురికి | — | 54 | — | 28 |
| 20. | పద్మాక్షుని పదివేలమంది | — | పద్మాక్షుని సంహరించగా పదివేలమంది | — | 56 | — | 26 |
| 21. | రాఘ వనవాసము | — | రాఘవ వనవాసము | | 59 | — | 5 |
| 22. | వెనుకకు | — | వెనుక | | 64 | — | 8 |
| 23. | ఆట్లే | — | అట్లే | | 64 | — | 21 |

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| 24. వసిష్టువకు | వసిష్టునకు | 66 | 1 |
| 25. చిశ్చయించుట | నిశ్చయించుట | 73 | 19 |
| 26. జటాయువులు | జటాయవుల | 78 | 4 |
| 27. ఆ వసిష్ఠారుంధతి కౌసల్యా | వసిష్ఠారుంధతి కౌసల్య | 80 | 13 |
| 28. సేతుభంధన | సేతుబంధన | 82 | 7 |
| 29. పంవుటయు | పంపుటయు | 82 | 24 |
| 30. వచనమున్నగు రచనలు | మున్నగు వచన రచనలు | 99 | 9 |
| 31. సాహిత్యము | సాహిత్యమున | 99 | 10 |
| 32. కార్యప్రక్రియలను | కావ్యప్రక్రియలను | 106 | 18 |
| 33. రచించినడని | రచించినదని | 107 | 24 |
| 34. రామభక్తుని | రామభక్తిని | 114 | 20 |
| 35. అనిలోనన్న | అనిలోమున్న | 123 | 13 |
| 36. పల్కలంబులు | వల్కలంబులు | 124 | 20 |
| 37. సన్నివేశమును | ఈ సన్నివేశమును | 125 | 11 |
| 38. అళియారామరాజు | అళియరామరాజు | 129 | 21 |
| 39. ఘట్టముగ | ఘట్టమున | 143 | 6 |
| 40. వాల్మీకి రామాయణమున | వాల్మీకి రామాయణమును | 144 | 26 |
| 41. వాలీకి | వాల్మీకి | 147 | 21 |
| 42. మూలమును | మూలమున | 150 | 24 |
| 43. యభీషమున | యభీష్టమున | 150 | 28 |
| 44. ప్రవర్తిఁజేసి | ప్రవర్తింపజేసి | 155 | 29 |
| 45. వృత్తతమున | వృత్తమున | 159 | 2 |
| 46. ఆధికముగ | అధికముగ | 159 | 27 |
| 47. వెదజల్లి | వెదజల్లిన | 160 | 22 |
| 48. విశిక్షుతుని | సుశిక్షితుని | 168 | 16 |

| | తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|---|
| 49. | లక్ష్మణుడు | లక్ష్మణుని | 174 | 10 |
| 50. | రామాయము | రామాయణము | 174 | 28 |
| 51. | నీవవ | నీవని | 176 | 19 |
| 52. | భాసించినచో | భాషించినచో | 181 | 21 |
| 53 | హరివంశార్గత | హరివంశాంతర్గత | 216 | 7 |
| 54. | రామప్రోలు | రాయప్రోలు | 222 | 23 |
| 55 | అనుచు, | అనును. | 225 | 4 |
| 56. | లక్ష్మణువితో | లక్ష్మణునితో | 235 | 13 |
| 57. | అమౌలికములైన | అమూలకములైన | 242 | 18 |
| 58 | లదకనుట | కలదనుట | 248 | 2 |
| 59 | అగ్రిప్రవేశము | అగ్నిప్రవేశము | 249 | 4 |
| 60 | దృషాంతముగ | దృష్టాంతముగ | 249 | 20 |
| 61 | జానప్రవచనములు | జ్ఞానప్రవచనములు | 249 | 28 |
| 62. | ఆసలుంచి | ఆనలుంచి | 252 | 29 |
| 63. | గోవించనామాలు | గోవిందనామాలు | 254 | 26 |
| 64. | చరణ గోవిందనామాలు | చరగోవిందనామాలు | 256 | 12 |
| 65. | నామదేవాదులు | వామదేవాదులు | 260 | 6 |
| 66. | హేళనాత్మకమున | హేళనాత్మకముగ | 264 | 12 |
| 67. | సంస్కృత సమాన | సంస్కృతసమాస | 273 | 10 |
| 68. | మనన్న | మన్నన | 274 | 6 |
| 69. | 'రామాయణము' | 'రామమయము' | 278 | 5 |
| 70. | దానికి నడిపే | దానిని నడిపే | 281 | 17 |
| 71. | అందాల రావుడు | అందాల రాముడు | 282 | 16 |
| 72. | 'సీతా కళ్యాము' | 'సీతా కళ్యాణము' | 298 | 25 |
| 73. | మహీపాలుడు | మహీపాలురు | 309 | 20 |
| 74. | దశరధునికి | దశరథుని | 350 | 9 |
| 75. | వాత్సల్యరసము | వత్సలరసము | 350 | 10 |
| 76. | లక్ష్మీరంజినం | లక్ష్మీరంజనం | 359 | 14 |

| తప్పు | | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|---|
| 77. భక్త్యావేశము | — | భక్త్యావేశమున | — 359 — | 22 |
| 78. మిట్టి కవిని | — | మిట్లు కవిని | — 366 — | 6 |
| 79. కొంత చేరి | — | కొంతచేర్చి | — 382 — | 7 |
| 80. శ్రీరామచందులు | — | శ్రీరామచంద్రులు | — 382 — | 24 |
| 81. ఆసందర్భము | — | అసందర్భము | — 394 — | 6 |
| 82. స్మరించునే | — | స్మరించుచునే | — 396 — | 27 |
| 83. సీతా సౌందర్యములు | — | సీతాసౌందర్యమును | — 400 — | 16 |
| 84. కల్పవృక్షమనగా | — | కల్పవృక్షమునను | — 401 — | 1 |
| 85. ఏడు బారులు | — | ఏడుబరులు | — 401 — | 20 |
| 86. బోధించును | — | బోధించును | — 404 — | 6 |
| 87. దాసరథి | — | దాశరథి | — 408 — | 28 |
| 88. సమైక్యము | — | మమైక్యము | — 409 — | 20 |

